# ప్రేమసాగరుడు

## అవతార్ మెహెర్‌బాబా జీవితచరిత్ర




8వ భాగం

రచయిత:
నిట్టి భీమశంకరం

ప్రచురణ:
అవతార్ మెహెర్‌బాబా
ఆంధ్రా సెంటర్ - కాకినాడ

అవతార్ మెహెర్‌బాబా
జీవిత చరిత్ర 8 వ భాగము

ఈ ఎనిమిదవ భాగము
బాబా అక్షర ఫలక విసర్జన
వార్షికోత్సవ సందర్భమున
ది 7-10-1982 న ప్రకటించడమైనది.

అవతార్ మెహెర్‌బాబా_ట్రస్టు
అహ్మద్‌నగర్ వారి_
సౌజన్యముతో



ముద్రణ :
శ్రీ సీతారామాంజనేయ ప్రెస్,
ఏలూరు - 1

# అష్టమ సంపుట సమర్పణ

యుగావతారుడు మెహెర్ ప్రభువు యిచ్ఛవలన ఆయన జీవిత చరిత్ర అష్టమ సంపుటము సమర్పించుచున్నాను. బాబా అన్నారు, "నేను నీకొసగు దానికై ఆశించి నన్ను ప్రేమించుట ప్రేమించుటయే కాదు. నా కోసం నా కార్యం కోసం దేనినైనా త్యాగంచేయుట నీ కేదో లాభమాశించి కారాదు. అట్లు చేయుట దృష్టికోసమై అంధుడు తన కన్నులను త్యాగము చేయుట వంటిది."

ఈ ప్రేమ సాగరుని ప్రచురించుట ఆ ప్రియతముని కార్యము. ఇందులో పాల్గొని నిరాటంకముగా సాగునట్లు తోడ్పడు చున్న సభ్యులకు, సంపాదకత్వం వహిస్తున్న డా॥ రామచంద్రన్ గారికి, అచ్చుకు అనువగురీతిని ప్రతులు వ్రాయుచున్న కుమారి పి. హెచ్. ఉషాదేవిగారికి, ప్రేమసాగరుని సర్వాంగ సుందరంగా అచ్చువేసిన శ్రీ సీతారామాంజనేయ ప్రెస్, ఏలూరు, అధిపతి శ్రీ మాజేటి కృష్ణారావుగారికి, నా హార్ధిక జై బాబాలు.

ఇట్లు

బాబా సేవలో

**చింతా సర్వారావు**

ప్రకాశకుడు.

జై బాబా

# అవతార్ మెహెర్ బాబా జీవితచరిత్ర

# ఎనిమిదవ భాగము

## 1955 నవంబరు 11 వ తేదీ మధ్యాహ్నం:- ఆంధ్ర ప్రేమికులతో సహవాస కార్యక్రమం

రెండవ వారంలో యీ మధ్యాహ్నానికే రావలసిన ఆహ్వానితులందరు వచ్చేశారు. సహవాసనకు వచ్చినవారందరు బాబా ఆదేశాను సారం ప్రవర్తించాలని ఇంకనూ బాబా చెప్పినవన్నీ ఒక కాగితంపై టైపుచేయించి నోటీసు బోర్డులో అంటించారనీ ఈరచ్ అందరకు చెప్పారు. తరువాత అందరినీ విశ్రాంతి తీసుకోమన్నారు. వచ్చిన ప్రతి సహవాసునకు రెండు 'అనాసిన్' బిళ్ళలిచ్చి, బాబా వాటిని మింగమన్నారని చెప్పారు. ఇష్టమైనా కాకపోయినాసరే, అనాసిన్ ప్రతి ఒక్కరు వేసుకొనాలని బాబా చెప్పారు. అలా వేసుకొంటే వాతావరణం మార్పువలన జబ్బు చేయకుండా వుంటుంది.

**12 నవంబరు 1955 – శనివారం.**

బాబా ఉదయం 8 గంటలకు వచ్చారు. బాబా ఆదేశానుసారం వచ్చిన ప్రతి ప్రేమికుడు వరుసలో బాబా వద్దకువెళ్లి ఆయనకు పూలమాలలు వేసి ప్రణామం చేశారు.

బాబా ఇలా చెప్పారు. "మీరందరూ క్రొత్తదనం లేకుండా స్వగృహంలో వున్నట్లుండాలి. మనకు అయిదురోజు లున్నాయి. అందుచేత కావలసినంత సేమయం వుంది. నిన్నరాత్రి ఎవరెవరు నిద్రపోలేదు ? లేచి నిలబడండి. మీరందరు దక్షిణాది

నుండి వచ్చారు. ఇక్కడ చలిగా వుంది. అస్వస్థతగా నున్నవారు డాక్టర్ నీలకంఠ్ గోడ్సేకి చెప్పండి. మీకు అస్వస్థత కలిగేవరకు ఊరుకోవద్దు. అస్వస్థత కలుగకుండా చూచుకొనండి, లేకపోతే మీకు జలుబుచేస్తే అది యింకొకరికి తగులుతుంది. మీరు ఇక్కడున్న ఆరు రోజులు మీ యిండ్లను గురించి మరచిపోయి బాబాతో వుండాలి. మీ సంతాపాలను మీ కష్టాలను మరచిపొండి. ఇక్కడ సుఖంగా మీ యింట్లో వున్నట్లే వుండండి బాబా యొక్క సాహచర్యమును అనుభవించండి. మీరు చేతులు జోడించినపుడు వేరెవరినైనా తలిస్తే మీరు నమస్కరించినది నాకు కాదు; వేరొకరికి. బాబాకు కాదు. గోడమీద వ్రాయించినది చదివారా? అందులో ఏముందో మీకు తెలుసునా? మొదటి వారంలో గుజరాతీ బృందానికి చెప్పినది రంజూను వ్రాసి వుంచుకోమన్నాను. అదే మీకు మరోవిధంగా వివరిస్తాను.'' అన్నారు.

ఒక భక్తునకు జలుబుచేసి దగ్గు వస్తోంది. బాబా అతనిని ''నీవు ఎందుకు లేచి నిలబడలేదు?'' అని అడిగారు. అతడు ''నేను చిన్నవాడను. ముసలివానివలె నాకు దగ్గు వచ్చిందని చెప్పుకోవడం నా కిష్టంలేదు'' అన్నాడు.

బాబా :—''స్థూలదేహధారులైన వారందరికీ జబ్బులు చేస్తూనే వుంటాయి. జ్వరం వస్తుంది. జలుబు చేస్తుంది. ఎవరైతే భగవంతుడై సాధారణ చైతన్యస్థాయికి రాకుండా వుంటారో (బ్రహ్మీభూతులు) వారికి దేహచైతన్యం వుండదు. వారికి జలుబుచేసిందని వారికి తెలియదు. సాఈబాబా దేహం చాలించినపుడు కూడా టైఫాయిడ్ జ్వరం వచ్చింది. అందుచేత నీవు జలుబుతోగాని జ్వరంతోగాని బాధ పడుతున్నందున యింకొకరికి చెప్పడానికి సిగ్గుపడకు. ఈసంగతిని వివరించడానికి నీవు అవకాశమును కలిగించావు, మంచిదే.'' అన్నారు బాబా.

''ఒకసారి 1931 సం॥లో తొలిసారిగా బాబా ఇంగ్లాండు వెళ్లినపుడు, బాబా చాలా చురుకుగాను సన్నగాను వుండేవారు. ఆయనతో సమానముగా నడవడానికి మండలి పరుగెత్తవలసి వచ్చేది. బాబాకు అనేక వైఖరులుండేవి. ఒక్కొక్కప్పుడు ఇతరులను కొట్టేవారు. కొన్నిసమయాలలో చాలా సంతోషంగా వుండేవారు. బాబా రూపంలో భగవంతుడు అవతరించివస్తే బాబాకు జబ్బుచేయదు అని, జలుబుచేయదని పాశ్చాత్యులు అనుకొనేవారు. ఇంగ్లాండులో అందరు ఉన్నిదుస్తులు ధరించేవారు. బాబాను ఆరుబయలుకు పలుచని దుస్తులతో రమ్మనేవారు. లోపల బాబాకు చలిగా

వుండేది. బాబా సంతోషంగా వుండవలసి వచ్చేది. బాబాకు ఎప్పుడు చలివేయదని వారు అనుకొనేవారు. జలుబుచేసేది బాబాకే. నీవెందుకు సిగ్గుపడతావు? నీవెందుకు సంతోషంగా వుండవు?" అన్నారు బాబా.

1952 సం॥లో కారుప్రమాదంలో బాబా కాలునకు ప్లాస్టర్ వేసి కట్టుకట్టినపుడు- అమెరికన్ ప్రేమికుల ప్రేమ చాలా గొప్పది. ఆస్థితిలో డాన్ బాబాను కలిసికున్నాడు. కృష్ణభగవానుడు ప్రమాదవశాత్తు బాణం తగిలి నిర్యాణంచెందాడు"అని బాబా చెప్పి--- "బాబాను ఈవిధంగా మోటారు ప్రమాదంలో చిక్కుకొని వుండుట చూచి ఏమను కుంటున్నావు డాన్?" అని బాబా అడిగారు.

డాన్‌స్టీవెన్స్ :—" బాబా యొక్క దేహాన్నిగురించి నేనేమీ ఆలోచించలేదు. బాబాను వాస్తవిక తత్వంగా ఆలోచిస్తున్నాను" అన్నాడు.

బాబా :—" నేను అధికారపూర్వకంగా చెపుతున్నాను. అన్నింటిలోను ఉన్నది నేనే. ఇది ఒక పండితుడుగాని, ఒక వేదాంతిగాని చెప్పే వట్టిమాట కాదు. స్వానుభవంతోను, స్వాధికారంతోను చెపుతున్నాను. ఉన్నవాడను నేను ఒక్కడినే"

(సహవాసులు 'అవతార్ మెహెర్‌బాబాకీ జై' అని జయధ్వానములు చేశారు)

బాబా :—" అయిదురోజులక్రిందట సాకోరీ నుండి గోదావరీమాత కన్యలతో వచ్చింది. ఆమెతోకూడా బాబా పురాణపురుషుడని, నిరంతరము బాబాను స్మరించమని ఆమెతో చెప్పాను. ఆమె మొదటివారంలో, గుజరాతీ బృందం సమావేశమైనప్పుడు వచ్చింది.

"ఈమాట నేను ప్రేమికులకు మాత్రమే చెప్పటంలేదు. సద్గురువులకు మహాపురుషులకుకూడా చెపుతున్నాను. సద్గురువులుగా పరిగణింపబడేవారికి చెపుతున్నాను.

"పేరుగాంచిన మహమ్మదీయ సాధువు అయిన 'కమ్ము బాబా' వద్దనుండి రెండురోజులక్రిందట ఒక ఉత్తరం వచ్చింది. అతడు బాబాను అమితంగా ప్రేమిస్తాడు. ఈరచేకి వతునకు సోదరుడైన ఒకడు అతనివద్దకువెళ్ళి బాబాకు ఒక

సందేశం పంపించాడు. దానిలో కమ్ముబాబాను సంస్కార భారమునుండి విముక్తుని చేయమని, అతనిని నాలో లీనం చేసికొమ్మని వ్రాశాడు. అందుకు నేను బాబా నామం నిరంతరము దేహం చాలించే పర్యంతం స్మరించమని జవాబు పంపించాను.''

''నేను, నా తండ్రి ఒకటే, సర్వమును విడిచి నా వద్దకు రండి'' అని జీసస్ చెపుతుండేవాడు. కృష్ణుడు అదే చెప్పాడు.

''నా యొక్క అహమ్ (నేను) నకు మీ యొక్క అహమ్ (నేను) నకు తేడా వుంది. నేను పురాణపురుషుడను. మీలో నున్న 'నేను' బంధంలో వుంది. నాలోని 'నేను' కు ఏ బంధమూ లేదు. నేను పురాణపురుషుడనైనప్పుడు యింకేమి చెప్పను? అందుకే అందరిలోనున్న నన్ను సదా స్మరించమని చెపుతాను. మీ చుట్టూ నూ వున్న యీ ప్రపంచమంతయు మాయ, సున్న. నూరేళ్లు నిండిన తరువాత మీరు దేహం విడిచిపెడతారు. కాని మీరు (ఆత్మలు) అందరు అక్కడే వుంటారు. దేహమే అదృశ్యమౌతుంది.

''మీరు మీ దేహాన్ని విడిచే సమయంలో బాబాను స్మరించండి. అలాగైతే మీరందరు నా వద్దకు వచ్చేస్తారు.

''నన్ను మీరు చూస్తున్నారంటే, నా దేహాన్ని చూస్తున్నారు. ఈ కోటు వగైరాలను చూస్తున్నారు. బాహ్యంగా మీకు కనిపించేది నేను కాదు. నిజమైన 'నేను' కాదు. మీరు ఇంకా 'నన్ను' చూడవలసివుంది. మీరు లేశమాత్రం 'నన్ను' చూస్తే మీరు బంధవిముక్తులౌతారు. కోటిమందిలో ఒక్కనికి అట్టిచూపు లభిస్తుంది. అలా చూడగల్గిన కోటిమందిలో ఒక్కనికి బ్రహ్మానుభవం కల్గుతుంది. హఫీజ్ ఒక వాక్యం చెప్పాడు——''దేహాన్ని ధూళిగాచేసికొన్న లక్షమందిలో ఒక్కడు, ఒకయుగంలో అట్టివారిలో ఒక్కడు భగవంతునిగా అవుతాడు.

''దేహాన్ని దూళిగా చేసుకొన్నవారిలో ఒక్కడు ప్రియతముని పాదముల చెంత తన హృదయాన్ని శిరస్సును అర్పిస్తాడు. అతడు ఎన్నియో యుగముల అనంతరము భగవదైక్యమును పొందుతాడు.

''మీరు బాగా నిద్రపోయి వుండరు. మీకు ప్రయాణబడలిక వుంటుంది. మీరు నిద్రపోకుండా బద్ధకంలేకుండా నేను చెప్పేది సావధానంగా వినండి. ఇప్పుడే

లక్షలాదిమందిలో ఒక్కనికి కొన్నియుగముల అనంతరం భగవదనుభూతి కలుగుతుందని బాబా మీకు చెప్పాడు. ఇంతకాలానికి కదా ముక్తిలభించేది అని మీరు నిరాశచెందకండి. దీనికి మూడు పరిష్కార మార్గములున్నాయి.

"మొదటిది :— ధూళి అయిపోయి (సర్వం త్యజించి నాకు అంకితం అయిపోవడానికి సంసిద్ధులు కావాలి) నావద్దకురావాలి. ఇది చాలా కష్టం. ధూళి అయిపోవడమంటే సులభమైన పనికాదు.,

"రెండవది :— ఈప్రపంచంలోనే వుండి, నీకుటుంబబాధ్యతలను నిర్వహిస్తూ నీధర్మం (ఉద్యోగం) నెరవేర్చుతూవుండు. కాని, ప్రతిరోజు బాబా నామం 14 సార్లు స్మరించు. ఎక్కువావద్దు, తక్కువావద్దు. 14 సార్లు. అంతట నావద్దకు వస్తావు. రోజునకు 14 సార్లు నన్ను స్మరిస్తే నావద్దకు తప్పకవస్తావు. నాసర్వోన్నత అధికారంతో చెపుతున్నాను.

" ఇది తేలికగా కనిపించవచ్చును. కాని ఇది మొదటిదాని అంతకష్టం. అంతకంటె ఎక్కువకష్టం కూడా. రోజునకు 14 సార్లు కంటె ఎక్కువాకాకుండా తక్కువా కాకుండా తలంచాలి.

మూడవది :— నీ ఆఖరిశ్వాస వదలినపుడు బాబా నామం జపించు. నీవు తప్పక నా వద్దకు వస్తావు.

"ఇది అన్నిటికంటే సులభంగా కనిపించవచ్చు. కాని ఇది కూడా కష్టమే. నీవు నీ జీవితంలో ప్రతి క్షణము నన్ను ప్రేమించి తలంచే అలవాటు కలిగివుంటేనే గాని నీ ఆఖరు ఘడియలో నన్ను తలంచలేవు.

"ఈ మూడు మార్గాలు సాధ్యం కాకపోతే నాల్గవది — పరులకు నిస్వార్థముగా సేవచేయి. అందరిలోను ప్రతి యొకరిలోను బాబా ఉన్నాడు. నీవు నిస్వార్థమైన సేవచేస్తే, నీవు భగవంతుని సేవించినవాడవౌతావు. అన్ని పరిస్థితులలోను ఎట్టి స్థితిగతులలోనైనా, నీకు కష్టాలు సంభవించినా, నీకు మెప్పుగాని బహూకృతిగాని లభించినా. లేకపోయినా స్వార్థం లేకుండా సేవించు. అప్పుడు కూడా నీవు నా వద్దకు వస్తావు.

గాడ్గే మహరాజ్ వంటి సాధుపురుషులనుచూడు. వారు నిస్వార్థసేవ చేస్తారు. వారు బాబాను ప్రేమిస్తారు. బాబాను గురించి ఇతరులకు చెపుతారు. గాడ్గేమహరాజ్ నా వద్దకు వచ్చేశాడు. ఎందరో ఇతరులు అతనిని దర్శించేవారు. గాడ్గేమహరాజ్ ఇతరులతో కలిసి సంచరించేవాడు. బీదలకు సాయపడేవాడు. ధర్మశాలలు, పాఠశాలలు కుష్ఠురోగులకు ఆశ్రమాలు మొదలైనవి నిర్వహించేవాడు. ప్రేమను గూర్చి వివరించి చెప్పేవాడు. భగవంతుని ప్రేమిస్తూ సంకీర్తనచేస్తూ అందరిలో భక్తిని కలిగించే వాడు. అతడు నిస్వార్థమైన సేవచేస్తాడు. నడిచివెళ్ళేవాడు. ఒక్కొక్కప్పుడు నిద్రాహారాలు లేకుండా తిరిగేవాడు.

"వినోబా భావేను చూడండి. అతడు వృద్ధుడు, నిస్వార్థమైన సేవచేస్తాడు. ఇతరులకు భగవత్ప్రేమను గురించి చెపుతాడు. అట్టిసేవను వారందరు చేస్తున్నట్లుగనే మీరందరూ చేయగలరు; చేస్తున్నారు కూడా. మీరేమి చేస్తున్నారో మీకు తెలియక పోవచ్చు. 'నేను' 'నా' అనే ఆలోచన ఏ మాత్రం లేకుండా ప్రేమ ద్వారా నిస్వార్థ సేవ చేయడానికి ప్రయత్నించండి. ప్రేమింపబడరానివానిని నీవు ప్రేమిస్తున్నావని అనుకోవలదు. సాధు సత్పురుషులకుకూడా స్వార్థరహితమైన సేవచేయుట చాలా కష్టం. ఒక్కొక్కప్పుడు అనేకమందిలో ఏ ఒక్కడో ఇతరులకు యీవిధమైన నిస్వార్థసేవ చేయుటలో విజయుడౌతాడు. ఇండియాలో మాత్రమే నిస్వార్థసేవ చేయ వచ్చునని అనుకోవలదు. ఇతర దేశాలలోకూడా ఇటువంటి నిస్వార్థసేవకులున్నారు. చాలామంచివారు పాశ్చాత్యదేశాలలో కూడా వున్నారు. డాక్టర్ డేనియల్ అనునాతడు కుష్ఠురోగుల ఆస్పత్రిపెట్టాడు.

దక్షిణాఫ్రికాలో డాక్టర్ ష్వైజర్ కుష్ఠురోగులతో నివసిస్తున్నాడు. అతడు బాబాను కలిసికొనలేదు. బాబా అంటే ఎవరో అతనికి తెలియదు, అంతటి నిస్వార్థసేవ చేస్తున్నప్పటికీ, వారు బాబాను ఎందుకు దర్శించలేదు ? ఎందుచేతనంటే వారికి యింకా మనస్సువుంది. సేవలో అసలు స్వార్థంలేకుండా వుండాలి. వారిలో బాబా వున్నప్పటికీ వారు బాబాను దరిచేరలేదు. బాబాను తెలిసికొనలేదు.

"ఇతరులకు ప్రేమను ఎటుల వ్యాప్తిచేయవలెనో రేపు వివరించి చెపుతాను. నీవిప్పుడు చేస్తున్న విధానం బాబాకు ఇష్టంగాలేదు. బాబా తన ప్రేమను వ్యాప్తిచేయమని చెపుతారు. అది ఆయన ఇచ్ఛానుసారం చేయాలి, కాని నీకు

ఇష్టమైనట్లుకాదు. ఈ విషయమే గుజరాతీ బృందానికి చెప్పాను. ఇదే మీకూ చెపుతాను. హిందీ, మరాఠీ బృందాలకు కూడా చెపుతాను.

"ఎల్లుండి ప్రతి యొకరిని వేర్వేరుగా చూస్తాను. ఇక్కడకు వచ్చిన ప్రతివారు బాబాతో ప్రత్యక్షమైన సాంగత్యం పొందాలి.

"గత 12 మాసములనుంచి నా స్థూల దేహానికి ఎక్కువపని కల్పిస్తున్నాను. ఏకాంతవాసం అనంతరం నా నేత్రాలు వాచినవి. నిరంతరం తలనొప్పి వుండేది. ఇప్పుడు బాబాకు కొంచెం స్థిమితంగా వుంది. ఇవన్నీ తగ్గాయి.

"ఒకటి జ్ఞాపకం ఉంచుకొనండి. బాబా యిస్తూవచ్చిన వివరణం బాబాను ఏ అద్భుతంతోను ముడిపెట్టవద్దు. బాబా మిమ్మల్ని జ్ఞాపకం ఉంచుకోమన్న సంగతి ఇది ఒకటి. బాబా ఎన్నడూ ఏ అద్భుతమూ చేయరు. అసలు సృష్టికంటే మించిన అద్భుతం యింకేముంది ? ఉత్తరాల ద్వారా నాకు తెలియపరచే చిన్నవిషయాలు (అద్భుతాలు) నాకు వార్తలే. నేను ఏ అద్భుతాలను చేయను. అవి నా వలన జరిగా యని చెప్పకండి. ఈ సంగతి మాత్రం బాగా గుర్తుంచుకొనండి. నేను ఏ అద్భుతాలు చేయను.

బాబా, కట్టాసుబ్బారావు (ఏలూరు) వంక తిరిగి "నీవు మాకు కావలసినంత భోజనం పెట్టావు. నీవు ఎంతగానో నన్ను ప్రేమిస్తున్నావు. నీవు విచారించకు. ఊరకే ఇలా వివరిస్తున్నాను, ఉదయం 10-55 గం॥లకు సభ చాలించే సమయంలో బాబా అందరినీ భోజనంచేసి విశ్రాంతి తీసికోమని చెప్పారు. మధ్యాహ్నం 2 గం॥లకు మరల హాలులోనికి రావాలని బాబా చెప్పారు.

"జోస్యుల వెంకటేశ్వరరావు (అడ్వొకేటు - తాడేపల్లిగూడెం) పంపించిన టెలిగ్రాం చూచి చాలా సంతోషించాను. అతని తల్లి, కుమార్తె ఇరువురూ చనిపోయినా, అతడు వచ్చాడు. నాకు చాలా ఆనందంగా వుంది. ఈవిషయంలో తరువాత ఇంకా చెపుతాను.

బాబా అందరినీ సంతోషంగా వుండమన్నారు. 1926 సం॥లో నవంబరు 12 వ తేదీని జమ్‌షెడ్ శాశ్వతంగా నావద్దకు వచ్చాడు. (జమ్‌షెడ్ అంటే బాబాకు అన్న గారు, షెరియార్జీ షీరీన్‌బానూలకు ప్రథమసంతానం).

"ప్రతినెల 12 వ తేదీని మెహెరాబాద్‌లో ధుని వెలిగించమన్నాను. ఈరోజున 12 వ తేదీ. మీరంతా ఇక్కడ వుండటం సంభవించింది. మెహర్ ఆశ్రమంలో యీరోజు ధునివెలిగించే రోజు. అది, బాబా పుస్తకం వ్రాసిన చోటవే వెలిగిస్తారు. ఈరోజున మీరందరు సాయంత్రం 6 గంటలకు వచ్చి చూడండి."

"మనసులో ఎన్నోరకాల ఆలోచనలు, ఎన్నోరకాల కోరికలు ఉన్నాయి. ఈరోజున ధునిలో మీరు ఎన్నాళ్లనుండియో మనస్సులో వుంచుకున్న ఏదో ఒక కోరికను భస్మీపటలం చేయండి. మానసికంగా ఆ ఆలోచనను దహింప చేయండి.

ఉదాహరణకు :—

మీ కామం, మీ క్రోధం, ధూమపానం, లేక బలహీనత, యీ రోజున ధునిలో పారేయండి.

"డాక్టర్ నీలకంఠ్ ఎన్నోవత్సరాల నుండి నాతో వున్నాడు. అతడు నన్ను ఎంతగనో ప్రేమిస్తాడు. అతని ప్రాణమైనా నా కోసం యివ్వడానికి సిద్ధంగా వున్నాడు. అతనికి మూడు పదార్థాలంటే చాల యిష్టం. 1) బాసుంది 2) క్షీర 3) పితలా (ఒక పిండివంట) అతడంటాడుగదా తనకు మోక్షం వద్దంటాడు. ఆధ్యాత్మికమార్గం వద్దట. అతనికి కావలసింది – బాబా కొంగును గట్టిగా పట్టుకొని వుండడమే – అయితే పైనచెప్పిన మూడూ దానితోపాటు అతనికి కావాలి. డాక్టర్ నీలకంఠ్‌ను కూడా వాటిని తినాలనే కోరికను త్యజించమని చెప్పాలి. మూడింటిలో ఒకటైనా అతడీరోజున త్యజించాలి. ఎన్నో యేళ్లుగా అతడు బాబాతో ఉంటున్నాడు. అతడు బాబా కొంగుపట్టుకున్నాడు. అతనికి మోక్షంగాని, ఆధ్యాత్మికత్వంగాని ఏదీ అక్కరలేదు. అయినా అతనిని కూడా ఒక కోరికను త్యాగం చెయ్యమని చెప్పాలి.

"మీలో ప్రతియొకరు ఏదేని ఒకటి త్యజించడానికి ప్రయత్నించండి. ధునిలో ప్రజ్వలిస్తూవున్న అగ్నికి ఆహుతి కావాలి. కోపమో, పరువుకోసం ఉబలాటమో, ఆశయో, ఐశ్వర్యకాంక్షయో ఏదో ఒకటి. మీరు కోపం లేకుండా చేసుకోగల్గితే అది అద్భుతంగా వుంటుంది. ఈ సాయంకాలం ఏదో ఒకటి ధునిలో అర్పించివేయాలి." అన్నారు బాబా.

సమావేశం 11 గంటలకు ముగిసింది. తిరిగి మధ్యాహ్నం అందరకూ 1-30 గంllలకే రమ్మని బాబా కబురు పంపించారు.

మధ్యాహ్నం 1-30 గంllకే సభ తిరిగి ప్రారంభమయింది. అప్పుడు బాబా ఇలా చెప్పారు.

"గత నాలుగు రాత్రులు నాకు నిద్రేలేదు. మీగురించి, అందరిగురించి సప్తభూమికలగురించి ఆలోచనలు. ఈరచ్ అన్నాడు "కావలివాడు, కృష్ణ (మండలిలో ఒకడు) మాసు చెప్పాడు"అని. అనంతరం బాబా మరల "బాబాకు పరాత్పర పరబ్రహ్మస్థితియైన ఆ ఆదిమూలమైన దివ్యసుషుప్తి (గాఢనిద్ర)పోయింది కొన్ని యుగాలనుండి. ఆయనకు ఇప్పుడు దేహానికి విశ్రాంతి కావాలి. అదే ఆయన పొందలేకుండా వున్నాడు." అన్నారు.

"మాజీ డిప్యూటీమంత్రి (భారతప్రభుత్వంలో) అయిన తిరుమలరావును తెలుగులో చెప్పమన్నారు. తిరుమలరావు యీమధ్య అమెరికా వెళ్లివచ్చాడు. అక్కడ న్యూయార్కులో ప్రతిసోమవారం సాయంకాలం బాబా ప్రవచనాలు ఎవరో ఒక శిష్యుని యింటిలో చదువుతున్నారు. అమెరికాలో 7,8 వారాలున్నానని తిరుమలరావు చెప్పాడు. సోమవారం బృందం తిరుమలరావు రాకగురించి అమెరికానుంచి వ్రాశారు. అతనికి హృదయ-మస్తిష్కముల సమన్వయం వుందని వ్రాశారు.

"మనం యిక్కడ వారం రోజులుంటాము. ఇట్టి అవకాశం మరల మరి రాకపోవచ్చును. ఈ అవకాశం సద్వినియోగం చేసికొనాలి. ఈ దేహం ఎప్పుడో ఒక రోజున రాలిపోతుంది. తరువాత లక్షలాది ప్రజలువచ్చి పూజించుట మీరు చూస్తారు. ఇప్పుడు మీకు కలిగిన అవకాశం ఇతరులకు రాదు. మీరు బాబాను సశరీరంగా చూస్తున్నారు, భావితరాల ప్రజలు పుస్తకాల ద్వారానే తెలిసికొంటారు. ఈ సహవాస్ రోజులు అమూల్యమైన రోజులు.

"ఇక్కడ కైకోబాద్‌ను మనం చూస్తున్నాం. అతడు నిజంగా అదృష్టవంతుడు. సంవత్సరాల తరబడి అతడు బాబాను ప్రేమిస్తున్నాడు. అతడు (కర్మలు జరిపించే) పురోహిత కులానికి చెందినవాడు. జొరాస్ట్రియనులలో ఇతడు పెద్ద పురోహితుడు.

అందుకే అతనిని కైకోబాద్ దస్తూర్ (పురోహితుడు) అంటారు. అతనిని బాబా తాళంవేసి బంధిస్తే అలాగే మండలికి వేరుగా ఉండిపోతాడు.

"అతడు నా వద్ద గత 12 సంవత్సరాలుగా వుంటున్నాడు. ప్రతిరోజు అతడు బాబా నామం లక్షసార్లు జపిస్తాడు. అది యాంత్రికమైన జపంకాదు. హార్దికమైన జపం" ఇప్పుడు కూడా జపిస్తూనే వున్నాడు. నిలుచున్నా, నడుస్తూవున్నా, కూర్చున్నా, విశ్రాంతి తీసికుంటున్నా జపం చేస్తూనే వుంటాడు. (అక్కడున్న కైకోబాద్‌ను అవునా ? అని బాబా అడిగారు) (అతడు అవునన్నాడు) ఒక్కమాటలో చెప్పాలంటే బాబానామం అతనికి శ్వాస అయింది. తొలిసారిగా 1946 వ సంవత్సరంలో అతనికి బాబాయొక్క దివ్యత్వం కొంచెం కనిపించింది, మెహెరాబాద్ కొండమీద. అది కల కాదు. దృశ్యమూ కాదు. అది బాబా యొక్క దివ్యత్వాను భవం. (కైకోబాద్ అవునన్నాడు) బాబా అతనిని డెహ్రాడూన్‌కు మహాబలేశ్వరానికి తీసుకు వెళ్ళారు. 1953 సం॥ ఆగష్టు 31 వ తేదీని డెహ్రాడూన్‌లో అతిశయించిన దివ్యానందంలో ఓలలాడి పోయాడు. అప్పుడు దేహం చాలిస్తాడేమో ననిపించింది. అతనికి ఇప్పటికీ అనుభవాలు కలుగుతూవుంటాయి. అప్పుడక్కడవున్న 'కైకోబాద్'– "నేనెప్పుడు బాబాను చూడదలచుకున్నా చూడగలను" అని బాబా అడగగా చెప్పాడు. కైకోబాద్‌నకు కళ్ళనుండి అశ్రువులు ధారగా జాలువారినవి. అతడు దుఃఖించి "ఇతరులకు అటువంటి అనుభవం ఎప్పుడు కలుగుతుంది", అన్నాడు.

అంతట బాబా ;—"నేను పరబ్రహ్మ పరమాత్ముడనై యున్ననూ నా అనంతత్వపులోతును నేనే తెలిసికొనలేకుండా వున్నాను. మీరందరు అదృష్టవంతులు. మీరందరూ బాబా (భగవంతుని) సహవాసకు వచ్చారు. అందుచేత నేననుకొన్నది, నాయిష్టంవచ్చినది మీకు చెప్పాలి. కైకోబాద్ పాదాలపై నాశిరముంచి ప్రణమిల్లుతాను. ఎందుచేతనంటే బాబాను అతడు తన ఆత్మగా భగవంతునిగా చూస్తున్నాడు. అలాగే బాబాను చూడాలి. బాబా దర్శనం ఎలాపొందాలో అతనికి తెలుసు.

"నేను కైకోబాద్‌నకుగాని, మండలికిగాని, పేదలకుగాని, సాధుపుంగవులకుగాని, కుష్ఠురోగులకు గాని ప్రణమిల్లినపుడు, అది ఒక ప్రదర్శనకాదు. బాబాయొక్క నమ్రతను ప్రదర్శించడమూ కాదు. నేను హృదయపూర్వకమైన ప్రేమతో ప్రణమిల్లుతాను. వారిలో నాదివ్యత్వాన్ని చూస్తాను గనుక.

"నేను నాఅలవాట్లను గురించి నాఏఫానాలను గురించి మీకు చెప్పాలి. మండలితో నేను ఎలా వ్యవహరిస్తానో చెప్పాలి. నేను మస్తుల సాంగత్యమునకై వెళ్లినపుడు, నాస్వకార్యం నిమిత్తమై వెళ్లినను (అది ఎవరికి తెలియదు) బాబా యొక్క ఆరోగ్యం సరిగా చూచుకోవాలి. ఈకార్యం జయప్రదం కావాలి. బాబా కైకోబాద్ వద్దకు వెళ్ళి అతనిని నాశిరముపై చేయినుంచి ఆశీర్వదించమంటాను. (అక్కడున్న కైకోబాద్ అవునన్నాడు)

ఈ మధ్య కైకోబాద్ సతారాలో బాబావద్ద ఎంతగనో దుఃఖించాడు. అతడు బాబాతో "నాకు యిప్పుడు మీ దివ్యత్వం తెలిసింది. మీ శిరముపై నన్ను చేతులు ఎందుకు ఉంచమంటారు ? (నన్ను ఎందుకు ఆశీర్వదించమంటారు) నేను మీ దివ్యత్వాన్ని అనుభవిస్తున్నాను, అయినా నాచేత అటువంటిపని చేయిస్తున్నారు. నా భావాలు మీరు గ్రహించలేరా ? నా హృదయం తెలిసికొనలేరా ? నాచేత ఎందుకు అట్టిపనులు చేయిస్తారు" అని అడిగాడు.

బాబా అతనితో — "నాకు విధేయుడవై యుండు. అదే దానికి పరిష్కారం. నేను నన్ను తన్నమని ఆదేశిస్తే నీవు హృదయపూర్వకంగా ఆపని చేయాలి. కైకోబాద్‌నకు నా దివ్యత్వానుభూతి కలిగినా అతడు ఈ మార్గంలోనే వుండాలి. అది భగవత్సాక్షాత్కారం కాదు. అసలైన ఏకత్వం."

కైకోబాద్ బాబాకు చెప్పినది ఇప్పుడు బాబా చెపుతున్నారు. "అతడు కూర్చున్నాడు లేక నిద్రపోతున్నాడనుకోండి. దీపములన్నీ ఆరిపోయి వున్నాయి. అంతటా చీకటిమయం. హఠాత్తుగా అతనికి కావలసినప్పుడు, గదినిండా వెలుఁగు వచ్చేస్తుంది." అన్నారు.

అతనితో బాబా ఇలా అన్నారు. "అది నాకు తెలియదు. అది నేను చేసిన అద్భుతం కాదు. నేను ఈ అద్భుతం చేయటంలేదు. ఒక చీకటి గదిని వెలుఁగుతోఁ నింపడము అనేది. నేను అందరిలో వున్నానన్నది నాకు తెలుసును. నీవు నీ ఇచ్ఛ ప్రకారం చేయగలుగుతున్నావంటే అది నీ అదృష్టం. కైకోబాద్ బాబాను ఒక మహిమాన్వితునిగా చూస్తున్నాడు. అదంతయూ అతడు వివరించలేనంటాడు. ఆ వెలుఁగుతో సూర్యుడు కూడా సరిపోలడంటాడు." అని అన్నారు బాబా.

కైకోబాద్ – "అంతా నీ కృప. నీవే నన్ను అలా చేశావు" అని. నేనంటాను "అది నీ ప్రేమ, నీ నమ్మకం, నీ కృషి" అని.

ఇంక ఐక్యం సంగతి చూదాం.

"మీరందరు మీ యింటిలో వున్నట్లుగానే భావించుకొని హాయిగా వుండండి. నేను పాశ్చాత్యదేశాలకు (1931 సం॥) వెళ్ళినపుడు, ఆ ఓడలోనే గాంధీజీ కూడా వున్నారు. అతడు బాబా వద్దకు మూడు రోజులు వచ్చాడు. బాబావద్ద కూర్చునేవాడు. అక్కడ చాంజీ, రుస్తుం కూడా వుండేవారు. మహదేవ్‌దేశాయి, ప్యారేలాల్ గుమ్మం అవతల నిలబడివుండేవారు. గాంధీజీ ఒక్కడే లోపలికి వచ్చేవాడు. ఎవరికీ గాంధిజీ హృదయంవంటి హృదయంలేదు. గాంధీజీవచ్చి బాబా ప్రక్కన కూర్చుండేవాడు. చర్చలు సాగుతూవుండేవి అక్షరఫలకం ద్వారా. అప్పుడొక సంగతి జరిగింది. గాంధీజీ గుజరాతీలో మాట్లాడేవాడు. అతడు 'మీరు మాట్లాడాలి. ప్రపంచం మీరు చెప్పినది వినాలి. మీ మాటలు వినాలి. మీ నోటిమాటలు వినాలి.' అని చెప్పేవాడు. అన్నారు బాబా.

'మెహెర్‌మెసేజ్' అనే పత్రికలో బాబా ప్రవచనాలు ప్రచురింపబడుతూ వుండేవి. దానికి ప్రచురణకర్త దస్తూర్. నేను అప్పుడు గాంధీజీతో "నేను త్వరలో మాట్లాడతాను" అన్నాను.

"అయితే త్వరలో అంటే ఎప్పుడు ?" అని గాంధీ అడిగాడు.

అప్పుడు నేను "వాగ్దానాలు చేయడం నాకు అలవాటు. 'చేసినవి భంగం చేయుట కూడా నాకు పరిపాటు. నేను శాశ్వతుడను. నేను వాగ్దానములకు అతీతుడను. దేనికీ కట్టుబడి వుండను" అని అన్నాను.

ఇలా అనగానే గాంధీజీ నవ్వాడు. అప్పుడు మహదేవదేశాయ తలుపుమీద తట్టాడు; అది సమయం అయినదని గాంధీజీతో చెప్పడము. అతనితో గాంధీజీ ఉండమన్నాడు. మహదేవ్‌దేశాయి వెళ్ళిపోయాడు. మూడు రోజులు వరుసగా గాంధీజీ వచ్చాడు. గాంధీజీ బాబాను అధికంగా అధికాధికంగా ప్రేమించసాగాడు. ప్రతిరోజు అతడనేవాడు 'ఇండియా స్వేచ్ఛను పొందిన తరువాత నీతో కలుస్తాను బాబా అప్పుడు మనమిద్దరం పశ్చిమానికి వెళదాం' అని. అది .... అతడు చేసిన వాగ్దానం.

నేను గాంధీజీతో సంభాషించడము గురించి చెపుతూవుంటే, కాళ్లు చాపుకోవడం జ్ఞాపకం వస్తోంది. గాంధీజీ నన్ను "మీరు ఖాదీకోటు, ఖాదీటోపీ ఎందుకు ధరించరు?" అని. ఆతని హృదయం బంగారం. అటువంటి హృదయం కలవానిని మీరు చూడరు. గాంధీజీని నేను కౌగలించుకొన్న తరువాత, అతడు నా గదిలోనుండి వెళ్లిపోయాడు. నాల్గవరోజున ఆ స్టీమరులోనే వున్న 'షౌకత్ ఆలీ' నా వద్దకు వచ్చాడు. షౌకత్ ఆలీ చాంజీతో చెప్పాడు. "ముస్లిం సాంప్రదాయం ప్రకారం బాబా చేతిని ముద్దు పెట్టుకోవాలని వుంది" అని. అందుకు బాబా అంగీకరించాడు. షౌకత్ ఆలీ వచ్చి నా చేతిని ముద్దు పెట్టుకొని కుర్చీలో కూర్చున్నాడు. వెంటనే ఆ కుర్చీ విరిగిపోయింది. అతడు క్రిందపడ్డాడుపాపం. నేను, చాంజీ, రుస్తుం ముగ్గురం కలిసి ఆలీని లేవదీశాను.

హాస్యమైన సంగతి ఏదైనా అది బాబాకు చాలా యిష్టం. "గంభీరంగా మాట్లాడడం కంటే నవ్వించే మాటలంటే నాకు యిష్టం" అంటారు బాబా.

"మీరందరు ఉల్లాసంగా వుండండి. ఎప్పుడూ నవ్వుతూ ఆనందంగా వుండాల. లోపల బయటా కూడా. ప్రేమ ఉండనీయండి. ప్రియతముని నుండి వియోగం వలన కంటనీరు రానీయండి. మనం స్వేచ్ఛగా ఉన్నది ఉన్నట్టుగా చెప్పుకోవాలి. అంతేగాని మాట్లాడకుండా గంభీరంగా వుండకూడదు. ఇది సహవాస్. నేను అంతా చెప్పేస్తాను. ధ్యానము, సేవ, విధేయత వగైరాలన్నీ.

"బాబా అవతారపురుషుడు. ఇది పంచసద్గురువులవల్లనే జరిగింది. ఈయుగం లోనే కాదు, అన్ని యుగాలలోను. ఆయన ఎప్పుడు వచ్చినా, (అవతరించినా) ఆయనను అదే ప్రవక్తగా సద్గురువులు చేస్తున్నారు. ఇదంతా నా 'గాడ్‌స్పీక్స్' (భగవద్వచనం) పుస్తకంలో వ్రాశాను.

"మీరందరు 'గాడ్‌స్పీక్స్' గ్రంథసమీక్ష చూశారా? ఈమధ్య ఒక గొప్ప అమెరికన్ రచయిత, పండితుడు ఆ సమీక్ష వ్రాశాడు. అతడు వ్రాసిన ఉత్తరం ఆదీ (ఆదీ కే. ఇరానీ) వద్ద వుంది. ఆగ్రంథం చదివితే నీవెవరవో, ఏమిటో, నీవేస్థితిలో ఉన్నావో అన్నీ తెలుస్తాయి. అంటే— నీవు నన్ను తెలిసికొంటావనికాదు. నీవు భగవంతుడనని చెప్పుకొంటావనికాదు. దానికి నీవు నన్ను ప్రేమించాలి.

"గాడ్‌స్పీక్స్ అమెరికాలో అమ్ముతున్నారు. ఇక్కడ ఇండియాకు డాన్‌స్టీవెన్స్ కొలది ప్రతులు తీసుకువచ్చాడు. బాబా ఈగ్రంథాన్ని తన అక్షర

ఫలకం ద్వారా చెప్పి వ్రాయించారు. టెలివిజన్ ప్రకటన శాఖవారు ఈ పుస్తకంలో వారికి ఆసక్తి ఉందని చెప్పారు. మౌనంగా ఉన్నవారు అంత ఉద్గ్రంధాన్ని అంతటి గంభీర భావాలతో ఒక అక్షరఫలకం ద్వారా ఎలా రచించారా! అని ఆశ్చర్య పోతున్నారు. వారు బాబాను టెలివిజన్‌లో కనిపించాలని కోరుతున్నారు. రెండు నిమిషాల కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నారు. వారు బాబాను అక్షర ఫలకం ఉపయోగించి చూపించమన్నారు. గుజరాతీ బృందంతో ఫొటోగ్రాఫర్లు వచ్చి టెలివిజన్ కోసం రెండు నిమిషాలకోసం కార్యక్రమం నిర్ణయించుకొని జరుపుకున్నారు. బాబా అక్షరఫలకాన్ని పరిత్యజించినప్పటికీ ఈ టెలివిజన్ కార్యక్రమం కోసం ఆయన వాగ్దానభంగం చేశారు.

"గత 12 మాసముల నుండి అక్షరఫలకం ఉపయోగించుట మానివేసినా, ఇప్పుడు దీనికోసం దానిపై మరల మాటలు చూపిస్తున్నాను. నేను దీనిని మరల ఉపయోగించను." అని దానిపై అక్షరాలు చూపించాను.

"గాడ్ స్పీక్స్ అనే గ్రంధం చాల ముఖ్యమైనది. అటువంటి పుస్తకం ఏ విధంగా అక్షరఫలకం మీద రచన సాగించానో అది అమెరికనులు తెలుసుకుందా మనుకుంటున్నారు.

"నేనెన్నడు ఆడినమాట తప్పలేదు. కాని ఇప్పుడలా చేయవలసి వచ్చింది.

"సాతఃబాబా ఈ సృష్టియొక్క తాళంచెవిని తన దగ్గర పుంచుకున్నాడు. అతడు దేహధారిగా నున్నప్పుడు కొద్దిమంది వచ్చి ఆతనివద్ద కూర్చుండి వెళ్లేవారు. గుస్తాద్‌జీ సాతఃబాబా దేహం చాలించినపుడు అక్కడే వున్నాడు. కొద్దిమంది వచ్చి సాతఃబాబా వద్ద కూర్చుండేవారు. ఎవరైనావస్తే "నీవద్ద ఏమివుందో అది నాకు ఇవ్వు" అని అడిగి, ఆ యిచ్చినది తీసికొని జేబులో వేసుకొనేవాడు. గుస్తాద్‌జీ అలాగే ఒకసారి జేబు ఖాళీచేసుకున్నాడు. సాతఃబాబా ఎల్లకాలం పూజింప బడేటంత గొప్పవాడు. అతడు చిలుము పీల్చేవాడు. దగ్గుతుండేవాడు. ఉమ్మి వేస్తుండేవాడు. ఉదయం వేళలందు డబ్బు తీసికుంటూ వుండేవాడు. తనవద్ద ఉన్నవారికి నెలజీతం మాదిరి ఇచ్చేవాడు. బడా బాబా అని రోజూ సాయంకాలం సాతఃబాబా వద్దనుండి నూరు రూపాయిలు జీతంవలె పొందేవాడు. భజనలు. కవ్వాలీలు జరిగేవి. అందరికీ ప్రతిరోజూ డబ్బు యిచ్చేవాడు. ప్రజలు దర్శించేటందుకు

వచ్చేవారు. కొందరు సాఈబాబా అడిగినంతా ఇచ్చేవారు. కొందరు 'అతడు సాధు వెలాగౌతాడు ? మన ప్రేమ ఆయనకు అక్కర్లేదు. ఆయనకు డబ్బేకావాలి' అని అనుకొనేవారు. కాని అది పొరపాటు. ఈ రోజున అనేకచోట్ల సాఈబాబాను పూజిస్తారు. సాఈబాబా అగ్గిపెట్టెలు, సాఈబాబా ఫ్యాక్టరీలు అన్నీ వుంటున్నాయి. ఆయన పేరుతో షాపులు, ఫిలిములు పెడుతున్నారు. సాఈబాబా ఫొటోలు చిత్రాలు ఎక్కడబడితే అక్కడ వుంటున్నాయి. అదేమీ చిన్నవిషయం కాదు. సజీవుడై వున్నప్పుడు కొద్దిమందే ఆయనవద్దకు వెళ్లేవారు. అందులో సగంమంది 'ఈయన డబ్బు అడుగుతాడు. డబ్బెందుకో' అని ఆశ్చర్యపడుతూవుండేవారు. 'అటువంటివాడు గురువెలాగౌతాడు ?' అనుకొనేవారు.

"ఆరోజులలో ఉపాసనీ మహరాజ్ ఖండోబా ఆలయంలో కూర్చునేవాడు. మంచినీరు తప్ప మరేమీ తీసికొనేవాడు కాదు. బాగా చిక్కి శల్యావస్థలో నున్నాడు. సాఈబాబా అంటే ఎవరో ఉపాసనీమహరాజ్‌కే తెలుసును. సాఈబాబాకు అనుగ్రహం కలిగింవంటే ధూళినైనా భగవంతుని చేయగలడు. అట్టిశక్తి సాఈబాబాకే వుండేది.

"ఉపాసనీ మహరాజ్ గోనెగుడ్డ చుట్టబెట్టుకొనేవాడు. ప్రారంభదశలో ఎవరైనా తన దగ్గరకు వెళితే కొట్టేవాడు. కొట్టి అతనికి కొంత డబ్బు యిచ్చేవాడు. మహరాజ్ ఏమీ తీసికొనేవాడు కాదు. తరువాత క్రమంగా మహరాజ్ కూడా డబ్బు యిస్తే తీసికొనేవాడు. వద్దనేవాడుకాదు. అయిదుగురు సద్గురువుల గుణములను గురించి మీకు చెపుతున్నాను." అన్నారు బాబా.

బాబా అందరినీ కొంచెంసేపు లేచినిలబడి తరువాత మళ్లీ కూర్చోమన్నారు. దీనికి కారణం ?

మొదటిది :- సాఈబాబాకు ఉపాసనీమహరాజ్ నకు గౌరవ సూచకం గానూ,

రెండవది :- చాలసేపటినుండి అందరూ కూర్చునేవున్నారు కాళ్లనొప్పి సర్దుకుంటుందని.

"బాబాజాన్ ఈ విశ్వానికే చక్రవర్తి. ఆమె వేపచెట్టుక్రింద కూర్చుండేది. ఇంక పైన ఆచ్ఛాదన ఏమీవుండేదికాదు. ఆమెకు అప్పుడు 125 యేళ్లవయస్సు వుంటుంది. ఆమెకు ముఖము దేహము అంతా ముడతలుపడి వుండేది. ఆముఖంలో ఎంతో

తేజస్సు వుండేది. ఎంతో శక్తి కనిపించుతూ వుండేది వర్షం కురిసినా, చలివేసినా, వేసవిలో ఎంత గాడ్పు వీచినా, ఎంత తీక్షణంగా వున్నా, ఆమె ఎంత మాత్రము లెక్క పెట్టేదికాదు. ఆమెబట్టలు ధరించేదికాదు. బట్టలు లేకుండానే నడిచివెళ్లేది. ఆమె డబ్బు యిచ్చినా తీసికొనేదికాదు. బెలూచిస్థాన్ పఠానులు వచ్చి ఆమెకు జోహార్లు అర్పించేవారు. ఆమె లేచి కర్ర తీసేసరికి ఎంతటి వాళ్లయినా పారిపోయేవారు. ఆమె ఒకనొక వైఖరిలో నున్నప్పుడు, నా తెర తొలగించింది. నా దివ్యజీవితమునకు ఆతెర అడ్డుగావుండేది. నా ఆదిమూలస్థితి (అహంబ్రహ్మాస్మి) ని తెలిసి కొనేటట్టు చేసింది. ఆమె రూపును నేను వర్ణించలేను. ''మేర్వాన్, ప్రపంచాన్నంతనూ కదిలించే రోజు వస్తుంది'' అని ఆమె ఇతరులకు చెపుతూ వుండేది.

ముగ్గురను గురించి చెప్పాను.

1) సాఈబాబా అడిగి తీసికొనేవాడు.

2) ఉపాసనీ ఉదాసీనంగా వుండేవాడు. ఇస్తేతీసికొనేవాడు.

3) బాబాజాన్ ఇచ్చినా తీసికొనేదికాదు.

''ఇంక కేడ్‌గాంవ్‌లో నున్న నారాయణమహరాజ్ సంగతి: ఇతడు పొట్టిగా వుండేవాడు. సరిగా గుస్తాద్‌జీ అంత ఎత్తువుండేవాడు. ఆతని వ్రేళ్ళకు వజ్రపుటుంగరా లుండేవి. కోటునకు చొక్కాకు బంగారు బొత్తాములు పెట్టుకొనేవాడు. అతడు సరాసరి డబ్బు కావాలని అడిగేవాడుకాదు. ఇతరులకు తనకు డబ్బు అవసరమని తెలియజెప్పే వాడు. పరోక్షంగా డబ్బు కావాలని తనమాటలవలన అర్థమయేటట్లు చెప్పేవాడు.

''తాజుద్దీన్ బాబా (నాగపూర్) పూర్తిగా భిన్నంగా వుండేవాడు. ఎవరైనా డబ్బు ఇచ్చారా లేదా అనేధ్యాసే వుండేదికాదు. తనవద్దనున్న డబ్బే తీసికొని పోయినా ఏమీ పట్టించుకొనేవాడు కాదు. ఆవిధంగా ఆయన వద్ద డబ్బు చూస్తే వచ్చినవాళ్లు తీసుకుపోయేవారు. ఇప్పుడు సంవత్సరానికి లక్షలాది ప్రజలు నాగపూర్‌కు ఆయన సమాధిని దర్శించేటందుకు వస్తూవుంటారు.

''నాకు యీ అయిదుగురి గుణాలుకూడా వున్నాయి. వారేకదా నన్ను అవతరింప చేసినది! జాగ్రత్తగా వినండి. మీకు ఇది ఉపయోగకరంగా వుంటుంది. డాన్‌స్టీవెన్స్ కూడా వినాలి. అమెరికనులకు కూడా తెలియాలి.

"నేను ఎవరినైనా.... నన్ను ప్రేమిస్తారు. నన్ను ద్వేషించేవారికి కూడా నేను బాబానే. పాశ్చాత్యులకు కూడా చెపుతున్నాను. నాతోనున్న కొందరు మండలివారు 30 యేళ్లనుండి కూడా నావద్ద నున్నారు. వారికి నా అలవాట్లు తెలుసును. బాబాకు డబ్బంటే విలువలేదు; డబ్బుతో బాబాకు పనిలేదు. నేను మౌనం వహించినప్పటి నుండి డబ్బునుతాకలేదు, బీదవారికి ఇచ్చినప్పుడు తప్ప. నాకు డబ్బులేదు. నాకు ప్రేమ వుంది. నాకు డబ్బును పంపించే ప్రేమికులవద్ద నేను ప్రేమతో స్వీకరిస్తాను. కార్యం నిమిత్తం పంచిపెడతాను. నా స్వంతమునకు నా జీవనంకోసం నేను కష్టించిపనిచేయను. నా కోసంగా డబ్బును సంపాదించను. గత 30 సంవత్సరాలుగా నేను డబ్బును తాకలేదు, మస్తులకు పేదలకు ఇచ్చేటప్పుడు తప్ప. ప్రపంచంలో అనేకచోట్ల నుండి డబ్బు వస్తోంది. విష్ణు చెపుతాడు. ఒక కోటి రూపాయల వరకు అతని చేతులద్వారా ఖర్చు అయిందని. డబ్బు ఖర్చుకాగానే కూరలేకుండా పచ్చడి చపాతీ తిని పాలు లేకుండా వున్న – టీ త్రాగేవారం. డబ్బురాగానే పాఠశాలలు ఆస్పత్రులు మొదలైనవి అన్నీ వుంటాయి. డబ్బు ఖర్చయిపోయిందంటే బాబా అన్నింటినీ ఎత్తివేస్తారు. అడిగినవారందరికి 'బాబాకు శాశ్వతంగా ఏ ఆశ్రమమూ వుండదు' అని చెప్పేవారు. ప్రతి హృదయము నా ఆశ్రమమే. డబ్బు ఉన్నప్పుడు పాఠశాలలు. ఆశ్రమాలు, ఆస్పత్రులు పెట్టేవారం. లేనప్పుడు అన్నీ విడిచి పెట్టేశాం. అయినా సుఖంగానే వున్నాం" అని బాబా విశదీకరించి చెప్పేవారు.

"ఇన్ని సంవత్సరాలనుండి ఆయన చేతులలో నుండి ఇంత డబ్బు ఎలా ప్రవహించింది? ఒక కోటిరుపాయిలు; బాబా కోసం కాదు. బాబా పనికోసం. ఈ డబ్బు ఒక అద్భుతరూపం (Miracle) లో రాలేదు. ప్రేమ డబ్బును తీసుకువస్తుంది. ఒక్కొక్కప్పుడు నేను డబ్బు అడుగుతాను. పాశ్చాత్య దేశాలలోగాని ఇండియాలోగాని నేను అడిగినవారు ఇస్తారు. ఒకొక్కప్పుడు నారాయణ మహరాజ్ ఏదె పరోక్షంగానే కాకుండా సరాసరి నా ప్రేమికులను అడుగుతానా, నాకు డబ్బు వస్తుంది. ఒకొక్కప్పుడు అడగకుండానే వస్తుంది. నేను స్వీకరిస్తాను. కొన్ని సమయాలలో నిరాకరిస్తాను కూడా అనేకసార్లు దానంటదే వచ్చినా బాబా అంగీకరించలేదు. డబ్బును బాబా చరణములకడ సమర్పిస్తారు. కాని బాబా నిరాకరించేవారు. అప్పుడు ఆడబ్బు ఇచ్చినవారి వెనుక పరుగెత్తవలసి వచ్చేది వాళ్లకు తిరిగి ఇచ్చేటందుకు. బాబా పేరుతో ఒక్క ఆస్తికూడా

లేదు; మెహెరాబాద్ ఆస్తులు కూడా. బాబా భావిసమాధి మందిరం మాత్రం బాబా స్వంతఆస్తి. బాబాకు అర్పించిన ఆస్తులుకూడా బాబా వద్దన్నారు.

"ఇది ముఖ్యమైన విషయం. మీరు జాగ్రత్తగా వినాలి. భవిష్యత్తులో మీపనికోసం పనికివస్తుంది.

"మెహెరాబాద్‌లో ఆశ్రమం వుండేది. మండలి (శిష్యులు) ఆస్పత్రి, ధర్మశాల, కుష్ఠురోగులు ఇంతమంది వుండేవారు. బాబా భౌతికంగా పనిచేసేవారు, పంచిపెసరేవారు, హఠాత్తుగా బాబా అన్నిటినీ ఎత్తివేయమన్నారు. అహమద్‌నగర్‌కు 40 మైళ్లదూరంలోనున్న "టోకా" అనే గ్రామానికి తరలించారు. అది పింపల్‌గాంవ్ రోడ్డులోవుంది. మళ్లీ ఆరుమాసాలలో అక్కడినుండి ఆఆశ్రమం ఎత్తివేశారు. టోకాలో ఒక గదిలో బాబా ఉపవాసం చేశారు. అప్పుడు మూడు విశేషాలు జరిగాయి.

(1) చాలసార్లు బాబా ఉపవసించారు. మండలినికూడా ఉపవసించమని చెప్పారు. ఒకడిని ఒక గదిలోపెట్టి మూడేళ్లు బంధించారు. అప్పుడు బాబా ఉపవాసం చేసేవారు. మంచినీరు టీ మాత్రం త్రాగేవారు. టోకాలో బాబా 51 రోజులు ఉపవాసం చేశారు. తదనంతరం బత్తాయిపండ్లరసం తీసికొని ఉపవాసం విరమించారు. అప్పుడు మండలి చాలా సంతోషించారు. బాబాను ఊరేగించారు. ఆనాడు ఏదో పండుగ. తరువాత రెండుమాసాలు బాబా కడుపునొప్పితో బాధపడ్డారు. మండలి సంతోషంతో త్వరత్వరగా వెళ్లుట-మూలంగా కుదుపువల్ల ఆకడుపునొప్పి వచ్చింది. ఇలా బాధ పడుతూవున్నా బాబా ప్రసన్నవదనంతో వుండవలసివచ్చేది. ఆయన అవతార పురుషుడు కాదా మరి !

2) టోకాలో ఉన్నప్పుడు, ఒకనాడు ఒక వ్యక్తి బాబా వద్దకు వచ్చాడు. అతడు మిక్కిలి ధనవంతుడు. బాబాను గురించి విని టోకాకు వచ్చాడు. అతడు హిందూ-జైనమతస్తుడు. బాబాను దర్శించేటందుకు వచ్చాడు. బ్రహ్మానుభవం కావాలని బాబాను అడిగాడు. బాబా అతనిని నేను ఏదిచెపితే అది చేస్తావా? అని అడిగారు. 'నాశిరస్సు ఖండించి మీ పాదములచెంత ఉంచుతాను' అన్నాడతడు. అప్పుడు బాబా "అక్కర్లేదు కాని, ఇక్కడ పిల్లలున్నారు. వారికోసం పదివేల రూపాయిలిస్తావా ?" అని అడిగారు. అతడు —'నాకు భార్యాపిల్లలున్నారు.

వారిని నేను పోషించాలికదా ?' అన్నాడు. మరి ఇప్పుడే ఏది చెసితే అదిచేస్తానన్నావు. ఒక్క పదివేలు యీ పిల్లలకోసం యివ్వలేవా ?'' అని అనగానే అతడు వెళ్లిపోయాడు.

3) టోకాలో జరిగిన మూడవ సంఘటన. బాబా వద్దకు ఒకయోగి వచ్చాడు. వచ్చి భగవంతుడు కావాలన్నాడు. 'సరే ! ఆ చెట్టుక్రింద కూర్చోమన్నాను. భోజనం చేయకూడదు. నీరు త్రాగకూడదు. తరువాత నా ఆజ్ఞకై నిరీక్షించాలి ? అన్నాను. వారం రోజులు అలాగే వున్నాడు. ఎనిమిదవ రోజున చెప్పకుండా పారిపోయాడు.'' అని యీ మూడు విశేషాలు చెప్పారు బాబా.

గం 3-10 నిమిషాలకు ప్రేమికులు కొంతసేపు విశ్రాంతి కావాలన్నారు. కొంతసేపటికి మళ్లీ అందరు సమావేశమైనారు.

బాబా :—''డబ్బుగురించి ప్రసంగం ముగిస్తాను. రేపు ఇంకొక సహవాస బృందానికి చెప్పినది రంజూ వ్రాసుకున్న ప్రకారం చదివించుదాం. తరువాత బాబా ఒక్కొక్కరిని వేరే వేరే కలుస్తారు. కార్యకర్తలలో ఏవో సమస్యలున్నాయి, అవన్నీ బాబా పరిష్కరిస్తారు.

''14-11-55 తేదీని పేదల పాదప్రక్షాళన కార్యక్రమం వుంది. ఆ రోజు మధ్యాహ్నం 'బుర్రకథ' (బాబా జీవిత సంగ్రహము - సందేశములు) వుంది. ఆ సాయంకాలం ధుని. 15 వ తేదీని బాబా విస్మృలను అందరిని మెహెరాబాద్ కొండమీదికి తీసికొని వెళతారు. 16 వ తేదీని, పింపల్‌గాంవ్‌కి, అక్కడున్న 'మనోనాశ్' పర్వతం మీదకు తీసుకు వెళతారు. పింపల్‌గాంవ్ అంటే, ప్రతిరోజూ ఇక్కడనుండి బాబా అక్కడికే వెళుతూవుంటారు. అక్కడ కొండమీద బాబా ఏకాంత వాసం గడిపారు.

''గోదావరీ మాత నేను కృష్ణునిగా నున్న కాలంలో యశోదను గుర్తు చేస్తుంది.'' అన్నారు. అప్పుడు, కట్టా సుబ్బారావు (ఏలూరు నివాసి) లేచి, గోదావరీ మాతను మెహెరాబాద్‌కు ఆహ్వానించి ఆమెను చూచే అవకాశం కల్పించమని బాబాను కోరాడు. ఆదీని అడిగి అటువంటి ఏర్పాటు చేసేటందుకు ఏమైనా వీలుందేమో అడుగుతానని బాబా అన్నారు. బాబా మళ్లీ ప్రసంగం ప్రారంభించారు.

"ఇన్ని సంవత్సరాల నుండి ధనం ప్రవాహంవలె వస్తోంది. డబ్బు వస్తుంది, పోతుంది. వచ్చినపుడు బాబా దానిని సద్వినియోగం చేస్తారు.

బాబా అన్నారు "గత 30 సంవత్సరాల నుండి బాబాపై ఆధారపడివున్న బృందసులు — స్త్రీలు, పురుషులు, వారి కుటుంబాలు.

"బాబా మస్తు కార్యక్రమం కోసం ఉపయోగించడమే కాక, బీదలకు సాధువులకు ఉపయోగించడమే కాక, మండలికి (పురుషులకు – స్త్రీలకు) వారి కుటుంబాలకు కూడా డబ్బును పంచిపెడతారు.

"డబ్బు వచ్చినపుడు మండలికి ముఖ్యావసరముల కంటె అధికంగా వారి సౌఖ్యాలకు సంతోషాలకు కూడా డబ్బు యిస్తాను. డబ్బు తక్కువ వస్తే వారి అవసరాలకు మాత్రం యిస్తాను.

"ఈ డబ్బు ఎలా వస్తోందో ఎలా ఖర్చవుతోందో లెక్క వ్రాయటం లేదు. అది రోజూ జరిగే విషయమే కాబట్టి లెక్కలుంచలేదు.

"ఇప్పుడు నాపై ఆధారపడినవారికి ప్రతినెల 8 మొదలు 10 వేల వరకు పంచిపెట్టాలి.

"అమెరికాలో ఎలిజబెత్ పాటర్సన్ అను ఆమె వుంది. ఆమె మిర్టిల్ బీచ్ అనే పెద్ద ఆస్తిని బాబాకు సమర్పించింది. అది 500 ఎకరాల విస్తీర్ణం కలది. అందు ఆధునికమైన భవనాలున్నాయి. బాబా నిమిత్తమే ఒక బంగళా వుంది. ఒక హాలు వుంది. మండలి నిమిత్తం గదులు నిర్మించారు. 1949 సం॥లో బాబా సర్వస్వమును పరిత్యజించి నూతన జీవితంలో ప్రవేశించినపుడు బాబా పేరుతో నున్న పన్నీ వేర్వేరు ఆసామీలకు వ్రాసి యివ్వడం జరిగింది. మండలి అందుకు సాక్షులు. బాబా ఆస్తులన్నింటిని భావితరం వారికి యిచ్చివేశారు. అంటే – భగవత్ప్రేమికులకు ఆ ఆస్తులపై వచ్చిన ద్రవ్యం వారి మనుగడకోసం యివ్వాలి.

ఈ మధ్య సతరాలో బాబా ఏకాంతవాసం ముగియగానే విష్ణుమాస్టర్ అడిగాడు "వచ్చేనెల మాటేమిటి? మన దగ్గర ఏమీలేదే!" అని.

అందుచేత బాబా యీ ప్రేమికుల సమావేశం గురించి ఆలోచించారు.

విష్ణు ఇలా అన్నాడు "బాబా! మీరు వారిని పిలవాలనుకుంటున్నారు, వచ్చే నెలలో ఖర్చు సంగతి నేను చెప్తున్నాను. మనకు భోజనానికి ఇక్కడేమీ లేదు. అప్పుడు బాబా; "మండలిని పిలిచి 20 బాబా ప్రేమికులకు సహవాస్ కార్యక్రమం గురించి చెప్పమని చెప్పు ఆ 20 మందికి వ్రాసిన ఉత్తరం సంగతి మీలో చాల మందికి తెలుసుననుకుంటాను." అని అంటూ పెండును పిలిచి 150 మందిని ఒక నెలరోజులకు పిలిస్తే ఎంత ఖర్చు అవుతుంది అని అడిగాను. అతడు రు 30,000 లు అవసరమన్నాడు.

"మీకు వివరాలన్నీ చెప్తున్నాను – ఇచ్చట వ్యవహారాలు ఎలా సాగుతాయో తెలిసేటందుకు. మనిషికి రోజునకు రు 6-00 లు అవుతుంది. బాబా హోమపు చేయమని అన్నారు. నేను రు 10,000 లు నీవల కోసం ఉంచుకొని పెండుకు రు 20,000 ఇస్తానన్నాను. పెండు అంగీకరించాడు.

"అప్పుడు బాబా 20 ఉత్తరాలు పంపించారు, ఒక్కొక్కరిని రు 1500/- లు విరాళం పంపమని. తరువాత 25 మందికి వెళ్లాలన్నాను. అటు పిమ్మట ఇంకా ఎక్కువమంది డబ్బు యివ్వడానికి అంగీకరించారు.

"ఉత్తరాలు వ్రాసినా అయిదువేలు లోటు ఉండిపోయింది.

డాక్టర్ కనకదండి సూర్యనారాయణ (ఏలూరు) మొదట రు 100/- లు పంపుతానని టెలిగ్రాం యిచ్చాడు. గడువు తేదీ దాటిన తరువాత, లోటు ఎంత వుండే, అంతా భర్తీ చేస్తానని తంతి యిచ్చాడు. చాలా టెలిగ్రాములు నడిచాయి. డాక్టర్ కనకదండి, టి. ఎస్. కుటుంబశాస్త్రి ఇద్దరు కలిసి టెలిగ్రాములు యిచ్చారు.

"చివరికి బాబా డా॥ కనకదండికి, కుటుంబశాస్త్రికి రు 5,500 లోటు వచ్చిందని తెలియజేయడమైనది. గడువు తేదీనాటికి రు 15,000/- లోటు వుంది. తరువాత రు 5,500 లు మాత్రం ఉండిపోయిమిగిలినది భర్తీ అయిపోయింది. వారిద్దరు లోటు ఎంత వుంటే అంతా భరిస్తామన్నారు. సరే, యీ విధంగా రు 30,000 లు వసూలైంది. బాబా విష్ణుని పిలిచి "ఇదిగో! సహవాస్ నిమిత్తమై డబ్బు" అన్నారు. అతడు "బాగానేవుంది కాని వచ్చేనెల ఖర్చుకోసమో" అన్నాడు. తరువాత డా॥ కనకదండి, కుటుంబశాస్త్రికి మళ్లీ వ్రాశాడు. గడువుతేదీ ముగిసిన, పిమ్మట

రు 15,000 లు లోటు వుంది. అదంతా వారు పూర్తిచేస్తామన్నారు. వారిని వారి మాటమీద నిలబడాలన్నాను. చివరికి బాబా ఒక్కమాట వ్రాయించారు. "ప్రియతమునికి తన ప్రేమికులను అడగవలెనని ప్రేరేపణ కలిగింది" అని.

"వారి ధైర్యసాహసం చూడండి. వారు ఏమి వ్రాసినా, .... సరేనని అంగీకరించారు. వారు డబ్బు ఏ విధంగా సేకరించారో అన్నది అదొక కథ. వారు అయిదువేలు లోటును పూరిస్తూ ఆదీకి (ఆదీకే, ఇరానీ) పంపించారు. వచ్చేనెల ఖర్చుల నిమిత్తమై విష్ణునకు పదివేలు పంపించారు.

సా॥ నాలుగు గంటలవుతూ వుంది. డాన్ హాలులోపలకు వచ్చాడు. బాబా అతనితో "డాన్ ! నీవు చాలవరకు వినకుండా మేము మాట్లాడుకున్నాం. ఆ ప్రసంగమే ఇంకా సాగుతోంది" అన్నారు.

బాబా మళ్లీ ప్రారంభించారు.

"కుటుంబశాస్త్రి యొక్క, కనకదండి యొక్క ప్రేమకు, త్యాగానికి చాలా సంతోషిస్తున్నాను. బాబాకోసం వారి ధైర్యసాహసం మెచ్చుకోదగినది. మళ్లీ ఇప్పుడు జేబులు ఖాళీ అయినాయి.

"ఇప్పుడు సాఈబాబా నాలో ప్రవేశించాడు. ఇప్పుడు సాఈబాబా మాట్లాడుతున్నాడు. బాబా, మీకు ఒకపథకాన్ని గురించి చెపుతున్నారు. ఆయన చేసినవాగ్దానాల చేత బాబాను బంధించవలదు. బాబా మాటయిస్తే దానిని భంగపరచరు. అయితే వాగ్దానభంగంలోకూడా బాబాకు స్వేచ్ఛవుంది.

"ఈసారి మరొకటి ఆలోచించాము.

1956 ఫిబ్రవరి 15 తేదీ అనంతరము బాబా యొక్క స్త్రీ-పురుష మండలి నుండి, బాబాపై ఆధారపడిన కుటుంబీకులనుండి ఒక యేడాదిపాటు దూరంగా వుండాలనుకుంటున్నారు. వీరికి దూరంగానుండి చేయడానికి బాబాకు స్వంతపని వుంది. వెళ్లిపోవడం అంటే —వారికి తన ముఖం చూపించకుండా వుండడమే. "నేను వచ్చిన తరువాత మౌనం విరమించవచ్చును" అన్నారుబాబా. బాబా సూచిస్తూ వచ్చిన అద్భుతం జరగవచ్చును. "ఈక్షణంలో నేను భావిస్తున్నది యిది. నేను సంవత్సరం తరువాత తిరిగి రావచ్చును లేక రాకపోవచ్చును. కాని నేను ఏమని వాగ్దానం చేయను ?" అన్నారు బాబా.

"పూర్తిగా ఒక సంవత్సరం నేను వెళ్లిపోతే స్త్రీ–పురుషమండలుల పోషణ జరగాలి. దానికి తగిన యేర్పాట్లను చేయాలి. ఒక సంవత్సరానికి సరిపడినది ఇచ్చి మరీ వెళ్లాలి. 1955 డిశెంబరు మొదలు ఫిబ్రవరి 15, 1957 వరకు సుమారు 14 మాసాలకు బాదా ఏర్పాట్లు చేయాలి. అమెరికన్ ప్రేమికులతో ఎంతవీలైతే అంతా పంపించమని చెప్పమని డాన్‌స్టీవెన్స్‌తో చెప్పాను. ఎవరు ఇవ్వగలిగితే వారు తప్పక ఇవ్వాలి. కాని స్వేచ్ఛగా ఇవ్వాలి. మీ ప్రేమనంతా చూపించుతూ ఇవ్వాలి. మీలో ఎవరైనా ఇవ్వలేకపోతే అది మీకు –బాబాకు మధ్య అడ్డుతెరవలె వుంటుందని భావించవద్దు. ఇవి అందరికీ వర్తించే ఉత్తర్వులు. బృందములన్నింటిలో ఈవిధంగానే చెప్పటం జరుగుతుంది.

"వచ్చే డబ్బంతా స్వీకరించేటందుకు కాకాబారియాకు అధికారమిచ్చాను. పంపించగలిగినవారే ప్రేమతో పంపించాలి.

"డబ్బుకోసం మీరు ఇబ్బందిపడి కూలబడకండి. ఇది మోసం కాకూడదు. ఇవ్వలేనివారు కూడా ఒక్క రూపాయి అయినా ఇవ్వవచ్చు. ఎందుచేతననగా అది ఉపకరిస్తుంది. ఆ ఒక్కరూపాయి మీ భాగం అవుతుంది. అదే లక్షరూపాయిల విలువ అవుతుంది.

"దీనిని గురించి మూడు సంగతులు గుర్తుంచుకోనండి :

1) కాకా బారియాకు వెంటనే ఇప్పుడే ఇవ్వాలని బాధపడకండి. మీరందరూ మీ వూళ్లకు వెళ్లి ఆలోచించి తరువాత కాకాకు పంపించండి. అతడు స్వీకరించి జమచేస్తాడు.

2) దీని నిమిత్తమై ఇంటింటికివెళ్లి అడగవలదు. మీరు ఒక్కొక్కరే వ్యక్తిగతంగా పంపించగలిగినది ఏదిటో పంపించండి. మీరందరు ఇచ్చటికి రానివారందరితోను చెప్పండి. కాని వారలను బలవంతం చేయవద్దు. ఉదాహరణకు — వారితో తియ్యనిమాటలు చెప్పి వారిని మభ్యపెట్టకండి. కాకాకు ఇప్పుడేమీ ఇవ్వవద్దు. మీరు మీ యిండ్లకు తరలివెళ్లిన తరువాత పంపించండి.

"స్త్రీలు కూడా పంపించవచ్చు. గుజరాతీ బృందంలో స్త్రీలు కూడా ఈ విషయం అడిగారు. స్త్రీలు కూడా పంపవచ్చునని బాబా, వారిని అనుమతించారు.

"ఇంక, ఈ సహవాస్ ఏర్పాట్లను గురించి-ఈ సహవాస్‌నకు రు 20,000 లు ఉపయోగించుదామని, రు 10,000 లు బీదల కార్యక్రమానికి ఉంచుదామని అనుకొన్నాను. తొలిగా అనుకొన్న 150 మంది, ఇప్పుడు 200 అయ్యారు. హిందీబృందం 200 కు మించి పోయారు. పెండు "బాబా! పేదల కార్యక్రమానికి రు 10,000 లు ఉంచడం కుదరదు" అన్నాడు. నేను "పోనీలే, బీదలకోసం రు 2,000 మాత్రమే ఇవ్వు, నాకు తృప్తికలుగుతుంది" అన్నాను. పెండు మొదట్లో అసలే లేదన్నాడు. తరువాత రు 1000 లు యిస్తానన్నాడు. తరువాత రు 2000 లకు అంగీకరించాడు.

బీదలకోసం పెండు యిచ్చిన రు 2000/-లు నాజర్ తండ్రి పంపించిన రు 1000/-లు ఇంకొక 1000/-లు ఏలూరు ఆతిథ్యసంఘం తీసికొని వచ్చినది మొత్తం రు 4000/- లు వుంది. ప్రతివారం 250 మంది బీదలను పిలిచి ఒక్కొక్కరికి రు 4/-ల చొప్పున రు 1000/-లు వేయిరూపాయిలు పంచిపెట్టడం జరుగుతోంది. నాజర్ తండ్రి యిచ్చిన రు 1000-లు మొదటివారంలో వినియోగించబడింది.

"అసలు యీనాల్గురూపాయిలు ఏవిటి? దాని విశిష్టత ఏమిటి? బాబా స్వయంగా వారి పాదాలు స్పృశించి యీ కానుక యిస్తున్నారు. అది వారికి శాశ్వతంగా వుండిపోతుంది. నాలుగు రూపాయిల విలువ ఏమీలేకపోవచ్చు, కాని బాబా సాంగత్యంయొక్క ఆధ్యాత్మిక విలువ సాటిలేనిది.

"ఈవిధంగా పెండుకు రు 28,000/-లు సహవాస్ ఏర్పాట్లకు యివ్వడం జరిగింది. దీనికి సరియైన లెఖ్ఖ వ్రాసి, దీనికై డబ్బు యిచ్చిన ప్రతివారికి ఈ జమా ఖర్చుల ప్రతి, ఒకటి పంపించబడుతుంది. ఇందులో ఏదైనా ఖర్చు కాకుండా మిగిలితే, అది డాక్టర్ కనకదండికి, కుటుంబశాస్త్రికి తిరిగి పంపించుట జరుగుతుంది.

"1956 ఫిబ్రవరి 15 తేదీ తరువాత నేను ఏడుగురు శిష్యులను వెంటతీసికొని ఒక సంవత్సరంపాటు ఎక్కడికో వెళదామనుకుంటున్నాను.

"ఇంకొక విషయం. ఒక్కొక్క బృందంనుండి అయిదుగురు కావాలి. వారు వరుసగా వారంరోజులు ఉపవాసంచేసి, మంచినీరు తప్ప ఏమీ త్రాగకుండా, ఒక గదిలో బంధింపబడి వారంరోజులపాటు నిద్రపోకుండా వుంటూ, బాబా నామం జపించాలి, నిరంతరము. గుజరాతీబృందం నుండి నేను అయిదుగురను ఎన్నుకున్నాను. ఆ ప్రకారం ఉపవాసం చేస్తూ నిద్రపోకుండా ఉండగలవారు ఎవరున్నారో

వారు లేచి నిలబడండి'' అని బాబా చెప్పగనే 16 గురు ప్రేమికులు లేచి నిలుచున్నారు బాబా ఆజ్ఞలను పాలిస్తామని.

బాబా ''తయిదుగురి కంటే ఎక్కువమంది ఉన్నందున నాకు 'సంతోషంగా వుంది. తరువాత బాబా 5 గురిని ఎన్నుకొని మిగిలినవారితో మిమ్మల్ని ఎన్నుకొనలేదని మీరేమీ అన్యథా తలంచవద్దు'' అన్నారు.

బాబా ఈ క్రింది అయిదుగురిని ఎన్నుకొన్నారు.

1) తాడిమేటి సూర్యకుటుంబశాస్త్రి
2) డా॥ కనకదండి సూర్యనారాయణ
3) కోడూరి కృష్ణారావు
4) వై. వి. రంగారావు
5) మెహెర్ ప్రసాద్

బాబా వారితో ''రెండుసార్లు బాగా ఆలోచించండి. ఉపవసించడము సులభమే. కాని మెలకువగా నుండి నిద్రపోకుండా మంచినీరు మాత్రమే తీసికుంటూ నిరంతరం నామ జపం చేయడము చాలా కష్టం. మీరు లేచి నిలబడి అలాగే చేస్తానని – వాగ్దానం చేసేముందు బాగా రెండుసార్లు ఆలోచించండి. తేలికగా మాట యివ్వకండి. మీ ఆరోగ్యం గురించి ఆలోచించండి.

ఎన్నుకొనని ఇతర ప్రేమికులతో బాబా ''మీరులేచి నిలబడిన తక్షణం మీరు నేను చెప్పిన ప్రకారం చేసినట్లే. మిమ్ములను ఎన్నుకొనలేదని విచారించకండి. ఆ వారంరోజులు మాత్రమేగాక బాబా నామం నిత్యమూ జపించండి.

''ఎన్నికైన మీ అయిదుగురికి నేను ఇంకా కొన్నిసంగతులు చెప్తాను.

''రేపు మీరు ''ప్రేమ''ను గురించి ప్రసంగం వినరండి.

''నేను అనంతముగా తెలివైనవాడను. నేను బుద్ధికి అతీతుడను. నేను అనంతంగా ఆనందంలో వుంటాను. కాని అనుక్షణం చిత్రవ్యధనొందుతూ వుంటాను.

నేను ఆనందంలో ప్రజ్ఞాతీతుడను. అనుక్షణం చిత్రవ్యథను అనుభవిస్తూ వుంటాను. నేను మీతో ఒకడను. నేను ఒక్కడనే. మీరందరు నాలో ఉన్నారు. నేను మీ అందరిలో ఉన్నాను. ఒక్కసారి మీకు ఆ అనుభవం కలిగిందంటే ఆ యేకత్వస్థితి వుండిపోతుంది.

మీరెవరైనా సత్పురుషులను సందర్శించడానికి బాబాకు అభ్యంతరం లేదు. వారికి మీరు నమస్కరించవచ్చు. వారితో సంబంధాలు కలిగివుండవచ్చు. వారందరు ఆయనలో వున్నారు. మీలో ఎవరికైనా ఏసాధుపురుషుడైనా గొప్పవాడని భావిస్తే, మీకు ఆతడు తారసిల్లినపుడు, మీరు అయనను గౌరవించి ఆతనికి నమస్కరించాలి. మీరు ఎందుకు ఆవిధంగా చేయకూడదో నాకు తెలియదు. మీరు అట్టివారిని గౌరవించాలి. అన్ని బృందాలకు నేను అదే చెపుతూవుంటాను. మీరు బృందములుగా విభజింపబడినా, బాబాకు అందరూ ఒకటే. మహమ్మదీయులు, పార్సీలు, హిందువులు, క్రిష్టియనులు, ఎవరైనా బాబాకు అందరూ ఒకటే. గుజరాతీయులైనా, ఆంధ్రులైనా, మహారాష్ట్రులైనా, హిందీవారైనా బాబాకు అంతా ఒక్కటే.

బాబా ఇంకా అధికారపూర్వకంగా చెపుతున్నారు. "మీరు భగవంతునిగురించి ఏదైనా తెలిసికొనాలంటే, భగవంతుని చేరవలెనంటే, అప్పుడు బాబా కొంగునే పట్టుకొనండి. మీకు భగవంతుడు కావలెనంటే, ప్రేమ కావలెనంటే, భగవంతునితో ఐక్యం పొందవలెననే కోర్కె వుంటే – అందుకు బాబా కొంగు పట్టుకొనుట ఒక్కటే మార్గం.

"మీకు ఇతరములైనవి ఆరోగ్యము, ఐశ్వర్యము వగైరా కావలెనంటే వీటికోసం మీరు బాబా వద్దకు రాకండి. భగవంతుడు తప్ప ఇతరకోర్కెలు తీర్చడానికి ఇతర సాధుపురుషులు ఎందరో వున్నారు.

"వ్యాపారస్తులు మూడు రకాలుంటారు.

1) షా సౌదాగర్. అతడు దర్యియాలో వుంటాడు. అతడు వ్యాపారవృత్తికే రాజు. వ్యాపారము లన్నింటిపై ఆతనికి గుత్తాధికారం వుంటుంది.

2) టోకు వ్యాపారస్తులు. (ఒక్కొక్కసరుకునకు గాని లేక కొన్నింటికిగాని)

3) చిల్లర వ్యాపారస్తులు.

"నీకు ఒక సూది కావలెనంటే నీవు చిల్లర దుకాణం వద్దకు పోతావుగాని టోకు వ్యాపారివద్దకు పోవు. అలాగే నీకు ఆరోగ్యం, ధనం పలుకుబడి, ఉద్యోగం, కీర్తి కావలెనంటే నీవు నా వద్దకు ఇక్కడికి వచ్చినచో ప్రయోజనంలేదు. వాటితో బాబా వ్యాపారం చేయడు." అని అన్నారు బాబా.

సాయంకాలం 5 గం॥లకు భజన జరిగింది. అరంగాంవ్ నుండి వచ్చినవారికి బయటవేసిన పందిట్లో బాబా దర్శనమిచ్చారు. తరువాత సాయంకాలం బాబా ధుని వెలిగించారు. ఒక్కొకరు ఒక్కొక సమిధతీసికొని, తమకున్న కోర్కెలలో ఒక కోరికను గాని లేక, బలహీనతలలో ఒక బలహీనతను గాని బాబా చెప్పిన ప్రకారం ఆధునిలో విడిచిపెట్టారు. అందరు ఆవిధంగా చేసినతరువాత బాబా సా॥ గ 6-30 లకు పింపల్‌గాంవ్ వెళ్లిపోయారు.

1955 నవంబరు 13 తేదీ, ఆదివారం.

బాబా పింపల్‌గాంవ్ నుండి మెహెరాబాద్‌కి ఉదయం 7-30 గం॥కు వచ్చారు. అందరు హాలులో సమావేశమైనారు. హాలులోపలకు బాబా 8 గం॥లకు వచ్చారు. బాబా మామూలుప్రకారం ప్రేమికుల ఆరోగ్యం గురించి రాత్రి నిద్రపోని వారిని గురించి పలప్రశ్నలు వేశారు.

వడివేలు అనే ప్రేమికుడు లేచి నిలబడి "సరిగా, ఎక్కువ తక్కువలు లేకుండా సరిగా 14 సార్లే బాబా నామం జపించాలన్నారు, అది చాలా కష్టం" అని చెప్పాడు. ముఖ్యంగా అనుక్షణము బాబా నామాన్ని స్మరించేవారి సంగతేమిటి? సరిగా 14 సార్లే జపించాలంటే వారికి కష్టం. 14 సార్లకు తక్కువకాకుండా అంటే బాగుంటుంది" అని అన్నాడు వడివేలు. ఈ విషయంలో బాబా యీవిధంగా ఆదేశించినప్పటినుండి తనకు నిద్రపట్టలేదన్నాడు.

ఒక మండలి సభ్యుడు కొన్నిరోజులనుండి నిద్రపట్టడం లేదన్నాడు. అంతట బాబా: "నీవు ఆరోగ్యంగా బాగానే వున్నావులే. నీకు నిద్రపట్టకపోయినా ఫరవాలేదు. నీవు విచారించ నక్కరలేదు.

"ఒక్కొక్కప్పుడు మండలి మెలకువగా వుండాలి, బాబాతో కలిసి నివసిస్తున్న మండలి అందరు రత్నాలవంటివారు, ఈరచ్‌తో ఎవరూ సాటిలేరు" అని చెపుతూ వుంటే ఈరచ్ 'అటువంటి మాటలు అనుట నాకిష్టంలేదు' అన్నాడు – బాబా 14 రోజులు 20 రోజులు మస్తుయాత్రలు చేస్తూవుంటారు. రాత్రింబగళ్లు ఒకవూరి నుండి ఇంకోవూరికి కదలుతూనే వుండాలి. ఈ రోజుల్లో మండలికి రాత్రులందు విశ్రాంతి వుండేదికాదు ఎప్పుడో కొలది నిమిషాలు తప్ప.

"మీకు నిద్ర వస్తూవుంటే మెలకువగా వుండేటందుకు ప్రయత్నించకండి. మీకు నిద్ర రానప్పుడు మెలకువగా నుండి బాబానామం జపించుతూ వుండండి. నిన్న చెప్పినది ఈ రోజున మార్చుతున్నాను. 14 సార్లకు తక్కువకాకుండా నామజపం చేయండి. ఎన్నిసార్లు వీలైతే అన్నిసార్లు చేయండి" అన్నారు బాబా.

ఒక ప్రేమికుడు ఏ నామం మేము జపించాలి? మెహెర్‌బాబా అనియా? లేక బాబా అనియా? అని బాబాను అడిగాడు. బాబా దానికి జవాబుగా "మెహెర్ బాబా" అని అక్కరలేదు. 'బాబా - బాబా' అని అంటే చాలు" అన్నారు.

గుజరాత్ బృందానికి చెప్పిన ప్రసంగం సారాంశం ఈరచ్‌ను చదివి చెప్ప మన్నారు. ఈరచ్ "చెప్పిన సంగతులన్నీ సాఫీగా వ్రాయలేదు. పూర్తికాకుండా చిత్తులో వున్నాయి" అన్నాడు.

బాబా యొక్క కార్యం ఎలా చేయాలి? అనే ప్రసక్తి తెచ్చారు. తెలుగు బృందానికే కాక అందరికీ చెపుతున్నాను.

"అయితే చెప్పడం మరిచిపోయాను. పెండు అన్నాడు గదా 'సహవాస్ ఏర్పాటులకు అతనికి యిచ్చిన సొమ్ము చాలదంటున్నాడు. పింపల్‌గావ్‌కి వెళ్లిరావ డానిక అందులోనుంచి ఖర్చుచేయడానికి చాలదు. అందుచేత అతనిని ఒక్కొక్కరి వద్ద పింపల్‌గావ్ వెళ్లిరావడానికి బస్సుఛార్జీ రెండు రూపాయిలు తీసికోమని నేనే అనుమతించాను! నిన్న కొందరు రెండు రూపాయల చొప్పున వసూలు చేశారు. ఇప్పుడు పెండు రెండు రూపాయిల చొప్పున వసూలు చేయనక్కరలేకుండానే పింపల్‌గావ్ తీసుకువెళ్లి మళ్లీ తీసుకు వస్తానంటున్నాడు. అందుచేత ఎవరూ రెండు రూపాయిలు యివ్వనక్కరలేదు. నిన్న వసూలుచేసిన రెండేసిరూపాయిలు

వాపసుచేయమని చెప్పాను. మిగిలిన డబ్బు కుటుంబశాస్త్రికి, డా॥ కనకదండికి పంపించాలికదా అని పాద్రీ జ్ఞాపకం చేస్తున్నాడు. అందుచేత ఏంచేయాలి? నేను చెప్పాను "అలాగైతే నిన్న యిచ్చిన డబ్బు వాపసుచేయవద్దు" అన్నాను. ఇప్పుని వారివద్ద తీసికొనవద్దు. వారు ఊరికే వెళ్ళిపస్తారు.

"ఇంకొక సంగతి. అనేకమంది స్త్రీలు ఉత్తరాలు వ్రాశారు. అనేక చోట్ల నుండి ప్రేమికురాండ్రు వ్రాశారు. బాబాకు సన్నిహితంగా ఉండటానికి స్త్రీలకు ఎందుకు అవకాశం యివ్వలేదు? క్రిందటిసారి సెప్టెంబరు 1954 లో కూడా స్త్రీలు రాకూడదన్నారు. ఇప్పుడూ అంతే. ఎందుచేత?

"బాబాకు అటువంటి తేడా యేమీ లేదు. ఆయన వీటికి అతీతుడు. కాని స్త్రీలు వస్తే పిల్లలుకూడా వస్తారు తరువాత వారి భర్తలు కూడా వస్తారు. సహజంగా పెండుకు పచ్చెక్కుతుంది. మనం కుటుంబాలకోసం కుటీరాలు, గుడారాలు ఏర్పాటు చేయాలి. ఆడవారికి వారిని గురించి జాగ్రత్తపడి పిల్లల సంరక్షణ చేసికొనేటందుకే సమయం గడిచిపోతుంది ఈకష్టం మూలంనసే ఆడవారిని రమ్మనలేదు. మగవారైతే వారిపనులు త్వరగా చేసికొంటారు. సాధారణంగా స్త్రీలు అలాకాదు," అన్నారు.

బాబాకు ఒక ఆలోచన కలిగింది. ఇప్పుడది ఆలోచన మాత్రంగనే వుంది. వాగ్దానం యేమీ కాదు. బంధం అసలేకాదు. డిశెంబరులో బాబాకు సమయం చిక్కితే ఆంధ్రలో రెండుచోట్లకు ఒక్కొక్కరోజు చొప్పున వెళదామని వుంది. అది ప్రత్యేకించి స్త్రీలకోసం. డాన్‌స్టీవెన్సు పాశ్చాత్య స్త్రీలగురించి ఇదేచెపుతున్నాడు. ఇక్కడ నుండి పాశ్చాత్యరాజ్యాలకు రాకపోకలకు ఖర్చులు యిస్తే బాబా వెళ్లవచ్చును. అయితే బాబా ఏ మాట యివ్వరు. బాబాకు సమయం లేదు. 1956 ఫిబ్రవరి 15 నుండి బాబా వెళ్లిపోవాలి. బాబా పడమరకు వెళ్లవలసి వుంటుంది. ఈ లోపుగా బాబాకు సమయంచిక్కితే ఆయన దక్షిణాపథంలో ఒకటి రెండు రోజులు గడుపుతారు.

"నిన్న ఈ విషయం బాబా ఆలోచించారు. పాశ్చాత్య స్త్రీలకోసం పాశ్చాత్య దేశాలకు వెళ్లడానికి అవకాశం లేదు. కాని ఇండియాలో అనేకచోట్లకు బాబా వెళ్ల వచ్చును, ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క రోజు చొప్పున. నేను నిశ్చయించుకొన్న మీదట మీకు చెపుతాను.

"నేను ఆంధ్రకు రెండు రోజులు ఇవ్వగలను. రెండు సెంటర్లకు రెండు రోజులు. అంతకంటె ఎక్కువ సెంటర్లకు వెళ్లడానికి సమయం లేదు.

"కిషన్‌సింగు డెహ్రాడూన్ రమ్మని అంటున్నాడు. రెండు రోజులు ప్రయాణం. రెండురోజులు అక్కడుండడము, మరల రెండు రోజులు తిరుగు ప్రయాణం. డాక్టర్ దేశ్‌ముఖ్ వద్దకు వెళతానని నేను వాగ్దానం చేశాను. ఇవన్నీ తిరగడానికి 15 రోజులు తీసికుంటుంది. 15-2-1956 తేదీనుండి ఒక యేడాదిపాటు వెళ్లినపుడు బాబా విశ్వమంతటికి ఘనకార్యం చేయవలసివుంది. ఈ సహవాస్ అంతా దర్శనమే. స్త్రీలను పిలిచి స్త్రీలకు – పురుషులకు దర్శనం యివ్వడం ఇవన్నీ 15-2-56 తేదీనుండి సంవత్సరం పాటు బాబా చేయవలసిన పనితో పోలిస్తే ఏమీ విశిష్టత లేనిది. కాని ఈ ప్రేమ విశిష్టతలేనిదికాదు. ప్రేమలోనే విశిష్టతను కలిగివుంది. సంవత్సరం బాబా బయటికి వెళ్లాలంటే, బాబాకు అన్నివిధాలా స్వేచ్ఛ వుండాలి. అందుకు 15-2-56 తేదీ ముందు ఇవన్నీ ముగించుకొని బయటపడటానికి సమయం కావాలి. ఆ యేడాదిపనితో దేనికీ పోటీ వుండకూడదు. మీరు వీలుచేసుకొని చేయగలమంటే బాబాకు వ్రాయండి, చేయలేకపోతే విచారించకండి.

నేను ఆంధ్రలో మీ అందరిలోను వున్నాను. రెండురోజులకంటె ఎక్కువ అడగకండి. నేను దక్షిణ భారతాన్ని ఎక్కువగా ప్రేమిస్తాను. మీకు అర్థంకాని సంబంధం ఒకటి వుంది. దక్షిణభారతంలో మీ అందరితోను —పురుషులు, స్త్రీలు, పిల్లలు —ఏస్థలాలకు వెళ్లాలో నిశ్చయించుకొనేటందుకు పోట్లాట వస్తుందని బాబాకు తెలుసును. ఒక్కొక్క సెంటరునుండి ఒక్కొక్కరు కూడి సమావేశమై చర్చించండి. తిరుమలరావుని మీసభకు అధ్యక్షునిగాచేసి ఒక నిర్ణయానికి రండి.

"'బాబా ఆంధ్రదేశానికివచ్చి బహిరంగ' ప్రజాదర్శనాలివ్వరు. ఈసారి స్త్రీలకు సహవాస్ ఇవ్వడంకోసమే. అందుచేత స్త్రీలు బాబా ప్రేమను ఇతర స్త్రీలకు వ్యాప్తి చేయగలరు. నాకు పూలమాలలు వద్దు ప్రజలు ఊరికేవచ్చి ప్రణమిల్లి వెళ్లిపోవడం వద్దు. నాకు అసలైన కార్యకర్తలు, బాబా సందేశమును పవిత్ర ప్రేమను వ్యాప్తి చేయగలవారు కావాలి.

"రెండు సెంటర్లు ఏర్పాటు చేయండి. ఒక్కొక్కచోట 500 మంది స్త్రీలు సహవాస్‌కు సమావేశం కావాలి. అవి ఆదరణ యోగ్యంగా కనుపించకపోతే బాబా

నిర్ణయాన్ని మార్చనీయకండి. ప్రజాదర్శనాలుగాని ఆ వాతావరణంగాని రానీయకండి. నాకు నిజమైన కార్యకర్తలు కావాలి. ఇక్కడ మేము సంఖ్య తగ్గించినట్లే మీరు కూడా సంఖ్యను అదుపులో ఉంచుకొనండి. అలాగు మీరు చేయకపోతే మాని వేయండి. నేను ఎప్పుడూ అక్కడ మీతోనే వున్నాను. ఎన్నుకొన్న స్త్రీలు మాత్రం బాబా ప్రేమసందేశాన్ని వ్యాప్తిచేయగలవారై వుండాలి. మీరు పిల్లలసంగతి పట్టించుకొనవద్దు. రెండుసెంటర్లు నిర్ణయించుకొనండి. 48 గంటలు వరుసగా గడిపేటట్లు చూడండి. ఇందులో ప్రయాణకాలం మినహాయించండి. కానిస్త్రీలతో పిల్లలను కలిపారు. ఈ 48 గంటలలోను బాబాకు పిల్లలతో వుండాలనివుంది. ఇది నిర్వహించడం కష్టమే. కాని నిర్వహించడానికి ప్రయత్నించండి''

మండలివారు కొందరు అన్నారు ''బాబాలో తరచుగా మార్పులు మేము చూశాము. హఠాత్తుగా ఆయన తేజోవంతంగా సంతోషంగా ఉండడము చూస్తాము. అలాగే మళ్లీ హఠాత్తుగా ముదుసలివలె కృశించిపోయి, కళ్లు లోతుకు పోయినట్లు కనిపించుతారు. ఆయన ముఖంలో మార్పులు కలుగుతూవుంటాయి. బాబా ఇంకనూ ఇలా అన్నారు ''మీ మధ్యలో వున్నందుకు నేను సంతోషిస్తున్నాను'' అని.

''అంతా మనస్సులో వుంది. సృష్టియావత్తు మనస్సులో నుండి వచ్చింది. మనస్సే స్వేచ్ఛను ఇస్తుంది. మనస్సే బంధిస్తుంది. మీరందరూ ఇదివరకే మీ సంస్కారసులచేత బంధింపబడి వున్నారు. కాని నీ ఆత్మ ఎల్లప్పుడు స్వేచ్ఛగనే వుంది. అయితే నీవు బద్ధుడవై యున్నావని భావింపచేసేది నీ మనస్సే. నీవు బాధింపబడుతూవున్నావని అనుకొనేటట్లు చేసేదీ నీ మనస్సే. నేను చెపుతూవుంటే మీరు వింటున్నారే గాని దీని అనుభవం పొందడానికి అది మీ చేతులలో లేదు. మీరు అవగాహన చేసికొనగలరు అంతే. అయితే మనస్సు అది పట్టుకొని పనిచేస్తుంది. మీరు నన్ను భగవంతునిగా చూడగనే మీరు శాశ్వతానందంలో వుంటారు. మనస్సు దానితో సంస్కారాలు మరి ఇతరసులన్నీ అదృశ్యమైపోతాయి.

డాక్టర్ ధనపతిరావు ''అయితే మేము నీ కృపవల్లనే అనుభవించగలం బాబా'' అన్నాడు.

బాబా ''ఉండు. ఈరచ్ చదివేది విను. గుజరాతీ బృందానికి కూడా ఇలాగే వివరించి చెప్పాను'' అన్నారు.

"ఎప్పుడైతే మీరందరూ నన్ను చూస్తారో నా అనుగ్రహం మీ మీద ప్రసరిస్తుందో ఆక్షణమే మీరు నేను ఒకటే. కాని నానుండి అనుగ్రహం మీ మీదకు ప్రసరించాలంటే అది కష్టం. దానిని స్వీకరించడానికి పాత్ర సిద్ధంగాలేదు. దాని వెంట్లా ఏవేవో ఉన్నాయి. నా కృప ఎల్లప్పుడు ప్రవహిస్తూనే వుంటుంది. సూర్యుని వైపు చూడండి. సూర్యకిరణాలు ఎప్పుడు అందరిపై పడుతునే వున్నాయి. అన్ని చోట్ల పడుతునే వున్నాయి. సూర్యుడు తనపని తానే చేసికుంటాడు. కాని ఆ కిరణాలు ఎక్కడ పైకప్పులున్నాయో అక్కడ సోకవు. ఆ పైకప్పే మనస్సు. ఆ పైకప్పును తీసివేయండి.

"సహజంగా మీకు నా అనుగ్రహం లభిస్తుంది. బాబాకు లహర్ కలిగితే బాబా యొక్క కృపావీక్షణం ఎవరిపైనో పడుతుంది. బాబా ఆ పైకప్పును పగలగొట్టాలని అనుకుంటారు. ఆయన అలా చేసేస్తారు. భూకంపం వచ్చినపుడు, లహర్ కలిగినపుడు వర్షం కురుస్తుంది కరుణావృష్టి. అలాగు బాబానుండి లహర్ (కృప) కలిగినపుడు తప్ప తక్కినదంతయూ ఎల్లప్పుడు నీ కృషియే. ఆ లహర్ లక్షలో ఒకటికాదు. ఎప్పుడైనా కలుగుతుంది. ఎల్లప్పుడూ మాత్రం కాదు" అన్నారు బాబా.

ఈరచ్ ఇంతవరకు చదివి ఇంకా ఇలా అన్నాడు.

బాబా ఒక మంచి విషయం చెపుదామనుకుంటున్నారు. దాని తరువాత 15 నిమిషాలు విశ్రాంతి వుంటుంది. అటు పిమ్మట ఈరచ్ చదువుతాడు. నేను మీకు చెప్పే ఆధ్యాత్మికాన్ని గురించి ఇతర విషయాలు అన్నీ పుస్తకాలలో వున్నాయి. అయినా దానికి విలువవుంది సత్యానికి సంబంధించినంతవరకు.

'భగవద్వచనం' గ్రంథంలో అనాదినుంచి ప్రారంభించి అంతంవరకు చెప్పారు. అది సంపూర్ణమైనది. కాని పరమసత్యం **(Infinite Reality)** తో పోల్చిచూస్తే అదేమీకాదు.

ఇతర పుస్తకాలలో 'అది ప్రారంభమైనది' అని వుంటుంది. కాని ఈ పుస్తకంలో 'ఎలా ప్రారంభించినది' అని ప్రారంభించారు. పవిత్రగ్రంథాలన్నీ ఒకటి చెపుతాయి "నా అనుగ్రహం మీ మీద ప్రసరిస్తే నేను మిమ్మల్ని భగవంతుని చేయగలను" తరువాత అనుగ్రహం వర్షించడానికి సరియైన తరుణం రావాలి.

మీరు కృషిసల్పి దానిని స్వీకరించడానికి సంసిద్ధులు కావాలి. ఇదంతా యేవిటి? వింతగా వుంది.

పవిత్రగ్రంథాలలో "నా అనుగ్రహం నీపై ప్రసరించితే, నీ హృదయం పరిశుద్ధంగా వుంటే, అప్పుడు సరియైన సమయం వస్తే నీవు భగవంతుడవు కాగలవు" అని వుంటుంది. ఏవిటి ఈ అయితేగియతేలు? వర్షించడానికి ఏముంది? దేనిమీద? అసలు అనుగ్రహం అంటే, ఏమిటి? అది ఏదైనా ద్రవపదార్థమా! అదేమైనా పేరమా? ఏమిటది? ఒకడు పరమపాపిగా వున్నాడనుకోండి. అతడు నావాడె కావాలని నేను కోరితే దానిని అనుగ్రహం అంటారు" అన్నారు బాబా.

అందువేత బాబా అంటారు "మీరందరు విచారించకండి చెడ్డ ఆలోచనల గురించి. కామం మొదలగువాటిని గురించిన ఆలోచనలకు విచారించకండి. వాటిని రానీయండి. ఎలా వచ్చాయో అలాగే పోతాయి. నన్ను మరచిపోతారేమోనని ఆందోళన చెందకండి. నన్ను మీరు సదా స్మరిస్తే మిమ్మల్ని ఏదీ ఏమీ చేయలేదు." అన్నారు.

ఉ 9-15 లకు బాబా లేచి అందరిని కొంతసేపు విశ్రాంతి తీసికోమన్నారు. బాబా మరల దర్బారు హాలులోపలకు 9-40 కు వచ్చారు. సమావేశం మరల 9-45 కు ప్రారంభమైనది.

బాబా చెప్పారు "మనం ముఖ్యంగా మాట్లాడుకోవలసినది ముగించివేద్దాం. రేపటినుండి మనం విశ్రాంతి తీసికొందాం. ఇతర కార్యక్రమాలుంటాయి. బీదల పాదప్రక్షాళనం, భజన, కొండమీదికి వెళ్లడము, ఆటలాడుకోవడము, బుట్టభిక్ష మొదలైనవి. రేపటినుండి తీవ్రమైన సంభాషణలుండవు. విజయవాడ నుండి వచ్చిన మాణిక్యాలరావువైపు తిరిగి బాబా "నీవు బాబా పనిచేయడానికి ముందు ఆరోగ్యం కలిగి వుండాలి. దేహం ఎప్పుడో ఒకప్పుడు పడిపోతుంది. సరే. కాని దేహం వున్నంతవరకు నీవు ఆరోగ్యంగా వుండాలి. దేహం గురించి విచారించమని నేను మీకు చెప్పను. కాని దానిని ఆరోగ్యంగా చక్కగా ఉంచుకోనండి. బాబా పనిచేయడం కోసం మీరు జీవించి వున్నంతవరకు దేహాన్ని ఆరోగ్యంగా ఉంచుకోనండి.

(గుజరాతీ బృందంతోగల సహవాస్‌లో బాబా చెప్పగా వ్రాసుకొన్నది ఈరచ్ చదివాడు)

సహవాస్ గురించి ప్రతి చిన్న విషయము బాబా యొక్క అంగీకారాన్ని పొందింది. ఆయన స్వయంగా పర్యవేక్షించారు. ఆయన అభీష్టం ప్రకారం ప్రవర్తించడానికి మండలి అప్రమత్తులై యున్నారు.

హాలులో ప్రదర్శించిన సూచనలు, పటములు అన్నీ అందరూ చదవాలి. మొదటిరోజున బాబాను కలియకముందే అవి చదవాలి.

1) టైపు చేసిన 'సూచనలు'
2) అచ్చుపడిన 'భగవంతుడు – ప్రేమ' అనునది ఫ్రేము కట్టబడింది.
3) 25 నెంబరు సర్క్యులర్ లేఖయొక్క సారాంశం, ఫ్రేము కట్టబడింది.
4) సహవాస్‌కు వచ్చిన విరాళములు—— ఎవరెవరు ఎంతెంత యిచ్చినది.

బాబా సృష్టించిన వాటిలో పెద్దవైనా చిన్నవైనా అన్నివిషయాలలోను అన్ని వివరాలు జాగ్రత్తగా పరిశీలించే అలవాటుంది బాబాకు.

మొదట్లో టైపుచేసిన సూచనలు సరిగా పెట్టలేదు. కాని బాబా వాటిని మార్చి ప్రతి ఒక్కరు చదవగలిగేటట్లు సక్రమంగా వుంచారు. చిన్న వివరాలుకూడా ఈసృష్టివిషయాలు చూచుకోవడం అలవాటైనది.

ప్రేమాశ్రమం, అందులో పిల్లలు, కుష్ఠురోగులు వగైరా అందరూ వున్నప్పుడు అన్నం ఒకేవంటలో వండేవారు. అకస్మాత్తుగా బాబా వంటశాలలోనికి వచ్చి చూశారు. చూచి, అన్నం ఉడికిందా లేదా యని పరీక్షించారు. మండలి అందరు అప్రమత్తులై వుండేవారు బాబా వచ్చి ఏమి చూస్తారోనని. వారల అలవాటు బాబాకు తెలుసును గనుక.

బాబా ప్రేమికులందరిని-బోర్డుమీద సూచనలు వగైరా అన్నియూ చదివారా ? అని అడిగారు. అవి ఇతరభాషలలోనికి కూడా అనువదింపబడ్డాయి.

సహవాస్‌కు మూడు కారణాలు. నాలుగు విషయాలపై వివరణము. ఇవన్నీ మిగిలిన రోజుల్లో బాబా చెప్పారు.

గత 12 మాసాలలోనూ బాబాదేహానికి ఎంతో శ్రమ కలిగింది. ఎన్నియో రోజులనుండి బాబాకు రాత్రిళ్లు నిద్రలేదు. అందుచేత అంత శ్రమలేకుండా వుండే టందుకే బాబా ఒకవారంలో చెప్పినవి వ్రాసికొని తరువాత వారాల్లో చదవడం జరుగు తోంది. సమయం కూడా కలిసి వస్తుంది.

## సహవాస్ - దాని అర్థము.

బాబా ఇలా చెప్పారు.

"సహవాస్ అంటే భౌతికంగా సన్నిహితంగా ఉండడము; ఒక కుటుంబ సభ్యులవలె కలిసిమెలిసి వుండడము. నేను మీతో వుంటాను. మీరు నాతో వుంటారు. రెండూ ఒకటే కాకపోవచ్చును. మీతో నేనున్నాను గనుక ఈ అయిదురోజులు మీకు నాతో వుండే అవకాశం లభించింది. మీ హృదయాలు పరిశుద్ధం కానీయండి. అప్పుడు నేను త్వరగా ప్రవేశిస్తాను మీ బలహీనతల గురించి, విఫలులు కావడం గురించి మీరు ఆలోచించకండి.

"మీరు వెళ్లిపోయేటప్పుడు నన్ను సాధ్యమైనంత ఎక్కువగా మీ వెంట తీసికొనివెళ్లండి. ఆలోచనలను ఎప్పుడూ బలవంతంగా అదుపుచేయకండి. నా నుండి అల్పమైన సంగతులు స్వల్పమైన సంగతులు నన్ను చూస్తూ కనిపెట్టండి. నేను ఏమిచేస్తానో ఏమి చెపుతానో అవన్నీ. మీ ఇళ్లు వాకిళ్లు, మీ ఆఫీసులు, అక్కడ మీకు వుంటున్న దినచర్య, అన్నియు మరచిపొండి. ఇక్కడికి వచ్చినందువలన మీకష్టాలన్నీ తీరిపోతాయని అనుకోకండి. ఆరోగ్యాన్నిగాని ఐశ్వర్యమునుగాని ఆశించకండి. ఇవి ఆశిస్తే ఈ సహవాస్‌లో మీకు ప్రాప్తించేవి కూడా మీరు పోగొట్టు కొనవచ్చును.

"హారతులు, పూజలు, సాధుపురుషులకు. అవి నాకు కాదు. నేను ప్రేమ కోసం వచ్చాను. మిగిలినదంతా మాయ. ప్రేమను తప్ప యింకేమీ ఆశించవద్దు.

మండలి ఎలా జీవిస్తున్నారో అలా జీవించండి. నన్ను గుర్తించడము, నాచేత గుర్తించబడడము, 2) నానుండి అద్భుతాలేమీ ఆశించకుండా వుండడము, నేను ఏ అద్భుతమూ చేయలేదు. 3) విరాళములు ఖర్చులగురించి యిదివరకే చెప్పాను. 4) ప్రేమ, ప్రేమ అంటే ఏమిటి? దీనిని గురించి ఉద్గ్రంథాలు రచింప

బడ్డాయి. ప్రేమను కనుగొన్నవారు, ప్రేమను కలిగినవారు బహుకొద్దిమంది వున్నారు. నన్ను ప్రేమించవలసిన రీతిగా ఇక్కడున్నవారెవరూ నన్ను ప్రేమించుట లేదు. మీరు నానిజస్థితిని తెలిసికొనలేరు. ఎందువలన ? మిమ్మల్ని నేను ప్రేమించి నట్లుగా మీరు నన్ను ప్రేమించుటలేదు గనుక. మండలి నాకోసం ప్రాణాలర్పించ డానికి సిద్ధంగానున్నారు. నేను వారిని ప్రేమిస్తున్నట్లు, వారు కూడా నన్ను ప్రేమించుట లేదు. అటువంటి ప్రేమే వారికి వుండే వారు నాతో ఏకత్వం పొందివుండేవారు. మీరు ——నేను. మీలోని 'నేను' అనే తెరవల్లనే వేరైయున్నాము. మీ అహంకారమే నన్ను మీనుంచి వేరుచేస్తోంది. ఉదాహరణకు ;

మీరు ఒక అందమైన అమ్మాయిని చూచి ఆమె ప్రేమలో పడ్డారనుకోండి. ఇంక మీకు శాంతి అనేది వుండదు. మీ మనస్సంతా ఆమెపైనే లగ్నమై వుంటుంది. మీకు నిద్రాహారములుండవు. భోజనం చేయాలనే గుర్తే వుండదు. కంటికి నిద్ర పట్టదు. నేను ప్రాపంచక విషయాలను గురించి, నిజమైన లౌకికప్రేమను గురించి మాట్లాడుతున్నాను. కేవలం కామం కాదు. కాని నా యెడల ప్రేమకు ఇంతకంటే ఎక్కువ కావాలి. ప్రేమ పిపాసువు నీటిలోని చేపను బయట పడవైచినట్లుగా వుండాలి. అది అందరికీ అంత సులభంకాదు. అరుదుగా ఎక్కడో ఒకడు అలాంటి ప్రేమ కలిగి వుంటాడు.

"మీ స్థానంలో నేనుంటే నేను ఎలా ప్రేమించబడవలెనో ఆ విధంగా ప్రేమించలేకపోయేవాడను. అది నిజం." అన్నారు. బాబా తిరారులరావు యొక్క అనువాదం తరచుగా మెచ్చుకున్నారు. అతని అనువాదంలో పెద్ద ప్రయత్నం లేకుండా అసలైన అభిప్రాయం బాగా వ్యక్తమయేది.

'నీవు' అంటే యేవిటి ? 'నేను ఆకలిగా వున్నాను. నేను సుస్తీగా వున్నాను, నేను బాగా నిద్రపోయాను. నా కుమారుడు చనిపోయాడు. 'నేను' 'నన్ను' 'నాది' ఇవి అడ్డు తెరలు. ఈ తెరలు తొలగిపోయిన తక్షణం నన్ను మీరు తెలిసికొంటారు. నా యెడల ప్రేమ స్పృశించే సరికి కష్టాలు అదృశ్యమౌతాయి.

"బాబా నామం 14 సార్లుకు తక్కువకాకుండా స్మరించండి. ఎంత తరచుగా చేయకలిగితే అంత తరచుగా అంత అధికంగా నానామం స్మరించండి 'బాబా, బాబా,

బాబా, బాబా, బాబా, బాబా, బాబా' అని. ఒక రోజున ఒక్క క్షణంలో ఆ అజ్ఞానపు తెర తొలగిపోతుంది. నామస్మరణ ప్రేమతో చేయండి. నేనిది నా అధికారపూర్వకంగా చెపుతున్నాను. ఒక్క క్షణంలో ప్రేమ తొలగించగలదు. ఆ తెరను లక్షలాది జన్మ లెత్తినా తొలగించడానికి చాలవు.

"మానవుడు దేనివల్లను ప్రేమను పొందలేడు; ప్రేమమూర్తి యొక్క ప్రసాదము వలన తప్ప మరి దేనివల్లను పొందజాలడు. నీకు ఎప్పుడు ప్రేమ కలిగినదో ఇంక ద్వైతస్థితి వుండదు. ప్రేమకోపం బేరసారాలుండవు. ఎంత తప మొనర్చినా, ఎంత ధ్యానమొనర్చినా, ఎంత పూజచేసినా ప్రేమకానుక లభ్యంకాదు. ఎప్పుడైతే భగవంతుని నుంచి ప్రేమ అనే కానుక లభిస్తుందో అది అన్ని తెరలను, సంస్కారాలను భస్మీపటలం చేస్తుంది.

"భగవంతుని వద్దనుండి ప్రేమ కానుక లభించినవారికి ప్రేమయొక్క నిజమైన అర్థం తెలుస్తుంది. అలా స్వీకరించిన ప్రేమికుడు అది ఇట్టిదని ప్రేమను గురించి ఇంకొకనికి వ్యక్తపరచలేడు. అతని నోరు కుట్టేసినట్లవుతుంది. అందులోనుండి పొగకూడా రాదు. ఎప్పుడైతే ప్రేమ వ్యక్తమౌతుందో ఇతరులు ఇతడు భగవత్ప్రేమికుడు అని (అతని ఆనందబాష్పములవలన, జపంవలన, పూజలవలన) గ్రహిస్తారో అతడు నిజంగా, భగవత్ప్రేమికుడు కానేరడు. నా దివ్యాధికారంతో నేనిది చెపుతున్నాను.

"ప్రేమ అనే కానుకకు ఏ షరత్తూ లేదు. బాబాను ఆరోగ్యంకోసం, ఐశ్వర్యం కోసం, ప్రేమిస్తే అది ప్రేమకాదు. ఆ ప్రేమ ఆ ఆరోగ్యానికి ఆ ఐశ్వర్యానికే చెందుతుంది, బాబాకు కాదు.

"విధేయతలో ఏ ప్రశ్నా ఉదయించదు ప్రియతముని ఇచ్ఛయే ప్రేమికుని అభీష్టము. అట్టి విధేయత ప్రేమకన్న గొప్పది. హాఫీజ్ చెప్పినట్లు అది నూటికి నూరుపాళ్లూ విధేయత. విధేయతమాత్రం మీచేతులలో వుంది. ప్రేమను నేను ప్రసాదించాలి. నన్ను అవతారునిగా స్వీకరిస్తే, మీరు నాకు విధేయులు కాగలరు.

"కైకోబాద్‌కు అనుభవం వుంది. నాకు లేదు. కైకోబాద్ అంటాడు...
"నాకు బాబా-అంటే తెలియదు. బాబా గొప్పవారని కొంతరనుకుంటారు నేను బాబాకు

విధేయుడను. హఠాత్తుగా బాబాకు లహర్ కలిగితే ఆయనకు ఆనందం కలుగుతుంది.'' అంటాడు.

''మీరు బాబా అవతారుడని ఎలా తెలిసికొన్నారు ? మండలి జవాబు—''మా కెవరికీ తెలియదు. దాదా అలా చెపుతున్నారు''అని.

బాబా అడిగారు-''దాదా ఏదైనా చేస్తారు. నేను అవతారుడనపడానికి సందేహం లేదు కాని నీకెలా తెలుసును ?''

బాబా ఇంకా చెపుతున్నారు- ''మీ అపజయాలకు, మీ బలహీనతలకు, మంచి-చెడు ఆలోచనలకు మీరు దేనికీ పట్టించుకోవద్దు. మీరు నన్ను అవతారునిగా స్వీకరిస్తే నాకు విధేయులుగా వుండండి. నేను మంచిచెప్పినా చెడ్డ చెప్పినా, చెప్పినది వినాలి. నా అవతారత్వం గురించి మీకు సందేహం వుంటే మీరు నటించకండి. అది మిమ్మల్ని గోతిలోకి దింపవచ్చు. బాహ్యంగా గౌరవం చూపించడం వలన లాభంలేదు. మీరు నన్ను అవతారునిగా నమ్మి నాకు విధేయులైతే అది మంచిది. లేకపోతే మీరు నన్ను అవతారునిగా నమ్మకపోతే మీరు ప్రణమిల్లుట వగైరావల్ల ప్రయోజనం లేదు. పైగా అది మిమ్మ క్రింద పారవేస్తుంది. ఈ మాదిరి హెచ్చరించడము ఇది మొదటిసారి కాదు. నేను ఇలా అనేక యుగములనుండి చెపుతున్నాను – 'సర్వము వీడి నన్ను అనుసరించండి' అని. విధేయత అంటే ఇదే.

బాబా మౌనం వహించకపూర్వం ఒకసారి మెహెరాబాద్‌లో ఎవరో ఒకడు వచ్చి దుఃఖించసాగాడు. బాబా పాదములు పట్టుకున్నాడు. అతడు బాబావద్దనే తనను ఉండనీమని బాబాతో చెప్పుకున్నాడు. బాబా అతనిని ''నేను చెప్పినట్లు చేస్తావా ? అని అడిగారు. అతడు సరేనన్నాడు. అంతట బాబా ''నేను ఇందుకోసమే వచ్చాను. సర్వము వీడి బాబాను అనుసరించు'' అన్నారు. అతనికి భార్యాబిడ్డలున్నారు. బాబా అతనిని '' నీ బిడ్డను కోసెయ్యమంటే ఆపని చేస్తావా ?'' అన్నారు. అదే అతని విధేయత !

బాబా ఇంకా ఇలా అన్నారు. ''నేను మిమ్మల్ని ఎప్పుడూ మీ పిల్లలను కోసెయ్యమనిగాని మీ భార్యలను విడిచిపెట్టమని గాని చెప్పను. మీరు భయపడకండి. ఒక విధంగా మీ విధేయతను కావాలంటాను. నాయెడల మీకు ప్రేమ వుంటే

నానామం 14 సార్లకు తక్కువ కాకుండా జపించండి. నిస్వార్థంగా నరులను సేవించండి. సాధ్యమైనంత వరకు బాబాను జ్ఞాపకం ఉంచుకోండి. దీనిని మీరు విధేయతతో చేస్తే అది ప్రేమకంటె నాకు ఎక్కువైనది-మీరు 'అదృష్టవంతుడైన బానిస'గా వుండాలంటే ప్రియతముని ఆజ్ఞను పాలించండి.

"నాతో నివసించి నాకోసం జీవించేవారికి ఈమాటలు చెప్తాను; మీరు నన్ను ప్రేమిస్తే నేనే (భగవంతుడు) అయిపోతారు. నేను మీ ప్రేమను స్వీకరించ డానికి మీకు ప్రేమను ఇవ్వడానికి వచ్చాను.

"ప్రపంచ మానవులు దీవనలకోసం వస్తూవుంటారు. నేను దీవనలిచ్చేటందుకు రాలేదు. భగవంతుడు మాత్రమే సత్యమని తక్కినదంతా మిథ్యయని నమ్మండి. అది నాకు స్పష్టంగా తెలుసును.

"మీరందరు హాలులో కూర్చున్నారు. మీరు నన్ను చూస్తున్నారు. మీరు బయటికి వెళ్లి భోజనంచేసి విశ్రాంతి తీసికొంటారు. ఇదంతయూ, కలయేగాని మరేమీ కాదు. మీరిప్పుడు మెలకువగాలేరు మీరు నిద్రపోయినపుడు మీకు కలలు వస్తాయి. మీరు బాబాను చూస్తారు. మీకలలో బాబా మీతో చెప్తాడు "చూడండి! ఇదంతా ఒక కలయేగాని మరేమీ కాదు." అని. కలలో మీరు "ఇదంతా కల ఎలాగౌతుంది. బాబా! మేము నిన్ను చూస్తున్నాముగదా!" అంటారు. కాని నేను ఎంతచెప్పినసూ మీకు బోధపడదు.

"అలాగే ఇదికూడా ఒక కలయేనని నేను మీతో చెప్తున్నాను."

మీరు "అది కల ఎలాగౌతుంది?" అంటారు. నేను మీకు చెప్తున్నాను. ఇదంతా వట్టి కల మాత్రమే. అంతకంటే ఏమీ లేదు. మీకు నిజంగా మెలకువ (సత్యంలో, లేక, భగవంతునిలో మెలకువ) వస్తే నేను చెప్పేడిది నిజమని మీకు తెలుస్తుంది. ఎప్పటికీ మనం అందరము ఒకటే. ఒకటిగా ఉండేవాళ్లం, ఒకటిగా వుంటాం.

"మనం నిద్రపోయినపుడు సామాన్య చైతన్యానికి అతీతమైన మన ఆది మూలస్థితికి వెళతాము. ప్రతిరాత్రి మానవుడు గాఢనిద్రలో (సుషుప్తిలో) తన ఆది మూలస్థితికి వెళతాడు. అయినప్పటికీ మీకు చైతన్యంలేదు కాబట్టి తెలియదు. నగం

చైతన్యస్థితికి వచ్చేసరికి స్వప్నావస్థకు వస్తావు. పూర్తిచైతన్యం వచ్చిందంటే నీవు మాయలో మేల్కొన్నావన్నమాట. నీకు చైతన్యం వుండదు గనుక ఏకత్వస్థితి పోతుంది. ఏకత్వం కోసం వెదకుచూ మనం ఏకత్వాన్ని పోగొట్టుకొని ద్వంద్వ స్థితిలోనికి పడతాను. ఈద్వంద్వస్థితికి రాకుండా మన ఆదిస్థితియొక్క చైతన్యం పొందడానికి ఏవిటిమార్గం ? దానికి ఒకటే మార్గం. అది సుషుప్తిలో మెలకువగా ఉండడము. అది ఎలా సాధ్యమౌతుంది ! సుషుప్తి అంటేనే గాఢనిద్రకదా ! అందులో మెలకువ ఏమిటి ? (దీనినే విరోధాభాసం అంటారు) ఏకమాత్రుడైన భగవంతుని వెదకడానికి వెళ్ళి మీరు ద్వంద్వంలో కలుస్తారు.

"మీరు వెనుకకు వెళితే ద్వంద్వమును గురించి మరచిపోతారు. ఆదిస్థితిని కూడా మరచిపోతారు. ఎందుచేత ? అట్టిదేమీ లేదు గనుక. మనకు ఆ ఆదిస్థితి కావాలి. నన్ను ప్రేమించడమే దానికి విధానం. ప్రేమ లేకపోయినట్లయితే కనీసం నన్ను ప్రతిరోజు 14 సార్లకు తక్కువకాకుండా స్మరించాలి. నిస్వార్థంగా సేవించాలి. ఎందుచేతనంటే, నీవు నిన్ను మరచిపోయినపుడు ఈ మాయాన్వితమైన జీవాత్మను మరచిపోతావు నిస్వార్థసేవలో.

అంతకంటే ఎక్కువ నేను ఆశించను" అన్నారు బాబా.

ఇంకొక దృక్కోణంలో బాబా ఇలా వివరిస్తున్నారు "సావధానంగా వినండి ! మానవుడు 'నాకు' ఇది కావాలి; ఇది 'నాకు' అవసరం; 'నాకు' ఆహారం కావాలి; ఇది 'నా' భార్య; ఈ డబ్బు 'నాది' – అని చెప్పినపుడు ఈ 'నా' అనేది ఎక్కడ నుండి వచ్చినది ! నీవు 'నేను' పాలు అడుగుతున్నాను అంటావు. ఎక్కడనుండి ? భగవంతుని ఆదిప్రతిమనుంచి నీ జీవాత్మ వచ్చింది.

'నేను ఎవరినో తెలిసికొనాలని నేను కోరుతున్నాను' అనేచోటనుండి సృష్టి ప్రారంభం అయినది. ఈ మొదటి కోరికతో ఇదంతా బయలుదేరింది. ఈ 'నేను కోరుతున్నాను' అనేది చివరవరకు వచ్చి నీకు చరమంగా 'నేను ఫలానా' అనే జవాబు వచ్చేవరకు వుంటుంది. అది అనేక రూపాలలో వుంటుంది.

"అనేకత్వంలో ఏకత్వాన్ని హృదయాంతరాళం స్పృశించినందువల్లనే అనుభవింపచేయవచ్చును. ఆ పనినిమిత్తమే నేను వచ్చాను.

"మీ హృదయాలలో ప్రేమ బీజములు నాటుటకే నేను వచ్చాను. బాహ్యంగా అనేకత్వం ఏవిధంగా ఉన్నప్పటికీ, మాయలోనున్న జీవితాన్ని అనుభవించి భరించ వలసివుంది. ప్రపంచమునందు అన్ని జాతులు మతములు కులములలోను ప్రేమ ద్వారా ఏకత్వ భావన నెలకొని వుంటుంది.

ఇట్టి ఏకత్వభావనను కలిగించుటకే నేను నామౌనమును విరమించుటకు సిద్ధపడుచున్నాను. నేను మౌనమును విరమించినపుడు, అది ఆధ్యాత్మిక ఉపన్యాసము లతో మీ వీనులకు విందుచేయుట కోసం కాదు. నేను ఒకే ఒక శబ్దమును ఉచ్చరిస్తాను. ఈశబ్దం మానవులందరి హృదయాలలోనికి చొచ్చుకొనిపోయి, పాపా త్ముడు ఒక సాధుపురుషుడుగా వుండాలని, భగవంతుడు పాపాత్మునిలోను సాధుపురు షులలోను కూడా వున్నాడనే సంగతి సాధుపురుషుడు గ్రహిస్తాడని తెలియజేస్తుంది.

"ఎన్నియో యుగములకు పూర్వం నేనొక అద్భుతం చేశాను; ఈ మాయా ప్రపంచాన్ని సృష్టించాను. అలాగే నేను మౌనాన్ని విరమించినపుడు మరొక అద్భుతం చేస్తాను. ఈ నా అవతారంలో అదే మొదటిది అదే ఆఖరిది అయిన అద్భుతం! ఇంక మరే అద్భుతాన్ని నా వద్దనుండి ఆశించవద్దు.

"అనుగ్రహమనే సాగరంలో ఒక వెల్లువ (ఉప్పెన తరంగం వంటిది) వచ్చే సమయం త్వరగా సమీపిస్తోంది. అప్పుడు సహజంగా సముద్రంలోనికి ప్రవహిస్తూవుండే నదీ ప్రవాహక్రమం, తలక్రిందులై సాగరజలం నదులలోనికే ప్రవహిస్తుంది. అనుగ్రహం పొంగి పొరలే తరుణానికై నిరీక్షించండి. దానిని స్వీక రించడానికి సంసిద్ధులుకండి.

"కొందరు సహవాస్ అనంతరం ఇతర చోట్లకు వెళ్లి అచ్చటనుండి యిండ్లకు పోవచ్చునా? లేక, ఇచ్చటనుండే సరాసరి యిండ్లకు వెళ్లవలెనా? అని అడుగు తున్నారు. మీరు యితరచోట్లకు వెళ్లడానికి బాబాకు అభ్యంతరం లేదు. కాని పాత షరతే వస్తుంది; అంటే — మీరు వెళ్లదలిస్తే పంచ సద్గురువుల సమాధులను దర్శించి సరాసరి మీ యిండ్లకు పోయి, కావాలంటే అక్కడనుండి ఎచ్చటికైనా వెళ్లవచ్చును" అన్నారు.

"మీరు బాబాకోసం వచ్చివుంటే బాబాను పూర్తిగా మీతో మీ యిండ్లకు తిన్నగా తీసికొని వెళ్లాలి." అని బాబా చెప్పారు. సమావేశం 11 గంటలతో ముగిసింది.

భోజనాలనంతరం మళ్లీ 1-20 లకే బాబా సహవాస్ ప్రారంభించారు.

ఆంధ్ర మెహెర్ ప్రచురణ సంఘం 1954 సం॥లో తయారు చేసిన ప్రార్థన **Md.** రాజామొహమ్మద్ చదివాడు. అతడు చాలా ఉద్రేకం కనపరిచినాడు. బాబా అతనిని శాంతంగా కూర్చుండి విశ్రాంతి తీసికోమన్నారు. అతని గుండె బలహీనంగా వుంది గనుక జాగ్రత్త వహించమన్నారు.

## 14-11-55 ఉదయం బీచల కార్యక్రమం :—

తరువాత 10 గం॥ నుండి 11 గం॥ వరకు, తిరిగి మధ్యాహ్నం ఒంటిగంట మొదలు 4 గం॥ వరకు వ్యక్తులతో సంభాషణలు (ఇంటర్వ్యూలు) జరుగుతాయి.

సా॥ 4 గం॥ నుండి 5-30 గం॥ వరకు తెలుగులో * 'బుర్రకథ' సాగుతుంది. 15 వ తేదీనాకు మరల ఉదయం 10 గం॥ నుండి 11 గం॥ వరకు, మధ్యాహ్నం ఒంటిగంట నుండి 4 గం॥ వరకు వ్యక్తులతో సంభాషణలు జరుగుతాయి.

ఒక అరగంట తరువాత ఆంధ్ర కార్యనిర్వాహక వర్గం తిరుమలరావుతో కలిసివస్తారు.

'పని' గురించి బాబా ఇలా చెప్పారు. "నిజాయితీగల ఉద్దేశంతో ఉద్యమించిన పని, ప్రేమ. ఇవి బాబా పనులు. ఈ పని చేయువారు బాబా మనుష్యులు.

---

గమనిక : * శ్రీ బాలగోపాల భాస్కరరాజు & బృందంచే తెలుగులో బాబా సంక్షిప్త జీవితం బాబా సన్నిధిలో ప్రప్రథమంగా ప్రదర్శించిన తెలుగు బుర్రకథ.

రచన :— శ్రీ బాలగోపాల రామభద్రరాజు
కథకులు :— శ్రీ పారేపల్లి సత్యం
సహకారగానం :— శ్రీ కొండపల్లి వెంకటాచార్యులు
హాస్యం :— శ్రీ గవుతు వెంకటనర్సయ్య
హార్మోనియం :— శ్రీ బా॥ రామభద్రరాజు
దర్శకత్వం :— శ్రీ బాలగోపాల భాస్కరరాజు
ఢోలక్ :— శ్రీ భాస్కరరాజు

*'ఆనాటి అవతార్ మెహెర్‌బాబా బుర్రకథ బృందం'
(తాడేపల్లిగూడెం)

బాబాకోసం చేసే పనులన్నింటికోను గొప్పపని ఏమిటంటే— ప్రేమతోను, అణకువతోను, నిజాయితీతోను, నిస్వార్థ సేవతోడను జీవిస్తూ అందు లేశమాత్రమైనా కపటవర్తనం లేకుండా వుండడము.

బాబా ప్రేమ అందరికోసమైనది బాబా ప్రేమికులు ప్రతి ఒక్కరు నిస్వార్థ సేవతో జీవించి పరులకు ఆదర్శప్రాయులై వుండాలి. బాబాను సంతృప్తి పరచేది ఇదే.

అటువంటి ప్రేమ, అటువంటి జీవితము బాబా పనిలో చాల ముఖ్యం. దానితో అత్యున్నతమైన బాధ్యత వుంటుంది. ఎందుచేతనంటే— దానితో బాబా ప్రేమికులు నిజంగా, బాబా ప్రేమను, బాబా సందేశమును ఇతరులకు అందజేస్తారు. వట్టి మాటల వలన ఏమీ ప్రయోజనంలేదు.

‘ఏ’ అనేవ్యక్తి బాబా పనిచేసే కార్యకర్త అనుకోండి. అతడు హృదయంలో చాలమంచివాడు; (సుహృదయుడు) ఆతని ఊరికి వెళ్లి బాబాను గురించి, బాబా గొప్ప తనం గురించి చెప్పి, బాబా అవతారపురుషుడు, బాబాను ప్రేమించండి. ఈ ప్రపంచం అంతా మాయ, అని చెపుతాడు. అతడు ‘అవతార్ మెహెర్ బాబా కీ జై’ అనికూడా అరుస్తాడు. ఇంతలో హఠాత్తుగా అతనిపేర ఒక టెలిగ్రాం వస్తుంది, ఒక ప్రమాదంలో అతని కుటుంబం మరణించారని. అప్పుడేం జరుగుతుంది? ఆ టెలిగ్రాం చదవగానే అతనికి ఏంచేయాలో తోచదు. అతనికి నోట మాట రాలేదు. అంతవరకు అతని ఉపన్యాసం విన్నవారు అప్పుడు ఏమనుకుంటారు? ఎంతశక్తితో బాబాను గురించి మాట్లాడినాడో అది యిప్పుడేమయింది? అది పోయింది. కాని ఆటెలిగ్రాం చదువుకొన్నతరువాతకూడా అతడు అదేమోస్తరుగా మాట్లాడగలిగి వుంటే అది ప్రజలమీద ఎంతటి ప్రభావాన్ని కనపరుస్తుంది?

“అందుచేత నీవు ఇతరులకు ఏమిచెపుతావో అది నీవు ఆచరించు. లేకపోతే నీవేమీ చెప్పకుండా వుండటం మంచిది.

“ఇంకొక ఉదాహరణ తీసికొనండి. ‘బి’ అనేవ్యక్తి ఒకచోటుకు వెళతాడు. అతడు “మెహెర్‌బాబా అవతారపురుషుడు, బాబా మనకు కోపం రాకూడదని అంటారు. కోపపు తలంపులు కలిగినా, అది మాటలలోగాని చేతలలోగాని వ్యక్త పరచకండి”అని చెపుతాడు. (అందరూ అవతార్ మెహెర్‌బాబా కీ జై! అని జయధ్వానములు చేశారు)

"ఆ సమావేశంలో ఎవరో 'బి'ని కొట్టారనుకోండి 'బి'కి కోపంవచ్చి తిట్టాడు. మళ్లీ వానిని కొట్టాడనుకుందాం. ఇప్పుడు బాబా కార్యకర్తకు కోపం వచ్చింది. అతని ఉపన్యాసం వట్టి మాటలేగాని ఏమీ విలువలేనిదై పోయింది కదా! అందుచేత మీరు సాగించే జీవితం ఆదర్శయుక్తమై వుండాలి. అది పరులకు ప్రామాణికంగా వుండాలి. కాబట్టి ఎవరూ తాను ఆచరించలేనిది ఇంకొకరికి చెప్పకూడదు. నీవు ఎంతయో కష్టించి పనిచేసి జనులను ప్రోగుచేస్తావనుకో "అది బాబా గొప్పతనాన్ని పెంచుతుందా? జనులను ప్రోగుచేయ వచ్చు. కాని జనసమూహం బాబాయొక్క గొప్పతనాన్ని చూపించదు.

"బాబా పిచ్చివారలకు ఆశ్రమం, మస్తుల ఆశ్రమం నిర్వహించేవారు. వారిని యీ ఆశ్రమంలోనే వుంచేవారు. ఫకీర్ బువా అనేవ్యక్తి ఉండేవాడు, అతడు పూర్తిగా పిచ్చివాడు. పూనానుండి ఒక మహమ్మదీయుడు వచ్చి ఆశ్రమం చూచేవాడు. పిచ్చివారి ఆశ్రమం ఎత్తివేసినపుడు ఆ పిచ్చివారిని అనేకచోట్లకు పంపించివేసేవారు. ఫకీర్ బువాను పూనాలో వుంచారు. ఆ మహమ్మదీయుడు ఫకీర్ బువాను తన నిర్వహణాధికారిగా చేశాడు. ఫకీర్ బువా కూడా సైగలుచేస్తూ వుండేవాడు. అందుచేత ప్రజలు తనను ఒక గొప్ప సాధుపురుషుడు అనుకొనేవారు. ఇటువంటివి ఈ మధ్యకాలంలో జరిగాయి.

"ఇండియాలో యుగయుగాలుగా ఆధ్యాత్మిక వాతావరణం వుంది. ఎవరికైనా గడ్డం వుంటే అతనిని గౌరవించేవారు. ఇది భారతదేశంలో ఒక ఆచారం అయిపోయింది. కాషాయవస్త్రాలు ధరించి చేతిలో దండముంటే చాలు. అటువంటివాడు 'యతి' అనియు, పూజనీయుడనీ పైగా అందుకు సందేహమే లేదని విశదీకరించారు.

అది ఎవరైనా చేస్తే ఇరుగుపొరుగు వారు అనుసరిస్తారు. ఇంక అందరూ ఆ గడ్డంమనిషిని గౌరవిస్తారు.

"మండలిలో ఒకరు బాబా మౌనం ప్రారంభించకముందు నుండి ఇక్కడ వుండేవాడు. అతడు బాబా వద్దకు వచ్చి ఇక్కడే వుండేవాడు. బాబా అతనిని ఉపవాసం వుండమని చెప్పారు. నామస్మరణ కూడా చేయమని చెప్పారు. తరువాత అతడు నాసిక్‌నకు వెళ్లాడు. నాసిక్‌లో అందరికీ తాను బాబాయొక్క ప్రతినిధినని చెప్పుకొనేవాడు. పెద్దలు కూడా అతనిని గౌరవించేవారు. ఈ సంగతి బాబాకు

తెలిసింది. అతనిని హెచ్చరించమని ఆదీ కే. ఇరానీకి చెప్పి బాబా అతనివద్దకు పంపించారు. ఆదీ వెళ్లి అతడు అలా చెప్పుకోకూడదని, అది వానికి మంచిది కాదని చెప్పాడు. అయినా, అతడు బాబా చెప్పినమాట వినలేదు. అతని భక్తులలో ఒక సుందరాంగి వుంది. అతనికి ఆమెతో అక్రమ సంబంధం ఏర్పడింది. ఆమె గర్భవతి కూడా అయినది. ఒకనాడతడు నాసిక్ వదలి బాబా వద్దకు వచ్చి బాబాపాదముల మీద పడ్డాడు. చివరికి పోలీసుల బాధ తప్పించుకొనేటందుకు బాబా శరణు వేడు కొన్నాడు. కనుక బాబా అతనిని కౌగలించుకున్నారు. కాని ముందుగా బాబా మాటను ఉల్లంఘించినందువలన అతనికి కుష్ఠురోగం వచ్చింది. అప్పుడు బాబా అతనితో కాలినడకను ఇండియా అంత తిరిగి రమ్మని ఆదేశిస్తూ; తన ఆహారం కోసం భిక్షాటన చేసికొని తినాలని చెప్పారు. ఆ ప్రకారం అతడు హృదయపూర్వకంగా చేశాడు. ఆతని కుష్ఠువ్యాధి పూర్తిగా మాసిపోయింది. అతడు ఇంకా బాబా కార్యక్రమం చేస్తూనే వున్నాడు. ఊరూరా తిరుగుతూ, వచ్చేవారంలో అతడు మహారాష్ట్ర బృందంతో కలిసి ఈ సహవాస్‌కు వస్తాడు.

''బాబాను ప్రేమించగలిగి, వారి జీవిత కాలంలో ఆచరణపూర్వకంగా బాబా యెడల ప్రేమను కలిగించి, బాబా యొక్క ప్రేమ సందేశాన్ని వ్యాపింపచేస్తున్నవారు కొలదిమంది అయినా ఎన్నికైనవారుంటే, అది బాబా కోసం నిజమైనపని చేస్తున్నట్లే. ఇతరులకు నీ జీవితమే నా ప్రేమ సందేశమగునట్లు వుండాలి.'' అని బాబా చెప్పారు.

మధ్యాహ్నం 2 గంటల 15 నిమిషాలకు సమావేశం ముగిసింది. తరువాత ఆంధ్రకేంద్ర కార్యనిర్వాహకవర్గ సభ్యులను బాబా పిలిచారు. వారితో బాబా సాముహికంగా మాట్లాడారు.

తరువాత 3 గం. 10 నిమిషాలకు సహవాసీయులను కలుసుకోవడానికి బాబా దర్బారు హాలులోనికి వచ్చారు. అప్పుడు బాబా ఇలా ప్రసంగించారు.

''ఆంధ్ర మెహెర్ మండలి కార్యనిర్వాహక వర్గంతో మాట్లాడినప్పుడు ఏమి జరిగినదో మీరు తెలిసికొనాలి. క్రిందటిసారి నేను రాజమహేంద్రవరం వచ్చినపుడు కార్యకర్తల సభ నిర్వహించాను. అప్పుడు నేను, బాబాపని అంటే ఏవిటో, కార్య కర్తల కర్తవ్యం ఏవిటో చెప్పాను. నేను K. D. R. M. బృందాన్ని తొలగించాను. సెంటర్లని చెప్పుకొనేవాటి నన్నిటని ఎత్తివేశాను. ప్రతి మానవహృదయం

నా ఆశ్రమం. నా కేంద్రం. నిజమైన బాబా ప్రేమికునిగా జీవితం సాగించినపుడే నాపని చేయగలడు.

"తరువాత మీలో కార్యకర్తలు కొందరు ఒక కేంద్రం కావాలన్నారు. నేను ఏకాంతవాసంలో నున్నపుడు మీరు ఒక సెంటరు నెలకొల్పారు. తరువాత మీలో మీకు అభిప్రాయభేదాలు వచ్చాయి.

"పోనీలెండి. జరిగినదేదో జరిగిపోయింది. ఇంక గతాన్ని గూర్చి యోచించకండి. గతాన్ని మరచిపోండి. మీరందరూ నన్ను ప్రేమిస్తున్నారు. అదొకటే చాలదు. మీలో మీరు పరస్పరం ప్రేమించుకొనాలి. మీరు బోధించేది మీ జీవితంలో అభ్యసించాలి. ప్రజలను ఒకచోట చేర్చుటవలన ఏమీ ప్రయోజనంలేదు. మీలో మీకు నమ్మకం, సహృదయభావం, ప్రేమ వుండాలి.

అటువంటిపని మీరు చేయగలిగితే చేయండి. లేకపోతే మీరు అసలు పనిచేయకుండటమే మేలు.

తిరుమలరావు తనసేవ, సహకారము సలహా ఇస్తానన్నాడు. కాని కమిటీ సభ్యుడుగా తనకు బంధమనేది లేదన్నాడు.

(అప్పుడు కమిటీ సభ్యులు బాబాతోను తిరుమలరావుతోను ఒక ఫొటో తీయించుకున్నారు.)

బాబా, "ప్రతి ప్రేమికుని హృదయం బాబాకు మందిరం కావాలి. ఆ మందిరంలో పూజారివి నీవే. ఒక మంచిసంగతి బాబా చెపుదామనుకుంటున్నారు. అది మీరు ఆచరించినట్లయితే అన్ని చిక్కులు తీరిపోతాయి." అన్నారు.

బాబా కమిటీ సభ్యులతో "మేలో మీరు ఒకరినొకరు ప్రేమించుకోవాలి తరువాత ఇంకొకరికి ప్రేమసంగతి చెప్పాలి. బాబా ప్రతి ప్రేమికునికి వ్యక్తిగతంగా ఇదే చెవుతున్నారు.

"నీలో నీవు పుందుగా ప్రేమను స్థాపించుకో; మీరు నేను చెప్పినది ఆచరిస్తే కమిటీకి వెలుపల ఇంతకంటే బాబా పనిచేసే ప్రేమికుడు ఇంకొకడు వుండడు.

"ఫిబ్రవరి 15 తేదీ నుండి పూర్తిగా సంవత్సరంపాటు బాబా బయటికి వెళతారు. ప్రతి ప్రేమికుడు బాబాను ప్రేమిస్తూ బాబా ప్రేమను పరివ్యాప్తం చేయాలి. ఒక యేడాదిపాటు ఎవరూ బాబాకుగాని ఈరచ్‌కి గాని ఉత్తరాలు వ్రాయకుండా వుండాలి. ఎవరైనా ఆదీక్ వ్రాయవచ్చును. డాక్టర్ ధనపతిరావు 'ఆంధ్రమండలి' ద్వారా' అని శృతి కలిపాడు.

బాబా అప్పుడు ధనపతితో "నా ప్రేమికులను నిబంధనలతో శిక్షణలో పెడదామని చూడను. వారికి స్వేచ్ఛ వుండనీ. నీవు నీ ప్రియతమునికి ప్రేమలేఖ వ్రాయాలని అనుకొన్నావనుకో! ఆలేఖ ఇంకొకరి ద్వారా వెళ్లడము నీ కిష్టమౌతుందా? బాబా పనిని గురించి మీరు ఏదైనా ఆదీకి వ్రాయాలనుకొంటే దాని నకలు ప్రతి నొకటి ఆంధ్ర సెంటరుకు పంపించండి.

"మీరు ప్రేమించి ఒకరి నొకరు నమ్మకంతో వుంటేనే ఇతరులకు మీరు బాబా ప్రేమను గురించి చెప్పగలరు. జరిగినదానిని మరచిపొండి. ప్రేమ, నమ్మకములను భవిష్యత్తుకు ఉండనీయండి.

"బాబా ప్రతివారికీ తన యిష్టంవచ్చినది చేయడానికి స్వేచ్ఛనిస్తారు. "కమిటీలో లేని ప్రేమికులు, ఉన్నవారికంటె బాగుగా చేయగలరని కమిటీ సభ్యులకు చూపించగలరు. కమిటీలో నున్న సభ్యుడు, కమిటీలోలేని ఇతర ప్రేమికులకంటే గొప్పవాడని భావించకండి. కమిటీలోలేని మీరు కూడా బాబాప్రేమను వ్యాపింపచేయగలరు.

"బాబాకు ముఖ్యమైనది ప్రేమ. హృదయం ముఖ్యమైనభాగం. ఐశ్వర్యం కాదు, పరువుకాదు, తెలివితేటలు కాదు. హృదయము శిరస్సు (ప్రేమ - తెలివి) రెండూ వుంటే బాబా పనిలో సామరస్యంతో వుంటే అది ఆదర్శం. అది ఒక ప్రత్యేకత. ప్రేమ, తెలివి, ఐశ్వర్యం అంతా కలిసి ఆచరణ యోగ్యంగా వుండాలి ఆక్షేపణలేకుండా వుండాలి. నాలుగు గంటల పది నిమిషాలకు బాబా ప్రేమికులందరును కొంచెంసేపు (పది నిమిషాలపాటు) విశ్రాంతి తీసికోవలసినదని చెప్పారు. అందరు బయటికి వెళ్లి తిరిగి 4-20 నిమిషాలకు వచ్చి కూర్చున్నారు. అప్పుడు భజనకీర్తనలు పాడారు. మరునాడు ఉదయం బాబా బీదల పాదాలను కడుగుతారని తరువాత ప్రేమికులందరు 'పరబ్రహ్మ - పరమాత్మ' అని ఉచ్చరించాలని చెప్పారు.

బాబా ఆ బీదల కార్యక్రమం నిర్వహిస్తున్నంతసేపు ప్రేమికులు హృదయపూర్వకంగా ఉచ్చరించాలి'' అని బాబా చెప్పారు.

గుజరాతీ బృందానికి 'అహూర్ మజ్దా' అని ఉచ్చరించమన్నారు. మీరు 'పరబ్రహ్మ పరమాత్మ' అని చెప్పండి. మీ అందరికి చెపుతున్నాను. ''నేను ఒక్కడనే ఉన్నాను. నేను సర్వోన్నతుడను''అని.

సాయంకాలం 6 గంటలకు బాబా పింపల్‌గావ్ వెళ్లారు.

## 1955 నవంబరు 14 తేదీ - సోమవారం :

బాబా మెహెరాబాద్‌నకు ఉదయం 7-30 గం॥లకు వచ్చారు. సహవాసులందరు హాలులోపలకు వచ్చి కూర్చున్నారు. 7-50 గం॥లకు బాబా హాలులోపలకు వచ్చి ఆసీనులైనారు. భజన జరుగుతోంది. అమెరికానుండి వచ్చిన ప్రసిద్ధ బాబా ప్రేమికుడు 'భగవద్వచనము' అనే ఉద్గ్రంథానికి సంపాదకుడు అయిన డాన్ స్టీవెన్స్ బాబా అనుమతిపై తిరిగి అమెరికాకు ప్రయాణమై వెళ్లిపోయాడు.

బాబా అనుమతితో తిరుమలరావు మాట్లాడినాడు. అతడు ఇలా ప్రసంగించాడు.

## నెహ్రూ పండితుడు :

''ఈరోజున పండిత జవహర్‌లాల్ నెహ్రూయొక్క 66వ జన్మదినం. బాబా అతనిని ఆశీర్వదించుగాక ! ప్రపంచం అణుబాంబులతో భయపడుతోంది. గాంధీజీ సిద్ధాంతాలు - అహింస, సత్యము, ప్రపంచ జాతుల మధ్య సామరస్యము. మన కున్న ఆధ్యాత్మికబలంతో నాయకులు వీటినిగురించి కృషిచేస్తున్నారు. బాబా ! వారిని ఆశీర్వదించండి. మీరు వారికి తల్లిగాను, తండ్రిగాను తగిన అండగా వారికి తగిన బలమును చేకూర్చి, వారిని ఒక కంట కనిపెట్టకపోతే వారు ఏపనీ చేయలేరు. అవతారపురుషుల ఆధ్యాత్మికశక్తితో ప్రపంచశాంతి సుస్థిరంగా నెలకొల్పడానికి భారతదేశం ఆధ్యాత్మిక వైభవంతో ఐహిక ఐశ్వర్యం పొందటానికి బాబా ఆశీర్వదించాలి'' అని.

బాబా అందులకు ఈవిధంగా జవాబు చెప్పారు.

## 14 నవంబరు :

"ఈరోజు నెహ్రూపండితుని జన్మదిన మైనందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఆతడే ఇండియాకు కావలసిన మనిషి. అతనికి చాలా మంచి హృదయం వుంది. అతడు చాలా తెలివైనవాడు. శక్తిమంతుడు. అతడు ఏదిచేసినా నిజాయతీతో చేస్తాడు. ఆపాదమస్తకము అతడు ఇండియాకోసమే పాటుపడుతున్నాడు. నాకు సమస్తము తెలుసును. ఆధ్యాత్మికంగాను ఐహికంగాను భారతావని వర్ధిల్లుగాక. నాయకులందరూ రత్నాలవంటివారు. బాబా అనుగ్రహంవలన వారు రత్నాలుగా వున్నారు.

ఈరోజు నెహ్రూ పుట్టినరోజు అని మీరు నాచెవినివేశారు. అంతే, అతనికి అక్కడ శుభాకాంక్షలు అందుతాయి. అతనినిగురించి మీరు నాకు గుర్తుచేసినందులకు నాకు సంతోషంగా వుంది. మనకు ఇండియాలో కొలదిరత్నాలే వున్నాయి. అవి అరుదుగా మనకు లభిస్తాయి. గాంధీజీతో ఎవరినీ పోల్చలేము. అలాగే నెహ్రూ నిరుపమానుడు. అతడే ఇండియాకు కావలసినవాడు. ఇవన్నీ నాకు తెలుసును.

"ఈ విశ్వమంతటిలో నాకు సాటి మరెవ్వరూ లేరు. మనకు ఇండియాలో నున్న కొలదిరత్నాలు సుహృదయులు. అందుకు నాకు సంతోషంగా వుంది. వారందరూ నా హృదయంలో నున్నారు.

చూడండి ! ఈ రోజున నెహ్రూకి 66 యేండ్లు వచ్చాయి. నఖశిఖపర్యంతము అతడు మన భారతజాతి కోసం కృషిచేస్తున్నాడు, తన శక్తినంతను ధారపోసి. అతని మనస్సు అంతా ఇండియాకోసమే పనిచేస్తుంది. అతని శక్తికి మనం గర్వించాలి. ఒక పిల్లవానికివలెనే అతని శక్తి అంతా, నా నుండియే నా ద్వారానే ప్రవహిస్తుంది." అన్నారు బాబా.

ఈ సమయంలో నెహ్రూకు టెలిగ్రాం ద్వారా శుభాకాంక్షలను పంపించితే బాగుంటుందని డాక్టర్ ధనపతిరావు అన్నాడు. అందుకు బాబా అంగీకరించలేదు.

"నేను ఇక్కడ చెపుతూవుంటే అతనికి అక్కడ అందుతుంది. ఇందుకు టెలిగ్రాం పంపిస్తే నేను చెప్పినదాని విలువ అంతా తగ్గిపోతుంది. విచారించకండి.

మీరు నాకు చెప్పారుచాలు. నేను విన్నాను. నా ఆశీస్సులు పండితనెహ్రూకి వెంటనే అందాయి.'' అన్నారు.

తరువాత బాబా, బాపిరాజుచేత మాట్లాడించారు. అతడు (బందెల బాపిరాజు) రామ, కృష్ణ అవతారములగురించి వారి లీలలను గురించి చెప్పాడు. బాపిరాజు నవ్వు వచ్చేటట్లు మాట్లాడినాడు. అతడు ఈ యుగావతారుడు బాబాను గురించికూడా మాట్లాడినాడు.

ఉదయం 8-50 మొదలు 9-50 గంటలవరకు 150 మంది పేదలైన స్త్రీలకు, 100 మంది పురుషులకు బాబా పాదములు కడిగి ప్రణమిల్లి ఒక్కొక్కరికి నాలుగు రూపాయిలు దక్షిణనిచ్చి పంపించారు. మొత్తం బాబా వేయిరూపాయిలు పంచిపెట్టారు.

బీదల కార్యక్రమంలో పాల్గొన్న బీదలు బిచ్చగాండ్రుకాదు. బీదకుటుంబములనుండి ఎన్నుకొనబడినవారు. బీదవారిలో చాలామంది చిరిగిన గుడ్డలు కట్టుకున్నారు. అందులో కొందరు కుష్ఠురోగులున్నారు.

పురుషులలో 'సత్యమార్గ్' అని పేరు పడిన ఒక వృద్ధుడున్నాడు. అతడిదివరకు పేరుమోగిన ఒక బందిపోటుదొంగ. అతడు బాబాతో సాంగత్యం చేసినప్పటినుండి పరివర్తనం చెందాడు. బాబా అతని జీవితాన్నే మార్చివేశారు. అప్పుడు బాబాను ధనపతిరావు 'పతితపావనుడు' అన్నాడు.

భగవంతుని సప్తనామములు ఉచ్చరించమని బాబా, కైకోబాద్‌ను అడిగారు. కైకోబాద్ ఆవిధంగానే

'అహూర్‌మజ్దా !
యజ్దాన్ !
ఈజద్ !
అల్లాహ్ !
పరమాత్మా !
గాడ్ ఆల్మైటీ !
పర్‌వర్‌దిగార్ !

అవి ఉచ్చరించాడు. డాక్టర్‌నీలు, తరచుగా బిగ్గరగా పరబ్రహ్మ పరమాత్మ అని ఉచ్చరిస్తూ వచ్చాడు. మిగిలిన వారిని కూడా బాబా పరబ్రహ్మ పరమాత్మ అని ఉచ్చరించమన్నాడు.

బాబా అనుమతితో రాజా మొహమ్మద్ 'అల్లాహూ' అని ఉచ్చరించాడు. వీదల కార్యక్రమం వగైరా అయిన తరువాత సహవాసీయులందరు హాలులో మరల 9-50 గం॥లకు సమావేశమైనారు.

ఈ రోజున బాబా వ్యక్తిగతంగా సహవాసులతో సంభాషిస్తారు. ముందుగా ఉపవాసం చేయడానికి అంగీకరించిన అయిదుగురిని పిలిచి వారితో బాబా 15 నిమిషాల పాటు మాట్లాడినారు. తరువాత వారి అయిదుగురిని పిలిచి ఒక్కొక్కరితో సంభాషిస్తారు.

తరువాత ప్రేమికులు ఒక్కొక్కరు బాబావద్దకు వెళ్లినపుడు వారితో వేర్వేరుగా ఒక్కొక్కరితో 2, 3 నిమిషాలు సంభాషిస్తారు.

17 నవంబరు తేదీని బాబా ఇక్కడికి రారు. ఆరోజున సహవాసులందరు వెళ్లిపోవచ్చును. ఆ ఒక్కరోజు బాబా కొంచెం విశ్రాంతి తీసికొని, వచ్చిన ఉత్తరాలకు జవాబులు వ్రాయిస్తారు. మళ్లీ ఇంకొక బృందం వచ్చేముందు ఈ పని చూస్తారు.

17 నవంబరు అంటే క్రిందటి జన్మలో 1875 సం॥ (80 ఏండ్లక్రిందట) అమెరికాలో బ్లావట్స్కీ అమ్మగా జన్మించినపుడు అమెరికాలో దివ్యజ్ఞాన సమాజం స్థాపించినరోజు.

'బాబా ఉత్తర ప్రత్యుత్తరాలు పూర్తిగా విరమించేముందు ఇంతవరకు వచ్చిన ఉత్తరాలను చదివించుకొని వాటికి అవసరమైన జవాబులు వ్రాయిస్తారు' అని సహవాసులందరకు బాబా ఈవిధంగా ప్రకటన చేయించారు.

బాబా ప్రేమికులతో ;

"మీరు 17 వ తేదీని బయలుదేరి మీ గ్రామాలకు వెళ్లేటప్పుడు బాబాను మీతో తీసికొని వెళ్లండి. బాబా మీఅందరిలోను ఉన్నాడు. దానికి సందేహంలేదు. మీతోపాటు బాబాను తీసికొని వెళ్లడం మీవంతు" అని చెప్పారు.

బాబా స్త్రీల సహవాస్ గురించిన నిర్ణయం తెలిసికోవలసివుంది అన్నారు. "ఇది నా వాగ్దానంగా భావించవలదు. ఇంకా నిశ్చయించుకోలేదు. తరువాత మీఅందరికీ తెలియజేస్తాను" అన్నారు బాబా.

ఇప్పుడు బాబా సంభాషణలు ప్రారంభిస్తారు. అవి పదకొండు గంటలవరకు కొనసాగుతాయి. మరల మధ్యాహ్నం ఒంటిగంటనుండి నాల్గుగంటలవరకు జరుగుతాయి. రేపుకూడా బాబా సంభాషణలు జరుపుతారు.

"సంభాషణలకు మీరు సామూహికంగా వస్తారో లేక ఒక్కొక్కరే వస్తారో అది మీయిష్టం. మీరే నిర్ణయించుకొని రండి. బృందములుగా వస్తే ఏక్రమంలో వస్తారో నిర్ణయించుకొనండి. ఎలాగు వచ్చినా నాకు ఒకటే. తేడా యేమీ లేదు. మీ హృదయం పరిశుద్ధంగా ఉండనీయండి. మీలో కలవరపాటు చెందకుండా ఇతర ఆలోచనలు లేకుండావుంటే బాబా యొక్క పూర్తిప్రేమ. కృప మీకు కలుగుతాయి. ఉదాహరణకు: ఈరచ్‌కి కళ్లు, ముక్కు, వేళ్లు, కాళ్లు అన్నీ వున్నాయి. అన్నీ సమానంగా ముఖ్యమైనవే. కాని అతడు ఏ అవయవమైనా ఉపయోగిస్తున్నప్పుడు దానికి ప్రత్యేక ప్రాముఖ్యత యిస్తున్నాడన్నమాట. అలాగే నేను ఎవరికైనా ఒకపని చేయమని చెపితే, అతనికి ఆ పని ఇలా చేయాలి అలా చేయాలి అని కొన్ని సూచనలు చేస్తాను. అందుచేత ఎవరికీ నేను అధిక ప్రాధాన్యతను యిస్తున్నానని మీరు భావించకండి.

బృందంవారీగా కలకత్తానుండి ప్రారంభించి బాబా సంభాషణలు సాగిస్తారు.

ఉపవాసం చేయడానికి అంగీకరించిన అయిదుగురికి బాబా ఈ విధంగా ఉత్తరువు లిచ్చారు.

"14-2-1956 తేదీని రాత్రి 12 గంటలకు (తెల్లవారితే 15 వ తేదీ అవుతుంది) ఉపవాసం ప్రారంభించాలి. ఈ ఉపవాసం 21 వ తేదీ అర్థరాత్రి (తెల్లవారితే 22 వ తేదీ) విరమించాలి.

"మీరు ఏదేని ఒక గదిలోనే వుండాలి. స్నానం మొదలైన ఆవశ్యకాలు అందులోనే తీర్చుకోవాలి. మౌనం పాటించాలి. ఆగదిలోపలకు ఎవరూ ప్రవేశించరాదు. నీళ్లు తెచ్చువాడు, గది శుభ్రపరచేవాడు తప్ప. మాట్లాడుట, చదువుట,

వ్రాయుట పనికిరాదు. అసలు నిద్ర పోకూడదు. పరుండకూడదు. నడవడానికి, కూర్చోవడానికి, ఎలాగు కూర్చున్నా కూర్చుండవచ్చు. అనుమతి, స్వేచ్ఛవుంది. అంతసేపు బాబా నామం జపించాలి.

మంచినీరు త్రాగడం తప్ప ఇంకేమి తీసికొనరాదు. మొదటి రెండు రోజులు చాలా కష్టంగా వుంటుంది. తరువాత ఇంక ఫరవాలేదు.

మీరు జార్లబడి కూర్చుంటే, జోగు వచ్చి కునుకుపడితే ఆందోళన చెందకండి. అంతేకాని ఇదేమీ బాగుండదని పరుండి నిద్రపోకండి.

వారం రోజులు అయిన తరువాత పండ్లరసం తీసికొని ఉపవాసం విరమించండి. తరువాత మామూలు భోజనం చేయవచ్చు.

ఈ అయిదుగురికి చెప్పవలసినది చెప్పిన తరువాత సహవాసులతో సంభాషణలు ప్రారంభించారు. అవి నాలుగు గంటలవరకు సాగినవి. నాల్గుగంటలకు 'బుఱ్ఱకథ' ప్రారంభం అయినది. ఈసందర్భంలో బుఱ్ఱకథ బృందనాయకుడైన బాలగోపాల భాస్కరరాజు ఇలాచెపుతున్నాడు.

"ఈనాడు ప్రదర్శింపబడిన బుర్రకథకు కావలసిన ఏర్పాట్లను గురించి సహవాస కార్యక్రమానికి పూర్వమే మేము బాబాను అర్థించాము. బాబా మాకోరికను మన్నించి, కావలసిన యేర్పాట్లను అన్నీ చేశారు. మేము బుర్రకథ రూపంలో బాబా యొక్క జీవితచరిత్రను ప్రదర్శించడము ప్రారంభించిన తరువాత, బాబా దివ్య సన్నిధిలో ఆయన సచ్చరిత్రమును ఆయనకే వినిపించుటలో ఇది మా తొలిబుర్రకథా ప్రదర్శనము.

"బాబా చరిత్రను ప్రారంభించి చెపుతున్నాము. ప్రియతమ అవతార్ మెహెర్‌బాబా, సహవాసులందరిమధ్య తానొక ప్రేక్షకునివలె బుర్రకథను వింటున్నారు. బాబా, మేర్వాన్‌గా నున్నరోజులలో సద్గుర్విణి హజరత్ బాబాజాన్ యొక్క దివ్యచుంబనము ద్వారా బ్రహ్మీభూతుని కావించిన ఘట్టము పాడుతూవుండగా, బాబా తన్మయుడై 'ఆగండి!'' అని సౌజ్ఞచేశారు. మేము కథాగానమును ఆపి బాబావంక చూస్తున్నాము. క్షణకాలం సమాధిస్థితిలో నున్నట్లు కనిపించారు బాబా. తదనంతరం బాబా కళకుల నుద్దేశించి ఇలా అన్నారు.

''మీరు బాబాజాన్ ఘట్టమును ప్రదర్శిస్తూ వున్నప్పుడు, బాబాజాన్ యొక్క దివ్యచుంబనస్పర్శ ద్వారా ఆనాడు నేను పొందిన అదే అనుభూతిని నేను మళ్లీ అనుభూతిని పొందాను. నేను మెర్వాన్‌గానున్న నా బాల్యజీవితాన్ని మీరు నాకు జ్ఞాపకం చేస్తున్నారు. ఈ క్షణమందు నాలో శాశ్వతులైయున్న ఈ వర్తమానయుగ సద్గురువులైదుగురు మీ కథను వింటున్నారు'' అని చెప్పి కథ కానిమ్మన్నారు. వెంటనే మేము కథను కొనసాగించాము. కథానంతరము బాబా తన విశ్వప్రేమ హృదయంతో కళాకారులందరిని ఆలింగనం చేసుకున్నారు.

బాబా ఇంకా ఇలా చెప్తున్నారు:

బాబాజాన్ చుంబించిన సంగతి, బాబాజాన్ యొక్క సాంగత్యం బాబాకు బాగా జ్ఞాపకం వుంది. తరువాత నేను ఇంటికి వెళ్లి మరుసుదొడ్డికి వెళ్లగా అనంతమైన అనేకప్రలయములు నాలోనుండి బహిర్గతం కావడం నేను చూశాను. అప్పుడు బాబా యొక్క పరిస్థితి అడకత్తెరలో పోకచందంగా వుంది. బాధ,మామూలు చైతన్యం లేకపోవడము. అతీతమైన బ్రహ్మచైతన్యం పైకి లాగుతోంది. మానవచైతన్యం క్రిందికి లాగుతోంది. లోపల సంఘర్షణ జరుగుతోంది. మెర్వాన్‌కు పిచ్చెక్కిందని తల్లి భావించింది. ఆమె గుండెలు మోదుకుంటూ బాబాజాన్ వద్దకు వెళ్లి, బాబాను యథాస్థితికి రప్పించమని అర్థించింది. అతని బాధ ఘోరంగా వుంది.అంతటి బాధను ఎవ్వరూ ఇంతవరకు పడియుండలేదు. బాబా, తలను నేలకు, గోడలకు వేసి కొట్టుకునేవారు. మండలిలో కొందరు అది చూశారు. నుదురు రక్తం చిమ్ముతూ వుంటే, జేబురుమాలు కట్టుకొనేవారు తలకు రక్తస్రావం నిలిచేటందుకు. ఒకసారి తలను గోడకుపెట్టి కొట్టేసరికి గోడ పగులుచూపింది. బాబా అప్పుడు చైతన్య భూమికలన్నింటిలోను వుండేవారు.

తరువాత ఉపాసనీ మహరాజ్ బాబా నుదుట ఒక చిన్నరాతితోకొట్టి, బాబాను క్రమంగా సామాన్య చైతన్య స్థాయికి రప్పించాడు.

బెండు, ఆదీ, పాద్రీ అప్పుడు అక్కడ వుండేవారు. వారికి అంతా తెలుసు.

''నేను అవతరించినపుడు ప్రతిసారీ నేను ఆ పురాణపురుషుడనే యని నాకు తెలుసును.''

బాబా ఉపాసనీమహరాజ్ వద్దకు వెళ్ళకముందు జరిగినదంతయూ చెప్పారు.

"నాకు మామూలు చైతన్యం (దేహస్మృతి) ఉండేదికాదు. నేను అతీతమైన చైతన్యంలో ఆనందంలో ఉండేవాడను. దేహమందు శ్రద్ధ వుండేదికాదు. ఆహారం కావాలని అనుకోవడం లేదు. మా యింటిలో ఒక అటక వుండేది. నాకు అన్నం పెట్టినప్పుడు, దానిని ఆవల పారవేసేవాడిని, లేక ఆ అటకమీద దాచేవాడిని. ఒక రోజున ఆగదిలో దుర్వాసన ప్రారంభమయింది. ఆహారం పారవేయడంవలన దుర్వాసన వచ్చేది. నాకు పిచ్చెక్కిందేమోనని మా అమ్మ భయపడింది. తరువాత ఒకరోజున నేను బాబాజాన్ వద్దకు వెళ్లినపుడు ప్రేమికులు కొందరు అక్కడ కూర్చుండి వున్నారు. అందులో ఇద్దరు ముగ్గురు ఇప్పుడు మండలిలో వున్నారు. అప్పుడు బాబాజాన్ "మేర్వాన్ ప్రపంచమంతటనీ కదిలించివేస్తాడు" అని చెప్పింది.

సాయిబాబా వద్దకు వెళ్లమని అంతరంగికంగా నన్ను ఏదో ప్రేరేపించింది. అప్పుడు నాలో మూడుశక్తులు పనిచేశాయి.

అతీత చైతన్యస్థితి

మామూలు చైతన్యస్థితి

సాయిబాబా వైపునకు ఒక ఆకర్షణ

సాయిబాబా వద్దకు వెళ్లేసరికి, అప్పుడు సాయిబాబా కాలకృత్యాలు నెరవేర్చు కొనేటందుకు ఊరిబయటకువెళ్లి ఆతని గద్దెకు తిరిగి వస్తున్నాడు ఊరేగింపుతో. ఆయనకు నేను ప్రణమిల్లగానే సాయిబాబా బిగ్గరగా 'ఓ! పర్‌వర్‌దిగార్!' అని సంబోధించాడు. తరువాత నన్ను ఉపాసనీ కడకు వెళ్ల మనిసాయిబాబా సూచించగానే అక్కడికి వెళ్లవలెనని నాకు ప్రేరేపణ కలిగింది. అప్పుడు మహరాజ్ దిగంబరిగా కూర్చున్నాడు. నేను సమీపించగానే ఒక చిన్నరాయి తీసికొని నా ముఖం మీద గురిచూచి కొట్టాడు. అప్పుడు నా మామూలు చైతన్యం ఒక భాగం వచ్చింది. క్రమంగా పూర్తిగా చేకూరింది.

"అప్పుడు ఆదీ, గుస్తాద్‌జీ, యశ్వంతరావు ఉన్నారు. వీరికి అన్ని విషయ ములు తెలుసును.

"ఒకనాడు ఉపాసనీ అందరిని పిలిచి "నా వద్దనున్న ధనమంతా మేర్వాన్‌కు ఇచ్చివేశాను. ఇంక మీరు ఆతనికి విధేయులుగా వుండాలి" అన్నాడు.

"గుస్తాద్‌జీ సాయిబాబావద్ద వుండేవాడు. అతడొకసారి వరుసగా ఆరునెలలు ఆహారం లేకుండా వున్నాడు. సాయిబాబా దేహం చాలించిన తరువాత అతడు ఉపాసనీ మహారాజ్‌వద్దకు వెళ్లాడు. ఉపాసనీ గుస్తాద్‌జీతో "బాబా దామన్ పట్టుకో" అని చెప్పాడు. అప్పటినుండి గుస్తాద్‌జీ నన్ను వీడకుండా నావద్దనే వున్నాడు.

"ఒకసారి ఉపాసనీ మహరాజ్ నాతో "మేర్వాన్ : నీవు అవతార పురుషుడవు" అన్నాడు. 1921 సం॥ డిశెంబరునుండి నన్ను మెహెర్‌బాబా అని పిలిచేవారు. మొదట నాశిష్యులే నన్ను ఆవిధంగా పిలిచారు.

"ఇప్పుడు సాయిబాబా, ఉపాసనీ ఇద్దరూకూడా ఇక్కడకువచ్చి నేను చెప్పేది వింటున్నారు"అని చెప్పారు బాబా.

ఈవిధంగా బాబా అనేక జీవిత విశేషాలు చెప్పారు. ఆసాయంకాలం బాబా సన్నిధిలో (బాలగోపాల భాస్కరరాజు బృందంచే) బాబా జీవితచరిత్ర బుర్రకథ జరిగింది. అది సా॥ 5-30 లకు ముగిసింది. తదనంతరం హారతి యిచ్చారు.

**14-11-1955 :**

బాబా : "నేనీరోజున చాలా సంతోషంగా వున్నాను. ఈరోజు విశేషాలు ఏమిటంటే—

1. బీదల కార్యక్రమం జరిగింది
2. ఇది దీపావళి పండుగరోజు
3. నెహ్రూ పుట్టిన రోజు
4. నాచరిత్ర గానంచేయగా విన్నాను
5. నా ప్రేమికుల మధ్య నేనున్నాను.

"మీరు నన్ను అధికాధికంగా ప్రేమించండి. నేను మీ అందరిలో వున్నాను. నేను అధికాధికంగా సుఖంగా వున్నట్లు భావిస్తాను"

తరువాత బాబా అనుమతితో బెజవాడలో సి. ఆర్. ఆర్. కాలేజీలో లెక్చరర్‌గా నున్న డి. వి. శేషగిరిరావు లేచి ప్రసంగించాడు.



సహవాస్‌లో బాబాతో విజయవాడ ప్రేమికులు

బాబా అనుమతితో ఏలూరు నివాసి – కట్టాసుబ్బారావు బుఱ్ఱకథ బృందానికి వారి కథా కాలక్షేపానికి సంతోషించి రు 116 లు ఇచ్చాడు.

బాబా ఆ బృందంతో "నేను ఒక సంవత్సరం ఎక్కడికో వెళ్లిపోతున్నాను ఆ సంవత్సరంలో మీకు అవకాశం లభించినప్పుడు గ్రామ గ్రామాలకు వెళ్లి నా ప్రేమ సందేశాన్ని వ్యాపింపచేయండి" అని చెప్పారు.

సాయంకాలం 5–45 గం॥లకు సహవాస్ పూర్తి అయినది ఆరోజునకు. తరువాత బాబా పింపల్‌గాంవ్‌నకు వెళ్లిపోయారు.

## 15 నవంబరు 1955 – జయవారం (మంగళవారం)

ఈ రోజున ఉదయమునసే బాబా 7–30 గం॥లకు మెహెరాబాద్ వచ్చారు. బాబా రాకపూర్వమే సహవాసులందరు హాలులోపలకు వచ్చి సిద్ధంగా కూర్చుని వున్నారు. మామూలుగా భజన, నామ సంకీర్తన జరుగుతోంది.

బాబా – "ఒక అరగంట తరువాత మనం మెహెరాబాద్ కొండమీదకు వెళదాము. నేను అక్కడ ఏకాంతంగా నున్న స్థలం మీకు చూపిస్తాను. బాబా దేహం చాలించినపుడు, దానిని సమాధి చేయదానికి, శాశ్వత విశ్రాంతి తీసికోవడానికి, ఏర్పాటు చేసిన నా భావిసమాధి కూడా మీకు చూపించుతాను.

"తరువాత కొండమీద సామూహికంగా ఫొటోలు తీయింపుకుందాం, అచ్చటి నుండి తిరిగివచ్చిన తరువాత సంభాషణలు (ఇంటర్వ్యూలు) మళ్లీ కొనసాగుతాయి..

"పెండు" మెహెరాబాద్ వ్యవహారాలు చూస్తూవుంటాడు. అతడు ఈ సహవాస్ జయప్రదంగా జరిగేటట్లు హృదయపూర్వకంగా పనిచేస్తున్నాడు. నిర్మాణ కార్యక్రమాలలో 'పాద్రి' అతనికి భాగస్వామిగా వుంటూ సహకరిస్తున్నాడు 'విష్ణు' ఆర్థికవిషయాలు చూస్తూ లేఖలు వ్రాస్తూ ఉన్నాడు. 'అలోబా', 'భావూకల్చూరీ చాలాశ్రమ తీసికొని సహాయం చేస్తున్నారు. 'డాక్టర్‌నీలు' వైద్యవిషయాలు చూస్తాడు. చాలా నిజాయతీతో చేస్తున్నాడు. అదని వద్దకు ప్రతిరోజూ వెళ్లే రోగులసంఖ్య ఎక్కువ అవుతోంది. వాళ్లకు ఆతని మందులవలన స్వస్థత చేకూరుతోంది. ఆదీ (సీనియర్) ఆఫీసుపని, ఉత్తరాలు వ్రాయడము అనేకమైన ఇతరపనులు చేస్తూ

వుంటాడు. 'జాల్ భాలిః' అందరినీ నవ్విస్తూ వుంటాడు. ఈరోజున డాక్టర్ నీలు మాణిక్యాలరావు గురించి చెప్పాడు. అతడు బలహీనంగా వున్నాడు. రక్తం తక్కువగా వుందట. అతని గుండె బలహీనంగా వుందట. అతడు విశ్రాంతి తీసికోవాలని చెప్పాడు'' అన్నారు.

బాబా (మాణిక్యాలరావుతో) ''నీవు త్వరగా చచ్చిపోదామనుకుంటున్నావా? లేక బాబా పనిచేస్తూ జీవించుదామని వుందా? (మాణిక్యాలరావు మిన్నకుండెను)

''నిన్న కొందరు అడిగారు. 16 వ తేదీని వెళ్ళిపోవచ్చునా? అని. రేపు పింపల్‌గాం(ప్ కొండకి వెళతాము. తరువాత బాబా మధ్యాహ్నం 2 గంటలకు వచ్చి ఇచ్చట రెండు గంటలు ఉంటారు. వెళ్ళదలచుకొన్నవారు 16 వ తేదీ (రేపు) సాయంకాలం వెళ్ళవచ్చును. లేదా, ఎల్లుండి (17 వ తేదీ) వెళ్లాలి.

*మాణిక్యాలరావు మరి నలుగురు సుస్తీగా వున్నారు. వారిని బాబా కొండ మీదికి నడిచి రావద్దన్నారు. బాబా కారులో రమ్మన్నారు.

తరువాత కబీర్‌దాస్‌నకు ఏ విధంగా భగవంతుని సమీపించవలెనో ఏ విధంగా ఆచరణయుక్తమైన జ్ఞానం కలదో అతడు రామదాస్‌కు ఏ విధంగా శిక్షణ యిచ్చాడో నిష్కామకర్మతోడను, యోగాభ్యాసం తోడను - అన్నీ ప్రవచించారు బాబా.

తరువాత బాబా అందరిని కొండమీదికి తీసికొని వెళ్ళారు. అచ్చట ఫొటోలు తీయించారు. కలకత్తా బృందంతో ప్రారంభించి, మద్రాసు బృందంతో ఆఖరి ఫొటో తీయించుకున్నారు. ఉపవాసం చేయడానికి అంగీకరించిన అయిదుగురు బాబాతో వేరే ఫొటో తీయించుకున్నారు. ఆంధ్రమండలి సంఘసభ్యులు బాబాతోను, మాణిక్యాలరావు, వారి వద్దైరాలతోను ఈ విధంగా అనేక ఫొటోలు తీయబడ్డాయి.

---

* 1. వై. మాణిక్యాలరావు (విజయవాడ)
  2. బాలగోపాల భాస్కరరాజు (తాడేపల్లిగూడెం)
  3. మాంద్రాజుల వెంకటరత్నం (రామచంద్రపురం)
  4. పేరు తెలియదు.
  5. పేరు తెలియదు.

తదుపాత బాబాయొక్క భావి సమాధిస్థలము (గోయి) చూపించారు. బాబా అందులో ఏకాంతంగా సున్నారు. అది రాతిగోడలతో నిర్మింపబడినది. పైన డూమ్ కట్టారు. లోపల గోడలమీద బొమ్మలు వేశారు. ఇదే బాబా దేహానికి భావి విశ్రాంతి స్థలం.

తరువాత బాబా ఇంకొకగది చూపించారు. బాబా ఏకాంతవాసం చేసిన గది అది. దానిని పైనుండియే చూపించారు. ఒక కిటికీలోనున్న చిన్నగంతలోనుంచి విష్ణు అక్షర ఫలకం చదివేవాడు. తరువాత ఆ గది స్త్రీలకు ప్రసూతిగృహంగా మార్చారు. తరువాత ఒక పాశ్చాత్య స్త్రీ డాక్టరు ఈ ఆస్పత్రిలో పనిచేసేది. అనంతరం బాబా ఇలా చెప్పారు.

"ఇచ్చట 1914 - 1918 సంవత్సరాలలో జరిగిన తొలి ప్రపంచయుద్ధం జరిగిన కాలంలో ఒక దావి ఉండేవి. అందులో లోపలికివెళ్లి ఏకాంతంగా కూర్చుండే వాడను. దిగడానికి ఎక్కడానికి మెట్లు ఉండేవి. బాబా దేహం చాలించిన తరువాత ఈస్థలం (ఈకొండ) చాలాప్రాముఖ్యంలోనికి వచ్చి గొప్ప యాత్రాస్థలం అవుతుంది. బాబా జీవించి యుండగానే బాబాను మీతో ఉంచుకోవడానికి మీరు చాలా అదృష్ట వంతులు" అన్నారు.

బాబా ఏండివిసరినచోటు, ఆయన కూర్చున్నచోటును కూడా చూపించారు. గొలుసు, తిరగలి అక్కడ మట్టితో అలికినవేల అన్నియూ జాగ్రత్తగా ఉంచబడ్డాయి.

ఆసమయంలో వెనుక నిలబడి చూస్తున్న వారిలో 'పడివేలు' అనే మద్రాసు ప్రేమికుడు స్పృహతప్పి పడిపోయాడు. తరువాత అతనికి స్పృహవచ్చింది. బాబా కారులో డాక్టర్ ధనపతిరావు అతనిని క్రిందికి తీసికొని వెళ్లాడు. రాజా మొహమ్మద్ కూడా అతనితో వెళ్లాడు. అతనికి ఆరోగ్యం బాగానే వుందని, బాబా అతనికి లేశమాత్రం దర్శనం ఇవ్వగానే అతనికి స్పృహతప్పిందని చెప్పాడు. సహవాసు లందరు కొండదిగి వెళ్లారు. మధ్యాహ్నం ఒంటిగంటనుండి మూడుగంటలవరకు సంభాషణలు జరిగాయి. టీ - తీసికొన్న తరువాత బాబా హాలులో 3-20 నుండి 4-30 గం॥ వరకు కూర్చున్నారు.

ఒక ప్రేమికుడు తాను ఇంగ్లీషులో రచించిన పద్యం ఒకటి చదివాడు. బాబా అది విని "మంచి భాషలో మంచి భావములతో చక్కగా వ్రాశావు. అది ఇపుడు నీ జీవితంలో నఖశిఖపర్యంతము అనుసరించి ఆచరించాలి" అన్నారు.

ఇంకొక ప్రేమికుడు తెలుగులో పాటపాడుతూవుంటే, బాబా "ఇది నాకొకటి గుర్తుచేస్తోంది. అది ముఖ్యమైనది. ఇంతవరకు ఇది నేను ఎవరికీ చెప్పలేదు. మండలికి కూడా చెప్పలేదు. 'భగవద్వచనం'లో వ్రాయలేదు. మనం ఊపిరి పీల్చుతాము. ఊపిరి ఆగిపోతే ఆదేహం మరణించింది అంటాను. (మనం ఊపిరి పీల్చడము దానంతటదే జరిగిపోతూవుంటుంది. మనం స్పృహ తప్పియున్ననూ ఊపిరి పీల్చుతునే వుంటాము. మనం నిద్రించినా, ఊపిరి పీల్చుకోవడం మీద మన మనస్సును కేంద్రీకరించము. అసలు దానినిగూర్చి ఆలోచించము. మనకు తెలియకుండానే శ్వాసక్రియ జరుగుతూ వుంటుంది. మనతో శ్వాసక్రియ ఎంత సన్నిహితంగా వుందంటే, అది ఆగిపోతే మనం మరణించేటంతగా సన్నిహితమై వుంది.

"అలాగే భగవంతుడు మనలో ఎంతగా కలిసిపోయి వున్నాడంటే, అది మనకు బొత్తిగా తెలియనంత సన్నిహితుడై వున్నాడు. ఈ శ్వాసక్రియవలనే మనం ఊపిరి పీల్చుకుంటున్నామని మనకు ఎప్పుడు తెలుస్తుంది? ఊపిరి పీల్చడానికి మనం కష్టపడుతూ వున్నప్పుడు తెలుస్తుంది. ఉదా॥ ఆయాసం కలిగినప్పుడు, మనం పరుగెత్తినపుడు. అలాగే ప్రేమద్వారా మనం భగవంతునికోసం కష్టపడితే భగవంతుడు మనలో ఉన్నాడని తెలుస్తుంది" అన్నారు బాబా.)

బాబా ప్రేమికులు, ఒక డాక్టరు కుటుంబం బాబాను దర్శించి, వారికి గౌరవం కనబరిచి అయిదు నిముషాలు బాబాతోనుండి వెళ్లిపోయారు. బాబా సహవాసులకు అతనొక డాక్టరు అనియు, గుజరాతీవాడనియు, బాబా అమెరికా వెళ్లినపుడు అతడక్కడ వున్నాడనియు, ఆధ్యాత్మికవిషయాలపై ప్రసంగించేవాడనియు, బాబాను అక్కడ కలుసుకున్నాడనియు అప్పటినుండియు ప్రేమికుడై వుంటున్నాడనియు తెలిపారు.

తరువాత సంభాషణలు జరిగాయి. బందరు నుండి ఎం. ఎస్. ఆర్. శాస్త్రి అనే అడ్వొకేటు బాబాతో సంభాషించి వచ్చి చెప్పాడు. నిడుబ్రోలుపద్ద పొన్నూరులో ఒక దేవాలయం నిర్మిస్తున్నారని - అది ఒక పెద్ద ఆంజనేయస్వామి ఆలయమనీ,

అంయలో దేవుని దశావతార విగ్రహాలు నెలకొల్పుచున్నారనియు, దానిలో అవతార పురుషుడైన బాబా విగ్రహం కూడా నెలకొల్పడానికి బాబా యొక్క అనుమతి కావాలనియు అతడు అడిగాడు. అందుకు బాబా అంగీకరించారు. మద్రాసు బృందం 20 నిమిషాలు బాబాతో సంభాషించారు. వారు ఒక్కొక్కరు ప్రేమతో ప్రణమిల్లి రాలేనివారి పక్షమున కూడా ప్రేమ ప్రణామములు చేశారు బాబా చాల సంతోషించి అందరికీ తన ప్రేమను అందజేయమన్నారు.

రామావతారంలో నారదుని ఒక వరం కోరుకొమ్మని అంటే, నారదుడు ఈ విధంగా కోరుకున్నాడట. రాముని యెడల అవ్యాజమైన ప్రేమ ఉండాలని, ప్రపంచంలో జీవించుతూ ప్రపంచానికి నిస్సంగంగా వుండాలని కోరాడు. అలాగే హనుమాన్ చేసిన సేవకు చాల సంతోషించి రాముడు హనుమంతునికి కూడా వరం యిస్తాను కోరుకొనమని అంటే, అతడు రామునికి విధేయుడైన సేవకునిగా ఎల్లప్పుడు వుండాలని కోరుకున్నాడు. ఈ రెండు సంగతులు బాబా పూర్వావతారములో జరిగినవి గుర్తుజేస్తూ ఎ. సి చారి, మద్రాసు ప్రేమికులు బాబాను రెండు వరాలు అడిగారు.

1) బాబాను ప్రేమిస్తూ, విధేయులై ఉండడము,

2) భగవద్వచనం అరవభాషలో తర్జుమాచేసి ప్రచురించడానికి బాబా అనుమతి కావాలన్నారు. ఈ రెంటింటికీ బాబా ఎంతో సంతోషంతో అంగీకరించి వారిని ప్రతి వారిని ఆలింగనం చేసికొని ఆశీర్వదించి పంపారు. ఎ. సి. చారి ప్రయత్నం జయప్రదం కావాలని బాబా ఆశీర్వదించారు. మిగిలినవారితో సంభాషణలు కాగానే సాయంకాలం 6 గంటలకు బాబా పింపల్‌గాంవ్ వెళ్లిపోయారు.

(15 నవంబరు 1955 - మంగళవారం రోజు సహవాస ముగిసింది)

## 16 నవంబరు 1955 - బుధవారం:

ఉదయం 7-30 గం॥లకు అయిదు బస్సులు వచ్చాయి. సహవాసులందరు బస్సులలో ఎక్కి 15 మైళ్లదూరంలోనున్న పింపల్‌గాంవ్‌కి వెళ్లారు.

అందరు పింపల్‌గాంవ్ చేరుకొన్న తరువాత బాబా, ఒక కుక్కవైపు చూపించి "నేను ఉత్తర కాశీ మండలితో కాలినడకను వెళుతూవుంటే ఈ కుక్కపిల్లను నేను

నాభుజములమీద ఎక్కించుకొని తీసికొని వెళ్లాను. ఇప్పుడది పెరిగి పెద్దదయింది. అప్పుడు బైదుల్ కూడా వున్నాడు. అప్పుడు నేను కొండఎక్కినవుడు దానిని క్రిందికి దింపేవాడను. కొండ అదే ఎక్కివచ్చేది. బాబా సాహచర్యంలో ఉండటానికి ఈకుక్క ఎంతపుణ్యం చేసుకొన్నదో ! అదృష్టమంటే దానిదే'' అని చెప్పారు.

బాబా ఎప్పుడూ ఈ పింపల్‌గాంవ్ లోనే వుండరు. అహమద్‌నగర్ వచ్చినపుడు బాబా రాత్రులందు మాత్రం పింపల్‌గావ్‌లో గడుపుతారు. బాబా గది దగ్గిరా కాకాబారియా జాగ్రత్తగా ఉంచుతాడు. ఎప్పుడైనా బాబా ఆకస్మికంగా చెప్పకుండా వస్తూవుంటారు. బాబా ఎప్పుడువచ్చి చూచినా, ఆచోటు పరిశుభ్రంగా వుంచేవాడు కాకాబారియా.

మెహెరాబాద్ అస్తి నారిమన్‌దాదాచాంజీది.
మెహెరాబాద్ ఆస్తి మెహెర్‌జీది.

'ఘురా' అనే బాబా ప్రేమికుని బాబా అందరికీ పరిచయం చేశారు. అతనికి 76 యేండ్లవయస్సు. ఇక్కడనుండి 9 మైళ్లుంది అహమద్‌నగర్. ఈతొమ్మిదిమైళ్లు రానుపోను నడిచేవస్తాడు, నడిచే వెళతాడు. అతడు స్వయంగా పనిచేసుకుంటాడు. అతడు బాబాను చాలా ప్రేమిస్తాడు. దగ్గరలోనే అతనికి పొలం వుంది. ఘురా ఎల్లప్పుడు ఒకేరకం దుస్తులు ధరిస్తాడు. వీటితోనే వరుంటాడు. పొలంలో చురుకుగా పనిచేస్తూ వుంటాడు. కాకాతో ఘురా సహవాసం చేస్తాడు. అతడు ఖాన్‌బహదూర్ ఘురాయొక్క కుమారుడు. క్వెట్టానుండి ఇక్కడకు వచ్చాడు.

ఇచ్చట బాబా తప్ప మరెవ్వరు వుండరు.

బాబా, మెహెరాబాద్‌లోని పూలతోటను అందరికి చూపించారు. ఈతోటను చక్కగా వుంచే బాధ్యత కాకాది. మేడమీద గది, హాలు, అందులో బాబా వరుంటారు. అవి బాబాకోసం శుభ్రంగా వుంచబడతాయి. బాబా వరుండినపుడు కృష్ణ కాపలా కాస్తాడు.

దగ్గరనున్న కొండవద్దకు బాబా అందరిని తీసికొని వెళ్లారు. కొన్నిచోట్ల మాత్రం కాలిబాట వుంది. డాక్టర్ విలియం హాంకిన్ ఒకదారి చేశాడు. అయినను కొన్నిచోట్ల దారిలేదు.

ఇది ఒక యాత్రాస్థలం. ఎవ్వరూ బాబా కంటే ముందుగా పోకూడదు. మీకు ఇక్కడ ఏమి జరిగినదో బాబా చెపుతారు. కొండపైనుండి బాబా దూరంగా నున్న సాధుగోరఖ్‌నాథ్ సమాధిని చూపించారు. అక్కడికి చాలమంది యాత్రికులు యేడాది కొకసారి వెళుతూ వుంటారు.

కొండ ఎక్కుతూ బాబా అన్నారు " దారి జారుడుగా వుంది. ప్రేమమార్గం కూడా జారుడుగానే వుంటుంది. అది చాల దీర్ఘంగా వుంటుంది. ప్రేమ మార్గం కత్తి అంచువున్నట్లుగా వుంటుంది. ఈ మార్గంలో పయనించడము అసిధారావ్రతం వంటిది. పింపల్‌గావ్ గ్రామాన్నికూడా బాబా చూపించారు. కొండపైకి వెళ్లినతరువాత "ఈ కొండమీద బాబా అనేకసార్లు ఏకాంతవాసం చేశారు. ఇక్కడ కొన్నిగదులు కట్టించారు. శిఖరంమీద ఒక గది. దానికి కొంచెం క్రిందుగా మరియొకగది. ఆ గదులలో నేలమీద ఇటుకలు పరిపించారు. ఆ కట్టడాలు తీయించివేసినా, ఇటుకలు మాత్రం మిగిలాయి. ఇప్పుడు ఆ ఇటుకలు పరిచిన నేలమీద కూర్చున్నారు ప్రేమికు లందరు. ఆగదులు తాలూకు పైకప్పు, గోడలు తీసివైచి క్రింద బంగాళా ఆవరణలో వుంచారు. ఇదివరలో అప్పుడప్పుడు బాబా ఈకొండమీదకు కొద్దిమంది మండలితో వచ్చి 1,2,3 వారాలు ఏకాంతంగా గడిపేవారు. ఈసందర్భాలలో బాబా ఉపవాసం కూడా చేశారు. అప్పుడు మంచినీరు మాత్రం తీసికొనేవారు. మండలి తమకోసం అప్పుడు ప్రత్యేకంగా ఒక గుడారం వేసుకొనేవారు. వంతులవారీగా మండలి కావలి వుండేవారు రాత్రులందు.

'మనోనాశ' కాలంలో బాబా ఔరంగాబాద్ నుండి ఈ కొండవద్దకు సరాసరి నడిచివచ్చారు ఐదురోజులు ఏకాంతంగా కొండమీద గడిపారు. బాబా కొండదిగువ నున్న బంగాళాకు వెళ్లారు.

ఇప్పుడక్కడ ప్రశాంతంగా వుంది. కొండ శిఖరంపై విపరీతంగా గాలి వీచేదని బాబా చెప్పారు. ఈ ఎక్కువ గాలిచేత మండలి నేలమీద పాకేవారు. బాబా ఎప్పుడు వారిని పిలిస్తే అప్పుడు గదులలోనుండి వచ్చేవారు.

సహవాసులందరు కొండదిగివచ్చారు. కొండదిగిన తరువాత వెంటనే మంచి నీరు త్రాగవద్దని ప్రేమికులకు బాబా చెప్పారు. కాని 15, 20 నిమిషాలు విశ్రాంతి

తీసికొన్న తరువాత మంచినీరు త్రాగాలని బాబా చెప్పారు. వెంటనే నీరు త్రాగితే మీకు జలుబు చేస్తుందని బాబా అన్నారు.

కొండమీద నుండి తీసుకువచ్చిన రేకుల గదులు, భారతదేశంలో బాబా ప్రయాణం చేస్తూవచ్చిన బస్సు అక్కడ జ్ఞాపకార్థం ఉంచాడు. ఈరచ్ వాటిని అందరికీ చూపించాడు. ఈరచ్ చెప్పినదానిని తిరుమలరావు, టి. ఎస్. కుటుంబశాస్త్రి తెలుగున అనువదించి చెప్పారు.

బాబా తపస్సుచేసినా, జపంచేసినా, అది ఆయన కోసం కాదు. ఆయనకు అటువంటిదేమీ అవసరంలేదు. అదంతా వారి విశ్వమయకార్యం కోసమే చేశారు.

బస్సులో బాబాయు, వారి మండలి ప్రయాణంచేసినపుడు అందులో స్నానాల గది ఏర్పాటుచేసి, దానిని ఉపయోగించేవారు. బస్సును ఒక గదివలె ఉపయోగించేవారు.

తిరుమలరావు, బాబా అనుమతితో వెంకటేశ్వరస్వామి నుద్దేశించి 'అఖిల భువన........భక్తిరూపా' అని సంస్కృతస్తోత్రం చదివాడు. తరువాత ఒక ఇంగ్లీషు ప్రార్థన ఈవిధంగా చదివాడు—

"సర్వజీవపోషకుడవు. సర్వము నీనుండియే వచ్చుచున్నవి. నీవే పరమేశ్వరుడవు. సర్వవ్యాపకుడవు. ఐహిక ఆముష్మిక ఐశ్వర్యములు నీవే. నాఆత్మకు ఆత్మవు. మాకు భక్తిని ప్రేమను కలిగించు ప్రభూ!

అందరు ప్రేమికులు బస్సులలో మెహెరాబాద్‌కు 11 గంటలకు వచ్చేశారు. వచ్చి భోజనాలు చేశారు. బాబా పింపల్‌గావ్‌లో ఉండిపోయారు. తరువాత రెండు గంటలలో వస్తానని బాబా చెప్పారు.

బాబా రాగానే సహవాసులందరు హాలులో ఆసీనులైనారు. వంటయింటిని నిర్వహిస్తున్న 'ఛగన్'ను సహస్రబుద్ధిని పిలిపించారు.

బాబా "ఛగన్ చాల సంవత్సరాలుగా బాబావద్ద వుంటున్నాడు. ఇక్కడ ఎప్పుడు సమావేశములు సభలు జరిగినా, వంట యింటి యాజమాన్యం అతనిదే" అతడు బాబా కోసం రాత్రి కావలి కూడా కాస్తాడు.

సహస్రబుద్ధి పూనాలోను, మహాబళేశ్వర్‌లోను అనేక హోటళ్ళకు యజమాని. అతడు బాబాను అధికంగా ప్రేమిస్తాడు. ఇప్పుడు బాబాను సేవించాలని వచ్చాడు. ఈసమయంలో తన హోటళ్లు రద్దీగా వుంటాయి. అయినా, తన వ్యాపారం అచ్చట కొందరికి అప్పగించి సహాయంగా కొందరిని తీసికొనివచ్చి ఇక్కడికి వచ్చాడు. ఇక్కడ వంట, భోజన వసుపాయాలను ఇతడే చూస్తాడు.

"ఈ రోజు సాయంకాలం గాని రాత్రి గాని మరునాడుగాని మెహెరాబాద్ నుండి వెళ్లిపోయేవారిని బాబా చూస్తానన్నారు.

'విశాఖపట్టణంలో ఉద్యోగంలోనున్న వి. వి. నారాయణరావుకి సెలవు దొరికినా, పై అధికారులు యిచ్చిన పనివలన రావడానికి వీలులేకపోయింది. ఆఖరు రోజులలో వీలయితే రావలెను' అని బాబా తంతిద్వారా అతనికి తెలియజేశారు. అది పురస్కరించుకొని బాబా "ఈ రోజున వి. వి. నారాయణరావు వస్తే అతనిని పింపల్‌గావ్‌కి తీసికొనిరండి" అని మండలికి ఆదేశించారు. "అతడు తరువాత వారం ఇచ్చట హిందీబృందంతో గాని మరాఠీబృందంతో గాని ఉండవచ్చునని నేను చెప్పానని చెప్పండి. అతడు రాలేకపోయినట్లయితే విచారించవలదని తెలియజేయండి" అని బాబా చెప్పారు.

"రేపు బాబా ఇక్కడికి రారు. మీరందరు ఆనందంగా మెహెరాబాద్ నుండి వెళ్లిపొండి. ఏమీ ఆందోళన చెందవలదు. ధైర్యంగా వుండండి. మీతో కూడా బాబాను తీసికొని వెళ్లండి. బాబా మీతో ఎప్పుడూ వుంటారు. మీరు మీతో బాబాను తీసికొనివెళ్లకపోతే మీరేమీ బాధపడవద్దు. భయపడవద్దు. నేనే మీతోవస్తాను. మీతో ఎల్లప్పుడు వుంటాను" అన్నారు బాబా.

వంటయింటివారితోను, ఇంకా కొందరు ప్రేమికులతోను బాబా ఫొటోలు తీయించుకున్నారు. ఇంతవరకు తీసిన ఫొటోలన్నియు బాగా వచ్చాయి, ఒక నూజవీడు బృందంతో తీయించిన ఫొటో తప్ప. అందుచేత నూజివీడువారితో మరియొక ఫొటో తీయమని బాబా చెప్పి తీయించుకున్నారు. తరువాత ధర్మారావుతోను, మూర్తితోను బాబా ఫొటో తీయించారు. తరువాత వై. వి రంగారావు, కొందరు కార్యకర్తలతో ఫొటో తీయించారు.

బెంగుళూరునుండి వచ్చిన బాబా ప్రేమికుడైన పినిశెట్టి నారాయణస్వామి ఒక ఫొటోగ్రాఫరు. బాబా అతనిని పిలిచారు. మెహెరాబాద్ కొండమీద అహమద్‌నగర్ నుండి వచ్చిన ఫొటోగ్రాఫరు తీసిన ఫొటోలు చూపెంచి ఎలా వున్నాయని అడిగారు. అందులో నీడ గురించి అది అతని తప్పుకాదని అప్పుడు ఎండ, నీడ అలా వున్నాయని చెప్పాడు.

సహవాసులందరు హాలులో కూర్చున్న తరువాత, టి. ఎస్. కుటుంబశాస్త్రి మండలి అందరిని పిలిచి బాబాను వారిని ఒక్కొక్కరినే ప్రేమికులకు పరిచయం చేయమని అడిగాడు. అతని అభ్యర్థన ప్రకారం బాబా ఒక్కొక్కరినే పిలిచి ఇలా చెప్పారు.

1) గుస్తాద్‌జీ . ''ఇతడు సాఈబాబాతోను, ఉపాసనీ మహరాజ్‌తోను అనేక వత్సరాలు వున్నాడు. బాబాజాన్‌వద్ద కూడా రాత్రి కావలి కాస్తూవుండేవాడు. బాబా ఆజ్ఞానుసారంగా ఇతడు 6 మాసాలు ఉపవాసం చేశాడు. 3 వత్సరాలు ఇతడు నిద్ర లేకుండా గడిపాడు. ఉపవాసం వలన ఇతడు చిక్కి శల్యమైపోయాడు. బాబా ఆజ్ఞాను సారంగా గత 27 వత్సరాలనుండి మౌనం వహిస్తున్నాడు'' అన్నారు బాబా.

2) కైకోబాద్ : ''ఇతడు పార్సీపురోహితుడు. ఇతని గురించి ఇదివరకే చెప్పాను'' అన్నారు.

3) డాక్టర్ డాంకిన్ : ఇతడు బాబాతో గత 6 సంవత్సరాలుగా ఉంటున్నాడు. అతని సర్వస్వం బాబా కోసం పరిత్యజించాడు. ఇతడు బాబాయొక్క నవ్యజీవితంలో బాబాతో వున్నాడు. ఇతని జీవితం బాబాకు అంకితం చేశాడు. ఇతడు గత యుద్ధంలో సేవజేసి మేజర్ పదవిని పొందాడు. ఆరోజులలో డాన్‌కిన్ బాబాకు డబ్బు పంపించే వాడు. బాబా ఇందుకు అనుమతించారు. యుద్ధానంతరం అతడు తిరిగివచ్చి బాబావద్ద వుంటున్నాడు. ఎన్నికష్టాలు వచ్చినా, ఎండనక వాననక బాబాతోనే వున్నాడు. అతడు ఆంగ్లేయుడైనా ఇక్కడి జీవితానికి సరిపెట్టుకొని బాబా దామన్ గట్టిగా పట్టుకొనిఉన్నాడు. (బాబా ఆశ్రయమును విడనాడకుండా ధృవతారవలె స్థిరుడై యున్నాడని భావము)

''మీరందరు మండలి సభ్యులుకారా ? మీరు బాబాను ప్రేమించుటలేదా ? ఈమాటలన్నీ ఎందుకు ? ఈ కొత్తసంగతి ప్రారంభించారేవిటి ? నాలుగేళ్లనుండి

ఈచెప్పులజోడును నేను తొడుగుతున్నాను. ఇవి నేనెక్కడికివెళితే అక్కడికి నాతో వస్తాయి. అంతమాత్రంచేత నాచెప్పులనుకూడా నేను వర్జించనా?

4) పాద్రి : "ఇతడు చిన్నతనంనుండి నాదగ్గరే వుంటున్నాడు. నఖశిఖ పర్యంతము నాకు విధేయుడై వున్నాడు.

5) పెండు

6) ఏష్ణు

7) జాల్‌భాయ్

8) కాకాబారియా

9) రంజూ – వీరందరినీ మీరెరుగుదురు. వీరిని గూర్చి ఇదివరకే నేను చెప్పాను.

10) శత్రుఘ్నకుమార్ : "ఇతనిది డెహ్రాడూన్. ఇతడు ఒకటవనెంబరు బందిపోటుదొంగ. రాజకీయ కారణాలవలన జైలుకు వెళ్లాడు. అనేకసార్లు జైలులో చాల సంవత్సరాలు గడిపాడు. ఇతనికి అప్రయత్నంగా ఉద్రేకం కలుగుతుంది. రోడ్డుమీద కనిపించినవాళ్లను కొడతాడు. భగవంతుడంటే నమ్మకంలేదు. అతడు నాస్తికుడుకాడు. కనిపించని భగవంతునిలో నమ్మకంలేదు. ధనికులనినా, బీదలనినా, ఎవరన్నా లక్ష్యంలేదు. బాబాకు ఏవిధంగా విధేయుడై వుండాలో అతనికి తెలియదు. తన తలతీసి బాబా పాదాలముందు వుంచడానికి సిద్ధంగావున్నాడు. బాబా ఆజ్ఞాపించితే అక్షరాలా అతని భార్యను ముక్కలక్రింద నరికివేస్తాడు. (శత్రుఘ్నకుమార్‌ను ప్రశ్నించగా, అంతా నిజమేనని అంగీకరించాడు)

11) ఆదీ కే. ఇరానీ (అర్దేషిర్ కైఖుస్రూ ఇరానీ) "30 యేండ్లనుండి బాబాతో వుంటున్నాడు.

12) ధాకేఫాల్కర్ : "1940 నుండి ఇతడు బాబాతో వుంటున్నాడు. అప్పటి నుండి ఇప్పటివరకు బాబాయెడల ప్రేమ ఒకేమోస్తరుగా వుంది. అతని హృదయంలో బాబా ఎవరో అతనికి తెలుసును. ధైర్యంగా బాబా ఎవరో ఇతరులకు చెపుతాడు. నఖశిఖపర్యంతము ఇతడు బాబాను ప్రేమిస్తాడు.

13) సావక్‌కొత్వాల్ : "1940 సం॥ నుండి ఇతడు, ఇతని కుటుంబ సభ్యులు, అందరూ బాబాకు అంకితమైనారు. ఇతడు సతారాలో రాత్రివేళ కావలా కాసేవాడు. ప్రతిరాత్రి ప్రతినెల ఇతడు బాబా పాదాలు ఒత్తుతాడు.

14) నారిమన్ : "ఇతని ప్రేమ వర్ణించడానికి వీలులేదు" అతని భార్య ప్రేమకూడా అటువంటిదే. ఈరోజున ఒకసంగతి జరిగింది. దానిని గురించి మీకు తరువాత చెపుతాను. నారిమన్‌కి, అతని భార్యకి బాబాయందు ఎంతో ఘనమైన ప్రేమ.

15) మెహెర్‌జీ : "ఇతడు రత్నంవంటివాడు. బాల్యంనుండి బాబావద్దనే ఉన్నాడు. ప్రేమలోను, సేవలోను, అక్షరాలా చూపించే విధేయతలోను బాబా పనికి అంకితమై నిర్వహించడంలోను అనేక సంవత్సరాలు గడిచాయి. అతడు నన్ను ఎలా ప్రేమిస్తున్నాడో చెప్పడానికి మాటలు చాలవు.

16) సిద్ధుజీ : ఇతడు చదువురానివాడు. అసలు చదువుకోలేదు. కాని బాబాకు ఇతడు చేసేసేవ చాలా గొప్పది. అనేక సంవత్సరాలనుండి బాబాతో వున్నాడు ఈ ఇల్లు కట్టినప్పటినుంచి అతడు బాబాతో వున్నాడు. అతని సేవను వర్ణించడానికి కొన్ని సంవత్సరాలు పడుతుంది.

"అసలు ఈ మండలిని గురించిన ప్రస్తావన ఎవరు తెచ్చారు ? మండలిలో ఇంకా ఎంతోమంది వున్నారు. ఇక్కడ లేనివారు ఇతరదేశాలలోనూ వున్నారు. చాలమంది రత్నాలవంటి వారున్నారు. మీరందరు నామండలి కారా ? మీ విధేయత, ప్రేమ వారితో సమానంగా గొప్పగాలేమా ?

17) భగన్ : ఇతనిని గురించి ఇదివరకే చెప్పాను.

18) నానా : ఇతడు నాగపూర్ వాస్తవ్యుడు.

19) అలోబా : ఇతని దేహము, మనస్సు, హృదయము, ఆరోగ్యము, ఐశ్వర్యము అన్నీ బాబాతోనే వున్నాయి.

20) భావూ ఏరోసింగ్‌కల్చూరి : ఇతనివృత్తి వ్యవసాయం. ఇతడు ఎం. ఏ. ప్యాసైనాడు. నిద్రలో కూడా 'బాబా' 'బాబా' అని అంటూవుంటాడు. మండలివారు ఇదిచూచి నాకు చెప్పారు.

"మండలిని గురించి వ్యక్తిగతంగా చెప్పడము నాకు ఇష్టంలేదు. మీకు వారి పరిచయం కావాలి, వారిని తెలిసికోవాలి అంటే, మీరు వారిని కలిసికొని మాట్లాడితే సరిపోయేది. మీలో రత్నాలవంటివారు అనేకులు వున్నారు. డాక్టర్ ధనపతిని చూడండి. అతని వయస్సు చూడండి. ఊరూరికీ తిరుగుతాడు. కుటుంబశాస్త్రిని చూడండి. అతడు ఎలా పనిచేస్తాడో! ఎలా త్యాగం చేశాడో చూడండి. మల్లిక్‌ను (ఇవటూరి చెన్న మల్లికార్జునరావు) చూడండి. ఇంకా మీలో ఎంతోమంది వున్నారు. వారిని గురించి నేనెందుకు చెప్పగూడదు? మండలిని గురించే ఎందుకు చెప్పాలి?

"నేను చెపుతాను వినండి. ఎవరైతే బాబాను ప్రేమించి బాబా ప్రేమను గురించి ఇతరులకు చెపుతారో వారే నామండలి. వారు బాబా దగ్గరవున్ననూ, వేయిమైళ్ల దూరంలోనున్నా అంతా ఒకటే.

21) డాక్టర్ సీలు :

22) కిషన్‌సింగ్ :

23) ఫరమ్ వర్కింగ్ బాక్సువాలా. వీరందరూ ఒక్కొక్కరు ఒక్కొక్క రత్నం. బాబాతో అనేక సంవత్సరాలనుండి వున్నాడు.

24) పటేల్ ; ఇతడు బాబాకు కుడిభుజంవంటివాడు. ఎవరూ లేనప్పుడు ఇతడు నాతోవుండేవాడు.

"ఎవరు నన్ను ప్రేమిస్తారో వారు నావారే. ఈ ప్రపంచం అంతా నాదే. మీరందరూ నావారే. ప్రతిది నాదే. అందరూ నావారే. ప్రతివ్యక్తి నావాడే. ఈ విశ్వమంతా నాదే. నన్ను ఎవరు ప్రేమిస్తారో వారికోసం నేనున్నాను. నన్ను ఎవరు ప్రేమిస్తారో నేను అతనివాడనే.

"ఈమాటలు మీ హృదయంపై వ్రాసుకొనండి.

"అందరూ నావారే. నన్ను ప్రేమించేవాడు నావాడు. అతడు నాదగ్గరవున్నా, ఎంతో దూరంలోనున్నా ఇది నిజం."

"బాబా మీ అందరిని సంతోషంగా ఉండమంటున్నారు.

"మీరు వ్యాకులపాటు చెందకండి. భయపడకండి. ఇక్కడనుండి మీరందరు ఉల్లాసంగా ఆనందంగా వెళ్లాలి. బాబాకు సర్వము తెలుసును. మీతో బాబాను పూర్తిగా తీసికొని వెళ్లండి. బాబాను మీతో సాధ్యమైనంత ఎక్కువగా తీసికొని వెళ్లండి." అని బాబా సహవాస్ ముగించారు.

సాయంకాలం 5-30 గం॥కి బాబా లేచి పింపల్‌గావ్ వెళుతూ అందరకూ వీడ్కోలు ఇచ్చారు.

ఆసాయంకాలం, రాత్రి చాలమంది వెళ్లిపోయారు. 17 వ తేదీని మధ్యాహ్నం 'టీ' సేవించిన తరువాత ఆఖరి బృందం వెళ్లిపోయారు. ఈవిధంగానే మూడవ వారంలో హిందీమాట్లాడేవారితో సహవాస్ జరిగింది.

## నాల్గవ వారం సహవాస్ :

ఇది 27 వ నవంబరు నుండి 3 వ డిశెంబరు (1955) వరకు జరిగింది. మరాఠీభాష మాట్లాడే బాబా ప్రేమికులు సహవాస్‌కు వచ్చేవారందరు 27 వ తేదీనాడు వచ్చారు. ఈరచ్ ఇంగ్లీషులో చెప్పినది, చదివినది డాకేథాల్కర్ మరాఠీలో అనువదించి చెప్పాడు.

## 28 నవంబరు 1955

ఉదయం 8 గంటలకు సహవాస్ ప్రారంభం అయినది. బాబావచ్చి కూర్చుండి ఇలా చెప్పారు :

"నేను చెప్పునది సావధానంగా వినండి. ఇప్పుడు వింటే వృధాగా పోదు. మీ చింతలన్నీ మరచిపోండి. ఆధ్యాత్మిక మార్గం అర్ధంచేసికోవడం కష్టం. 'గాడ్ స్పీక్స్' అనే పుస్తకంలో అనాది ఆదినుండి అనంత అంత్యంవరకు ఉన్న ప్రతిదీ చెప్పబడింది. నిద్రించడము, మేల్కొనడము, సంచరించడము, కూర్చోవడము ఇవన్నీ సంస్కారాలే ఉత్పన్నం చేస్తాయి. ఆత్మలకు వలవలె వున్నాయి. వీటివలన ముక్తి ఎలా లభిస్తుంది ? సంస్కారాలు ఈ విశ్వాన్ని సృష్టించాయి. శాశ్వతంగా మనం అందరమూ ఒకటే (ఏకమ్) - భగవంతుడు. ప్రతివ్యక్తి యొక్క గాఢ నిద్రావస్థ (సుషుప్తి) అది ఆత్మయొక్కస్థితి. మనకు మెలకువ రాగానే బంధంలో

వున్నాము తెలిసికొంటాము. ప్రతిరోజు మనం మనస్వీయమైన అవ్యనంత స్థితి లోనికి ప్రవేశిస్తాము. అది మనకు తెలియదు. కాని మెలకువ రాగానే మన పరిమిత స్థితిని తెలిసికొంటాము – అది ద్వైతస్థితి. మనకు కావలసినదేవిటి? మన ఆది మూలస్థితికి తిరిగి వెళ్ళిపోవడమే. మనం ఆ ఆదిస్థితిలో మెలకువ కలిగి చైతన్యంతో వుండాలి. ఈ స్థితికి మనం చేరుకొనవలెనంటే – సంస్కారములన్నీ చెదిరిపోవాలి. బాహ్యానికి అది పరిహాసాస్పదంగా వుంటుంది. ఆత్మజ్ఞానం పొందడము అంతకష్టం. ఎందుచేత? భగవంతుడు మనకు మన శ్వాసకంటే కూడా ఎక్కువ అనంతంగా ఆధారభూతుడు. మనము పరుగెత్తినపుడు, ఎత్తునకు ఎక్కినపుడు, శ్రమించినపుడు, మనకు శ్వాససంగతి గుర్తుకు వస్తుంది. నీటిలో మునిగిపోతున్న మానవునివలె జీవించడానికి శ్వాసక్రియ ముఖ్యమని ఆసమయంలో తెలిసికొంటాము. భగవంతుడు మన శ్వాసకంటె మనకు అత్యంత సన్నిహితంగా ఉన్నాడు. నీవు నీశ్వాసను నీజీవితానికి ముఖ్యమని తెలిసికోనపుడు భగవంతుడు నీలో ఉన్నాడని ఎలా తెలిసికో గలవు? నీ జీవితం ప్రేమ మహాసాగరంలో కలిసిపోవాలి ప్రేమలేనిదే నీవు ఎప్పటికీ జీవించలేవని నీవు భావించాలి.

"అనేక సంవత్సరాలక్రిందట ఒకవ్యక్తి బాగా దుస్తులు ధరించి బాబా వద్దకు వచ్చి నలభై సంవత్సరాలనుండి అతడు భగవంతునికై అన్వేషిస్తున్నానని చెప్పాడు. ధ్యానంచేస్తూ, జపతపాదులుచేస్తూ భగవత్సాక్షాత్కారం కావాలని, భగవంతునికోసం వెదకుతున్నానని చెప్పాడు. నీవు నాకు విధేయుడవైయుంటే బ్రహ్మసాయుజ్యాన్ని నీకు కలిగిస్తాను" అని బాబా చెప్పారు.

అతడు "నా శిరస్సు ఖండించి మీ పాదములచెంత ఉంచగలను మీరు కావలెనంటే" అన్నాడు.

అది విని బాబా చాలా ఆనందించారు. బాబా "అతని దుస్తులన్నింటినీ తీసివేసి, నగ్నంగా అహమద్‌నగర్ వీధులలో తిరిగి రావాలి" అన్నారు. అందుకు అతడు "అహమద్‌నగర్ నాస్వస్థలం. అక్కడ నేను ఆపనిచేయలేను" అని వెళ్ళిపోయాడు. అంతట బాబా "చూశారా! తలనరికి యివ్వడంకంటే విధేయులుగా ఉండడము ఎంత కష్టమో! ప్రేమ, విధేయత, శరణాగతి ఈమూడును ఆధ్యాత్మిక సాధకునికి చాల ముఖ్యమైన గుణాలు" అన్నారు. బాబా.

“ఎవరు ఆధ్యాత్మిక మార్గంలో ఉన్నారో తెలిసికోవడము కష్టం. ఇండియాలో సాధారణంగా అనేకమంది కాషాయవస్త్రాలు ధరించి, ఏచెట్టుక్రిందనో కూర్చుంటారు. వారిని ప్రజలు గౌరవిస్తారు. దివ్యమానవుని చూశామంటారు. ప్రజలు తండోప తండాలుగా అతని వద్దకు వస్తారు.

“చైతన్యభూమికలు అనే ఆధ్యాత్మికసోపానాలు ఏడు వున్నాయి. మొదటిది దేహస్మృతి లేకుండా దివ్యమైన సువాసనలు దివ్యమైన దృశ్యాలు కనిపించుట. మార్గంలో ప్రవేశించి ప్రయాణం సాగించినకొలదీ సాధకుడు దేహచైతన్యం పూర్తిగా కోల్పోతాడు, మెలకువ వచ్చిన తరువాత దుప్పటిని తీసివేసినట్లుగా.

“మెహెరాబాద్‌లో పిచ్చి ఆశ్రమం వుండేది. ఆ ఆశ్రమంలో ఒక ఫకీర్ వుండేవాడు. అతడు అందరికంటె పిచ్చివాడు. ఒక రోజున పూనానుండి ఒక మహమ్మదీయుడు వచ్చి ఆశ్రమంలో పనిచేస్తూ వున్నాడు. ఆ ఆశ్రమాన్ని ఎత్తివేసి నపుడు ఆ ఫకీర్‌ను పూనా పంపించారు. ఆ మహమ్మదీయుడు ఆ ఫకీర్‌ను గురించి బాబానుగురించి పూనా ప్రజలకు చెప్పాడు. అనేకమంది ఫకీర్‌యొక్క దర్శనార్థం రావడం ప్రారంభించారు. పాపం అతడు ఈ విషయం తెలిసినవాడు కాడు. కొంత కాలానికి 'జగద్గురు ఫకీర్‌బువా' అనే బోర్డు కనిపించింది. ఫకీర్ పిచ్చివాడు. ఎవరో బోర్డు తయారుచేసి పెట్టేశారు. ఫకీర్ చేతివ్రేళ్లు ఆడించేవాడు. బాబా కూడా ఇలాగే వ్రేళ్లు కదిపేవారు. “ఈ ఫకీర్ బాబా యొక్క ప్రతినిధి” అని ఆ మహమ్మదీయుడు చెప్పాడు. వీరు ఏమనుకుంటున్నారో, దేనిని గురించి మాట్లాడుకుంటున్నారో, ఆ ఫకీర్‌నకు ఏమీ తెలియదు. అతడు నిజంగా పిచ్చివాడు. “మీరు సద్గురువులవలె వేషాలు ధరించి వారిని అనుకరించవద్దు” అని బాబా కొందరిని హెచ్చరించేవారు. ప్రజలు వారి చుట్టునూ చేరతారు. ఒక విధమైన ఆధ్యాత్మిక వాతావరణం సృష్టిస్తారు.

బాబా అంటారు : “భగవంతుడు అనంతకరుణామయుడు. ఆయన అన్నింటినీ క్షమిస్తాడు. కాని నటనను మాత్రం క్షమించడు. నీవు ఎవరివై యున్నావో, అంత రంగికంగా నీవు ఎవరివో, బాహ్యానికి కూడా అలాగే వుండాలి. నన్ను ఎవరు ప్రేమిస్తారో నేను అవతారపురుషుడనని భావిస్తే, భగవంతుడనని అనుకొంటే, సనాతనుడనని నీవు ఆ విధంగా వక్కాణించగల హక్కు నీకు వుంది. నేను దొంగనని నీవు అనుకొంటే అదేనీవు చెప్పాలి. ప్రపంచం అంతా ఏకమై నాకు వ్యతిరేకమైనా,

నాకు ఏమీరాదు. నీవు యింటికివచ్చి బాబాను గురించి మాట్లాడితే — 'బాబా ఒక్కడే సత్యం, తక్కినదంతా మాయ' అని నీవు చెప్పాలి.

"నీవు ఒక బ్రహ్మాండమైన సమావేశంలో మాట్లాడుతూ ఈవిధంగా చెపుతూ వున్నప్పుడు నీకు ఒక చెడువార్త తెలిసిందనుకో. అప్పుడు నీవు కలవరపడి నిగ్రహశక్తిని కోల్పోయినట్లయితే ప్రజలు నిన్నుగురించి నీవు చెప్పేది నీకు ఆచరణలోలేదని నీమీద వారికి చెడ్డఅభిప్రాయం కలుగుతుంది" అన్నారు బాబా.

బాబా కొంతసేపు విశ్రాంతినిచ్చి మరల 9-30 గంటలకు సహవాసులను సమావేశపరిచారు. అప్పుడు మరల ఇలా చెప్పారు.

"యుగయుగములందు నేను మీమధ్యకు వస్తూవుంటాను. నేను ఆపురాణ పురుషుడను. ఈ నాయొక్క 'అహమ్‌' నకు, ఒక వ్యక్తియొక్క 'అహమ్'నకు తేడావుంది. 'గాడ్ స్పీక్స్' చదివితే మీకు నేను భగవంతుడనని తెలుస్తుంది. అందులో చక్కగా వివరించాను. కాని అర్థంచేసుకున్నంతమాత్రాన, నీకు దేవుడనని చెప్పుకొనే అధికారం రాదు.

"బాబా ప్రేమికులు నన్ను అనేక అద్భుతాలతోనింపి మాట్లాడతారు. నాకు ఆ అద్భుతాలకు సంబంధం లేదని నేను చెపుతాను. మీకు గల నమ్మకం, ప్రేమ వలననే అటువంటివి సంభవించే అవకాశం కలుగుతుంది. కొన్ని సమయములలో అది భ్రమకావచ్చు. రెండు విషయాలను గమనించండి. ఆధ్యాత్మికము లేక ప్రేమ మార్గమునకు అద్భుతాలకు ఏమీ సంబంధం వుండదు.

"రెండు నెలల క్రిందట ఉత్తరప్రదేశ్‌లో ఒక గ్రామంలో 'రామదాస్' ఒడిలో - చనిపోయిన బాలిక బ్రతకడము - ఈ సంఘటన గురించి బాబా వివరంగా చెప్పారు. రామదాస్ క్రిందటివారం హిందీబృందంతో సహవాస్‌కు వచ్చాడు. బాబా ఏ అద్భుతము చేయలేదని మళ్లీ చెప్పారు. ఆయన చేసిన మొదటి అద్భుతము ఈ సృష్టియని, రెండవ అద్భుతము ఆయన మౌన విరమణము కావించినపుడు జరుగుతుందనియు చెప్పారు.

బాబా ఇవ్వగలిగినది భగవంతుడే. బాబా, షాహిద్దాగర్ మొదలైన వ్యాపారస్తుల గురించి చెప్పారు. ఆయన ఇంకా ఇలా అన్నారు.

"కర్మకాండవలన ఆచారములవలన ప్రేమ కలుగదు. ప్రేమకానుక భగవంతుని నుండియే లభిస్తుంది." అనిచెప్పి బాబా కైకోబాద్ యొక్క అనుభవముల గురించి చెప్పారు. కైకోబాద్‌కి కలిగిన అనుభవం భగవత్సాక్షాత్కారం కాదు. బాబా కైకోబాద్‌ను అడుగగా తనకు కలిగిన అనుభవం అతడు వర్ణించలేక రెండు మూడుసార్లు వర్ణించడానికి ప్రయత్నించి చివరకు బాబాముందు ఏడ్చాడు.

"మార్గంలో ప్రేమకంటె గొప్పది ఒకటున్నది. అది విధేయత. ప్రేమకంటే విధేయతకంటే గొప్పది మరొకటున్నది. అది సర్వసమర్పణము. గురువు పాదముల కడ సర్వమును సమర్పించడము. మనస్సు సమర్పింపబడితే ఇంక అతడు ఆగురువే అయిపోతాడు.

"ప్రేమ, విధేయత, సమర్పణము ఏటికిగల తేడా ఏమిటంటే – ప్రేమ ప్రియతముని ఇచ్ఛ ఏమిటాయని చూస్తుంది.

"విధేయత ఆయన ఇచ్ఛానుసారంగా నడచుకొంటుంది.

"సమర్పణము ప్రియతముని ఇచ్ఛకులోబడి వుంటుంది.

"ప్రేమ భగవంతుని నుండి మానవునకు ప్రాప్తించిన కానుక. సమర్పణము– సద్గురువునకు మానవుడు అర్పించిన కానుక.

నేను భగవంతునిగా ఈ ప్రపంచంలో సదా స్వేచ్ఛగా వున్నాను. మీలో మానవునిగా శాశ్వతంగా బంధింపబడి వున్నాను. ఇక్కడ నా ఆదిమూలస్థితిలో స్వేచ్ఛగా నున్నాను. అక్కడ బంధంలో వున్నాను. అందరూ ఇంకనూ కలగంటూనే వున్నారు. బాహ్యానికి మనం ఒకరి నొకరు చూస్తూవున్నప్పటికీ ఈభూములు, పర్వతాలు, బయటి ప్రపంచం కలలో కనిపించుతాయి. ఈ నిద్రలో మానవుడు, మీరందరు ఈ హాలులో బాబాసన్నిధిలో కూర్చున్నట్లు చూస్తాడు. మీరందరూ కలగంటున్నారు అని బాబా చెప్పడము గమనిస్తాడు. ఆ మానవుడు, "అబ్బే! ఇది కలగాదు. ఇదంతా నిజమే. నాకు తెలుసు" అని అంటాడు. మీరిప్పుడు ఇచ్చట

ఇప్పుడు కూర్చున్నదికూడా ఒక స్వప్నమే. మీరు చూస్తున్నదంతా ఒక కల. మీరు నిద్రలో అనుభవించేది ఈ కలలో ఒక చిన్న కల.

"మీరు నన్ను ప్రేమిస్తేగాని నన్ను కనుగొనలేరు" ఎవరు నన్ను ప్రేమించడానికి సాహసిస్తారో చూదాం. సూర్యుని మేఘములు కమ్మేశాయి. తనపైకప్పు తానే పగులగొట్టటానికి (మేఘాలను పారద్రోలటానికి) బాబా యొక్క అనుగ్రహం పొందటానికి ఎవరు సాహసిస్తారో చూదాం.

"గోదావరిమాయితో సమానులు ఈ యావత్తు ప్రపంచంలో ఎవరూలేరు. గుజరాతీ బృందంలో మొదటివారంలో ఆమె వచ్చింది. బాబా ఆమెతో "నీవు నా యశోదవు. ఈసహవాస్ కార్యక్రమానంతరం నేను సాకోరీవచ్చి నీతో వుంటాను. నీస్వహస్తాలతో వండిన అన్నం తింటాను." అని అన్నారు బాబా.

బాబా సాకోరి వెళదామనుకున్నపుడు ఆమె సూరత్‌లోవుంది. ఆమె వద్దనుండి బాబాకు ఈ రోజున ఉత్తరం వచ్చింది. బాబాకు జనవరిలో సాకోరీ వెళ్ళడానికి తీరిక లేదు. జనవరిలో స్త్రీలకోసం సహవాస్ కార్యక్రమం నడపాలి. అమ్మ దగ్గరనుండి ఇప్పుడీ ఉత్తరం వచ్చింది. అందుచేత ఏమి చేయాలో తోచడంలేదు. జనవరిలో నా ప్రేమికుల సహవాస్‌లో ఉండడమా? లేక సాకోరీ వెళ్లడమా? అమ్మకు అహంకారం రవ్వంతైనా లేదు. బాబాతప్ప అది యెవరూ చూడలేరు. అహంకారం లేకుండా ఉండడము తమాషాకాదు. గోదావరీమాయి ప్రేమతో నిండివుంది. ఇది కూడా సామాన్యం కాదు.

"మహరాజ్ సద్గురువు. అమ్మ మహరాజ్ దగ్గర వుండేది. బాబా కృష్ణునిగా అవతరించినపుడు అమ్మ యశోదగా వుండేది" అన్నారు.

15 ఫిబ్రవరి 1956 నుండి ఒక సంవత్సరం బాబా వేరేగా వుంటారు. ఆయన సాకోరీలో రెండురోజులుంటారు. ఏ రోజులో తరువాత నిశ్చయింపబడతాయి.

ఇంతటితో యీ పూట సహవాస్ ముగించి బాబా లేచారు. అందరు భోజనాలు చేశారు.

మరల మధ్యాహ్నం ఒంటిగంటకే ప్రేమికులందరు హాలులో సమావేశమైనారు. బాబా వచ్చి ఇలా చెప్పారు.

"నేను ఈ దేహంతో ఉండగానే నేను అందరికీ చెప్పేది గ్రహించండి. నాదేహం చాలించగానే నా యిచ్ఛప్రకారం చేయగలను. అప్పుడు నా సమాధి వద్దకు లక్షోపలక్షలు ప్రజలు వస్తారు. నేను బయటికి ప్రజలకు దర్శనమివ్వడానికి వెళితే ప్రజలు తండోపతండాలుగా వస్తారు. గొప్పతనానికి నాకు ప్రజా సమూహాలు అక్కరలేదు. నాకు మీ వద్దనుండి కావలసినది కొంచెం ప్రేమ. ఈ దేహం – నేను ఏరూపంలో ఉన్నానో అది, అయిదుగురు సద్గురువుల కారణంగా ఏర్పడింది. ఈ సమయంలో బాబాకు 1931 వ సం॥లో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకానికి వస్తోంది.

"బాబా తొలిసారిగా పశ్చిమదేశాలకు వెళ్లినపుడు ఆస్టీమరులోనే గాంధీజీ వున్నాడు. అతడు చక్కని ఆత్మ, మంచి హృదయం కలవాడు. జమ్‌షెడ్‌జీ నస్సర్వాంజీమెహెతా. ఇతడు కరాచీనగరానికి మేయర్‌గా వుండేవాడు. అతనికి టెలిగ్రాం యిచ్చాడు, ఆ స్టీమర్‌లోనే వున్న మెహెర్‌బాబా ను కలిసికోమని. ఆప్రకారం గాంధీజీ తన కార్యదర్శి మహదేవ్ దేశాయితో నాకేబిన్‌కు వచ్చాడు. అప్పుడు నాతో రుస్తుం, చాన్‌జీ వున్నారు. గాంధీజీ లోపలకువచ్చి, జమ్‌షెడ్‌జీ మెహెతా టెలిగ్రాంయిస్తే వచ్చాను. నాఅంతట నేను రాలేదు" అని చెప్పాడు. నావద్ద అయిదు నిమిషాలే వుంటానని గాంధీజీ నాతోచెప్పాడు. నేను అంగీకరించాను. గాంధీజీకి అద్వితీయమైన హృదయం వుంది. గాంధీజీ మూడుగంటలసేపు నావద్ద కూర్చున్నాడు. అంతసేపు నేను అక్షరఫలకం ఉపయోగించాను. గాంధీజీ ఎంతో సంతోషించారు. నేను అతనిని ఆలింగనం చేసుకున్నాను.

"మరునాడు మరల గాంధీజీ వచ్చాడు. ఆవిధంగా మూడురోజులు వచ్చాడు. రెండవరోజున గాంధీజీ నన్ను మాట్లాడమని చెప్పాడు. అతడు "మీరు గొప్పవారని నాలో ఏదో చెప్తోంది. కాని ఉపాసనీ మహరాజ్‌ను దర్శించినపుడు నేను అలా భావించలేదు. నేను ఎందుచేత ? అని ప్రశ్నించాను. నేను వెళ్లి చూచినపుడు ఉపాసనీ మహరాజ్ గోచీతో వున్నాడు. తరువాత అదికూడా తీసివేశాడు " అన్నాడు.

"అప్పుడు నేను గాంధీజీని అడిగాను. నీవు నిజంగా నేను గొప్పవాడనని భావిస్తున్నావా ? ఉపాసనీమహరాజ్ ఒక సద్గురువు" అని చెప్పాను. ఆయన ఎలా సద్గురువో నాకు అర్థంకాలేదు అన్నాడు గాంధీజీ. నేను నవ్వాను.

తరువాత చాన్‌జీ గాంధీజీతో చాలా చనువుగా ఉన్నాడు. గాంధీజీ చాన్‌జీతో "బాబా అక్షరఫలకంమీద అక్షరాలను చూపించినట్లు, నేను మౌనంగా ఉన్నపుడు ఆయనను అనుకరిస్తాను" అని చెప్పాడు.

బాబా అన్నారు "రెండవరోజున నేను గాంధీజీతో చెప్పాను. నాయెడల నీకుగల గౌరవం నాకు తెలుసును, అన్నాను. గాంధీజీకి నఖశిఖపర్యంతము భారతదేశానికి సేవచేయాలనివుంది. గాంధీజీ నన్ను మౌనవిరమణ చేయమన్నాడు. సత్యమును గురించి లోకానికి చెప్పమన్నాడు. తరువాత మూడవ రోజున మరల ఒండొరుల అభిప్రాయములను గురించి మాట్లాడుకున్నాము. గాంధీజీ "ఒకరాత్రి మీవద్ద వరుంటాను" అన్నాడు గాంధీజీ నన్ను ఎత్తుకొని తనకేబిన్‌కు తీసుకురమ్మని రుస్తుంతోచెప్పాడు. గాంధీజీ వెళ్లిపోతూ "నీవు గొప్పవాడవని నీవేచెప్పుకుంటున్నావు. నీవు గొప్పవాడవే కావచ్చు. అయితే ఒకపనిచెయ్యి. ఖాదీటోపీ, కోటు ధరించు" అన్నాడు. నేను గాంధీజీని కౌగలించుకున్నాను. గాంధీజీ నాతో మాట్లాడినవన్నీ షౌకత్‌అలీ వింటున్నాడు బయట నిలబడి. గాంధీజీ దేశాయితో వెళ్లిపోయాడు. ఆవెంటనే షౌకత్‌అలీ రుస్తుంతో లోపలికివెళ్లి బాబాను దర్శించి ఆయన చేతిని ముద్దుపెట్టుకుంటాను అన్నాడు. ఈ మాటవిని చాన్‌జీతో షౌకత్‌అలీని లోపలికి తీసుకురమ్మన్నాను. షౌకత్‌అలీ వచ్చి నాచేతిని ముద్దుపెట్టుకున్నాడు. ముద్దుపెట్టుకొని షౌకత్‌అలీ అక్కడ ఒక కుర్చీలో కూర్చున్నాడు. వెంటనే అది విరిగిపోయింది. అందులోనుంచి అతనిని లేవదీయటం చాలా కష్టమైనది.

"పంచసద్గురువులు ఒకేరకమైన పరమాత్మానుభవం పొందినవారు. అయితే విధానాలు వేరు. నాగుణాలు నాఅలవాట్లు, నావిధానాలు, పంచసద్గురువులు కలిస్తే అలాగే వుంటాయి. ఎలాగు? సాయిబాబాకు అతని జీవితంలో ఎక్కువమంది భక్తులుండేవారుకాదు. గుస్తాద్‌జీ సాయిబాబా జీవితపర్యంతము అతనితోనే వున్నాడు. అతనికి అన్నిసంగతులు తెలుసును. సాయి ఆశ్రమంగురించి అంతా తెలుసును. ఇప్పుడు సాయిబాబా చిత్రం లేని ఇల్లులేదు. మందిరం లేదు. సాయిబాబా బయటికి పోగ పీల్చుతూ దగ్గుతూ వున్నట్లు కనిపించేవాడు. ఎప్పుడూ డబ్బు అడిగి తీసికొనే వాడు. ప్రజలు దర్శించటానికి వచ్చినపుడు ఆధ్యాత్మిక ప్రసంగాలు చేసేవాడుకాదు. విభూతి యిచ్చేవాడు. డబ్బు అడిగేవాడు. అతనితో ఉన్నవారికి సాయంకాలం వారి జీతాలు యిచ్చేవాడు. అందరికంటే ఎక్కువగా బడే బాబాకి ముట్టేవి. సాయిబాబాకు

అయిదుసార్లు హారతి యిచ్చేవారు. ఒక రాత్రి మసీదులోను ఒక రాత్రి చావడిలోను పరుండేవాడు. ఆ మసీదునే ద్వారకామాయి అనేవారు. ఇప్పుడు ఎక్కడ చూచినా సాయిమందిరాలున్నాయి.

"ఉపాసనీ మహరాజ్ సాకోరీలో చిన్న ఆలయంలో వుండేవాడు. చాల సంవత్సరాలు అతడు భోజనం చేయలేదు. అతడు గోనెగుడ్డ పరచుకొని దానిమీద కూర్చుండేవాడు. తేళ్లు దానిక్రిందకు చేరేవి. ఆగది ఎంతో మురికిగా వుండేది. మామూలు చైతన్యస్థితికి వచ్చినతరువాత అతడు భక్తులను కర్రతో కొట్టేవాడు. వారు పారిపోయేవారు. ఉపాసనీమహరాజ్ ఎవరినీ ఏమీ అడిగేవాడు కాదు. సాకోరీలో చిన్నమందిరంగా వుండే అతని ఆశ్రమం క్రమంగా ఉపాసనీనగర్‌గా తయారైంది. మొదట్లో ఉపాసనీమహరాజ్ పాకీవాళ్ల యిళ్లవద్ద మురికిస్థలంలో కూర్చుండేవాడు. తరువాత ఆశ్రమం బాగా విస్తరించింది. అక్కడ హిందూ వాతావరణం ఉండేది. నేను ఉపాసనీమహరాజ్ వద్దకు సాకోరీవెళ్లినపుడు దుర్గామాయి అతనిని గాఢంగా ప్రేమించి సేవించేది. ఒకరోజున మహరాజ్ అందరితోను 'నాధనం అంతా మేర్వాన్‌కి యిచ్చేశాను. నా తాళంచెవి అతనికిచ్చేశాను. నాదగ్గర ఏమీలేదిప్పుడు. నేను ఒక ఖాళీపెట్టెను. మేర్వాన్‌నే అనుసరించండి' అన్నాడు. అతడు చెప్పిన మాటలకు హిందువులు హర్షించలేదు. నేను సద్గురువులద్వారా మాట్లాడతాను. ఒకసారి ఉపాసనీ మహరాజ్ నేను ఒకగదిలో వుండగా హఠాత్తుగా చేతులు జోడిస్తూ "మేర్వాన్, అవతారపురుషుడు" అన్నాడు. వాతావరణం మారిపోయింది. దుర్గామాయి వేరే వెళ్లిపోయింది ఉపాసనీ నిర్యాణానికి ముందు నేను మహరాజ్‌ని 'దహిగాం(వ' అనే గ్రామంలో మరల కలిశాను.

"బాబాజాన్ చక్రవర్తి: 125 సంవత్సరాలు పైబడిన వయస్సు. ఒక వేపచెట్టుక్రింద కూర్చుండేది. పైన కప్పు వుండేదికాదు. ఎండకు వానకు అక్కడే వుండేది. ఆమె నానుదుట ముద్దుపెట్టిన కారణంగా నేను పరబ్రహ్మనని తెలిసికొన్నాను.

"సాయిబాబా డబ్బును అడిగి తీసికొనేవాడు.
ఉపాసనీమహరాజ్ ఇచ్చినపుడే డబ్బు తీసికొనేవాడు.
బాబాజాన్ ఎన్నడు డబ్బు తీసికొనేదికాదు.
నారాయణమహరాజ్ పరోక్షంగా డబ్బు కావాలని అడిగేవాడు.

నాకు అందరి సద్గురువుల గుణాలు వున్నాయి. పూజించేటందుకు కులభేదాలు వుండేవికావు. నారాయణమహరాజ్ పొట్టివాడు. అతడు వ్రేళ్లకు వజ్రపుటుంగరాలను ధరించేవాడు. ప్రకాశమానంగా మెరిసిపోతూ వుండే పొడవైన సిల్కుకోటు ధరించేవాడు. తిన్నగా డబ్బు కావాలని అడిగేవాడు కాదు. దొంకతిరుగుడుగా పరోక్షంగా అడిగేవాడు. ఎవరూ నిరాకరించేవారుకాదు. నారాయణమహరాజ్ వద్ద పూజాదికములన్నియూ హిందూపద్ధతిలో వుండేవి. ఇతరులకు వంటలు వేరే చేయించే వాడు. అతనికి ఆశ్రమం అంటూ వుండేదికాదు. సాఈబాబాకు మహరాజ్‌కు ఆశ్రమా లుండేవి. బాబాజాన్‌కి ఆవేపచెట్టే ఆమెకు ఆశ్రమం. నారాయణ మహరాజ్ ఒక హిందువుల పేటలో వుండేవాడు. తాజుద్దీన్‌బాబాకు డబ్బు అడిగే అలవాటు వుండేది కాదు. అన్ని మతాలవారు ఆయనను దరిచేరేవారు. ఈ అయిదుగురు సద్గురువుల వల్లనే నేను వచ్చాను. నాకు అందరి సద్గురువుల గుణాలు వున్నాయి.

''మొదట నేను పూనాలో ఒక చిన్నకుటీరంలో వుండేవాడను. అది నగరానికి బయట వుండేది. తరువాత 40 మంది శిష్యులతో కాలినడకను బొంబాయి వెళ్లాము. నావద్ద డబ్బులేకపోతే రుస్తుమ్‌ను అడిగితీసికున్నాను. రుస్తుం ఆదీ సోదరుడు. రుస్తుం నాకు డబ్బు ఇవ్వడం మంచిపనిచేశాడు. అందరము కాలినడకను వెళ్లాము. బొంబాయిలో దాదర్ అనేచోట 'మంజిల్-ఈ-మీమ్' అనే భవనంలో మకాం చేశాం. అందరికీ మసాజీ (మా మామగారు) మంచినేతితో వంటచేశేవాడు. అప్పుడు నేను చాలా సన్నంగా వుండేవాడను. మండలికి ఆహారం బాగా యివ్వబడేది. వారు వడ్డించినదంతా తినవలసినదే, తరువాత వాంతులు వచ్చినాసరే. ఒకసారి ఉల్లాసం గాను, ఒకసారి కోపంగాను, ఒకసారి ఆలింగనం చేసికొనేవాడను. ఒకసారి వారిని కొట్టేవాడను. ఇవ్విధంగా నావైఖరులు మారిపోతూ వుండేవి. ఒకసారి మండలితో నన్ను కదిలించమన్నాను. అందరూ కలిసి ఒక్కుమ్మడిగా త్రోశారు. కాని ఒక్క అంగుళమైనా కదల్చలేకపోయారు. అప్పుడు నావిదూషకుడు డాక్టర్ అబ్దుల్‌ఘనీ వుండేవాడు. అతడన్నాడు ''మాకు ఎక్కువ భాగ్యవంతమైన భోజనం వద్దు. సాధారణమైనదిచాలు. ఇలా రోజులు గడిచిపోయాయి. చేతిలో డబ్బు అయిపోయింది. మున్షీసాహేబ్ అని ఒకడుండేవాడు. అతడు బాబాను చాల ప్రేమించేవాడు. అతడు మంజిల్-ఈ-మీమ్‌కి తరచు వస్తూవుండేవాడు. మున్షీ సాహేబ్‌కి ఒక కల వచ్చిందట. ఆకలలో బాబా తనను ఏదో చేయమని ఆజ్ఞాపించినట్లు, దానిని తాను చేయడం మరచిపోయినట్లు కలవచ్చింది అని మున్షీ సాహేబ్ చెప్పాడు. దానిని

నేను చెపుతాను ఏమంది. నేను డబ్బు కావాలన్నాను. అప్పుడు మున్సీ సాహెబ్ డబ్బుతీసుకువచ్చాడు. అదికూడా పూర్తిగా ఖర్చయిపోయింది. తరువాత బాబా అక్కడనుండి మండలితో బయలుదేరి నడిచి మెహెరాబాద్‌కి వెళ్ళాడు. ఒకచెట్టుక్రింద కూర్చున్నారు. భక్తులు అక్కడ ఆశ్రమం నెలకొల్పారు. తమంతతాము డబ్బు యిచ్చారు. డబ్బుబాగా వచ్చింది. తరువాత మెహెరాబాద్‌లో ఆశ్రమం పెద్దదిగా పెరిగింది. కుష్ఠురోగుల ఆశ్రమం, పాఠశాల, ఆస్పత్రి వగైరా అన్నీ వచ్చాయి. చపాతీలు తయారుచేయటానికి నేను పిండివిసరేవాడను. ప్రేమాశ్రమంలో హరిజన బాలురకు స్నానంచేయించేవాడను. వారి ఒడలు తోమేవాడను. వారి మరుగుదొడ్లు శుభ్రపరిచేవాడను. కులభేదాలుండేవికావు. చేతిలో డబ్బు అయిపోగానే ఆశ్రమాలు, ఆస్పత్రులు, పాఠశాలలు అన్నీ ఎత్తివేశాను. బాబా ఎప్పుడూ కొత్తదేదీ స్థాపించలేదు. డబ్బు మళ్ళీవచ్చింది. మెహెరాబాద్‌కి 40 మైళ్ళదూరంలోనున్న 'టోకా' అనే గ్రామానికివెళ్ళి అక్కడ కొత్త ఆశ్రమం నెలకొల్పాను. మళ్ళీ ఆరునెలల్లో దానిని ఎత్తివేసి మెహెరాబాద్ తిరిగి వచ్చాను. తరువాత పాశ్చాత్యదేశాలకు వెళ్ళాను. ప్రపంచం అంతా తిరిగాను. బాబా ప్రేమికులు అన్నిదేశాలలో నున్నవారు డబ్బు యిచ్చారు. అమెరికాలో 500 ఎకరముల భూమిలో భవనాలతోసహా ప్రత్యేకించి నాకోసం కొన్ని కట్టించారు. నాపేరుతో ఆశ్రమం ఏర్పడింది.

''మెహెరాబాద్‌లో, పింపల్‌గాంవ్‌లో, బెంగుళూరులో, బైరమంగళంలో అన్నిచోట్లా భూములు నాపేరుతో వచ్చాయి.

''ఒకనాడు సన్నిహితులందరిని సమావేశపరచి నాపేరుతో ఏదీ వుండటానికి వీలులేదని, ఇండియాలోనున్న భూములన్నీ నారిమన్‌కీ, మెహెర్‌జీకి బదిలీ చేశాను. అమెరికాలో భూములు భగవత్ప్రేమికులకు అంకితం అయినాయి. నేను భిక్షార్థినై ఉత్తరహిందూస్థాన్‌కి వెళ్ళాను. 'అదే నవ్యజీవితం'

''సృష్టి ప్రారంభంనుండి మాయ మనమెడకు చుట్టుకుంది. దీనికోసం నేను మళ్ళీ మళ్ళీ రావలసివస్తోంది. నామండలి అందరు వచ్చేశారు. నూతన జీవితం తరువాత ప్రతినెల రు 10,000 ఖర్చు అయేది. ఇదంతా విష్ణుమాస్టర్ చూచుకొనేవాడు.

"ఈమధ్య్య నతారాలో నేను ఏకాంతవాసం గడిపాను. ఇంతకుపూర్వమే విష్ణు బాబాను, మండలికి డబ్బుకావాలని అడిగాడు. చింతించకు, నా ఏకాంతవాసం ప్రారంభదశలో పూర్తిచేస్తానన్నాను. ఏకాంతవాసం ముగిసిన తరువాత విష్ణు మరల నాకు గుర్తుజేశాడు. నేనొక పెద్దప్రణాళిక వేస్తున్నాను. ఒకసంవత్సరంపాటు ఎక్కడికో వెళుతున్నానన్నాను. దానికి పూర్వం ఒక్కొక్కబృందంలో 150 మంది చొప్పున 4 బృందాలుగా నాల్గువారాలపాటు నాప్రేమికులకు సహవాస్ యిస్తానన్నాను. దీనికంతకు విష్ణు డబ్బు కావాలన్నాడు. రెండుసు సహవాస్ ఏర్పాట్లు చేయమన్నాను. మొత్తం రు 30,000 లు ఖర్చు అవుతుందని అంచనా వేశారు. నేను 20 మందిని ఎన్నుకొని, ఒక్కొక్కరిని రు 1500 లు విరాళం యివ్వమని వ్రాశాను. సగంమంది వెంటనే పంపించారు. మిగిలినవారు వీలయినంతవరకు పంపించారు. కొందరు అసలు పంపించలేకపోయారు. కొందరు ఇంకా కావలసినచో పంపుతామన్నారు. ఇంకొక పది ఉత్తరాలు వ్రాయించాను. ఆంధ్రనుండి డాక్టరు కనకదండి సూర్యనారాయణ, కుటుంబశాస్త్రి రు 15,000 పంపుతామని టెలిగ్రాము పంపారు. ఈలోపుగా వచ్చిన డబ్బుతో కలిపి వచ్చిన మొత్తం పాతికవేలు అయినది. డాక్టరు కనకదండి రు 5000/- యిస్తే సహవాస్‌కు సరిపోతుందని బాబా అన్నారు. మిగిలినది పంపుతానంటే బేషరతుగా పంపమన్నారు. సరేనని డాక్టరు టెలిగ్రాంద్వారా జవాబిచ్చాడు. విష్ణుకి బాబా 10,000 రు.లు ఇచ్చారు. రెండుసు ఇంకొక 10,000 రు లు బీదల కార్యక్రమానికి ఇమ్మన్నారు. రెండు 150 అనుకొన్న సంఖ్య ప్రతి బృందంలోను చాల ఎక్కువయిందని అన్నాడు. అందుచేత అధమపక్షం రు 2000 లు బీదలకు పంచిపెట్టడానికి వారానికి వేయి రూపాయిలు కావాలి. మిగిలిన రు 2000 లుకి ఒకవేయి బొంబాయినుండి వచ్చింది. ఇంకొకవేయి ఆంధ్రనుంచి వచ్చింది. మొత్తం రు 4,000 లు బీదల కోసం సరిపోతుంది. మూడువారములయినది రు 3,000 లు ఖర్చు అయినది. ఈ వారంలో 30 వ తేదీన బీదల కార్యక్రమం ఏర్పాటు చేశాను. ఈకార్యక్రమంలో బాబా 250 మంది బీదలకు ఒక్కొక్కరి పాదములు కడిగి, వారి పాదములకు ప్రణమిల్లి ఒక్కొక్కరికి రు 4 లు చొప్పున పంచిపెడతాను. డిశెంబరు 1955 కి, జనవరి 1956 నకు ఈ రెండుమానములకు తరువాత ఫిబ్రవరి 15 నుండి సంవత్సరానికి డబ్బు కావలెనన్నాడు విష్ణు. 'విచారించకు' అని ధైర్యం చెప్పాను.

"డాన్‌స్టీవెన్సు అమెరికానుంచి మొదటి వారం గుజరాతీ బృందం సహవాస్‌కి వచ్చాడు. అతనికి బాబా ఈ సంగతులన్నీ చెప్పి అమెరికా ప్రేమికుల వద్దనుంచి డబ్బు అడిగి పంపించమని చెప్పారు. అతడు సరేనని చెప్పి అమెరికా వెళ్లాడు.

"మొదటి వారంలో గుజరాతీ బృందం కొంతసొమ్ము సేకరించి పంపుతామన్నారు. దక్షిణ ఇండియా బృందం రెండవ వారంలో వచ్చారు. వారు తెలివైనవారు, డబ్బుకలవారు. వారు కూడా పంపుతామని వాగ్దానం చేశారు.

"కాకా బారియాకి సొమ్ము పంపించాలి గనుక, ప్రేమికులకు అతని చిరునామా పంపించమని చెప్పాను.

"ప్రేమించేటందుకు యోగ్యుడను నేను ఒక్కడినే. నేను మీకు నా దివ్యాధికారంతో చెపుతున్నాను. మీరు యీ దేహం చాలించే ఘడియలోనైనా నన్ను స్మరించండి. నానామం ఉచ్చరించండి. మీరు నాపద్దకు వస్తారు.

"రు 30,000 లు వసూలు చేసిన సొమ్మునకు ప్రతి సహవాసికి జమాఖర్చులు పంపుతాను. మిగిలినసొమ్ము డాక్టర్ కనకదండికి పంపించాలి. ఈ రోజున ఢిల్లీనుంచి రు· 1500 లు వచ్చింది.

"గుజరాతీబృందం వచ్చినపుడు (ఈ నెల మొదటివారంలో) చాలా చలిగా వుంది. రెండవ వారంలో ఎక్కువ చలిగావుంది. మూడవవారం అంత చలిలేదు, కాని వేడిగా మాత్రంలేదు: ఇప్పుడు వేడిగా కూడా వుంది. మీలోని ప్రేమజ్వాల మీకు బయటకి చెమట వచ్చేటట్లు చేస్తుంది" అన్నారు బాబా.

మ॥ 3-40 గం॥వరకు బాబా ప్రేమికులవైపు పండ్లు విసరుతూ (రువ్వుతూ) కాలక్షేపం చేశారు.

మ॥ 3-40 గంటలకు 'టీ' తీసికొన్న తరువాత మరల సమావేశమైనారు.

మిల్లులో పనిచేసే ముగ్గురు ప్రేమికులు పూనానుండి సైకిళ్లమీద వచ్చి బాబాను దర్శించారు.

బాబాకు ఇంగ్లాండులో జరిగినది ఒక సంఘటను గుర్తుకువచ్చి బాబా ఇలా చెప్పారు :

"అప్పుడు చలి మిక్కుటంగా వుంది. చాన్‌జీ, కాకా వగైరా నాతో వున్నారు. అక్కడివారందరు ఉన్నిదుస్తులు ధరింవారు. నేను అవతారుడను కదా! నాకు చలివేయదని వారు అనుకున్నారు. బాబా ఫిలిం తీసేటందుకు ఏర్పాట్లుచేశారు. భారతీయ దుస్తులు ధరించి ఫిలిం తీయడానికి నన్ను రమ్మన్నారు. అలాగే సాద్రా ధరించి వెళ్లాను. ఫిలింకోసం నవ్వుముఖం పెట్టవలసివచ్చింది. లోపల నాకు చలి, ఎముకలు కొరికేస్తోంది. అయినా, నవ్వుతునే వున్నాను. కొందరు గుసగుసలాడుతున్నారు. నాకు వినపడుతునేవుంది. "ఆయన నిజంగా అవతారుడే. ఇంత చలిగావున్ననూ ఉన్నిదుస్తులు వేసుకోలేదు. పైగా నవ్వుతున్నాడు" అని అనుకుంటున్నారు.

"మీరు సహవాసకు వచ్చిన సంగతి మరచిపోవద్దు. నేను అన్ని చైతన్య భూమికలలోను ఉన్నాను. ప్రతిస్థాయిలోను ఉన్నాను. మానవుడు భగవదైక్యం పొంది నపుడు అతడు శాశ్వత అనంత ఆనందంలో వుంటాడు. అతనిని ఏదీ ఏమీ చేయలేదు. మామూలు ఈ స్థూలచైతన్యానికి వచ్చినపుడు అతనికి జలుబు, దగ్గు మరేదైనా రావచ్చును. సాఈబాబా తన దేహం చాలించేముందు 40 రోజులు టైఫాయిడ్ జ్వరంతో బాధపడ్డాడు.

"ఇంగ్లాండులో నేను పైనచెప్పిన ఆ సంఘటన జరిగి కొన్ని సంవత్సరాలు గడిచాయి. బాబా అందరికంటే గొప్పవాడని ఆ విషయం అర్థంచేసుకోమని చెప్పారు. బాబా అక్షరఫలకం మీద చెప్పి వ్రాయించిన 'గాడ్‌స్పీక్స్' గ్రంథం గొప్ప గొప్ప వేదాంతులు చదివారు, సమీక్షచేశారు. ఈరచ్ పుస్తకానికి ఒకరూపం ఇచ్చాడు. వ్రాసినది సరిగా వున్నదా ? లేదా ? అని పరిశీలించడానికి అనేక రాత్రులు నిద్ర లేకుండా గడిపాడు. డాన్‌స్టీవెన్స్ అచ్చువేయించి కొన్నిప్రతులు తనవెంట తీసుకొని వచ్చాడు. ఇంత పుస్తకం ఎలా చెప్పి వ్రాయించగలిగారు అని ఆశ్చర్యపోతున్నారు అమెరికాలో. బాబా అక్షరాలఫలకం ఉపయోగిస్తూ మాటలు చెప్పించే ప్రక్రియ టెలివిజన్‌లో అమెరికన్ ప్రజలకు చూపించాలని అందుకు ఒక ఫిలిం కూడా తీయాలని అనుకుంటున్నారు. 'టెలివిజన్ కార్పొరేషన్ ఆఫ్ అమెరికా' వారు ఏర్పాట్లు చేస్తున్నారు. ఆయనను అందుకోసం అక్షరఫలకం ఉపయోగించమని డాన్‌స్టీవెన్స్ అడిగాడు. డాన్‌స్టీవెన్స్ ఫిలిం తీయడానికి అంగీకరించమని బాబాను ప్రార్థించాడు.

బాబా అన్నారు "నేను 1954, అక్టోబరు 7 వ తేదీని యీ అక్షరఫలకం పరిత్యజించి, యింక దానిని ఉపయోగించనని చెప్పాను. నేను ఎన్నడూ వాగ్దానభంగం చేయను" అన్నారు.

అయినా బాబా ఈసారికి ప్రత్యేకించి అంగీకరించారు. ఇందుకోసం నవంబరు 6, 1955 తేదీని బొంబాయినుండి కెమేరామేన్ (సినీఫొటోగ్రాఫర్) వచ్చాడు. మెహెర్‌జీ యీయేర్పాట్లన్నీ నిర్వహించాడు. బాబా అక్షరఫలకం చేత ధరించి ఇలా చెప్పి వ్రాయించారు.

"గత 12 మాసాలుగా నేను ఈ అక్షరఫలకాన్ని పరిత్యజించాను. ఇది ఇంక మళ్లీ ఉపయోగించను" అన్నారు.

డాన్‌స్టీవెన్స్ చాలా సంతోషించాడు. అతడు తనతో అక్షరఫలకాన్ని అమెరికాకు తీసుకువెళ్లాడు. బాబా మళ్లీ ఇలా చెప్పారు.

"భగవంతుని అస్తిత్వస్థితిలో భగవంతునికి హఠాత్తుగా ఒక సంకల్పం కలిగింది. ఈ అస్తిత్వస్థితి ఒక అలలులేని మహాసముద్రం. అయితే భగవంతుని సంకల్పం వలన 1) చలనం 2) అలలు 3) నురుగు కలిగాయి. అలాగే చైతన్యం కలిగింది. ఆ ప్రశ్నకు 'నేను భగవంతుడను' అనే జవాబు వచ్చింది. ఇది ఒక నిరంతరక్రమం. ఒక మహాసాగరం అపరిమితంగా వుంది. ఈ హాలును సముద్రం అనుకోండి. అందులో ప్రతియొకరు సముద్రంలోని బిందువు. ఒక బుడగ వ్యక్తిగతమైన ఆకారం. అది తననే చూస్తుంది. దానిపరిసరాలను చూస్తుంది. భగవంతుడు అనంతమైన సత్యం. విశ్వము అనంతమైన మాయ. మానవుని శిరస్సును ఉదాహరణగా తీసికో. దానికి ఒక మెదడు వుంది. ఒక వ్యక్తిగతమైన తల వుంది. దానికి అసంఖ్యాకమైన కేశములున్నాయి. తలను గురించి మనం మాట్లాడుతూవుంటే, కేశములు తలనుండి రాలిపోయినా తల మిగులుతుంది. వ్యక్తిగతమైన మనస్సులో వ్యక్తిగతమైన ఆలోచనలు కలుగుతాయి. ఆమనస్సును శిరస్సుతో పోల్చవచ్చును. మనస్సు చాలా విలువైనది: కాని భగవంతుడు అనంతమైన విలువకలవాడు. సృష్టితో పోల్చిచూస్తే ఈ సృష్టిని శిరోజములతో పోల్చవచ్చును.

''బాబా ఈ బృందమునుంచి అయిదుగురిని ఎన్నుకుంటారు. ఆ అయిదుగురు బాబా నామ జపంచేస్తూ వారంరోజులు నిద్రాహారాలు లేకుండా వుండాలి. 15 ఫిబ్రవరి 1956 నుండి ప్రారంభించాలి. పాశ్చాత్యదేశములలో ఉపవసించడానికి నేనుంటానంటే నేనుంటాను అని పోటీపడతారు. బాబా అందరిని 'నామజపం' చేయమని చెపుతారు. అది అలవాటైతే శ్వాసతో సమానంగా జపించడం జరుగుతుంది. నిద్రలో కూడా నామజపం జరుగుతుంది. అంతట బాబాయొక్క స్వస్వరూపం కనిపించే అవకాశం వుంది. ఆలోచనల గురించి విచారించకండి.

నా నామజపం జరుగుతూవున్నప్పుడు ఆలోచనలను అరికట్టాలని ప్రయత్నించకండి. మంచివైనా చెడ్డవైనా దోమలు కుట్టితే మలేరియావస్తుంది. తెరవేసుకొంటే. అవి లోపలకురావు. బయట తిరిగినా అపకారం చేయలేవు. నా నామజపం చేస్తూ వుంటే ఆలోచనలు వచ్చినా అవి బంధనము కలిగించవు. తరువాత అందులో నిన్ను నీవు మరచిపోతావు. నీవు ఇది చేయలేకపోతే, నీ అవసానకాలంలో నానామం జపించడము అనేది మరచిపోవద్దు. కాని నీ ఆఖరిక్షణంలో ఎలా నానామాన్ని ఉచ్చరిస్తావు ? ఇప్పటినుండి నానామం జపించకపోతే నీ ఆఖరిక్షణంలో ఎలా ఉచ్చరించగలవు ?

## 29 నవంబరు, 1955 :

ఈ రోజు సహవాస్‌కి బాబా ఉదయాన్నే వచ్చి ప్రసంగం ప్రారంభిస్తూ బాబా వాతావరణం అనుసరించమని విమ్‌కర్‌ను ఎదురుగా పెట్టుకొని ప్రతివారికి ఇలా చెప్పారు.

''బాబా గంభీరంగా వుంటే నీవు కూడా అలాగే వుండాలి. బాబా నవ్వుతూ వుంటే నీవు కూడా నవ్వుతూ వుండాలి. బాబా తమాషాగా మాట్లాడుతూవుంటే నీవు కూడా అలాగేవుండాలి. సహవాస్‌కి వచ్చినవారు ఉపవాసాలు మాత్రమే పాటించనక్కరలేదు. మీరు ఇంటికి వెళ్లి మామూలు పద్ధతినే అవలంబించండి. కావలసినదేమిటంటే — మీ పొట్టనింపుకుని మనస్సు ఉపవాసం చేసేటట్లు చూడండి.

''నన్ను మీరు ప్రేమించలేకపోతే, మీరు ఇతరులకు నిస్వార్థంగా సేవలు చేయండి. నేను అందరిలోనూ వున్నాను. వారిని సేవించడమంటే బాబాను సేవించినట్లే.

"నిస్వార్థసేవ — నిస్వార్థం అనేమాట ఇప్పుడు మామూలు మాట అయిపోయింది. సబ్నవీస్‌నకు పిల్లలున్నారనుకోండి. సబ్నవీస్ ప్రేమాశ్రమం రోజులలో కాపలాదారుగా వుండేవాడు. రాత్రులందు మేల్కొని వుండేవాడు. మండలి మెలకువగా నున్నపుడు పగలు నిద్రించేవాడు. సబ్నవీస్ తన పిల్లలక్షేమం చూచుకుంటాడు. అతడు బయటికి పోయినపుడు ఇతరుల పిల్లలు అన్నం లేకుండా, బట్టలు లేకుండా వుండటం చూచేవాడు. తనపిల్లల యెడల ఉన్న అపేక్ష, ప్రేమ, ఇతరుల పిల్లల యెడల కూడా చూపగలిగితే — అది నిస్వార్థసేవ. అందులో 'నా' అనెడి ఆలోచన రాకూడదు. దానిని అధిగమించుట కష్టం పరులకు ఏదైనా సేవచేయడానికి నీ శక్తి వంతంగా ప్రయత్నించు. అది నన్ను సేవించినట్లే.

"మనం అలవాటుకొలది కొన్ని ప్రత్యేకమైన వేళలలోనే భోజనం చేస్తాం. మనం ఉపవాసం చేదామని నిశ్చయించుకొంటే, మనలను మభ్యపెట్టి గడియారం వైపు తరచుగా చూచేటట్లు చేస్తుంది మన మనస్సు. అది దాని స్వభావం. అందుచేత ఉపవాసం చేయడం వలన ఎక్కువ బంధనులు యేర్పడతాయి.

"అయిదుగురిని నీరు మాత్రమే త్రాగుతూ వారం రోజులు ఉపవాసం చేసేవారిని నేను ఎన్నుకుంటాను. వారు నిద్రపోకూడదు. పరుండకూడదు. వారు నిరంతరంగా బాబా నామం జపిస్తూ వుండాలి. బాబాచే ఎన్నుకొనబడినవారు —

సబ్నవీస్
చక్రపాణి
మోతీభట్
మోతీలాల్ కృపాల్
మూలే.

నేను పూజింపబడుతున్నాను, అదే సమయంలో పూజిస్తున్నాను కూడా. రెండునూ ఒకటే. కొన్ని సమయాలలో నేను పూజిస్తాను. కొన్ని సమయాలలో నేను పూజింపబడతాను. ఇది ఒకే సమయంలో కాదు. ఒక్కొక్కప్పుడు రెండూ ఒకే సమయంలో జరుగుతాయి.

"అరంగావ్‌లో ప్రజలు నిరుపేదలు కాని, వారు బాబాను ప్రేమిస్తారు. వారిలో చాలమంది బాబా మొదట అక్కడికి వచ్చినప్పుడు పిల్లలుగా వుండేవారు. ఇప్పుడు పెరిగి పెద్దవారైనారు.

బాబా పెండుని నాలుగు బీదల కార్యక్రమాలు పెట్టమన్నపుడు తడవకు 250 మందిని పిలవమన్నారు, అరంగావ్‌నుండి. మూడుసార్లు బీదల కార్యక్రమం జరిగింది. రేపటిది ఆఖరిది, నాల్గవది అవుతుంది.

మూడవవారంలో రెండవరోజున బాబా అరంగాంవ్ వెళ్లారు. ప్రజలు బాబాను తండోపతండాలుగా వచ్చి పూజించారు, వారు బాబాను ప్రేమిస్తున్నారు గనుక. ఈసారి వారు బాబాను ఒక రథంపై కూర్చుండజేసి ఊరేగిస్తారు అని విన్నాను. ఆరథం పురుషులే లాగుతారట. బాబా అంగీకరించలేదు. రేపు మీరందరు పందిరివద్ద ఉండాలి, బాబా పేశవారితో కార్యక్రమం జరుపుతూవుంటే చూడటానికి. ఆసమయంలో భగవన్నామం ఉచ్చరించండి. అప్పుడు బాబా, బీదలలోకెల్ల బీదవాడై వారికోసం పనిచేస్తారు. అందుచేత బాబా నామం ఉచ్చరించవలదు'' అని బాబా చెప్పారు.

కొంతసేపు అందరు విశ్రాంతి గొన్న తరువాత గం॥ 9-30 లకు సహవాస్ ప్రారంభించబడినది.

బాబా, తాను ప్రతిచోట ఉన్నాననెడి అనుభవం పొందుచున్నానని అన్నారు. అంబికాచరణ్ ఈసహవాస్‌లో అనేకచోట్ల కూర్చున్నాడు. ఇది చూచి, బాబా, అంబికాచరణ్ అన్నిచోట్ల ఉన్నాడని ఛలోక్తిగా అన్నారు.

తదనంతరం కొన్నినిమిషాలు భజన జరిగింది. బాబా ఇలాగు ప్రసంగించారు

''బాబా 15 ఫిబ్రవరి 1956 నుండి ఎక్కడికో వెళతారు. కారణం బాబాకే బాగుగా తెలియాలి. బాబా వెంట నలుగురైదుగురు మండలిని వెంటతీసికొని వెళ్ల వచ్చును. బాబా దర్శనములు వగైరా యివ్వరు. ఆయన ఏకాంతంగా వుంటారు. బాబాతోగాని, ఈరచ్‌తోగాని ఎవ్వరూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుప కూడదు. ఆదీతో మాత్రమే అట్టివి జరుపవలెను. బాబా నుండి లభించే ప్రేమ అనే కానుక, మిక్కిలి అరుదుగా లభించు కానుక. దానిని స్వీకరించడము కూడా అరుదుగానే లభిస్తుంది. నాకు ఒక మేకాదివాటు విధేయులైవుంటే మీరు ఆ ప్రేమను స్వీకరించడానికి మీకు సమర్థత కలుగుతుంది. ఇది వినడానికి చాలా సులభంగా వుంటుంది. కాని అనుస రించుట చాల కష్టం. ఇలాగే ఇదివరకు మూడు బృందములకు చెప్పాను.

"ఒక సంవత్సరంపాటు బాబా వెళ్లినపుడు బాబా ప్రేమికులు ప్రతిరాత్రి సరిగా అర్థరాత్రివేళ బాబానామం, మొదటిరాత్రి 14 సార్లు, రెండవరోజు రాత్రి 28 సార్లు మరల మూడవనాడు రాత్రి 14 సార్లు, నాల్గవరాత్రి 28 సార్లు ఈ విధంగా బాబా నామం ఉచ్చరించాలి. ఏరాత్రీ, ఎట్టి పరిస్థితులలోను ఇదిమాత్రం మానవలదు. ఎక్కువ వలదు, తక్కువ వలదు. పగటివేళ ఇతర వేళలందు బాబా నామం ఒకసారైనా ఉచ్చరించవలదు. అలాగే ఆ సంవత్సరమంతా చేయాలి. అప్రమత్తులై వుండండి. ఎవరు ప్రేమ కానుకను స్వీకరించ సాహసిస్తారో చూదాం. బాబా అభీష్టం ప్రకారం చేయడము అసాధ్యం. కాని ఎవరు సాహసించి చేయగలరో బాబా చూస్తారు. బాబా యొక్క కోరిక ప్రకారం, బాబా అభీష్టానుసారం నిజంగా ఎవరు వర్తించగలరో?" అని అన్నారు బాబా.

బాబా స్త్రీలకు సహవాస్ ఏర్పాటుచేస్తానని చెప్పలేము. సమయం వుంటే బాబా తేదీలు చెపుతారు. ఈ సహవాస్‌కు వచ్చినవారు సరాసరి వారి ఇండ్లకు వెళ్లిపోవాలి.

బాబా పనిచేయుట అంటే ఏమిటి?

బాబాయొక్క ప్రేమను గురించి చెప్పడము. బాబా కార్యం నిమిత్తం వెళ్లేముందు వారు, తమ హృదయాలను పరిశుద్ధం చేసికోవాలి. లేనిచో, వారు వంచనచేసినవారౌతారు. బాబా ప్రేమసందేశం ఏమిటంటే —

"మీ జీవితమే ఇతరులకు ప్రేమసందేశం కావాలి"

తరువాత 10-20 గం॥ నుండి 10-50 వరకు భజన, సంకీర్తన జరిగింది.

భోజనాలనంతరం బాబా 12-20 గంటలకే సహవాసులను సమావేశపరచారు. హాలులోపలకు అందరిని రమ్మన్నారు. హాలుపొడవునా మధ్యలో దారి వదలి కూర్చున్నారు. విభూతి మహరాజ్, గణేశ్‌లాల్ చౌరాసియా ఆమార్గంలో మధ్యగా ఎదురెదురుగా నిలుచున్నారు. వీరు వలంటీర్లు కావచ్చును. బాబా ఇలా చెప్పారు;

"అన్వేషకులలో మూడురకాలున్నారు. మొదటి రకం అన్వేషకులు "నేను భగవంతుని నాలో చూడాలి" అంటారు. వీరు కష్టములలోనైనా తమ కోరిక నెరవేర్చుకొనడానికి కృషిచేస్తారు. వారికి సాహసం లేదు. అందుచేత జన్మజన్మాలకు వారు అన్వేషకులుగా కృషిచేస్తూనే వుంటారు.

“రెండవరకం అన్వేషకులకు గురువు అవసరంలేదు. వారు తమంతట తామే భగవంతుని కనుగొనవలెనని అన్వేషణ సాగిస్తారు.

“మూడవరకం అన్వేషకులకు భగవంతుడు వారిలో నున్నాడని తెలుసును. వారు కళ్లకు గంతలు కట్టుకొని, అనగా గ్రుడ్డిగా గురువు చెప్పినట్లుగా అనుసరిస్తారు. హాలులోమధ్యనున్న ఖాళీమార్గముభగవంతునిలోని అనంతత్వాము. దాని అంత్యము చాల దూరముననుంది. సాధకుడు ఒకవైపునుంచి ఇంకొక వైపునకు దాటవలెనని చూస్తాడు. దాటుటకు ధైర్యసాహసములు లేవు. అందుచేత గట్టుమీదనే నడుస్తూ వుంటాడు. ఇది అక్షరాలా నిజం.

రెండవరకం అన్వేషకునకు సాహసం వుంది. అతడు నీటిలో దూకవలెనని దూకుతాడు. కాని అనేక కష్టాలు వానిని కృంగదీస్తాయి.

మూడవరకం అన్వేషకునకు సాహసంవుంది కాని అతనిలో అతనికే నమ్మకం లేదు. కాని అతడు గురువు చెప్పినప్రకారం కళ్లు మూసుకొని అనుసరించి ఒక్కక్షణంలో ఏరుదాటేస్తాడు.” అన్నారు.

ఆరోజున ఇంక బాబా తన ప్రేమికులతో వ్యక్తిగతంగాను, బృందములతోను సంభాషించారు. తదనంతరం బాబా మెహెరాబాద్ వెళ్లిపోయారు.

## 30 తేదీ నవంబరు 1955 :

ఈ రోజు ఉదయం బాబా పింపల్‌గావ్ నుండి ఉ॥ 7-30 గంటలకు రాగానే పందిరిలో పూలతో తయారుచేసిన కిరీటం అలంకరించారు. దానిని ధరించగానే, శ్రీకృష్ణునివలె ఉన్నారని ఫోటోలుకూడా తీశారు ప్రేమికులు.

7-40 గం॥లకు హాలులో సమావేశం ప్రారంభమైనది. బాబా ముందుగా ప్రేమికులను గతరాత్రి నిద్రపోనివారు ఎవరు? అని అడిగారు. మన ప్రేమచేతను మనలోనున్న అభిప్రాయములచేతను కలలో మనం బాబాను చూచి ఆయన మనకేదియో చెపుతూవున్న విషయం వింటున్నట్లు కలగంటాము. మన కలనుండి మనలను మేల్కొల్పుటకే బాబా వచ్చారు, అంతియేగాని మనకు కలలు రప్పించి ఆ కలలో

మనకు కనిపించేటందుకు బాబా రాలేదు. ఇతరులను గురువుగా స్వీకరించిన వారిని గురించి, బాబా అందుకు అభ్యంతరం లేదన్నారు. **నేనే అందరిలోనూ ఉన్నాను.** కనుక నిన్న ఒక ప్రేమికుడు ప్రశ్నించాడు, తన గురువుపేరుతో ప్రార్థన విరమించవలెనా ? అని. నీకు నిజంగా భగవంతుడు కావలెనంటే, నీవు నిజంగా భగవదన్వేషణలో వుంటే – దానికి ఒకటే మార్గం. **బాబా కొంగును పట్టుకోవడమే. వేరే మార్గంలేదు"** అని చెప్పారు.

తరువాత 9 గం॥ 10 నిమిషముల వరకు దీవల కార్యక్రమం జరిగింది.

9–30 గం॥ నుండి 10-30 గం॥ వరకు హాలులో ఘజల్సు, భజనలు గానం చేశారు. మధ్యాహ్నం బాబాను మేళతాళములతో అరంగాంవ్ గ్రామానికి ఊరేగింపుతో తీసికొని వెళ్లారు. బాబా అనేక ఇండ్లకు వెళ్లారు. అరంగాంవ్‌లో అనేక స్థలములు అలంకరించారు. ఆగ్రామీణులు అనేకచోట్ల బాబాకు పూజలుచేశారు హారతులిచ్చారు. అరంగావ్‌లో బాబా 2 1/2 గంటలు గడిపారు. తిరిగి వచ్చేసరికి సాయంకాలమైనది. సా॥ 5-45 లకు బాబా పింపల్‌గాంవ్‌కి వెళ్లారు.

## 1, డిశెంబరు 1955 :

బాబా ప్రేమికులందరికీ ఈవిధంగా చెప్పారు ;

"ఈరోజున బాబా మిమ్ములనందరిని మెహెరాబాద్ కొండమీదకు తీసికొని వెళతారు. అచ్చట బాబా యొక్క భావిసమాధి మందిరాన్ని దర్శిస్తారు. దిగువ మెహెరాబాద్‌కు ఎదురుగా 47/6 రైల్వే మైలురాయి దాటి వెళితే కొండమీద వుంది. 'సేవయందే పరిపూర్ణత్వము కలదు' (Mastery in Servitude) అని వ్రాసియున్న చిన్న భవనంలో సమాధి అగర్తమున్నది" అని చెప్పారు.

బాబా అందరినీ ఆప్రకారం తీసికొనివెళ్లి, బాబా ఆ సమాధిమందిరంలో నిలుచుండి అందరికి తన భావిసమాధిని దర్శనం చేయించారు. కొండప్రక్కన ఖాళీ స్థలంలో ప్రేమికులందరు బృందములుగా బాబాతో ఫొటోలు తీయించుకున్నారు.

సమాధిప్రక్కనున్న హాలులో 9-15 లకు అందరు కూర్చున్నారు. వారికి బాబా, అక్కడ జరిగిన తన ఏకాంతవాస వివరములన్నీ చెప్పారు. చాలకాలం

ఇప్పుడు సమాధి అగర్తుసున్నచోట గదిలోనుండి బయటికి రాలేదని, కాఫీమాత్రం సేవిస్తూ ఉపవాసం వున్నానని, తనకోసం ఫ్లాస్కునిండా కాఫీ ఒక హరిజన బాలుని చేత పంపించేవారని, ఆకుర్రవాడు ఆకాఫీలో సగం త్రాగేసి మిలిగిన సగం బాబాకు యిచ్చేవాడని, బాబా అందరికీ ప్రసాదం యిస్తున్నప్పటికీ....ఆ హరిజనబాలుని ప్రసాదం ఈవిధంగా తీసికొనేవాడినని బాబా చెప్పారు. ప్రేమాశ్రమ బాలురు ఇద్దరు అలీఅక్బర్, శ్యామ్‌సుందర్ అను వారు ఇప్పుడు మెహెరాబాద్‌లో ఉంటున్నారని చెప్పి, వారిద్దరిని బాబా అందరికీ చూపించారు.

అబ్దుల్లాగురించి చెపుతూ బాబా :

అబ్దుల్లా ఒకమారు పూర్తిగా స్పృహతప్పి పడిపోయాడు. అతడు ఆ విధంగా మూడురోజులున్నాడు. కన్నీరు బుగ్గలమీదనుండి కారింది. నాల్గవరోజున అతనికి చైతన్యం వచ్చింది. అతడు ఎంతగానో దుఃఖించాడు. అతడు "బాబా! నన్నెందుకు ఆఆనందంలోనుండి బయటికి లాగావు?" అన్నాడు.

"నేను మీకు ఈరోజున చూపించిన సమాధిమందిరం కొంతకాలానికి ఒక మహా యాత్రాకేంద్రము అయిపోతుంది. మీరందరు చాల అదృష్టవంతులు. బాబా (అవతారపురుషుడు) స్వయంగా మిమ్ములను అక్కడికి తీసికొనివెళ్లి మీకు చూపించాడు" అన్నారు.

9-30 మొదలు పదినిమిషాలు ధుని వద్ద సమావేశమైయున్న అరంగావ్ స్త్రీలను బాబా దర్శనమిచ్చారు.

తదనంతరం 9-45 నుండి ఒక గంటసేపు అరంగావ్ గ్రామంనుండి వచ్చిన భజనబృందం మండపంలో భజన చేశారు.

మధ్యాహ్నం దర్బార్ హాలులో 2-15 లకు సహవాస్ ప్రారంభించబడినది.

బాబా – "గ్రామస్థులకు ముందుగా ప్రసాదం పంచిపెట్టి తదనంతరం ప్రేమికులకు ఇస్తాను. మీరు దానిని స్వీకరించకుండా వుండకండి" అని వారిని బాబా హెచ్చరించారు. లడ్డు ప్రసాదం అందరికి 3-15 ల వరకు పంచిపెట్టడం జరిగినది. ఇదంతయూ బాబా ధునివద్ద ఒక చెట్టు మొదట్లో కూర్చుండి చేశారు. తరువాత

అందరూ హాలులోపలకు వచ్చి కూర్చుండుసరికి 3-25 ని॥ అయినది. అప్పుడు 3-37 వరకు బాబా ఆజ్ఞానుసారం నిశ్శబ్దంగా మౌనం పాటించారు. "రేపు – అనగా డిశెంబరు 2 వ తేదీని అందరూ పింపల్‌గావ్‌నకు రావాలి. అందరిని బాబాయే తీసికొని వెళతారు. కొండ ఎక్కుట కొంచెం కష్టం. తొందరపడకుండా నెమ్మదిగా ఎక్కవలెను. బాబా వెంట మీరు వస్తే చాలు. మీ రెవరైనా కొండఎక్కుటలో వేగాన్ని ప్రదర్శించాలని వుంటే అందరికంటె వడిగా ఎక్కగలవాడు బాబా ఉన్నాడు" అని చెప్పారు. బాబా సాయంకాలం 5 గంటలకు పింపల్‌గావ్ వెళ్లారు.

## 2 డిశెంబరు 1955 :

సహవాసులందరు బస్సులలో ఉ॥ 7-20 లకు బయలుదేరి పింపల్‌గావ్‌నకు వెళ్లారు. కాకా (కాకాబారియా) మెహెరాబాద్‌లో వుండి ఆశ్రమాన్ని జాగ్రత్తగా చూస్తూ వుంటాడు. బాబా పింపల్‌గావ్ వచ్చినపుడు రాత్రి అక్కడే వుండిపోతారు.

రతన్‌గ్యారా అను నాతడు 76 సం॥ వయసువాడని, అయినా చాల చురుకుగా బలంగా వున్నాడన్నారు. ఏకాంతవాస సమయంలో బాబాకి ఇతడు కావలి కాచేవాడు. బాబా గది మేడమీద వుంది. కుడివైపు గది వారిది. కృష్ణ కావలి కాచేవాడు. మహిళా మండలి దిగువభాగంలో వుండేవారు.

కొండమీద రెండు కేబినులు వుండేవి. బాబా పగలు ఒక కేబిన్‌లోను రాత్రి వేళ ఇంకొక కేబిన్‌లోను వుండేవారు. కొద్దిమంది మండలికూడా పగలంతయూ బాబాతో వుండేవారు. ఈ రెండు కేబిన్‌లు ఇచ్చటనుంచి తీసివేసి పింపల్‌గావ్‌లో పెట్టించారు.

బాబా సునోనాశ్ కార్యక్రమం కాగానే అవి ఇచ్చటనుండి తీసుకొని వెళ్లారు. పింపల్‌గావ్‌లో బాబా దేశమంతటా పర్యటించి వచ్చిన బస్సుకూడా వుంది. బాబా తన పరివారంతో భారతదేశమంతయూ దీనిలోనే పర్యటించి వచ్చారు. కేబిన్‌లు రెండునూ ఇప్పుడు మెహెరాబాద్‌లో ఒకటిగా జాగ్రత్తగా చూడబడుతున్నది. బాబా అందరినీ తలొకటాయిని జ్ఞాపకార్థంగా తీసికొని వెళ్లమన్నారు. క్రిందికి దిగి ప్రేమికులందరు 10-05 లకు మెహెరాబాద్ వచ్చారు. వారు కేబినులు, బస్సు చూచారు. అన్నియు చూచినమీదట ప్రేమికబృందం తిరిగి మెహెరాబాద్‌నకు బస్సులలో వెళ్లిపోయారు. అందరూ అక్కడికి 11-10 నిమిషములకు చేరుకున్నారు.

భోజనములుచేసి 12-30 లకు హాలులో భజన ప్రారంభించారు. బాబా 1-50 గం॥ లకు వచ్చి ఆసీనులై అందరినీ బయటికి వెళ్ళమని 15 నిమిషాలలో తిరిగి యథా స్థానములలో కూర్చుండమన్నారు. దీనిని అక్షరాలా పాటించాలని బాబా చెప్పారు 2-05 లకు నిశ్శబ్దంగా మౌనం పాటించారు తరువాత భజనలు చేశారు.

బాబా—"మస్తులు నాచేతివ్రేళ్లకు అలంకరించిన వజ్రములు" అని చెప్పి అరంగావ్ లోని ఇద్దరు మస్తులగురించి చెప్పారు.

సూఫీ పరిభాషలో మజ్ జూబ్ అనే స్థితికి వచ్చుట తమాషా కాదు. అందుకు ముందుగా దేహచైతన్యం పోవాలి. అప్పుడుగాని మజ్ జూబ్‌గా ఉండలేడు. ఒకటి. రెండు, మూడవ భూమికలలో నుండువాడు, తాను ఏ భూమికలోనున్నది తెలియదు. నిజమైన మజ్ జూబ్ ఎవరో, సామాన్య మానవుడెవరో తెలిసికొనడం కూడా కష్టమే. మజ్ జూబ్ లక్షమందిలో ఒక్కడుంటాడు. అట్టివారిలో ఒక్కడు సాధారణ చైతన్యం కలిగి వుంటాడు.

"సద్గురువు – అతీతచైతన్యమును, అదేసమయంలో సాధారణ మానవ చైతన్యమును రెండునూ కల్గివుంటాడు. ఆ రాత్రి ఎవరు వెళ్లిపోతున్నారు? అని బాబా అడిగారు. 3 వ తేదీ ఉదయము 2 వ తేదీ రాత్రి అందరు వెళుతున్నారు కదా! మీరు వెళ్లేటప్పుడు మీవెంట మీతో బాబాను తీసికొని వెళ్లండి." (అనగా స్వస్థలాలు చేరేవరకు బాబా స్మృతితో వుండవలెను)" అని బాబా చెప్పారు.

అందరు నిలబడి ఆరతి పాటపాడారు. కర్పూరం వెలిగించి హారతి ఇచ్చారు. అందరు బాబాను వెన్నంటి అరంగావ్ గ్రామ దిక్కునకు నడిచారు. రోడ్డుప్రక్క ఒక చెట్టుక్రింద బాబా కూర్చున్నారు. బాబా, హారతిపాట పాడమన్నారు. మధ్యలో పాటను బాబా ఆపివేశారు.

బాబా, పింపల్‌గావ్‌నకు 4-45లకు వెళ్లారు. సమావేశం హాలు నోటీసు బోర్డుమీద —

"ఎవరు తమ సర్వస్వాన్నీ నాలో పోగొట్టుకొంటారో, వారు తరువాత నాలో శాశ్వతంగా తమ భగవత్‌సర్వస్వాన్ని కనుగొంటారు —"

— మెహెర్‌బాబా.

అని వ్రాయబడివుంది. సహవాస్ అయిపోయింది. అందరూ తమ తమ స్వస్థలాలకు వెళ్లిపోయారు, మెహెరాబాద్‌లో సహవాస్ అనంతరం. బాబా సతారా జిల్లాలోని భూంజ అనే గ్రామంలో, ఆ గ్రామీణులకు దర్శనమిచ్చు ప్రయత్నాలు పూర్తి అయినవి.

డిశెంబరు 18 వ తేదీన మెహెర్ జీ (బాబా మండలిలో ఒక సభ్యుడు)— ఒక స్నేహితునికి వ్రాస్తూ "మనోహరమయిన సహవాస్ మాసము నవంబరు, 55 గతించింది. ఇంతకుముందు ఎప్పుడూ యింత తక్కువ కాలంలో యింత ఎక్కువ మందికి, యింతగా బాబా ఎప్పుడు బోధనలుచేసియుండలేదు. ఇంకా బాబా— "అటువంటి సహవాస్ సమావేశము మరల సంభవిస్తుందని నేను అనుకోను. వారి వీడ్కోలు సమయమందలి వారి దుఃఖము చూడటానికి నాకు కష్టముగా నుండెను." అన్నారు. మణి, (బాబా చెల్లెలు) డిశెంబరు 19 వ తేదీన పాశ్చాత్యులలో ఒకరి ఉత్తరానికి జవాబు వ్రాస్తూ— "వెన్నకంటె మృదువయిన హృదయము కలవాడు, ఉక్కుకంటె కఠినతరమయినవాడు పాశ్చాత్య దేశాల పిలుపు నందుకొని జవాబు చెప్పగలడు. వారి హృదయాలలో బాబా స్థిరముగా నెలకొని యున్నాడు. ప్రేమమూర్తి అయినవాడు ప్రేమ ఎక్కడికి పిలిస్తె అక్కడికి వెళ్ళవలసినదే. ఆయన వస్తే లయన మీ అందరి హృదయాల నుండి మీరు పిలిచిన పిలుపు ననుసరించియే రాగలడు."

తరువాత డిశెంబరు 20 వ తేదీన ఎలిజబెత్ పాటర్సన్‌కి, మిర్టిల్ బీచ్, సౌత్ కెరోలినా. చిరునామాకు సతారా (అప్పుడు ఉంటున్న బాబా వద్ద) నుంచి ఒక కేబిల్ వెళ్ళింది.

—"నేను తప్పకుండా వచ్చే సంవత్సరం మధ్యభాగంలో పశ్చిమ దేశాలకు రావాలనుకుంటున్నాను అమెరికాలో అందరికి చెప్పవలెను— బాబా."

అప్పటినుంచి బాబా ఎప్పుడు వస్తారు? ఇంకా ఎప్పుడు అని వారి రాకకోసం అమెరికాలోని ప్రేమికులు ఎదురు చూస్తున్నారు.

డాన్ స్టీవెన్స్ వ్రాసిన ఉత్తరానికి జవాబిస్తూ బాబా "నన్ను ఎవరు, ఎంతమంది చూడటానికి వచ్చినా రావచ్చును. కాని నేను ముఖ్యంగా నా దగ్గర వారికి నాకు ప్రియమైన వారికి ఎవరి ప్రేమ నన్ను అమెరికాకు లాగుకుని వస్తుందో వారికి నా సహవాసభాగ్య మివ్వడానికి వస్తున్నాను." మిర్టిల్‌బీచ్‌లో డిసెంబరు (1955) 30 వ

తేదీకి అందేలా బాబా యింకొక కేబిల్ యిచ్చారు. అందులో బాబా వచ్చే వేసంగిలో 17 రోజులపాటు పాశ్చాత్య దేశాలలో ఉంటారని, కొద్దిరోజులు లండన్‌లో ఉండి, న్యూయార్క్‌లోను, మిర్టిల్‌బీచ్‌లోను, తరువాత లాస్ ఏంజిలస్‌లోను, శాన్‌ఫ్రాన్సిస్కోలోను మిగతా రోజులు ఉండి ఇండియాకి తిరిగి వస్తారని వ్రాసారు.

బాబా మొదట్లో భారత స్త్రీలకు ఏర్పాటుచేసిన సహవాస కార్యక్రమం జనవరి 3 (1956) వ తేదీన రద్దు పరిచారు. బాబా ఒక సందేశాన్నిస్తూ "బాబా ప్రేమను జాజ్వల్యమానంగా ఉంచుకొని మీ ప్రియతముని పని ఉత్సాహంతో నా యొక్క సత్యప్రేమ సందేశాల శక్తిని యితరులు గ్రహించేలా పని చేయండి" అని అందరికీ సంబోధిస్తూ అన్నారు.

1956 ఫిబ్రవరి 15 వ తేదీనుంచి బాబా తీవ్రమయిన ఏకాంతవాసం ప్రారంభించారు. వారి ఏకాంతవాసంలో వారితో అనేక సంవత్సరాలనుంచి ఉంటూ ఉన్నవారి మండలియొక్క ఖర్చులకు గాను పాశ్చాత్యప్రేమికులను విరాళాలు యివ్వవలసిందిగా బాబా ఆదేశించారు.

ఫిబ్రవరి 15 నుంచి సంవత్సరంపాటు బాబా ప్రారంభించు ఏకాంతవాసము వారి పాశ్చాత్యదేశయాత్రకు కావలసినన్ని దినములు మాత్రము ఏకాంతమునకు భంగము కలుగునని బాబా సోదరి మణి, ఒక ఉత్తరంలో ఒక పాశ్చాత్య ప్రేమికురాలికి జనవరి 6 వ తేదీన వ్రాసెను. బాబా జూలైలో బయలుదేరి వస్తారని జనవరి 19 వ తేదీన వ్రాసిన ఇంకొక ఉత్తరంలో మణి తెలిపింది. ఆ ఉత్తరాలకి జవాబిస్తూ బాబా రాకకు అమెరికా ప్రేమికులు ఆతురతతో ఎదురుచూస్తున్నామని బాబాతో కలిసి దేశం అంతా వారు ఎక్కడికివెళ్ళె అక్కడికి ఎగిరిపోవడానికి రెక్కలు తెచ్చి పెట్టుకుని సిద్ధంగా ఉన్నామని వ్రాశారు.

జూలై మొదటి వారంలో బయలుదేరి బాబా అమెరికా యాత్రకి వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. వారితో కూడా మండలిలో నలుగురిని తీసికొని వెళ్లారు. వారు ఎవరనగా— ఎరచ్, నీలు, మెహెర్‌జీ, ఆదీ (సీనియర్). పాశ్చాత్య దేశాల ప్రేమికులు బాబాకి మండలికి రాకపోకల ఖర్చులు భరిస్తేనే బయలుదేరి వస్తామని బాబా స్పష్టంగా తెలియజేసారు. "ఈ మధ్యను ప్రేమతో మీరు యిచ్చిన భూరివిరాళాల తరువాత యిది కష్టమే కావచ్చును," అన్నారు బాబా. ఇంకా బాబా— "మీరంతా

ఎంత ప్రేమతోను త్యాగంతోను నాకు యీ కానుకలను పంపేరో నాకు తెలుసును. మీ అందరకు నా ప్రేమ'' అని బాబా వారికి తెలిపారు.

బాబాతో అయిదుగురికి ప్రయాణం వగైరా ఖర్చులకు కావలసిన సొమ్మును పోగుచేయమని అమెరికా ప్రేమికులు మేరియన్ ఫ్లోర్‌షీమ్‌ను నియమించారు. బాబా ప్రపంచ పర్యటన కోసం ఏర్పాట్లు చేయడానికి ప్రారంభించారు. ఆ యా దేశాలలోని ముఖ్యమైన ప్రేమికులందరికీ తెలియపరిచారు. ఎంతటి త్యాగానికయినా సంతోషంగా అంగీకరించి ప్రియతమ మెహెర్‌ప్రభువును మరల వారి మధ్యకు రప్పించాలని అమెరికన్ ప్రేమికులు ఉవ్విళ్ళూరుతున్నారు. బాబా వచ్చినపుడు పనిచేయడానికి ఆహ్వాన సంఘమొకటి ఏర్పాటు చేసారు. మేరియన్‌ఫ్లోర్‌షీమ్ అధ్యక్షురాలు గాను, ఫ్రెడ్‌వింటర్‌ఫెల్ట్ ఉపాధ్యక్షుడు గాను మరి యేడుగురు ఆతిథ్య సంఘ సభ్యులుగాను ఎన్నిక చేసుకున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్కనగరం లేక ప్రాంతానికి ప్రతినిధులుగా ఉన్నారు. ఎలిజబెత్‌పాటర్సన్ మిర్టిల్‌బీచ్‌కి, రుత్‌వైట్‌లాస్‌ఏంజిలెస్‌కి, ఆగ్నెస్‌బోర్న్ ఓజైకి, లడ్‌డింపిల్ శాన్‌ఫ్రాన్‌సిస్కోకి ఏర్పాటయారు. ఇంకా పబ్లిసిటీ కమిటీ (ప్రకటన సంఘం) లో ఐవీడ్యూక్, డాన్ స్టీవెన్స్ సభ్యులుగా ఏర్పాటు చేసుకున్నారు. ఇదివరలో బాబా 1952 లో వచ్చినపుడు వారి రాకపోకల గురించి గాని వారిగురించి గాని పత్రికలలో గాని ఏ విధంగా గాని ప్రకటనలు చేయడానికి బాబా యిష్టపడలేదు. ఇప్పుడు దానికి వ్యతిరేకంగా అన్నిదేశాలలో మత ప్రేమికులకు వారి పర్యటన రహస్యంగా ఉంచనక్కరలేదని ఆదేశాలు పంపారు. లండన్‌లో ఉన్న ప్రేమికబృందం విల్‌బాకెట్ మొదలైనవారు తగిన ఏర్పాట్లు చేయడానికి పూనుకున్నారు. స్విడ్జర్లాండులో హెడీ మెర్టెన్స్ ఆస్ట్రేలియాలో ఫ్రాన్సిస్ బ్రాబజాన్ బాబాకు స్వాగతమివ్వడానికి కావలసిన ఏర్పాట్లు చేయించడానికినాయకత్వం వహించారు.

బాబా జూలై (1956) మొదటివారంలో బయలుదేరడానికి బదులు జూలై 17వ తేదీన బయలుదేరుతున్నట్లుగా (మార్చి) (1956) 29 వ తేదీన ఆ యా దేశాల వారికి తెలియపరచారు. ఈలోపు త్వరత్వరగా బాబా ప్రపంచ పర్యటనకు కావలసిన సొమ్ము సేకరించడం, మిగిలిన ఏర్పాట్లు చేయడం చురుకుగా సాగుతోంది. బాబా ఏ యే ప్రదేశాలు ఎప్పుడెప్పుడు దర్శిస్తారో వారికి పూర్తి వివరాలు వచ్చాయి గనుక హారీ ఫ్లోర్‌షీమ్ ఒకమ్యాపు తయారుచేసాడు. అందులో ఆయన ప్రేమ

యాత్రలో ఆఖరి ఘట్టంగా ఆస్ట్రేలియాను చూపించాడు. అది చూసి ఆయా దేశాల వారు "మేలుకొలుపువాడు" వారి వారిని దివ్యమైన ఆ ఏకైక సత్యానికి తమను మేలుకొలుపుటకు ఫలానా రోజున వస్తున్నారని ఆయత్తపడుతున్నారు.

## భూయింజ్ దర్శన కార్యక్రమం :—

భూయింజ్ మొదలయిన గ్రామాలలో దర్శన కార్యక్రమాలకై బాబా బయలు దేరారు. ఆ రోజు డిశెంబరు 18, 1955. ప్రతివాని హృదయంలోను ప్రేమ అంకురించేలా బాబా కృపాదృష్టిని ప్రసరించి దర్శనం యిస్తున్నారు. మొదట్లో బాబా వెళ్ళినది భూయింజ్ గ్రామం. ఆ గ్రామంలో ముఖ్యుడు తాతాసాహెబ్ జాధవరావు. అతడెంతో ప్రేమతోను గౌరవంతోను యితర పెద్దలను పోగుచేసి బాబాకు స్వాగతం యివ్వడానికి సిద్ధంగా ఉన్నాడు. ఆనాడు ఆదివారం. బాబా కారు గ్రామానికి రాగానే జాధవరావు భూయింజ్‌కార్ బాబాకు పూలమాల వేసి సత్కరించాడు. ఆ సమయంలో గ్రామప్రజలందరు జయధ్వానాలు చేసారు. పూనా, భోర్, వై, సతారా మొదలయిన స్థలాల నుంచి అనేకమంది ప్రేమికులు భూయింజ్‌కి వచ్చారు. అక్కడనుంచి ఊళ్ళోకి బాబాను ఊరేగించి తీసికొని వెళ్ళాలని జాధవరావు ప్రభృతులు సంకల్పించారు. కాని బాబా అక్కడ కారు దిగి ఊళ్ళోకి నడిచేవెళ్ళారు. అయితే ఆ సమయంలో గ్రామస్తులు భజనలతోను, సంకీర్తనలతోను, మేళతాళాలతోను బాబాను తీసికొని వెళ్ళారు.

ఛత్రపతి శివాజీ మహరాజ్ యొక్క తల్లి జిజియాభాయి యొక్క పుట్టిల్లు ఆ ఊరే అని చెప్తారు. వాడా అనేచోట ఆమె యిల్లు ఉంది. బాబా నెమ్మదిగా గ్రామస్తులతో ఊళ్ళోకి చేరుకునే సరికి చాలాసేపయినది. జిజియాభాయి వంశానికి చెందినవాడే జాధవరావు కూడా. బాబా ఊరేగింపు అయన యింటికి చేరుకుంది. ఆయనకు మిక్కిలి సదుపాయంగా జాధవరావు యింట్లో పెల్లుబికిన ప్రేమతో బస ఏర్పాటు చేసినందు వలన అతడిచ్చిన హార్దికమయిన స్వాగతం వలన ఆయన ఎంతో ఆనందించారు. బాబా ఆనందం చూచి జాధవరావుకి చాలా సంతోషం కలిగింది. ఈ సంతోషంలో కొంతసేపు జాధవరావు తన కుటుంబ సభ్యులను బాబాకు పరిచయం చేయడం కూడా మరచిపోయాడు. అంచే కొంతసేపు కర్తవ్యతా మూఢుడయాడు. తరువాత కొంత

సేపటికి తన కుటుంబంలోని వారినందరినీ పిలిచి బాబాకి ఫలానా అని చెప్పి పరిచయం చేసాడు. తరువాత తన స్నేహితులందరిని బాబాకి చూపించాడు.

వచ్చిన వారందరు బాబా యొక్క దర్శనం చేసుకుని పువ్వులు పన్ను ఆయనకి సమర్పించారు. బాబా ఒకరిని వీపు మీద తట్టి మరొకరిని మందహాసంతో పలకరించి యీ విధంగా అందరినీ తృప్తులను గావించారు. బాబాకి మండలికి అల్పాహారాలు యిచ్చిన తరువాత గ్రామస్తులు చాలామంది ఒకచోట బాబా దర్శనానికై వేచి యున్నారని బాబాను జాధవరావు అక్కడికి తీసికొని వెళ్ళాడు. నలుగురు బాలికలు బాబాకు స్వాగత గానం చేసారు. ఈ పాట ఆ ఊరి పాఠశాల ప్రధానోపాధ్యాయుడు రచించాడు. ఈపాటలో బాబా యొక్క దైవత్వము ఆయనయొక్క ప్రేమసందేశము తెలిసేలా రచనచేసాడు. వీటిని గురించి జాధవరావు తన ఉపన్యాసంలో కూడా విశదంగా చెప్పాడు. అనేకమంది అధ్యాత్మిక గురువులు అవతార పురుషులు వచ్చిన యీ దేశ పురాణ చరిత్ర గురించి అతడు ముచ్చటించాడు. అవతార్ మెహెర్ బాబా కి జై అని నినాదాలు మిన్నుముట్టుచుండగా ప్రముఖులందరు బాబాకి పుష్పమాలలు సమర్పించారు. బాబాను భోర్ కి, వై కి రమ్మని ఆ గ్రామస్థులు ప్రార్థించారు. గాని వ్యవధి లేనందున వారి ఆహ్వానమును బాబా అంగీకరించలేదు. వాడలో స్త్రీ పురుషులు బాలబాలికలు అందరు బాబా దర్శనం చేసుకున్నారు.

ఈ వాడకు శివాజీ గురువయిన సమర్థ రామదాసు అనేకమారులు వచ్చి వెళ్ళేనని తెలుస్తోంది. దానివల్ల కొంత ఆధ్యాత్మిక వాతావరణం యిక్కడ కల్పించబడి బాబా రాకకి దోహదం చేసింది.

ఆ రోజున భూయింజ్‌లో ఒక గంటలో దర్శన్ కార్యక్రమం ముగించుకొని బాబా సతారాకి బయలుదేరి వెళ్ళారు. ఆ రోజున బాబా దర్శనం కోసం పరితపించే ఒక వెయ్యిమంది హృదయాలకు బాబా ఊరట కలిగించారు. జాధవరావు భుయింజికర్, అతని కుటుంబము వారు, పొందిన తృప్తికి సంతోషానికి మేరలేదు. అది వర్ణించడానికి మాటలు చాలవు. యుగావతారుణ్ణి వారి ఊరికి రప్పించి వారి అతిథిగా సత్కరించే అరుదయిన మహా భాగ్యం కలిగినందుకు భుయింజిక అతని కుటుంబము వారేగాక ఆ ఊరి ప్రజలంతా ఎంతో ఆనందించారంటే అతిశయోక్తి కాదు.

నవంబరు 3, (1955) నుంచి డిసెంబరు 3, (1955) వరకు జరిగిన నెల్లాళ్ళ సహవాస్‌లో కొందరు వ్యక్తులు కాకాబారియా ద్వారా బేషరతుగా యిచ్చిన కానుకల

మొత్తం బాబా పనులకు ఆయన వచ్చే సంవత్సరంలో (1950) లో ఒక సంవత్సరం పాటు చేద్దామనుకున్న ఏకాంతవాసానికి వెళ్ళేటందుకు చేయవలచుకున్న ఏర్పాటులకు కావలసిన మొత్తంలో సగం మాత్రమే వచ్చింది.

ఈ సహవాస్‌లో ఒక రోజున అమెరికన్ ప్రేమికుడయిన డాన్‌స్టీవెన్స్ 1956 వ సంవత్సరంలో బాబా పాశ్చాత్యదేశాలకు వెళ్ళడం సంభవమని చెప్పాడు.

వారికి భక్తులయిన స్త్రీ పురుషులకి, ఆయన సత్యప్రేమలకు అంకితమయిన ప్రేమికులకి బాబా చెప్పేదేమంటే బాబా తప్పకుండా ఫిబ్రవరి 15, 1956 నుంచి 1957 ఫిబ్రవరి 15 వరకు ఏకాంతవాసం చేయదలచు కున్నారని, బాబా చెప్పినట్లు యీ క్రింది ప్రకారం చేయాలని వారి ప్రేమికులను కోరుతున్నారని బాబా తెలియ జేసారు ——

"ఈ నా సంవత్సర ఏకాంతవాసంలో నాతో తిన్నగాగాని యింకొకరి ద్వారా గాని ఎవరూ నన్ను కలుసుకోరాదు; నాకు ఉత్తరాలు వ్రాయకూడదు. నేను సతారాలో ఉన్నా వేరే యింకొక చోట ఉంటున్నా నేను ఒక చోట నుంచి యింకొక చోటకు తిరుగుతున్నా నాకు ఉత్తరాలు వ్రాయడం గాని నన్ను కలుసుకుందామని ప్రయత్నం చేయడం గాని కూడదు. అప్పటిచుట్టూ నేను మీకు సమీపంలో ఉన్నా, మీరున్న చోటే ఉన్నా నా దర్శనం కోసం గాని మరి యేయితర కారణంచేతగాని మీరు నన్ను చూడాలని ప్రయత్నించ కూడదు. 1956 వ సం॥లో నేను 15 రోజులపాటు అమెరికాకి, రెండురోజులు ఇంగ్లాండుకి వెళ్ళి ఉందామని అనుకుంటున్నాను. తరువాత దాదా తన పర్యటనలో ఆస్ట్రేలియా కూడా చేర్చడంతో మొత్తం 30 రోజులు ప్రపంచ పర్యటన చేస్తారు. ఈ పర్యటన నా ఏకాంతవాసం మధ్యలో వస్తుంది. అప్పుడు మాత్రం నేను చెప్పినది వర్తించదు. నేను తిరిగి రాగానే ఏకాంత వాసం మళ్ళీ ప్రారంభించి ఫిబ్రవరి 15, 1957 వరకు కొనసాగిస్తాను.

మీరంతా ఫిబ్రవరి (1956) 14 వ తేదీ అర్ధరాత్రినుంచి ఫిబ్రవరి 15 అర్ధరాత్రి వరకు 24 గంటలు ఉపవాసం చేయాలి ఈ 24 గంటలలోను మీ యిష్టం వచ్చినపుడు ఒక్కసారి మాత్రమే టీ గాని కాఫీ గాని రెండు కప్పులు గాని లేక ఒక పావుశేరు పాలు గాని పుచ్చుకోవచ్చును. —— అని బాబా చెప్పారు. బాబా యింకా యిలా చెప్పారు —— ఈ 24 గంటల ఉపవాసకాలం లో పుగాకు ఏ విధంగాను

ఉపయోగించ కూడదు, పాన్‌సుపారి (తాంబూలం) వేసుకోకూడదు. మంచినీళ్ళు ఎన్నయినా ఎన్నిమార్లయినా త్రాగవచ్చును. సహవాస్ లో 15-2-53 నుంచి ఏడు రోజులు ఉపవాసం చేయడానికి బాబా ఎన్నుకున్న వారికి మాత్రం యీ 24 గంటల ఉపవాసం వర్తించదు. వారు బాబా చెప్పినట్లు ఉపవాసం చేస్తారు.

నేను కొన్నిరోజులలో అర్ధరాత్రి వేళ 12 గంటలకు "బాబా" అని కొన్ని మారులు ఉచ్చరించాలని సహవాస్ వారాలలో చెప్పాను. మిగిలిన వేళల్లో ఆ రోజుల్లో యీ పేరు నా ఏకాంతవాస సంవత్సరంలో ఏరోజునా ఉచ్చరించరాదని చెప్పాను. ఈ సందర్భంలో నా భక్తులందరికి నేను చెప్పాలనుకున్నది ఏమిటంటే అది నా వద్ద నుంచి ఎవరికీ ఆజ్ఞకాదు. ఆ విధంగా చేయదలచి వారు చేయవచ్చును అంతే. అయితే వారు గమనించవలసింది ఏమిటంటే మామూలుగా మాట్లాడేటప్పుడు నాపేరు మాటలో రావచ్చుకాని బాబాని కావాలని ఒక్కమారయినా స్మరించకూడదు. ఎందుచేతంటే ఆ యేడాది నేను చెప్పినన్ని మారులు నేను చెప్పిన సమయంలో 'బాబా' నామం ఉచ్చరించాలి.

## 1956, జనవరి 14 పూనా దర్శన కార్యక్రమం :—

పూనాలో అనేకమంది ప్రేమికులు బాబా దర్శనం చేసుకొని చాలాకాలం అయిందని బాబాను రమ్మని ఆహ్వానిస్తున్నారు. జనవరి 14 వ తేదీ అందుకు నిర్ణయించారు బాబా. ఆ రోజు మకర సంక్రాంతి పర్వదినం కూడాను. ఉత్తరాయణ ప్రవేశ పుణ్యకాలం. పూనా బాబా జన్మస్థలమే కదా. అక్కడ ప్రజాదర్శనం కోసం ఏర్పాట్లు జరిగిపోయాయి. పూనా అబ్జర్వేటరీ (నక్షత్రశాల) సమీపాన ఒక పెద్ద పందిరి వేసారు. 13వ తేదీ రాత్రి తెల్లవార్లూ పూనా ప్రేమిక కార్యకర్తలు పందిట్లో అలంకారం చేస్తూనే ఉన్నారు. ఆరోజున సూర్యోదయం అయేసరికి పందిరి నిండిపోయింది. బాబా కొంచెంసేపట్లోనే 8 గంటలకు వచ్చారు. పందిట్లో అనేక మతాలవారు అనేక భాషల వారు ఉన్నారు. అందరూ 'అవతార్ మెహెర్ బాబాకి జై' అని ఎలుగెత్తి జయ ధ్వానాలు చేసి బాబాకు స్వాగతం పలికారు. ఉదయం 8 గంటలు మొదలు సాయంత్రం 6 గం॥ల వరకు ప్రజలకు దర్శనాలిచ్చారు. ప్రేమికులకే గాక ప్రజ లందరూ రావచ్చునని తెలియగానే 4,000 మంది ప్రజలు ఆ రోజున స్త్రీ పురుషుల వరుసలలో వచ్చి బాబా దర్శనం చేసుకుంటున్నారు. వచ్చిన వారందరికీ బాబా తిల్-గుల్

(చిమ్మిలి) ప్రసాదంగా పంచిపెట్టారు. సంక్రాంతి నాడు తిల్-గుల్ తినడం మహారాష్ట్రంలోని సాంప్రదాయం. ఆ నాటి దర్శనానికి దూర నగరాలైనటువంటి ఢిల్లీ, హమీర్‌పూర్, దేరాడూన్, బిజ్వా, నిడదవోలు, ఏలూరు, సిలోన్ నుంచి అనేక మంది ప్రేమికులు వచ్చారు. పందిట్లోని కొందరు ముఖ్య ప్రేమికులను బాబా వేరే ఒక గదిలోకి పిలిచి ఒక్కొక్కరికి ఒకటి రెండు నిమిషాలు వ్యవధి చొప్పున వారి అమూల్యమైన సమయము నిచ్చి చనువుగ మాట్లాడారు. ఆ గదిలోనుంచి ప్రతి ప్రేమికుడు బాబా యెడల, ప్రేమాతిరేకంచేత బాష్పవారి పరిపూర్ణలోచనుడై బయటకు వచ్చేవాడు. ఆరుగంటలవగానే సిద్ధంగా ఉన్న కారులో బయలుదేరారు బాబా. ఆయన ప్రేమికులు బాబా వెళ్ళిపోతున్నారని విలపిస్తూ కారువెంటపడ్డారు. ప్రేమికుల విరహ బాధనుతట్టుకోవానికి శక్తిని బాబాయే యిచ్చారు. మరునాటి టైమ్స్ ఆఫ్ ఇండియా, ఇలస్ట్రేటెడ్ వీక్లీలలో బాబా దర్శనం గురించిన రంగుచిత్రాలతో ఒక పూర్తి పేజీ, ప్రచురణ అయింది. అందులో డా॥ సి. డి. దేశ్‌ముఖ్ వ్యాసం కూడా ప్రచురిత మయింది.

నాగపూర్ నుంచి డా॥ దేశ్‌ముఖ్ కుటుంబ సహితంగా వచ్చాడు. అతని చిన్న కుమారునికి ముఖంమీద పక్షవాతం వచ్చి నోరు వంకర పోయింది. ఎన్ని మందులు యిప్పించినా తగ్గకపోతే దయాసముద్రుడైన అవతారపురుషుని దర్శనం చేయించాడు. ఆ బాలునికి ప్రత్యేకంగా ప్రసాదమిచ్చారు బాబా. అతనిని కౌగిలించు కుని ముఖమును తమ దివ్యహస్తాలతో నిమిరారు. ఇంటికి వెళ్ళిన తరువాత అతడు అవలంభించవలసిన అభ్యాసాలు వివరంగా తెలియజేసారు. ఇది వరకు ఎన్ని మందులు మాకులు ఉపయోగించినా ఫలితం లేకపోయింది. నాగపూర్ చేరుకున్న కొద్దిరోజులలోనే పక్షవాత రోగం సమూలంగా మాయమయిపోయింది. బాలునికి ఆరోగ్యం చేకూరింది. నోరు వంకర తీరి మామూలుగా అయింది. బాబా దీవనలో ఆయన దివ్యస్పర్శలో అంత మహిమ ఉంది.

దర్శన కార్యక్రమం ముమ్మరంగా జరుగుతోంది. ఒక వైపున ప్రేమికులు బాబా దర్శనం చేసుకుంటున్నారు. వేరొక ప్రక్కన భజన గీతాలు ఖవ్వాలీలు అతిశ యించిన ప్రేమతో గానం చేస్తున్నారు. ప్రఖ్యాత గాయకుడయిన మాస్టర్ కృష్ణ అతని కుమార్తె గానం ప్రారంభించారు. ఖవ్వాలీలు అతిరంజకంగా పాడుతూనా రు

అనేక మందికి ఆలోజున ఆధ్యాత్మిక విందు చేసుకున్నట్లయింది బాబా దర్శనంతో. ఇప్పటికీ జనవరి 14 వ తేదీనాడు ప్రజానీకానికి బాబా యిచ్చిన దర్శన జ్ఞాపకార్థం పండుగ చేసుకుంటారు.

## కుమ్హాలో దర్శనం :—

సతారా జిల్లాలో కుమ్హా అనే గ్రామమున్నది. బాబా ఆ ఊళ్ళో 24-1-56 వ తేదీన దర్శన కార్యక్రమం జరిపారు. రెండు వేల ప్రజలు మాత్రం జనాభా కలిగిన ఒక చిన్న గ్రామం అది. ఆగ్రామం సతారాకి 15 మైళ్ళ దూరంలో తీల్‌గంగ అనే నదియొడ్డున ఉంది. కోర్‌గాం రైల్వుస్టేషన్‌కి మూడు మైళ్ళున్నది. కోర్‌గాం నుంచి ఆగ్రామానికి మట్టిరోడ్డున్నది. ఆ ఊళ్ళో ఎవరూ యింతవరకు బాబాని చూసి యుండలేదు. బాబా పేరుమాత్రం విన్నారు. మౌనిబువా అనే అతనివల్ల బాబాను గురించి విన్నారు. బాబాకి యితడొక పాత ప్రేమికుడు. మౌనిబువా 14 ఏళ్ళనుంచి మౌనవ్రతంలో ఉన్నాడు. అదియును బాబా ఆజ్ఞప్రకారమే. 1955 వ సంవత్సరంలో ఒక మారు బాబా అతనిని పరబ్రహ్మ పరమాత్మ అని చెప్పి మౌనభంగం చేయమని ఆజ్ఞాపించారు. ఈ భగవంతుని నామం 40 రోజులు ఉచ్చరించమని చెప్పారు బాబా మౌనిబువా అట్లే యొనర్చెను. బాబా మరల 40 రోజులు అయిన తరువాత మౌనంగా ఉండమని ఆజ్ఞాపించారు. కుమ్హా అనే యీ గ్రామంలో మౌనిబువా ప్రార్థించినందు వలన దర్శనమిస్తానని బాబా అంగీకరించారు. బాబా సతారా లో 12 గంటలకు బయలుదేరి ఒక అరగంటలో ఆ గ్రామం చేరుకున్నారు. మౌనిబువా యింకా కొందరు గ్రామీణులు బాబాకి స్వాగత మిచ్చారు. ఆ గ్రామస్థులు ప్రత్యేకంగా బాబా కొసం ఒక రెండెద్దుల బండి అలంకరించి తెచ్చారు. దానిని ఒక రథంలా తయారు చేసారు. బాబాను కారు దిగి ఆ రథము నధిరోహించమని ప్రార్థించారు. బాబా అందులో చక్కగా కూర్చోగా, దర్శన కార్యక్రమం ఏర్పాటు చేసిన స్థలానికి బాబాని అందులో తీసికొని వెళ్ళారు. ఆ గ్రామస్థులకు చేతనైనంత వైభవంతో బాబాని ఊరేగించి అక్కడికి తీసికొని వెళ్ళారు. దారిలో స్త్రీలు పిల్లలు బాబాపై పూల వర్షం కురిపించారు. కొందరు యిందుకోసం యిళ కప్పుల మీదకి కూడా ఎక్కారు. అవతార్ మెహెర్‌బాబాకి జై అనే నినాదాలు మిన్నుముట్టాయి. కొందరిళ్ళ వద్ద రథాన్ని ఆపి అక్కడ బాబాకి పుష్పమాలలు వేసి నాట్యాలు చేసారు.

ఒక మర్రిచెట్టు క్రింద ఒక పందిరివేసి ఒక వేదిక నిర్మించారు. రథం అక్కడికి చేరుకోగానే బాబాను ఆ వేదికపై ఆసీనులను గావించారు. సనాతన ప్రభువును స్తుతిస్తూ పాటలు పాడారు బాబా ఆసీనులు కాగానే పూలమాలలతో సత్కరించారు. త్వరలోనే దర్శన కార్యక్రమం ప్రారంభమయింది. స్త్రీలు పిల్లలు ఒక వరుసలోను పురుషులు ఒక వరుసలోను వెళ్ళి బాబా దర్శనం చేసుకుంటున్నారు. బాబా వారిని ఆశీర్వదించి ప్రసాదం పంచిపెడుతున్నారు. అందరు క్రమశిక్షణతో మెలగారు. బాబాకు పళ్ళు పువ్వులు పూలదండలు యిచ్చి వారి ప్రేమను వ్యక్తపరచుకున్నారు. కొందరు డబ్బులు కూడా యిచ్చారు. పెద్దంటున్నా చాలా మంది వారి పాదపద్మాలను స్పృశించి కళ్ళకద్దుకున్నారు. కొంచెం సేపయాక బాబా లేచి పంచాయతీ హాలుకి వెళ్ళారు. అక్కడ బాబాకు అల్పాహారాలు పెట్టారు. మండలివారు కూడా బాబా అనుమతితో అల్పాహారాలను తీసుకున్నారు. బాబా ఒక కప్పుసు చవిచూచి అందలి కాఫీని మౌనిబువా కిచ్చారు. బాబాను మరల దర్శనం యిమ్మని చాలా దూరంనుంచి అందుకోసం వచ్చారని చెప్పారు. బాబా ఒక షరతు మీద ఒప్పుకున్నారు. వారి పాదాలు ఎవరూ ముట్టుకోకూడదన్నారు. అందరూ సరే అన్నారు. అప్పుడు బాబా మరల పందిట్లో వేదిక మీద కూర్చొని దర్శనాలిచ్చారు. బాబా ఆరోజు సాయంత్రానికి తిరిగి సతారా వెళ్ళిపోయారు.

మరునాడు (25-1-56) కొందరు యితర గ్రామాల నుంచి వచ్చి బాబాను వారి గ్రామాలకు దయచేసి వారిని అక్కడ ఆశీర్వదించాలని కోరారు. కాని బాబా కార్యక్రమం తారీఖులతో సహితంగా యిదివరకే నిశ్చయం అయిపోయినందు వలన ఫిబ్రవరి (1956) 15 వ తేదీనుంచి బాబా ఒక యేడాదిపాటు ఏకాంతవాసంలో ఉంటారు గనుక సతారా జిల్లాలో, యిక యే గ్రామానికి ప్రస్తుతంలో రాలేనని చెప్పారు. కుమ్తాలో దర్శన కార్యక్రమం వల్ల వారందరికి ఉత్తేజం కలిగి గ్రామీణులు ప్రతిరోజూ సతారాకి వచ్చి బాబాను దర్శనం చేసుకుంటున్నారు. తరువాత బాబా యింక ఎవరికీ దర్శనాలివ్వడం మానేశారు.

నవంబరులో జరిగిన సహవాస్‌లో మొదటి వారంలో సాకోరీనుంచి గోదావరి మాత తన శిష్యురాండ్రు కొంతమందితో వచ్చింది మెహెరాబాద్‌కి. అప్పుడు ఆమె బాబా దర్శనం చేసుకున్నపుడు సాకోరీకి బాబాను రమ్మని ప్రార్థించింది. వచ్చి అక్కడ వారం రోజులయినా విశ్రాంతి తీసుకోమంది. ఆ ప్రకారంగా బాబా అక్కడికి వెళ్ళ

డానికి ఏర్పాట్లు చేస్తున్నారు. గోదావరి అప్పుడు ఆయన ఆహారం విషయంలో స్వయంగా జాగ్రత్త తీసుకుంటానంది. బాబా యే చెప్పారు ఆయన గనుక అక్కడికి వచ్చి ఉంటే గోదావరి స్వయంగా అన్నం వండి పెట్టాలన్నారు. ఆమె ఆయనకి (శ్రీకృష్ణుని తల్లి యశోద) తల్లికదా. తరువాత ఆయనకున్నపని వత్తిడి వలన వారం రోజులుందామనుకొన్నది రెండు రోజులకి తగ్గించినట్లుగా బాబా ఆమెకి వ్రాయించారు. కొద్దిరోజులయిన తరువాత బాబా రెండు రోజులుందా మనుకున్నది రెండు గంటల కన్న ఎక్కువ ఉండటానికి వీలులేదని వాగ్దానం చేసినట్లు తప్పక సాకోరీకి బాబా వస్తారని చెప్పి రమ్మని ఆదీ (సీనియర్) ని పంపించారు; ఆదీ వెళ్ళి యీ సంగతి చెప్పినపుడు గోదావరి మాయికి ఆశాభంగం కలిగింది. ఆఖరికి ఒక్క రోజయినా బాబా అక్కడ ఉండాలని ఆమె ప్రార్థించినట్లుగా చెప్పమంది.

ఆఖరికి 26 వ తేదీన బాబా అక్కడికి వెళ్ళి ఉదయం 8 గంటల నుంచి సాయంత్రం 6 గంటల వరకు ఉంటానని నిశ్చయించుకున్నారు. బాబా అక్కడ యీ ప్రకారం ఉంటారు గాని దర్శనం యివ్వనన్నారు. ఆసమయంలో అయన తల్లి చేత్తో వండిన అన్నం తింటానన్నారు. 25 వ తేదీ సాయంకాలానికి బాబా కొద్దిమంది మండలితో సతారా నుంచి పింపలగాం కి వచ్చారు. బాబా సాకోరీ కి గాని గోదావరి మాయి యిచ్చవచ్చిన ఎక్కడికయినా వస్తారని ఆమె స్వయంగా వండిన అన్నం ఆయన తింటారని దర్శన కార్యక్రమం ఉండకూడదని మరల బాబా ఆదీ చేత కబురు పంపారు. బాబా వచ్చినందుకు స్వాగత మివ్వడానికి ఎట్టి కార్యక్రమము ఉండకూడదన్నారు. 26 వ తేదీ ఉదయం పెందరాళే సాకోరీ వెళ్ళి బాబా చెప్ప మన్నట్లుగా ఆదీ గోదావరి మాతకు చెప్పాడు. "నన్ను బాబా ఆయన తల్లి యశోదగా చూస్తారు గనుక సాకోరీలో సాయంత్రం వరకు (6 గంటల వరకు) ఉండాలని నా ఇచ్ఛ" అని గోదావరి ఆదీతో చెప్పింది.

## సాకోరీలో (26-1-56)

26 వ తేదీ ఉదయం బాబా 7-30 గంటలకు బయలుదేరి రహతా అనే దారిలోని గ్రామానికి 8-40 కి చేరుకున్నారు. అక్కడి నుంచి సాకోరీ యింక ఒక మైలు దూరమే ఉంది. రహతా వద్ద ఆదీ బాబాను కలుసుకొని గోదావరి మాయి చెప్పిన మాట చెప్పాడు. తల్లి చెప్పిన కబురు విని బాబా చాలా సంతోషించారు.

బాబా సాకోరీ చేరినపుడు ఆశ్రమవాసులు, గోదావరిమాత ఆయనకు హార్దికంగా స్వాగతం యిచ్చారు. అవతార్ మెహెర్‌బాబాకి జై అనే నినాదాలు చెలరేగుతుండగా పుష్పమాలలతో ఆయనను అలంకరించారు. ఆశ్రమ నిర్వాహకుడుకూడా గౌరవంతో బాబాకు స్వాగతం యిచ్చాడు. ఆశ్రమవాసులు, సాకోరీ భజన మండలివారు, బడిపిల్లలు అక్కడికి వచ్చినవారు భక్తులు అందరు కలిసి బాబాను ఊరేగించి లోపలికి తీసికొని వెళ్ళారు. సన్నాయిమేళంతో చక్కగా అలంకంచిన గుఱ్ఱంతో ఊరేగింపు సాగింది. ముఖ్యపురోహితుడు దేవాలయానికి ఎదురుగా బాబాకి పూజగావించాడు. బాబా కారు నెమ్మదిగా యశ్వంతరావు యింటిముందునుంచి ఆశ్రమంలోనికి వెళ్ళింది. బాబా కారు దిగారు. గోదావరిమాయి ఆయన పాదాల కెరగి ఆయన మెడలో కుసుమాల మాల వేసింది. ఆమె శిష్యురాండ్రయిన కన్యలు కూడా అలాగే చేసారు. బాబా అక్కడ ఒక సోఫాలో కూర్చున్నారు. ఆశ్రమవాసులు కన్యలు బాబాకు హారతి యిచ్చారు. బాబా గోదావరిమాత ఆరోగ్యం గురించి కుశలప్రశ్న వేసారు. తరువాత సాయంత్రం 4 గంటల వరకు సాకోరీలో ఉంటానని ఆమెకు చెప్పారు. బాబా ఆ సోఫానుంచి లేచి అక్కడి కుటీరం లోపలికి వెళ్ళారు. తరువాత ఉపాసనీ మహరాజ్ సమాధి గదిలోనికి వెళ్ళి అక్కడ మహరాజ్ కూర్చునే పరుపుకి ఎదురుగా బాబా కోసం, ఏర్పాటుచేసిన మెత్తమీద కూర్చున్నారు. అప్పుడు ఒక కన్య ఉపాసనీ మహరాజ్ కోసం బాబా రచించిన ఒక పాట పాడింది. ఈ పాట మామూలుగా మహరాజ్ బ్రతికియున్నపుడు పాడబడేది. తరువాత ఆ కన్య బాబాను స్తుతిస్తూ యింకోపాట పాడింది. బాబా గోదావరిమాయి ఏం చేస్తోందని అడిగారు. ఆమె బాబా కోసం అన్నం వండుతోందని వంట యింటిలో ఉందని చెప్పారు. అప్పుడు మానేజరు (నిర్వాహకుడు) అయిన వాఘ్‌ను కుటీరమందువిద్యుద్దీపాలు క్రొత్తగా పెట్టించారా అని అడిగారు. అప్పుడప్పుడు తాత్కాలికంగా పెట్టించినట్లే పెట్టించామని అతడు తెలిపాడు. బాబా అప్పుడు తాత్కాలికంగా గాక శాశ్వతమయిన ఏర్పాటు చేయిస్తే మంచిదన్నారు. బాబా యిప్పుడు అలా చెప్పారు గనుక శాశ్వతంగానే ఆఏర్పాటు యింక జరుగుతుందని వాఘ్‌తో ఉన్న యింకొకడన్నాడు. బాబా అప్పుడు ఆస్థలం అంతా చాలా బాగుంటుందన్నారు. జిజియామొక్క సోదరుణ్ణి బాబాకు అప్పుడు పరిచయం చేసారు. జిజియాబాయికి వంట్లో సుస్తీగా ఉంది. అందుచేత ఆమె అక్కడికి రాలేదు. ఆమె హైదరాబాద్‌లో ఉండి ఔషధ సేవచేస్తోంది. బాబా ఆశ్రమానికి వచ్చారని

ఆమె ప్రత్యేకంగా తన సోదరుణ్ణి సాకోరీకి పంపించింది. పంపిస్తూ బాబాని ఆమె గదిలో కూర్చోబెట్టి హారతి యిమ్మని తమ్మునితో చెప్పింది. మహరాజ్ దయవల్ల మెహెర్‌బాబాను మా మధ్య ఉంచుకున్నందుకు మేమందరం చాలా అదృష్ట వంతులం అన్నాడు జీజీతమ్ముడు. అతడు చాలా ఆనందంతో ఉల్లాసంగా ఉన్నాడు.

కొద్దిసేపట్లో బాబా లేచి వంటయింటిలో తమకోసం వంట చేస్తూన్న గోదావరి మాత వద్దకు వెళ్ళారు. బాబా కన్యలతో అక్కడ కూర్చొని గోదావరిమాతకు పూరీలు చెయ్యడంలో సహాయపడ్డారు. బాబా ఆమెవలె అంత సమర్థవంతంగా చేయలేక పోయినా ఆయన చేతలవల్ల కన్యలకు గోదావరికి నవ్వు కలిగింది. "మీకు త్వరగా విద్యుద్దీపాలు రావాలి" అన్నారు బాబా. "నాకు యిప్పుడు ఆకలిగా ఉంది. నాకు యిప్పుడు కావలసింది భజన కాదు భోజనం" అని బాబా గోదావరిమాతతో అన్నారు. అందరూ నవ్వుకున్నారు. బాబా యింకా "నాతలమీద చాలా బరువుంది. రేపు నేను సంగమ్‌నేర్ వెళ్ళి ప్రజాదర్శన మివ్వాలి. తరువాత నవసారికి కి, బిజ్వాకి వెళ్ళాలి. ప్రపంచమంతా ఎంతో బాధలతో ఉంది. కాని మనమిక్కడ ఎంతో ఆనందంగా ఉన్నాము. నా యశోదమాత పెట్టిన అన్నం చాలా కాలానికి తినబోతున్నాను. నే నెప్పుడూ శాశ్వతానందంలోనే ఉన్నాను. నేను అదే సమయంలో అందరిలోనూ ఉన్నాను గనుక వారు పడే బాధలన్నీ నేను కూడా అనంతంగా పడుతున్నాను. నాకు యిక్కడే ఉండాలని, నా యశోదమాత పెట్టిన అన్నం తింటూ గోపికాయలాడుటూ ఉండాలని ఉంది. దర్శనాలిస్తూ ఆరతి పుచ్చుకుంటూ, పూజలందుకుంటూ ఉండడం కంటె అదే యిష్టం నాకు. నేను యెప్పుడూ స్వేచ్ఛగా ఉంటున్నా కావాలని నేను బంధనంలో ఉంటున్నాను. అందరిమీదా నాకు ఉన్న ప్రేమచేతనే యిలా ఉన్నాను." అన్నారు.

"ఇక్కడ చాలా వేడిగా ఉంది. నీకు చెమటకూడా పడుతోంది. ఇక్కడ నుంచి అప్పుడే వెంటనే బయటకు వెళ్ళకు. బయట ఉన్న చల్లదనం వల్ల నీకు జలుబు చేయవచ్చు. అని బాబా ఎంతో ప్రేమతో గోదావరిమాత వద్దకు వెళ్ళి ఆమె వీపు మీద తట్టుతూ అన్నారు. బాబా వంటయింటిలో నుంచి యీవలికి వచ్చారు. అప్పుడు కాకా అని మహరాజ్ యొక్క భక్తుడొకడు బాబాను కౌగిలించుకున్నాడు. అప్పుడతనికి ఉద్వేగం కలిగింది. కళ్ళవెంట అశ్రుపులు కూడా రాలాయి. అప్పుడు బాబా త్వరగా వాఘ్‌తో నడిచి వెళ్ళి కుటీరంలోకి మరల ప్రవేశించారు. వాఘ్‌ని చూసి

బాబా "నీకు బలం చాలానే ఉంది" అన్నారు. వాఘ్ బాబా కూర్చునే ఆసన్ వద్దకు తీసికొని వెళ్ళాడు. ఇంతలో గోదావరిమాయి పంట పూర్తి చేసుకుని చెంగుతో చేతులు తుడుచుకుంటూ బాబా ప్రక్కన కూర్చుంది. అప్పుడు బాబా తమ మండలిని మహరాజ్ సమాధికి మ్రొక్కమన్నారు. ఎంతో గౌరవంతో వారట్లు చేసారు.

అప్పుడే నోషిర్ అనే బాబా భక్తుడొకడు బొంబాయి నుంచి వచ్చి బాబాకు పుష్పమాల వేసాడు. అతన్ని కూడా బాబా మహరాజ్ సమాధికి సాష్టాంగ వందనం చేయమన్నారు. అప్పుడు భజన బృందం వారు భజన ప్రారంభించేసారు. తబలా ఎలా వాయిస్తున్నాడో బాబా పరిశీలించి చూసారు. తరుచుగా బాబా గోదావరిమాయిని ఆమె ఆరోగ్యం గురించి జాగ్రత్త తీసుకోమని హెచ్చరిస్తూ వచ్చారు. గదిలో వాతావరణం చల్లగా ఉంది. ఆమె వెచ్చటి దుస్తులు తొడుక్కోలేదు. తల్లీ కొడుకులట్లు (యశోదా కృష్ణులు) దగ్గరగా కూర్చుని మాట్లాడు కుంటూంటే అది ఒక నేత్ర పర్వమయిన దృశ్యంగా ఉంది.

బాబా భజన ఆపించి — "నేను యిప్పుడు చెప్పినది అర్థం చేసుకోడానికి ప్రయత్నించండి. ఎరచ్‌కి నా సంజ్ఞలు బాగా తెలుసును. అతడే అక్షరాల పలక ద్వారా నేను చెప్పిన భగవద్వచనం అనే గ్రంథం వ్రాసాడు. ఎరచ్ యిదివరకు లావుగా ఉండేవాడు. ఇప్పుడు చిక్కిపోయాడు. అతడు బాగా తినడు. బాగా నిద్ర పోడు. షికార్లకివెళ్ళడు. ఆకలి కూడా తగ్గింది. నాకోసం చాలా పాటుపడుతున్నాడు.

నానోవరి మణి కూడా నాకోసం ఎంతో పనిచేస్తోంది. పాశ్చాత్యులతో ఉత్తర ప్రత్యుత్తరాలు ఆమెయే చేస్తోంది. రోజంతా పాపం ఆమెకు టైపుచేయడమే పని. వారిద్దరియెడల కూడా నాహృదయములో నాకు జాలి లేదు..ఎవరియెడలా లేదనుకోండి. నా హృదయం ప్రేమమహాసాగరం అన్నమాట నిజం. ఆ ప్రేమ వల్లనే నాభక్తుల శరీరం, మనస్సు, హృదయం పిండి చేస్తున్నాను. ధూళి అయిపోతే గాని వాళ్ళు అమృతత్వం పొందలేరు.

మీకు కనిపించే నాశరీరం కాదు నేను. మీరు చూసేది, ఆలోచించేది, మీకు తగిలేది నేను కానేకాదు. నేను అందరిలోను ఉన్నాను. అన్నిటిలోను ఉన్నాను. నేను అసలయిన వస్తువును. నేను శాశ్వత ఆనందంలో ఉన్న ఏకైక పరమాత్మను."

(మహరాణ్ యొక్క విగ్రహం వైపు చూపిస్తూ "ఆ ముసలాయన నన్ను క్రిందికి దింపాడు. మీరు ఎప్పుడేనా పొందే ఎక్కువ రకం ప్రాపంచిక సుఖం అనంతానందానికి ఏడవ ఛాయ మాత్రమే.)

నేను గోదావరిమాయిని ఎంతో ఎక్కువగా ప్రేమిస్తాను. ఇదంతా ఆమెకు నాతో ఉన్న పూర్వసంబంధం వల్లనే. నాతో ఆమెకి అనేక సంబంధాలున్నాయి" అని చెప్పారు బాబా. అప్పుడు మాధవరావు వైపు తిరిగి "అందరికి నిద్ర వస్తున్నట్లుంది గనుక మంచి పాటపాడు." అన్నారు. తరువాత బాబా తమ మెడలోని గులాబీ దండలోని ఒక రేక తీసి జిజీ తమ్ముడికి యిచ్చి తినమన్నారు. అతడా రేకను అలాగే తినేసాడు. అప్పుడతడు హైదరాబాదులో వాళ్ళక్క జిజీ గొప్ప ఆధ్యాత్మికపు పని చేస్తోందన్నాడు. అని బాబాకు చెప్పాడు. ఆమె అనారోగ్యంగా ఉన్నా ప్రతిరోజూ కొంతమంది బీదవారిని కలుసుకొనేది. ఆ ఊళ్ళో ఉపాసనీ బాబాకి ప్రతిరోజూ పని చేస్తోంది. ఆమె ఆయన్ని అంత ప్రేమిస్తోంది" అని బాబాతో చెప్పగా బాబా అన్నారు — "జిజీ యొక్క పని హైదరాబాద్‌లో కొనసాగేలా చూడు ఆమె యీ పనికి అంతరాయం రాకూడదు. బాబా అప్పుడు కన్యలకు, ఆశ్రమవాసులకి, యితరులకి, ప్రసాదం పంచిపెట్టారు. ప్రసాదం పంచిపెడుతూ బాబా "పూనాలో దర్శన కార్యక్రమం లో 15 వేల మందికి ప్రసాదం పంచిపెట్టానని గోదావరి మాయితో చెప్పారు, ఇప్పుడు ఆయన చాలా అలసిపోయి ఉన్నానని చెప్పారు. అందరికి ప్రసాదం యిచ్చాక బాబా కొంచెం ప్రసాదం తీసుకొని తమ చేత్తో గోదావరిమాత నోటిలో పెట్టారు. అప్పుడు బాబాను చాలా కాలంగా రోగగ్రస్తురాలయి ఉన్న ఒక కన్య గదిలోకి తీసికొని వెళ్ళారు. బాబా ఆమెకు కొంచెం ప్రసాదం పెట్టి ఆమె చేతిని తీసుకొని ఆయన చేతిలో కొద్దిసేపు ఉంచుకున్నారు. తరువాత ఎంతో ప్రేమతో ఆయన ఆమె ముఖమును చేతితో నిమిరారు. అక్కడనుంచి లేచి బాబా జిజియాబాయి గదిలోకి వెళ్ళగా జిజీ తరపున ఒక కన్య ఆయనకు హారతి యిచ్చింది. జిజీ తమ్మునితో బాబా "జిజీ నన్ను ఎక్కువుగా ప్రేమిస్తుంది. నా ప్రేమను ఆమెకు తెలుపు" అన్నారు. జిజీ గదిలోంచి బాబా భరూచా యింట్లోకి వెళ్ళారు. అతడు కటి ప్రదేశంలోను తొడలోను నొప్పివల్ల బాధపడుతున్నాడు. అతడు ముసలివాడు.బాబా తనయింటికి వస్తారని బాబా కోసమే యెదురు చూస్తున్నాడు. అక్కడికి వెళ్ళి బాబా అతనిని కౌగిలించుకున్నపుడు భరూచాకు బాష్పధారలు వెలువడ్డాయి. భరుచా బాబాను తన పూజ గదికి తీసికొనిపోయి అక్కడ "భగవద్వచనం" పుస్తకం చూపించి అది

చదివిన భాగం మరిచిపోతున్నానని చెప్పాడు. బాబాఅతన్ని మళ్ళీమళ్ళీ చదవమన్నారు. అని, బాబా ఆ పుస్తకాన్ని స్పృశించారు. ఇప్పుడు ఆ గ్రంథాన్ని బాబా తాకారు గనుక దానిని మళ్ళీ చదువుతానన్నాడు ధరూచా. బాబా ధరూచా మంచం మీద కూర్చొని యింకొకరు పరుండే పడకమీద నేను సాధారణంగా కూర్చొనన్నారు. ఏమీ విచారించ వద్దని బాబా ధరూచాతో అన్నారు. "ఉపాసనీ మహరాజ్‌కి నేను అంకితం అయి పోయాను. అందువేత నా కింక విచారంలేదు" అన్నాడు ధరూచా. తరువాత బాబా ధరూచా గృహము విడిచివెళ్ళారు.

తరువాత బాబా యశ్వంతరావింటికి వెళ్ళారు. అక్కడ కొంచెంసేపు ఆగారు. అక్కడ ఉండగా గోదావరిమాయి భోజనం సిద్ధంగా ఉందని కబురు చేసింది. అప్పుడు బాబా లేచి యశ్వంతరావు యింటినుంచి గోదావరిమాత గదికి వెళ్ళారు. ఆ మాత ఆయనకు వడ్డించి తినమంది. బాబా తింటూండగా యీ కూర వేయించుకుని తిను. బాగాలేదా. ఇది రుచి చూడు అని అన్నం పప్పు యింకొంచెం వేయించుకో అని ఆ మాత తనయునిచేత తినిపించింది. బాబా తినడం అయిపోయాక ఆయన కంచం లోని మెతుకులు పోగుచేసి కన్యలందరకు ప్రసాదం పంచిపెట్టమని చెప్పారు. ఇతరులవైపు తిరిగి బాబా "ప్రపంచంలో స్త్రీలలోకెల్ల గోదావరిమాయి పరిశుద్ధమయిన హృదయం కలిగి ఉంది ఆమెను నేను చాలా ప్రేమిస్తున్నాను. ఆమె నన్ను ప్రేమించ గలిగిన దానికంటె యెక్కువ నేనామెను ప్రేమిస్తాను." అన్నారు.

బాబా బయటకు వచ్చి ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. సింహళం నుంచి అప్పుడు సచ్చిదానందమాత వచ్చింది. ఆమె యింతకు ముందు బాబాను చూడాలని సంభాషించాలని కోరుకుంది. ఆమెను ఆవరణలోచూసి ఎరచ్‌ను తీసుకొని బాబా ఆమెవద్దకు వెళ్ళి కొద్దినిమిషాలు మాట్లాడారు. స్వామి శివానంద సరస్వతి తరఫున దివ్యజీవన సంఘానికి సిలోన్‌లోని శాఖను ఆమె నిర్వహిస్తోంది. బాబా మళ్ళీ చెట్టు క్రింద కూర్చుని ఒక రబ్బరు బంతి ఆడడానికి యిమ్మన్నారు. వెంటనే బంతి తీసుకువచ్చారు. బాబా కన్యలతో ఆడడం ప్రారంభించారు. ఆయన విసరడం వాళ్ళు పట్టుకోవడం. ఈ ఆట కొంతసేపు ఆడారు. కన్యలందరు ఉల్లాసంగా ఉన్నారు. అందరు బంతి కింద పడిపోకుండా పట్టుకుందామని ప్రయత్నించారు. కాస్సేపు ఆడాక బాబా కన్యలందరిని అన్నం తినమని వెళ్ళమన్నారు. బాబా దర్శనానికి యశ్వంతరావు యింటిలో దర్శనార్థులు వేచియున్నారని తెలిసి అక్కడికి వెళ్ళారు

బాబా. అక్కడ బాబా ఆసీనులయాక భజనలు ప్రారంభించారు. అక్కడ ఉన్నవారు బాబా దర్శనం చేసుకుని ఆయనకు పూలమాలలు వేసారు. బాబా కొంచెంసేపయాక కుటీరం లోనికి వెళ్ళి సభామండపంలో కూర్చున్నారు. గోదావరిమాయి వచ్చి ఆయనకు దగ్గరగా కూర్చుంది. భోజనం అయిందా అని ఆమెను బాబా అడిగారు. తమ ప్రసాదం కన్యలకు పెట్టావా అని అడిగారు. ఆమె అవునని జవాబిచ్చింది. ఆరోజున సాకోరిస్థాన్‌లో వాతావరణం ప్రేమప్లావితమై ఎంతో చనువు సన్నిహితత్వముతో నిండిపోయింది

మెహెరాబాద్ పూర్వం సహవాస్ కార్యక్రమాల్లో తాము చాలా ప్రవచనాలు చేసానని భక్తులకు ఎన్నో వివరించి చెప్పానని బాబా చెప్పారు. "అందులో ఒక ప్రవచనం అసత్యంగా ప్రవర్తించడం మీద ఉన్నది. అసత్య ప్రవర్తనం అంటే యేమిటి? ఏదో తెచ్చిపెట్టుకోవడం, తాను కాని దాని లా ప్రవర్తించడం. పైకి మాత్రం అలా కనిపించేలా ఉండడం. దేవుడు అందరినీ అన్నిటికీ క్షమిస్తాడు గాని యీ కపటం మాత్రం క్షమించడు. సహవాస్ కార్యక్రమాలకి కొద్దినెలలకుముందు చచ్చిపోయిన ఒక బిడ్డ భజన చేస్తూంటే బ్రతికిందని తెలిసింది. సంకీర్తన జరుగుతూంటే జబ్బుగా ఉన్న ఒక చిన్నపిల్ల మరణించి సంకీర్తన యింకా తీవ్రం చేసేసరికి మళ్ళీ బ్రతికిందట. ఈ విషయం నాకు సంతోషం కలిగించలేదు సంకీర్తన చేసిన నా భక్తుడు చనిపోలేదా అని ఆలోచించాను. ఆధ్యాత్మిక మార్గంలో సిద్ధులు కలిగిన వాళ్ళున్నారు. వాళ్ళు చచ్చిపోయిన వారిని కూడా బ్రతికించగలరు. వారు ఆ మాయ యొక్క బోనులో పడతారు. నేను అటువంటి చమత్కారాలు అద్భుతాలు చేస్తాననుకోకండి. సూర్యుణ్ణిచూసి అదేదో వెలుతురు శక్తి కలిగినదనుకుంటారు. వాస్తవంగా సూర్యుడు దాని శక్తి, ప్రకాశము ఒక సద్గురువు కలిగించే అసలు దానికి 7 వ ఛాయమాత్రమే. బాబా యింకా యిలా చెప్పారు. "పూర్వకాలం ఋషులు, మునులు యీ గోళీలాట కనిపెట్టారు. ఆట గెలవడానికి ఒక ఆటగాడు గోళీకాయను 14 మారులు కొట్టాలి అది సప్త అవరోహణలు, సప్త ఆరోహణలు చేయవలసిన దివ్య ఖేలనాన్ని సూచిస్తోంది." అని చెప్పి బాబా గోదావరిమాయి గదికి వెళ్లారు. గోదావరిమాయి కన్యలుఆయనను అక్కడికి తీసికొనివెళ్ళారు. మాయి ఉపయోగించే ఊయల బల్లమీద కూర్చున్నారు. అక్కడికి తెల్లని ఒక కుందేలును తీసికొని వచ్చారు. బాబా ఆ కుందేలుని వళ్ళో పెట్టుకుని కొంతసేపు ఆడారు దానితో. తరువాత దానిని గోదావరిమాయికి అందించారు. అప్పుడు ఎరచ్ అన్నాడు – బాబాకి శివా

అనే ఆడగుఱ్ఱం అంటే యిష్టం. ఆయన దాని వద్దకు కొరడు పెట్టడానికి వెళ్ళినప్పుడల్లా అది బాబాను ముద్దుపెట్టుకుంటుంది. కన్యలవైపు చూసి దాదా – "మీరందరు గోదావరి మాయిని ప్రేమించాలి." అన్నారు. అప్పుడే గడియారం ఠంగుమని కొట్టింది. అది విని ఒక కన్య అంది – "గడియారం దాదా అభిలాషను అవునంటోంది." మిగిలిన కన్యలందరు అవునన్నారు. మళ్ళీ కన్యలవైపు తిరిగి బాబా "మీలో ఎవరు బాగా పాడ గలరు? అని అడిగారు. పాటగలిగిన ఒకకన్య తబలా హార్మోనియం కోసం పంపించింది. బాబా గోదావరిమాయి వైపు చూసి "నీవు ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోవాలి. ఈ వేసంగిలో ఎక్కడికీ సంచారం కోసం వెళ్ళవద్దు. నీవు వేసంగిలో యిక్కడ ఉండడం కూడా ఆరోగ్యానికి మంచిదికాదు. మే నెలలో ఎక్కడి కయినా చల్లని కొండ ప్రదేశానికి వెళ్ళి ఉండడం మంచిది. ఆ నెలలో ముస్సోరిలో ఉంటే మంచిది. అది మంచి స్థలం. హార్మోనియం తబలా రాగానే ఆ కన్య పాట మొదలు పెట్టింది. పాట అవగానే బాబా అన్నారు – "నేను 15 రోజులపాటు అమెరికాకి 2 రోజులు, ఇంగ్లండులో ఉండడానికి వెళ్ళాలి. ఆరు నెలలు అయిన తరువాత పాశ్చాత్య దేశాలలో ఒక సినిమాతార నా 'భగవద్వచనం'చదివి నన్ను ఎంతో ప్రేమించసాగింది. ఆమెకు నేనంటే ఎంతో గౌరవం ఏర్పడింది. వచ్చే 15 వ తేదీనుంచి (15–2–56) నేను ఒక సంవత్సరం పాటు ఏకాంతవాసంలో ఉంటాను. నేను అమెరికాకి ఇంగ్లండుకి వెళ్ళిరావడం యీ ఏకాంతవాసం మధ్యలో నన్నమాట. నేను తిరిగి వచ్చాక మళ్ళీ ఏకాంతం పాటిస్తాను. బాబా అన్నారు –

"నేనివ్వాళ చాలా ఆనందంగా ఉన్నట్టున్నాను. గోళీకాయలాడాను. మీ అందరి తోను తమాషాగా మాటలాడాను. నిజంగా నేను చేసేవనిని నన్ను ఎవరూ అర్థం చేసుకోలేరు. నేను వాగ్దానాలు చేయడమే గాని ఏవీ నిలబెట్టుకోనని అనుకుంటారు. కాని అవన్నీ నేను పాటిస్తాను. ఈ విషయంలో కృష్ణునివలె, రాముని వలెను చేస్తూంటాను. నేను ఆ కృష్ణుని, రాముని కూడా కదా. అప్పుడు కృష్ణుని కథలు చెప్పమని బాదాను అడిగారు. అప్పుడు కుమార్ యీ విధంగా చెప్పాడు. ఉత్తర యొక్క కొడుకయిన పరీక్షిత్తు మొదట్లో మృతుడై పుట్టాడట. అప్పుడు కృష్ణుడు అన్నాడుట. నేను అద్భుతాలు చేయలేదు. నేను అబద్ధాలు చెప్పనివాడినయితే, యిచ్చిన వాగ్దానాలు భంగం చేయనివాడినయితే, ఎవరికీ ఎప్పుడూ, అపకారం చేయనివాడినయితే, అలాగయితేనే, యీ బిడ్డ సజీవుడై యుండుగాక' బాబా అన్నారు——"ఆబిడ్డ వెంటనే జీవించింది. చూసి అందరు ఆశ్చర్యపోయారు. అప్పుడు కృష్ణుడు చేసిన ప్రార్థన

అందరికీ ఆసక్తి కలిగించింది. దానితో కృష్ణుడు చెప్పినవి అబద్ధాలు కావని, పైకి అలా కనిపించినా ఆయన చెప్పినట్లు చేసాడని బంధువులందరు తెలుసుకున్నారు.

బాబా అప్పుడు ఆ కన్యను యింకో పాట పాడమన్నారు. గానం ప్రారంభం అయాక బాబా కొంచెంసేపు ఏదో ఆలోచిస్తున్నట్లు కూర్చున్నారు. తరువాత అభజన యొక్క తాళాన్ని మృదంగం మీద బాబా వాయించారు. ఆవిధంగా గోదావరిమాయి, కన్యలు కూడా తాళం వేసారు. అందరు కలిసి బాబా ఆఊయల మీద కూర్చొని ఉండగా వెనుక ఉపాసనీమహరాజ్ ఊయలమీద కూర్చున్నప్పుడు పాడినపాట పాడారు.

బాబా అప్పుడు బయటకు వచ్చి నూతివైపు వెళ్ళారు. కన్యలందరు చూసి బాబా అలా ఎక్కడకు వెళ్తున్నారు, బహుశా దారి తప్పారేమో అని చూస్తున్నారు. కాని బాబా నూతిలోకి తొంగిచూసి వేసంగికి నీరు సరిపోతుందా అని చూసారు. గోదావరి మాయి బాబాను వెనక్కు టీ తీసుకుందురు గాని రండని పిలిచింది. ఆమె గదిలోనికి వెళ్ళి బాబా టీ కొంచెం రుచి చూసారంతే. బాబా అన్నారు – "నేను భోజనం చేసాను, గోళీలాడాను, టీ తీసుకున్నాను, ఉయల ఊగాను, దర్శనం యిచ్చాను, ప్రసాదం పంచిపెట్టాను, భజనకీర్తనలు పాడగా విన్నాను, రోజంతా యశోద దగ్గిర గడిపాను. ఇప్పుడు ఇంక నేను వెళ్ళిపోవాలి." అని బాబా త్వరగా గుళ్ళోకెళ్ళారు. అక్కడ బాబాకి హారతియిచ్చారు. తరువాత మహరాజ్ ఉండే గదిలోకి వెళ్ళారు. బాబా అక్కడ నిలబడి గడేకార్‌ని హారతి పాడమన్నారు. అదయిన తరువాత మండలి వారిని మహరాజ్ వేసుకునే పాదుకలకి మ్రొక్కమని చెప్పారు. అందరూ ఎంతో గౌరవంతో ప్రణమిల్లారు.

"ఈ గదిలోనే మహరాజ్ చేతులు జోడించి నాకు, నేను అవతారుడనని చెప్పాడు." అన్నారు బాబా. బాబా త్వరగా వెళ్ళి కారులో కూర్చున్నారు. అందరూ ఆయనకు నమస్కారాలు చేసారు. 'అవతార్ మెహెర్ బాబా కి జై' అని అరిచారు. మెహెరవతార్ కి జై అని జయధ్వానాలు చేసారు. బాబా గోదావరిమాయి వైపు చెయ్యి ఊపారు. సరిగ్గా 4 గంటలకు మెహెరాజాద్ వైపుకి కారు కదిలి వెళ్ళింది. సూర్యాస్తమయం అవకుండా బాబా పింపల్‌గాం కి చేరుకున్నారు. బాబాను షిర్డీ కూడా రమ్మని ఆహ్వానం వచ్చింది కాని వ్యవధి లేనందున అంగీకరించలేదు.

## సంగమ్‌నేర్ కార్యక్రమం :—(27-1-56)

9 గంటలనుంచి 4 గంటలవరకు 26వ తేదీన బాబా సాకోరీలో గడిపారు. ఆరాత్రి మెహెరాబాద్‌లో విశ్రాంతి తీసుకున్నారు. సంగమ్‌నేర్ పింపల్‌గామ్ కి 55 మైళ్ళ దూరం ఉంది. ఆఊళ్ళో 18,000 మంది జనాభా ఉన్నారు. ఆ ఊళ్ళో బాబా బహిరంగంగా ప్రజలకు దర్శనం యివ్వడం యిదే మొదలు. అక్కడ ఉన్న బాబా భక్తులకి, బాబాను ఆహ్వానించిన వారికి అన్నివేలమంది బాబా దర్శనం కోసం వస్తారని తెలియదు. బాబా మొదటిమాటు వచ్చారుకదా అని కొద్దివేలమందే వస్తారని అంతంతమాత్రంగానే ఏర్పాట్లు చేసారు. చిన్న పందిరే వేసారు. బాబా దర్శనం యిచ్చినపుడల్లా వరుసలలో జనం రావడానికి బలమైన ఏర్పాట్లు ఉండాలి. తరువాత పురుషులు స్త్రీలు పిల్లలు వేరే వేరే రావడానికి కూడా ఏర్పాట్లు చెయ్యాలి.

27 వ తేదీని బాబా ఉదయం 8 గంటలకి సంగమ్‌నేర్ చేరుకున్నారు. సంగమ్‌నేర్‌లో ఉన్న కొద్దిమంది బాబా భక్తులు ఆయనకి స్వాగతం చెప్పారు. పందిరి ప్రక్కనున్న గదిలో బాబాను దింపి అక్కడ ఆఊరిలోని పెద్దలను బాబాకు పరిచయం చేసారు. పందిట్లోకి బాబా వెళ్ళినపుడు పందిట్లో కూర్చున్న కొద్దివందల మందీ లేచి జయధ్వానాలు చేసారు. వారు బాబా వద్దకు రావడం మొదలుపెట్టగానే బాబా వేదిక మీద అంచున కూర్చొని వారికి ప్రసాదాలిచ్చారు. కొద్దిసేపు అయిందో లేదో వేంకొలది జనం దర్శనం కోసం తోసుకుంటూ వచ్చారు. ఎడతెరిపి లేకుండా వారి వరుసలు సాగాయి. వరుసల కోసం కట్టిన వెదురుకర్రలు పడిపోయాయి. ఎంత బూరాలు ఊది చెప్పినా, మైక్‌లో అరిచినా క్రమశిక్షణ సాగలేదు. ఎవరిమట్టుకు వారే ప్రసాదం తీసుకుందామని బాబా వద్దకు ఎగబడుతున్నారు. ఎంతో త్వరగా బాబా ప్రసాదం అందిస్తూనే ఉన్నారు. ఆత్రొక్కిడిలో కొందరు జనం ఆడవాళ్ళు, పిల్లలు కొందరు మగవారుకూడా నలిగిపోయారు. బాబా పాదాలు స్పృశించవద్దని ఎన్నిమార్లు గట్టిగా మైక్‌లోచెప్పినా ఫలితం లేకపోయింది. పైకి బలంగాకనిపించినా ఒక యువతి బాబా ప్రసాదం యివ్వగానే స్పృహ తప్పి పడిపోయింది. కొంతసేపు ఆమెను బాబా పట్టుకొని తరువాత ఆమెను జాగ్రత్తగా చూడమని మండలికి అప్పజెప్పారు. త్వరలోనే ఆమె తేరుకోగానే బాబా ప్రక్కన ఆమెను కొంతసేపు కూర్చోబెట్టు కున్నారు. పది నిమిషాల తరువాత మళ్ళీ ఆమెకు ప్రసాదం యిచ్చి బాబా ఆమెను

బయటకు జాగ్రత్తగా పంపించేసారు. వచ్చిన వేలకొలది ఉన్న ప్రజలకు బాబా ప్రసాదం పంచిపెట్టారు. అనుకోని విధంగా జనం రావడం చూసి వాళ్ళు నిగ్రహించుకోవడం లేదని అందరూ చుట్టబెట్టుకుని బాబామీద పడిపోతారని పోలీసువారు స్వచ్ఛంద సేవకులు శక్తిలేని వారయి పోవడం చూసి బాబా భక్తులు బాబాను వేదికమీదనుంచి ప్రక్కనున్న వారి గదిలోనికి తీసికొనివెళ్ళి కూర్చోబెట్టారు. ఏర్పాటుదార్లు పోలీసుల సహాయంతో ఎంత ఆపుదామని చూసినా గుంపులు ఆగటం లేదు. గదిలోనుంచే బాబా ప్రసాదం యిస్తున్నారు. ఆడవాళ్ళు మొదట గదిలోకి వెళ్ళి బాబా దర్శనం చేసుకుంటున్నారు. ముందు ద్వారంలోనుంచి గదిలోనికి వెళ్ళి ప్రసాదం తీసుకున్నాక వెనుకద్వారంలో నుంచి బయటకు వెళ్ళిపోతున్నారు. కొంతసేపయిన తరువాత పురుషులను లోపలకి వదిలారు. వీరు వెళ్ళిన దారినే మళ్ళా బయటకు వెళ్ళిపోయే యేర్పాటు చేసారు. బాబా సంగమ్‌నేర్ కార్యక్రమానికి రెండు గంటలు వేసుకున్నారు. కాని తరువాత నాలుగుగంటల సేపు అయినా యింకా అక్కడ ప్రసాదం యిస్తూనే ఉన్నారు.

తరువాత దిక్కులేని వారికోసం ఏర్పడిన ఒక ఆశ్రమ గృహానికి రమ్మని ఆ ఆశ్రమ అధ్యక్షులు బాబాను కోరగా అక్కడికి వెళ్ళారు. అందులో 85 గురు బాలురున్నారని అధ్యక్షుడు చెప్పాడు. ఆ బాలురకు ఉచితంగా భోజన వసతులు యిచ్చి విద్యనేర్పుతున్నారు. కొందరు త్వరలోనే సెకండరీ పరీక్షకు వెళ్తున్నారు. కొంతమంది పిల్లలు బాబాకు పూలదండలు వేసారు. తరువాత అధ్యక్షుని కుటుంబ సభ్యులను బాబాకి పరిచయం చేసారు. ఆశ్రమ సిబ్బంది కూడా వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. ఊరిలోనుంచి అధికారులు చాలా మంది బాబా దర్శనార్థం అక్కడకు వచ్చారు. చాలా మంది ముఖ్యులయిన పౌరులు కూడా వచ్చారు. ఎంతోమంది బయటవాళ్ళు ఆ హాలులోకి రాగా అక్కడ కూడా జనం క్రిక్కిరిసిపోయారు. బాబా ఒక అరగంట ప్రసాదం పంచిపెట్టారు. కొందరు విద్యార్థులు బాబాకుచుట్టూ నిలబడి బాబాను దర్శించాక తరువాత బాబా వారితో కొంచెముసేపు ప్రేమతో మాట్లాడారు. తరువాత బాబా బయటకు వచ్చారు. బాబా కారు యెక్కేముందు సంగమ్‌నేర్ భక్తులను పిలిచి ఒక్కొక్కరినే కౌగిలించుకున్నారు. వారందరిని ఆనందంగా ఉండమన్నారు. తమకు తృప్తి ఆనందము కలిగాయని బాబా చెప్పారు. మెహెరాబాద్ బయలుదేరేటప్పుడు జయధ్వానాలు చెలరేగాయి. ఇది చూసినవారు సంగమ్‌నేర్

చరిత్రలో యింత కోలాహలంగా ఎప్పుడూ ఎవరికీ స్వాగతం యివ్వలేదని చెప్పుకున్నారు.

1956 వ సంవత్సరం జనవరి 29 వ తేదీన నవసారీకి వస్తున్నానని బాబా అక్కడి ప్రేమికులకు టెలిగ్రాం యిచ్చారు. ఇలా వస్తున్నట్టు 25 రోజులు ముందు గానే 4 వ తారీఖునే తెలియజేసారు. ఈ వార్త అక్కడి ప్రేమికులందరిని ఆనందింప జేసింది. ప్రతిరాత్రి ప్రేమికులంతా సమావేశమై బాబా రాకకి కావలసిన ఏర్పాట్లు గురించి కార్యక్రమం ఎలా జయప్రదం చేయాలో ఆలోచించుకునేవారు.

బాబా నవసారీ వెళ్ళడం గురించి వారు చేయవలసిన ఏర్పాట్లు గురించి ఉత్తరాలు వ్రాసేవారు. అన్ని ఏర్పాట్లు సరిగా ఉన్నాయా అని చూడడానికి మెహెర్జీ బాబా పంపగా రెండుసార్లు నవసారీ వెళ్ళి చూసాడు. బాబా ఉండడం కోసం అన్ని సదుపాయాలు చేసారా అని అతడు విచారించాడు. పెద్ద పందిరి, వేదిక, అలంకారాలు, ప్రసాదాలు, అన్ని ఏర్పాట్లు త్వరత్వరగా జరిగిపోయాయి. కావలసిన డబ్బు కూడా వసూలు చేసుకున్నారు ఖర్చులకు.

నవసారీలో పార్సీలు ఎక్కువ మంది ఉన్నారు. వారు చాలా మట్టుకు ప్రాచీన సాంప్రదాయసిద్ధంగా ఉన్నకుటుంబాలకు చెందిన పూర్వాచార పరాయణులయిన వారే. అక్కడ ఏర్పాటయిన దర్శన కార్యక్రమం అద్వితీయంగా ఉంది. మిగిలినవారంతా బాబా రాక జయప్రదంగా ఉండాలనుకుంటూ ఉంటే అక్కడి పార్సీవారు మాత్రం అందుకు విరోధమైన భావాలతో ఉన్నారు. అసలు వారిలో కొందరికి బాబా అక్కడికి రావడమే యిష్టంలేదు. బాబాను నవయుగావతార పురుషుడుగా అందరూ జయధ్వానాలు చేస్తూంటే పార్సీలకు చాలా కష్టంగానే ఉంది. – క్రీస్తు జెరూసలెం రావడానికి అక్కడి పురోహితులకు యిష్టం లేనట్లుగానే. ఇంక బాబా రేపు వస్తారనగా పార్సీలందరూ పెద్దసభసేసి ముఖ్యంగా యువకులకు ఒక మానవుడు తాను దేవుడనని యీ యుగావ తారుడనని ప్రకటించుకోవడం చాలా ఘోరం అని అది గర్హించాలని ఉద్బోధించారు. మిగిలిన పిల్లలందరి వలెను పాఠశాలకి వెళ్ళి చదువు అభ్యసించి, పిల్లలతో ఆటలాడిన మెహెర్‌బాబా దేవుడెలా అవుతాడు ? తన తండ్రియొక్క కల్లు దుకాణంలో పనిచేసిన మెహెర్‌బాబా ఒక ప్రవక్త, మెస్సయ్యా ఎలా అవుతాడు ? బాబా నవసారీకి రావడమే జొరాస్ట్రియన్ మతానికి ఘోరాపచారం. బాబా దర్శనం యిచ్చినపుడు మీరంతా ఆయనను నిందిస్తూ నినాదాలు చెయ్యాలని ఒక డజను మంది బాలురను తయారు చేసారు పార్సీ పెద్దలు. పెద్దవారంతా వారికి మద్దత్తుగా ఉంటామన్నారు. బాబా

దర్శనానికి ఎవరయినా పార్సీలు వెళ్తే వారు అనేక రకాలయిన బాధలకు గురి అవుతారని వారిని బెదరించారు. మెహెర్‌బాబాకు విరుద్ధంగా రోడ్లమీద, గోడలమీద, బజార్లలోను పెద్దకాగితాలు (పోస్టర్లు) వ్రాసి అతికించారు. 28 వ తేదీన ప్రేమికులంతా బాబాకు స్వాగతం చెప్పే ఏర్పాటులలో ఉంటే పార్సీలు యీ విరుద్ధమయిన యేర్పాట్లు చేస్తున్నారు. దర్శన కార్యక్రమం అపజయం పొందాలని వారి అభిలాష.

బాబాకు విరుద్ధంగా పనిచేసేవారు, 28 వ తేదీన భరూచా తల్లి వద్దకు వెళ్ళి మీ యింటికి బాబా వచ్చారంటే జాగ్రత్త. వస్తే మీ కుటుంబంలో వినాశనం తప్పదు, అని ఆమెను బెదిరించారు. భరూచా తల్లికి నిజంగా భయం వేసింది. బాబా మన యింటికి ఎందుకు రావాలి అని ఆ ఉదయం ఆమె వారితో అన్నది. 29 వ తేదీ రానే వచ్చింది. భరూచా ఏర్పాట్లు సక్రమంగా ఉన్నాయా అని ఆఖరిసారిగా చూడడానికి ఉదయం 9 గంటలకు వెళ్ళి ఇంటికి 12 గంటలకు తిరిగి వచ్చాడు. వచ్చి తల్లినిచూసి ఆశ్చర్యపోయాడు. ఆమెయే బాబాకి తనయింటికి వచ్చినపుడు స్వాగతపు ఏర్పాట్లు స్వయంగా చేస్తోంది. అబ్బాయీ! బాబా వచ్చినపుడు ఆయనకి మనం ఏమి అర్పించాలిరా ? అని ఉత్సాహంగా ఆమెయే సిద్ధమయింది.

భరూచా తల్లితో ఒక గ్లాసుడు బత్తాయి రసం సిద్ధంగా ఉంచమని చెప్పి హడావిడిగా బాబా వస్తున్నారని నవసారీ రైలుస్టేషన్‌కి వెళ్ళాడు. 12-55 గంటలకు బాబా రైలు స్టేషన్‌లోకి వచ్చింది. బాబాతో ఆదీ, ఎరచ్, మెహెర్జీ, గుస్తాద్‌జీ, పెండు, డా॥ నీలు, వగైరాలు ఉన్నారు. బాబా రైలుదిగేసరికి "అవతార్ మెహెర్ బాబాకి జై" అనే నినాదాలు లేచాయి. బాబాను పుష్పమాలతో అలంకరించి వారిని ఒక కుర్చీ దగ్గరకు తీసుకువెళ్ళారు. బాబా కుర్చీలో కూర్చున్నారు. చాలామంది బాబా దర్శనం చేసుకున్నారు. బాబా మెడలో అనేక పూలదండలు వేసారు. పుష్పాలతో అలంకరించిన డిసోటో కారు ఒకటి బాబా కోసం స్టేషన్ బయట వేచియుంది. బాబాను అందులో యెక్కించి "మెహెర్ కాటేజ్" అనే భవనానికి బసనిమిత్తమై తీసుకువెళ్ళారు.

కీ॥ శే॥ సొరాబ్జీదేశాయి యొక్క తమ్ముని కుమార్తెలు యిరువురు— హోమాయి, అలమాయి— బాబా కోసం ఒక గృహాన్ని కట్టడానికి 1954 వ సం॥లో అనుమతి పొందారు. వారు బాబాను దాని నిర్మాణం పూర్తయాక వచ్చి అందులో ఉండమని ఆహ్వానించారు. "అప్పటికి నేను శరీరం వదిలెయ్యకపోతే వస్తాను" అని బాబా జవాబిచ్చారు. 1955 వ సం॥రంలో దీపావళి పండుగకు ఆగృహనిర్మాణం పూర్తయి దాని గృహప్రవేశోత్సవం జరిపించారు. అదయిన మూడు నెలల్లోనే వారి

మాట చెల్లించుకోవానికి నవసారీ వచ్చారు బాబా. ఆ అప్పచెల్లెంద్రకు మితిలేని ఆనందం కలిగింది. ఆ యింటిపేరే మెహెర్ కాటేజ్ అని పెట్టారు.

బాబా అక్కడికి వెళ్ళగానే అలమాయిని షోమాయిని ఆలింగనం చేసుకుని ముద్దుపెట్టుకున్నారు. ఇతర ప్రేమికులు కూడా ఆయన దర్శనం చేసుకున్నారు. ఆయనకి పుష్పమాల వేసి వారు లోపలకు తీసుకువెళ్ళారు. ఆ సోదరీలు బాబా కోసం భోజనం తయారుచేసారు. కొద్ది నిమిషాల తరువాత ఒక గదిలో బాబా భోజనానికి కూర్చున్నారు. మండలివారంతా ప్రక్కహాలులో వరుసగా కూర్చొని భోజనాలు చేసారు. నవసారీ ప్రేమికులు లోపల భోజనాలవుతూంటే వసారాలో వేచియున్నారు. బాబా అకస్మాత్ గా సి. వేసూనాను పిలిచి వారి కంచంలో నుంచి అన్నం కొంచెం తీసి ప్రసాదంగా యిచ్చారు. తరువాత వెంటనే భరూచాను కూడా పిలిచారు. బాబా పప్పు అన్నం తింటున్నారు. భరూచా వెళ్ళగానే ఒక చెంచాడు పప్పు అన్నం ఆయన కంచంలోనుంచి తీసి అతని నోట్లో పెట్టారు. భరూచా అది మ్రింగి బాబాకు ధన్యవాదాలు చెపుదామనుకుంటూంటే బాబా అతనిని వెళ్ళమన్నారు.

బాబా భోజనం చేసిన తరువాత ఒక గదిలో కూర్చుని భరూచాను మిగిలిన వారిలో కొందరిని పిలిచారు. మెహెర్జీ, నవసారీలో పరిస్థితి బాబాకు తెలిపియున్నాడు – పార్సీలు విరోధంగా పనిచేస్తున్నారని. జరిగిన సంగతంతా చెప్పగా విని బాబా – "మెహెర్ కాటేజ్ లో ఉండమని ఆహ్వానించిన నా ప్రియమైన వారి కోసము తరువాత నా దర్శనం చేసుకోవాలని ఆతురతగా ఉన్న నవసారీ ప్రేమికుల కోసము నేను వచ్చాను. నేను వచ్చిన పనిలో అప్పుడే సగం అయిపోయింది – నేను వచ్చి మెహెర్ కాటేజ్ లో ఉన్నాను గనుక. ఇప్పుడు 2-30 నుంచి 5-30 వరకు ఏర్పాటు చేసిన దర్శన కార్యక్రమంతో మిగతాపని కూడా అయిపోతుంది. నేను నీ యింటికి (భరూచావైపు తిరిగి) రాను" అన్నారు.

బాబా కారులో కూర్చొని నూరుగజాల దూరంలో ఉన్న మైదానంలో వేసిన పందిట్లోకి వెళ్ళారు. వేదిక దగ్గర కారు ఆగింది. వేదిక మీద బాబా కూర్చుంచుటకు ఒక కుర్చీవేయబడి యుంది. బాబా వేదిక మీదకు ఎక్కగానే అవతార్ మెహెర్ బాబాకి జై అను నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయి. వెయ్యిమంది ప్రజలు అప్పుడే దర్శనోత్సుకులై వచ్చియున్నారు. మళ్ళీ అందరు జయధ్వానాలు చేసారు. ఒక్క

బృందంవారు భజనగానాలు ప్రారంభించారు. ఆహ్వానసంఘంలోని ప్రతి సభ్యుడు వచ్చి బాబా మెడలో పుష్పమాల వేసాడు.

తరువాత వెంటనే బాబా కుర్చీమీద నుంచి దిగి వేదిక అంచుమీద కూర్చుని వరుసలో వచ్చే ప్రేమికులకు ప్రసాదాలు పంచడం ఆరంభించారు. ఒక వరుసలో స్త్రీలు ఎడమవైపున, ఒక వరుసలో – పురుషులు కుడివైపున బాబా వద్దకు వెళ్తున్నారు. రెండువైపులా ప్రసాదాలు ఉంచబడ్డాయి. మొదట బాబాను సమీపించి ఆయనకు ప్రణమిల్లి పూలదండవేసి ప్రసాదం స్వీకరించుటకు అనుమతింపబడినారు. కాని యిది ఆపివెయ్యవలసి వచ్చింది, చాలా మంది వచ్చి వరుసలో చేరారు గావున. కుడిచేతితో పురుషులకు, ఎడమచేతితో స్త్రీలకు బాబా ప్రసాదాలు అతి త్వరితముగా పంచిపెడుతున్నారు. పోలీసులు, స్వచ్ఛందసేవకులు, హోంగార్డులు అల్లరికాకుండా చూస్తున్నారు. స్త్రీ పురుషులు వరుసలో సక్రమంగా వెళ్ళేలా చేస్తున్నారు. మూడు గంటలయేసరికి పందిరి బయట నిలబడియున్న ప్రజలు బాబాను చేరి వారి దర్శనం చేసుకోడానికి ఎంతో తొందరపడుతున్నారు. నిమిషానికి బాబా 40 మంది స్త్రీలకు 40 మంది పురుషులకు ప్రసాదం యిస్తున్నారు. బాబాకి నమస్కరించడము, వారిని స్పృశించడము పనికిరాదని దర్శనార్థులకు చెప్పారు. ప్రసాదం యిచ్చినపుడు వారికి కలిగే స్పర్శ తప్ప వేరే విధంగా బాబాను స్పృశించుటకు వీలు కలుగలేదు. వారి చేతితో యిస్తేనే చాలునని ఆ ప్రసాదాన్ని స్వీకరించడానికి అనేకమంది స్త్రీ పురుషులు తొందరగా వస్తున్నారు. వచ్చినకొద్దీ బాబా యిస్తున్నారు. పందిట్లో కొన్ని వేల మంది ప్రజలున్నారు. వెళ్ళేవారు వెళ్తూంటే కొత్తవారు వస్తున్నారు. 3 గంటలయింది. అంతవరకు ఒక్క పార్సీ కూడా రాలేదు. పార్సీవారు వెళ్ళకూడదని పార్సీ బాలుడు అందరితోను చెప్పి వారిని మాన్పిస్తున్నారు. ఆ పార్సీ బాలుర బృందం పందిట్లోకి వచ్చారు. పందిట్లో ఉన్న స్వచ్ఛందసేవకులు ఏదయినా అల్లరి జరుగునేమో యని సిద్ధంగా ఉన్నారు. ఆ బృందం బాబా వద్దకు వద్దామని దారి చేసుకుంటూ వస్తున్నారు, పార్సీ బాలుర నాయకుడు బాబా వద్దనుంచి ప్రసాదం పుచ్చుకోకుండా ముందుకు సాగిపోయాడు. అతని బృందంలోని బాలురంతా ఒకరి తరువాత ఒకరు ప్రసాదం పుచ్చుకుని వెళ్ళారు. పందిట్లోంచి బయటకు వెళ్ళి యింకో విధంగా అల్లరి చెయ్యాలిరా, ఎలాచేస్తే బాగుంటుంది ? అని సంప్రదించుకుంటున్నారు. ఇంతట్లోనే ప్రసాదం అయిపోతోంది. వెంటనే యిద్దరు వాలంటీర్లు బజారుకి వెళ్ళి రెండు పంచు లతో ప్రసాదం తెచ్చారు. పటికిబెల్లం పలుకులు, జీడిపప్పు వగైరా. ఇంకా కొన్ని

వేలమంది ప్రసాదం పుచ్చుకున్నారు. అంతకొద్దిసేపట్లో అన్నివేలమందికి బాబా ప్రసాదం ఎలా యిచ్చారో చూసినవారికే తెలుస్తుంది. అది చెప్తే నమ్మశక్యంకాదు. బాబా అన్నారు—"ఈ ప్రసాదంతో నేను ఏమి యిస్తున్నానో ఎవరికీ తెలియదు. ఇలాంటి కార్యక్రమాల్లోనే నేను యివ్వదలుచుకున్నది యివ్వడానికి వీలవుతుంది."

బాబా 5 గంటలవరకే దర్శనం యిస్తానని సమ్మతించారు. బాబా 'సమయం ఎంతయింది' అని అడిగేసరికి 4-55 అయిందని చెప్పారు. లప్పివాలా అనే బృంద నాయకుని పిలిచి పరిగెత్తి వెళ్ళి వెనుక ఏమి జరుగుతోందో చూడమని లప్పివాలాతో బాబా చెప్పారు. బాబా ఆజ్ఞప్రకారం వెనుకవైపుకి వెళ్ళి చూడగా అతడు చూసినది అతనిని దిగ్భ్రాంతుని చేసినది. పార్సీ కుర్రవాళ్ళంతా చేరి కిరసనాయిలు తీసికొనివచ్చి పందిరిమీద చల్లి దానికి అగ్గిపుల్లగీసి అంటించబోతున్నారు. లప్పివాలాను చూడగానే వాళ్ళు పారిపోయారు. సర్వజ్ఞుడైన బాబా సరిగా సమయానికి పందిరి తగులబడి పోకుండా ఎవరికీ ఏ ప్రమాదమూ జరుగకుండా కాపాడారు.

సరిగ్గా 5 గంటలకు బాబా లేచి వేదిక దిగి కారుదగ్గరకు తొందరగా నడిచి వెళ్ళారు. ఉన్నవారంతా ఏమిజరుగుతోందో తెలుసుకునేసరికే బాబా కారులో కూర్చున్నారు. వెంటనే డ్రయివరు కారు బయలుదేరదీశాడు. వేలకొలది మిగిలి పోయిన దర్శనార్థులు అది చూసి బాబా కారుచుట్టూ మూగారు. అక్కడి ప్రేమికులు బాబా కారుకి దారిచేసారు. కారు మెహెర్ కాటేజికి 2 నిమిషాలలో చేరుకుంది. కారు వెళ్ళిపోతూంటే అవతార్ మెహెర్‌బాబా కి జై అని అందరూ అరిచారు. బాబా కారు దిగారు. కాని మెహెర్ కాటేజ్ ఇనుప గేట్లు లోపల తాళంవేసి ఉన్నాయి. ఈలోపుగా అనేక వందలమంది పరుగెత్తుకుని వచ్చి కారు వద్ద చేరారు. 'అవతార్ మెహెర్ బాబా కి జై' అని నినాదాలు చేస్తున్నారు. పార్సీ బాలురు ధైర్యం వహించి 'మెహెర్ బాబా ముర్దాబాద్' అని అరుస్తున్నారు. "మెహెర్ చలో జా ఓ మెహెర్ బాబా మాకు ఒక అద్భుతం చేసి చూపించు" అని గట్టిగా అరుస్తున్నారు. వీరి అరుపులన్నీ వందలాది కంఠాలు 'అవతార్ మెహెర్ బాబాకి జై' అని అరుస్తూంటే ఆధ్వనిలో అణగిపోయాయి.

బాబా కాటేజ్ లోపలికి వెళ్ళారు. మండలి వసారాలో ఉన్నారు. పార్సీ పిల్లల అరుపులు విని ఫిరూజా వారి మీదకు ఉరకబోతే మిగిలిన పెద్దవారు బాబా ప్రేమికులు అతనిని వారించారు. అయినా వారిని తోసేసి ముందుకు వెళ్లాలని ప్రయత్నిస్తున్నాడు.

ఆ గలాభా ఏమిటని బాబా అడిగితే బాబాతో భరూచా సాహసాన్ని గురించి చెప్పగా బాబా అతనిని రమ్మని పిలిచారు. బాబా లోపల కుర్చీలో కూర్చున్నారు. బాబా తమ వద్ద నేలమీద భరూచాను కూర్చోమన్నారు. "నీవు యిక్కడ నేను లెమ్మన్న వరకూ కూర్చో." అన్నారు భరూచాతో. ఆవరణ లోపల ఉన్న ప్రేమికుల నందరను శాంతంగా ఉండమన్నారు బాబా. ఆ పిల్లలను ఏమీ చెయ్యవద్దని తిట్టవద్దని బాబా చెప్పారు. "మీరు వారు అరిచే అరుపులు అసలు విననట్లే ఉండండి. వారి ద్వారా నేనే అరుపులు అరుస్తున్నాను నేను అన్ని పనులు చేస్తున్నాను. నేను తప్ప ఎవరూ ఏదీ లేదు" అని బాబా చెప్పారు. "ఎవరూ కూడా ఆ పిల్లలకు అడ్డు చెప్పవద్దు. వాళ్ళిష్టమొచ్చినట్లు అరవనీయండి. ఈ పరిస్థితిని శాంతంతోను సంతోషంతోను ఎదుర్కోవాలి. నేను అందరిలోను ఉన్నాను గనుక వారిలోను ఉన్నాను. నేను నా భక్తుల సంతోషకరమయిన జయధ్వానాలు విని నేనెలా సంతోషిస్తానో అలాగే ఆ పిల్లలు వేసే కేకలు విన్నాకూడా నాకు కోపం రాదు. నన్ను మెచ్చినా వెక్కిరించినా నాకు ఒకటే. రెండు రకాల వారు కూడా అజ్ఞానులే. ఒకరి అజ్ఞానం నాకు సంతోషం కలిగిస్తుంది. ఇంకొకరి అజ్ఞానం నాకు వేడుక కలిగిస్తుంది. ఎవరి యెడలా తప్పులేదు. నా నిజస్థితి ఎవరికీ తెలియదు. వారు అరచినపుడు కూడా నా పేరు ఉచ్ఛరిస్తున్నారు— "మెహెర్‌బాబా మురదాబాద్" అని. ఎలాగోలాగు నన్ను స్మరిస్తే చాలు; నా యెడల భక్తివల్లనయినా సరే నా యెడల ఎగతాళి వల్లనయినా సరే. వారంతా అమాయకులు. కేకలు వేసుకోనీయండి. నాకు చాలా వినోదంగా ఉంది." అన్నారు బాబా. ఒక గంటసేపు అలా కేకలు వేసి వేసి యింక లాభంలేదని వారంతా జారుకున్నారు.

బయట యింకా అనేకమంది బాబా దర్శనార్థం ఉన్నారు. ఒకమారు వారికి కనిపించమని వారు బాబాను కోరుతున్నారు. అప్పుడు బాబా ముందు వసారాలోకి వచ్చి వారివైపు బాబా చెయ్యి ఊపారు. వారికి ప్రసాదం లభ్యంకాకపోయినా బాబా కనిపించారని తృప్తిచెంది సంతోషించారు. జనం చాలా మంది ఉండడం చేత బాబాను అందరూ చూడలేకపోయారు. వారు "అవతార్ మెహెర్‌బాబాకి జై" అని అరుస్తున్నారు. నవసారీ ప్రేమికులు బాబాను డాబా మీదకు ఎక్కి అందరికీ కనిపించేలాగ నిలబడమని ప్రార్థించారు. డాబాకి సరియయిన మెట్లులేవు. ఒక పాత నిచ్చెన ఉంటే దేశాయి కుటుంబం వారిది, దాని మీద నుంచి, బాబా పైకి ఎక్కారు. నవసారీ వారి యింటికి ఉపాసనీ మహరాజ్ వచ్చినపుడు ఆ నిచ్చెనమీద (క్రింది నుంచి రెండవ మెట్టుమీద) కూర్చునేవాడు. వీధిలోని ప్రజలు వేల సంఖ్యలో పెరిగారు. వారికోసం

డాబా మీద నిలబడిన ప్రియతమ బాబాను చూసి వారు సంతోషంతో "అవతార్ మెహెర్‌బాబాకి జై" అని పెక్కుసార్లు అరిచారు. కొంతసేపయిన తరువాత బాబా క్రిందికివచ్చి కుర్చీమీద కూర్చున్నారు. నవసారీ పట్నం నుంచేగాక చుట్టుప్రక్కల గ్రామాలనుంచి కూడా అనేకవేలమంది వచ్చారు. వారంతా గేటువద్ద వీధిలో నిలబడి యున్నారు. ఇంకోమారు బాబా దర్శనం యివ్వాలని వారు కోరుతున్నారు. మళ్ళీ బాబా డాబా యెక్కి వారికి కనిపించేలా నిలబడ్డారు. క్రింద నిలబడ్డవారంతా కన్నులపండువుగా అవతారపురుషుని దర్శించారు.

బాబాను సరిగ్గా 7 గంటలకు నవసారీలోని బాబా సెంటర్‌కి తీసుకు వెళ్ళాలి. కాని గేటు వద్ద జనం కదలకుండా అలాగే నిలబడియున్నారు. కారు యెలా వెళ్తుంది? బాబా సెంటర్ వద్ద అనేకమంది ప్రేమికులు బాబాకోసం వేచి యున్నారు. అక్కడికి రావడానికి వీలు కాలేదని బాబా సెంటరుకి కబురు పంపించారు. అక్కడి బాబా ప్రేమికులను మెహెర్ కాటేజి కి రమ్మన్నారు. కొద్దిసేపట్లోనే బాబా వద్దకు వారంతా వచ్చారు. దేశాయి కుటుంబము వారిని తలుపులన్నీ మూసివెయ్యమని చెప్పారు. సూర్యాస్తమయం అయిన తరువాత బయటి ప్రజలకు దర్శనం యిస్తానని బాబా వారితో చెప్పారు. ఎవరూ లోపలికి రాకుండా తలుపులు మూసివేసారు.

కొద్దిసేపట్లో పెద్ద ఇనుపగేట్లు బాబా తెరిపించారు. ప్రజలంతా బాబాను చూడడానికి ఆవరణలోకి వచ్చారు. వరుసలో బాబావద్దకు వెళ్ళాలని ప్రేమికులు వారిని వరుసలో నిలబెట్టి పంపుతున్నారు. బాబాను చూసి వెళ్ళిపోవాలని చెప్పారు. బాబా కూర్చొనియుండగా వారినిచూసి ముందుకి సాగిపోవాలి. ముందు ద్వారం నుంచి లోపలికి వచ్చి బాబాను చూసి వెనుక ద్వారంనుంచి బయటకు వెళ్ళిపోతున్నారు. ఈ ప్రకారం 2 గంటలు బాబా దర్శనం యిచ్చారు. ఈ దర్శనం జరుగుతూండే నవసారీ ప్రేమికులు భజన గీతాలు గానం చేస్తున్నారు. మరల పార్సీ పిల్లలు కూడా ప్రజలతోబాటు వరుసలో బాబా వద్దకు వచ్చారు. పార్సీ పురోహిత ముఖ్యుడైన మెహెర్ జిరానా దస్తూర్‌యొక్క భార్య ఖోర్షెద్‌బానూ కూడా బాబా దర్శనార్థం వచ్చింది. ఆమె బాబా వద్ద ఒక గంటసేపు కూర్చుని ఉంది. ఆమె బాబాకు ఆరతి యిచ్చింది. ఆమె బాబాతో "బాబా! నా భర్త మీ దర్శనం చేసుకోవాలని ఉవ్విళ్ళూరు తున్నారు. కాని ఆయనకు సుస్తీగా ఉండడంచేత రాలేకపోయారు. దయచేసి,

క్షమించండి బాబా.'' అని చెప్పుకుంది. ఇంకా పురోహిత కుటుంబాలలో చాలామంది బాబా దర్శనం చేసుకున్నారు. వీరంతా ఎంతో భక్తితో వచ్చి అవతార పురుషుని దర్శనం చేసుకోగలిగినందుకు ఎంతో గర్విస్తున్నారు. 9 గంటల వరకు బాబా వద్ద అందరూ కూర్చున్నారు. ఇంతలో మీరంతా వెళ్ళి భోజనం చేసుకోండని బాబా వారిని పంపించేసారు. మరల వారిని ఉదయం తెల్లవారగానే బాబా రమ్మన్నారు.

మెహెర్ కాటేజ్ వెనుకనున్న ఒక భవనంలో 40 మందికి భోజనం ఏర్పాటు చేసారు. బాబా మండలి కాకుండా 40 మంది బొంబాయి నుండి ప్రేమికులు వచ్చారు. అందరికీ ఆ రాత్రి భోజనం యేర్పాటు అయింది. అంతా భోజనం చేసినా చాలా ఆహారం మిగిలిపోయింది. అదంతా మరునాడు బీదవారికి పంచిపెట్టబడింది. రాత్రి భోజనం అయాక ఒక బాబా ప్రేమికుడు వస్తూ మెహెర్ కాటేజ్ వెనుక భవనానికి సమీపంలో యింకో యిల్లు కట్టడానికి పునాది తవ్వి ఉంచే ఆ పునాది గోతిలో పడ్డాడు. కాని అతనికేమీ దెబ్బతగుల లేదు.

భోజనాలయి ప్రేమికులు వచ్చేసరికి బాబా హోమాయిని అలమాయిని, యింకా సొరాబ్జీ సోదరి 85 ఏళ్ళ వృద్ధురాలిని 9-30 గంటలకు యింటికి వెళ్ళిపొమ్మన్నారు. వాళ్ళు యింటికి వెళ్ళాక కాపలావాడుండే చిన్న కర్రగదిలో ఇరికి కూర్చున్నారు. మధ్యాహ్నం వారితో రాత్రి వచ్చి మెహెర్ కాటేజ్‌లో ఉండమని బాబా చెప్పారు. మండలివారు కాటేజ్ ఎదురుగా ఉన్న ఒక బంగళాలో రాత్రి పరుండాలని ఏర్పాటు. కాని బాబా వారిని కాటేజ్ వరండాలో పరుండమని చెప్పారు. అర్థరాత్రి వరకు గ్రామీణులు బాబా దర్శనానికి వస్తూనే ఉన్నారు. వారు వచ్చి ఇనుపగేటు వద్ద నిలబడితే వారికి కనిపించడం కోసం బాబా బయట వసారాలో నిలబడేవాడు.

అర్థరాత్రి తరువాత కూడా బాబా విశ్రాంతి తీసుకోలేదు. ఆయన లోపల గదిలో పచార్లు చేస్తున్నట్లు కనిపించారు. బాబా రాత్రి భోజనం చేయలేదు. రాత్రి అంతా కాటేజ్‌లో దీపాలన్నీ వెలుగుతూనే ఉన్నాయి.

భరూచా మొదలయినవారు రాత్రి భోజనం అయాక రాత్రి 11-30 గంటలకు బాబా సెంటరుకి వెళ్ళారు. వారు అలసిపోయి అక్కడ నుంచి యిళ్ళకి వెళ్ళిపోయారు. మరునాడు వారు ఉదయం తెల్లవారకడనే లేచారు. 4 గంటలకే లేచి మెహెర్ కాటేజ్‌కి వెళ్ళాలని సిద్ధమయారు. ఒక స్వచ్ఛందసేవకుడు కాటేజ్‌కి వెళ్ళేసరికి

తెల్లవారుఝామున 5 గంటలకే బాబా బయట వసారాలో పచారు చేస్తున్నారు. భరూచా 5-30 గంటలకు వచ్చాడు. బాబాని చూసేసరికి నవనవోల్లాసంగా కనిపించారు. బాబా సెంటరుకి వెళ్ళి చూడాలని ఉందన్నారు బాబా. కారులేదని టాంగా తెమ్మంటే తెస్తానని భరూచా చెప్పాడు. బాబా సరే అన్నారు. వెంటనే అతడు సైకిల్ మీద టాంగాకోసం వెళ్ళాడు. టాంగా రాగానే బాబా అందులోకి యెక్కి కూర్చున్నారు. బాబా కాక భరూచా, మరో యిద్దరు కూడా అందులో యెక్కారు. 6 గంటలయేసరికి బాబా సెంటరుకి చేరుకున్నారు. అప్పటికే వాలంటీర్లు సెంటరు తెరచి శుభ్రంగా తుడిచి ఉంచారు. నీళ్ళు చల్లి రంగవల్లులు కూడా తీర్చబడిఉన్నాయి. బాబా మెట్లు ఎక్కి సెంటరులోపల ప్రవేశించారు. లోపలికి రాగానే ఆయన కళ్ళు అక్కడ ఉన్న జీవిత సైజు షిర్డిసాయి బాబా చిత్రం మీద పడ్డాయి. ఈ చిత్రం ఏడెన్‌లో ఉన్న సాయిబాబా సెంటర్‌కి పంపించడానికి ఏర్పాడి ఉంది. బాబా దానిమీద చెయ్యివేసి స్పృశించి దానిని పవిత్రం చేసారు. బాబా తరువాత ఒక కుర్చీలో కూర్చుని సెంటరు నాలుగువైపుల పరికించి చూసారు. ఆయన సంతోషం పొందినట్లు కనబడ్డారు. ప్రేమికులు ఆరతి పాట పాడారు. బాబా వెళ్ళడానికి లేచారు. ఒకమాటు బాబాను మళ్ళీ ఆ కుర్చీలో కూర్చోమన్నాడు భరూచా. బాబా అలా కూర్చున్నాక ఒక తాడు లాగగానే బాబామీద గులాబీపూల వర్షం కురిసింది. తరువాత బాబా లేచారు. మొదట యీ పూల సంగతి బాబా వచ్చిన ఆనందంలో ఆ ప్రేమికులు మరిచిపోయారు. బాబా సెంటరులో ఉన్న పెద్ద బాబా చిత్రపటంలోని పాదాలను బాబా స్పృశించారు. ఆ సమయంలో ఒక పాత ప్రేమికుడు వచ్చి ఆ పటంలోని బాబావైపు చూపించి "ఆయన ఒక దొంగ" అన్నాడు. ఇంకో క్షణంలో అతడే "ఆయన మా హృదయాలు దొంగిలిస్తాడు" అని విశదీకరించాడు. అది విని బాబా చిరునవ్వు నవ్వారు.

6-30 గంటలకు బాబా మెహెర్ కాటేజ్‌కి తిరిగి వచ్చారు. అక్కడ అప్పటికే కొందరు వచ్చి చేరుకుంటున్నారు. 7-30 గంటలకు బయలుదేరే రైలులో బాబా నవసారీ నుంచి బిజావాకి వెళ్ళవలసి ఉంది. భరూచా వాగైరాలు బాబా తో వెళ్ళాలి. మండలివారు సామాను సర్దడంలో ఉన్నారు, కొందరు స్త్రీలు వచ్చి భజనలు పాడారు. దేశాయి కుటుంబంవారు బాబా వెళ్ళిపోతున్నారని చాలా దుఃఖాక్రాంతులై యున్నారు. మళ్ళీ వారు బాబాను ఎప్పుడు చూడగలరు? వారు బాబా తో బిజావా రావడానికి బాబా అనుమతించలేదు. వారిని (దేశాయి కుటుంబమును) తలుపులన్నీ లోపల వేసుకుని కాటేజ్ లోనే రోజంతా ఉండాలని బాబా చెప్పారు.

7 గంటలయింది. ఇంక బాబా స్టేషన్‌కి బయలుదేరవలసి యుంది. దేశాయి కుటుంబం వారు హృదయాలన్నీ ప్రేమతో నింపుకున్నారు. వారు గొంతుక పూడిపోయి గద్గదస్వరంతో విచారంగా ఉన్నారు. ఆ స్వరంతోనే బాబాను మరల ఎప్పుడు వస్తారని అడిగారు. అప్పుడు బాబాకు దగ్గరలోనే వృద్ధురాలయిన సౌరాష్ట్రి సోదరి, డా॥ నీలు నిలబడి యున్నారు. ఆమెలోని జీవన జ్యోతి రెపరెపలాడుతోంది. ఇంక ఆరిపోయే సమయం ఎంతో దూరం లేనట్లుంది. బాబా మరల ఎప్పుడు వస్తారనే ప్రశ్నకు. బాబా సైగతో యిలా జవాబిచ్చారు— "నీలు ఆమె వలె నడిచినప్పుడు" అన్నారు. అంటే యింక ఆ ఊరు వచ్చే అవకాశం లేదని బాబా ఆ విధంగా చెప్పారు. డా॥ నీలు ఆమె వయసు వచ్చేవరకు జీవించియే లేదు. ఆ సంవత్సరంలోనే తరువాత సతారా రోడ్డు మీద మోటారు ప్రమాదంలో డా॥ నీలు ప్రాణాలు వదిలేసాడు. సరిగ్గా బాబా నవసారీ కి వచ్చి వెళ్ళిన 8 రోజులకి ఆమె బాబాలో ఏకమయిపోయింది.

నవసారీ ప్రేమికులంతా స్టేషన్‌కి వెళ్ళారు, బాబాకు వీడ్కోలు యివ్వడానికి. రైలు యింకా రాలేదు. బాబా ప్లాట్‌ఫామ్ మీద పచారు చేస్తున్నారు. అప్పుడప్పుడు సంగుని చిన్నరాయిని తీసి విసురుతున్నారు. తరువాత బాబా వచ్చి ఒక కుర్చీమీద కూర్చున్నారు. ఒక పార్సీ బాబా కోసం టీ స్టాల్ నుంచి ఒక కప్పుతో టీ పట్టుకు వచ్చాడు. బాబా వద్దని తల త్రిప్పారు. అది 'మంచి టీ; పుచ్చుకోండి' అని ఆ పార్సీ మళ్ళా బాబాని త్రాగమని కోరాడు. బాబా ఆ టీలో ఒక వేలుముంచి నోటిలో పెట్టుకొని పీల్చారు. ఆ పార్సీని మిగిలినది నీవు త్రాగు— అని బాబా అన్నారు. అతడు టీ అంతా త్రాగేసాడు.

రైలు త్వరగానే వచ్చింది. బాబా, మండలి అందరూ ఒక మూడవ తరగతి పెట్టెలో యెక్కారు. మూడవ తరగతి ప్రయాణం ఎవరినీ జోలపాడి ఊపదు. కాని నిన్ను శాశ్వతంగా త్రోసివేస్తుంది. బాబా కూర్చున్న కిటికీ వద్దకు దేశాయి కుటుంబం వారు చేరుకోవాలని ప్రయత్నంచేసి బాబా దగ్గర దగ్గరకు చేరారు. అవతార్ మెహెర్ బాబా కి జై—అని జయధ్వానాలు చేస్తుంటే రైలు కదిలింది. బాబా ఆపెట్టె తలుపు దగ్గర నిలబడ్డారు చిరునవ్వుతో అందరివైపు చేయి ఊపుతున్నారు. అందరి హృదయాలలోని వియోగ భావన ఆయన హృదయాన్ని స్పృశించింది. కళ్ళవెంట వచ్చిన అశ్రువుల కంటె మాటలు ఎక్కువ చెప్పలేవు కదా. దేశాయి కుటుంబం వారు "మేము జీవించియుండగా మీతో మేము వేరుగా

ఉండలేము. కాని మరణానంతరం కూడా మీతో కలిసే ఉండేలా మాకు వరం యివ్వండి బాబా" అని కోరుకున్నారు.

ఇది నవసారీకి బాబా అఖరిసారిగా రావడం. వెనుకటి అనుభవాలు ఆ ప్రేమికుల లో చెరగని ముద్ర వేసాయి.

తెల్లవారుతూనే బాబా ఒక గుఱ్ఱపు బగ్గీలో మండలి బసకి వెళ్ళి వారికి దర్శన మిచ్చారు. మెహెర్‌కాలేజ్‌లో సమావేశమైన అనేకమంది భక్తులకు వీడ్కోలు చెప్పి, అందరిని ఆశీర్వదించి బాబా నవసారీ రైలుస్టేషన్‌కి వెళ్ళారు. నవసారీ నుంచి బజ్వాకు వెళ్లామని వచ్చినవాళ్ళు, బొంబాయినుంచి వచ్చిన ప్రేమికుల బాబా తో ఆరైల్లోనే ప్రయాణం చేసారు. వీళ్ళంతరు బజ్వాకు వచ్చి అక్కడ కార్యక్రమంలో పాల్గొన్నారు.

రైల్లో ప్రయాణం లో బచ్చుభాయి అనే ప్రేమికుని చేత బాబా పాడించుకుని విన్నారు. నవసారీ వదిలిన తరువాత సూరత్ రైల్వేస్టేషన్ లో బాబా దర్శనార్థం జనం మిక్కుటంగా వచ్చారు. బాబాను అనుజ్ఞ వేడి రైలును గార్డు సూరత్ స్టేషన్‌నుంచి పకాలమునకే వదిలాడు. రావల్‌భాయి అనే ప్రేమికుడు హాస్యపు కథలతోను, మాటల తోను బాబాను భక్తులను నవ్వించాడు. ఇంకొక కథ అతడు ప్రారంభించబోగా "చాల్లె మిగిలింది నేను మరల 700 సంవత్సరాల తరువాత వచ్చినపుడు వింటాలే" అని బాబా ఆపు చేసారు. బజ్వాకు రైలు 1-55 గం॥కు చేరింది. చాలామంది ప్రేమికులు స్టేషనుకి వచ్చి మెహెర్ అవతార్‌కిజై "బోలో మెహెర్ ప్రభూకిజై" అనే నినాదా లతో బాబాను స్వాగతం యిచ్చారు. బజ్వాలో ప్రముఖ పొగాకు వర్తకుడైన దహ్యాభాయి బాబాను తన యింటికి తీసికొని వెళ్ళి ఆతిధ్య మిచ్చాడు.

తరువాత బహిరంగ దర్శనం ఏర్పాటు చేసిన పందిట్లో బాబా ఆసీనులు కాగానే ప్రముఖ ప్రేమికుడగు హరిభాయిపటేల్ కుటుంబసహితంగా వచ్చి బాబా మెడలో పూల దండలు వేసి బాబాకి కర్పూరహారతి యిచ్చాడు.

దర్శన కార్యక్రమం అయిపోగానే బజ్వా ప్రేమిక బృందం బాబా తో ఒక ఫొటో తీయించుకున్నారు. ఆ సాయంత్రం షికారుకని బయలుదేరి బాబా సేవకార్మి కుల గృహాలకి వెళ్ళారు. ఒక ముసలివాని యింటి అరుగుమీద బాబా కొంతసేపు

కూర్చున్నారు. ఆ సమయంలో భక్తులంతా చూస్తూ దూరంగా నిలబడ్డారు. ఆ యింటి వారు బాబాకు ఎలా కృతజ్ఞత తెలుపుకోవాలో తెలియక తబ్బిబ్బయారు. ఆరాత్రి బొంబాయి నవసారీ నగరాలనుంచి వచ్చిన ప్రేమికులకు బజ్వా భక్తులు విందుచేసారు. బాబా ఆవిందులో పాల్గొని పప్పుఅన్నము మాత్రం తిన్నారు. హరిభాయి తాను రచించిన గుజరాతీ పాటలు పాడి బాబాకు వినిపించాడు.

రాత్రి 8-30 గంటలకు బాబా బజ్వానుంచి బయలుదేరి బరోడాకు మండలితో వెళ్ళారు. అక్కడ బాబా సాయిమండలికి వెళ్ళి చూసారు. బరోడాలో కంట్రాక్టర్ అనే ప్రేమికుని ప్రార్థనమీద అతని యింటికి వెళ్ళి అతని కుటుంబము వారిని ఆశీర్వదించారు. ఆ రాత్రి 11 గంటలకు బరోడాలో రైలు ఎక్కి తెల్లవారి 6 గంటలకు బాబా మండలితో బొంబాయి చేరుకున్నారు.

తెల్లవార్లూ అందరూ మెలకువగానే ప్రయాణం చేసారు. తెల్లవార్లూ భజనలు చేసారు. వినోదకరములయిన కథలు చెప్పారు. ఈ అవకాశం (భగవంతునితో ప్రయాణం చేయడం) పోగొట్టుకోలేక ఎవరూ నిద్రపోలేదు. నవసారీ బృందంవారు సూరత్‌స్టేషన్‌లో దిగిపోయి వాళ్ళ ఊరికి అక్కడ వేరేరైలు యెక్కి వెళ్ళారు. బొంబాయిలో దిగగానే బాబా ప్రేమికులకి సెలవిచ్చి పంపిస్తూ ఫిబ్రవరి 6 వ తేదీన కలుసుకుంటానని చెప్పారు. కొంతసేపు బాబా బొంబాయిలో నారిమన్ దాదాచాన్‌జీ యింటిలో విశ్రాంతి గైకొన్నారు. తరువాత మెహెర్‌జీ కారులో సతారాకి వెళ్ళారు.

ఫిబ్రవరి 15 వ తేదీనుంచి దీర్ఘకాల ఏకాంతవాసం చేయాలని బాబా సంకల్పించారు కదా. అంతకు ముందు 6 వ తేదీన బొంబాయి పౌరుల కోరికమీద అక్కడ దర్శన కార్యక్రమం జరిపించడానికి కొద్దిమంది మండలితో బొంబాయి వెళ్ళారు. ఆరోజున నారిమన్ యింటికి చేరుకునేసరికి మధ్యాహ్నం 12 గంటలయింది.

ఐరీన్ కోని బీర్ అనే పాశ్చాత్య వనిత బాబా అనుజ్ఞతో బాబా తో రెండు రోజులు గడపడానికి సతారా వచ్చింది. అమెకూడా బొంబాయివచ్చింది. ఆషియానాకు బాబా రాగానే కొందరు భక్తులు హమీర్‌పూర్ నుంచి వచ్చి ఒక హోటల్లో దిగారని బాబాకి తెలియగానే వారికి ఫోన్‌చేసి వెంటనే రమ్మని చెప్పమన్నారు బాబా. ఆస్ట్రేలియానుంచి క్లారిస్ ఆడమ్స్, ఎనాలెమన్ అనే స్త్రీలు వచ్చారు. మెహెర్‌జీ

వారిని నారిమన్ యింటికి తీసుకు వచ్చాడు. 6 వ తేదీని దర్శనమిస్తున్నారని తెలిసి బాబా ను చూద్దామని రెండురోజుల ముందుగానే వచ్చారు యిరువురు స్త్రీలూను.

క్లారిస్ ఒక స్నేహితుడిచ్చిన పుస్తకం చదివి అందులో బాబా గురించి చదివిన దానికి కోపం తెచ్చుకుంది. బాబా చెప్పినవి తప్పు అని రుజువు చేద్దామని ఆ పుస్తకంలో బాబా రచనలను మరల మరల చదివింది. చదువగా చదువగా బాబా చెప్పినది సరియయినదే అని ఆమె గ్రహించి బాబా దర్శనం చేసుకోవాలని వెంటనే బాదాకి వ్రాసి ఆయన అంగీకారముతో తారీఖు ఏర్పాటు చేసుకొని యిప్పుడు వచ్చింది

ఎనాలెమన్ 'అవతార్' అనే జీన్ ఏడ్రియల్ (అమెరికా ప్రేమికురాలు) రచించిన గ్రంథం చదివి బాబా యొక్క చిత్రం చూడగానే ఆయనను దర్శనం చేసుకోవాలని నిశ్చయించుకుని ఇండియాకు వచ్చింది.

బాబా దర్శనం చేసుకున్నాక ఆ యిరువురు స్త్రీలకు కలిగిన అనుభూతి వర్ణనాతీతం. వారిద్దరికీ కూడా కలిగిన ఆనందాతిరేకం వల్ల కళ్ళవెంట ఆనందాశ్రువులు కురిసాయి. బాబా యెడల ప్రేమతో వారి హృదయాలు నిండిపోయాయి. క్లారిస్ "నా జీవితంలో అనేక దృశ్యాలు, నాటకాలు, బాలేనృత్యాలు చూసాను. సంగీతాలు విన్నాను. చిత్రాలు చూసాను. అనేక మంది వ్యక్తులను కలుసుకున్నాను. కాని యీ విధంగా ఎవరూ నా హృదయాన్ని కరిగించలేదు." అని అంది.

"మారుమాట్లాడక మీ అభీష్టం ప్రకారం ఏదయినా చేస్తాను" అని నేను అనుకునే వ్యక్తిని యింతవరకు కలుసుకోలేదు. ఇటువంటి అనుభవాన్ని. నేనిదివరకు ఎప్పుడు పొందలేదు. నాకు సంపూర్ణమయిన తృప్తి, ఆనందం కలిగాయి." అని ఎనాలెమన్ తన అనుభవాన్ని వర్ణించింది.

హమీర్‌పూర్ ప్రేమికులు వచ్చాక వారందరిని బాబా కౌగిలించికుని కుశల ప్రశ్నలడిగారు. ఈవచ్చిన వారిలో పుకార్ (పరమేశ్వరీదయాళ్‌నిగమ్) అతని తల్లి భవానీప్రసాద్ నిగమ్, ఎల్. సి. సాలివాల్ ఉన్నారు. బాబా పుకార్‌తో యిలా అన్నారు. "జనవరి 14ని దర్శన కార్యక్రమానికి పూనా వచ్చావు. ఇప్పుడిక్కడికి మళ్ళావచ్చావు నాసంవత్సర ఏకాంతవాసానికి సరిపోయిన పని నీకు యిచ్చాను. నీవు ఫిబ్రవరి 15వ

తేదీనుంచి వారం రోజులు ఉపవాసం ఉండాలి. తరువాత సంవత్సరం పర్యటన చేసి దేశంలో నాప్రేమను వ్యాప్తం చేయాలి. నీవు బయలుదేరే ముందు నీకుటుంబానికి కావలిసినవన్నీ ఏర్పాటుచేసి మరీ వెళ్ళు. ఇదంతా నీకు తెలిసినా సమయము, ధనం, వెచ్చించి మళ్ళా వచ్చావా ? ఈఏర్పాట్లన్నీ ఎపుడు చేస్తావు?'' అని బాబా అడిగారు. అందుకు పుకార్ — ''త్వరలోనే ఏర్పాట్లన్నీ చేస్తాను బాబా. నాకు బాబా పని ఏవిధంగా ప్రారంభించాలో తెలియకుండా ఉంది. దాన్ని గురించి బాబాను అడిగి తెలుసుకుందామనే వచ్చాను'' అన్నాడు. అందుకు బాబా ''విచారించకు. పని ప్రారంభించు. నీకే తెలుస్తుంది ఏమి చెయ్యాలో. అయితే హృదయపూర్వకంగానూ, శ్రద్ధగానూ చెయ్యాలి. ఒక ఊరినుంచి యింకోవూరు పోతూఉండు. అవసరమయితేనే యింటికి వెళ్ళు. ఇంటివద్ద ఊరికే కూర్చోవద్దు. ముందు ఇంటిపనులు చక్కబెట్టుకుని బయలుదేరి వెళ్ళి సంవత్సరంవరకు పని చేయాలి'' అని బాబా ఆదేశించారు. సంవత్సర ఏకాంతవాసానికి ముందు యిది బాబాయిచ్చే ఆఖరి దర్శనం గనుక హమీర్‌పూర్, నవసారీ, పూనా, నాగపూర్ నగరాల నుంచి చాలా మంది ప్రేమికులు బాబా ధర్శనానికివచ్చారు.

వెయ్యిమంది భక్తులు ఆషియానాకు వచ్చి బాబా దర్శనం చేసుకున్నారని మరునాడు పత్రికల్లో ప్రచురించారు. అన్ని మతాల వారూ అందులో ఉన్నారు. అందరినీ బాబా స్పృశించి దీవించారు. ఈ దర్శన కార్యక్రమం జరుగుతూంటే క్లారిస్ ఆడమ్, ఎనాలెమన్ బాబా వద్దనే కూర్చొని చూస్తున్నారు. దర్శనం చేసుకొని ప్రేమికులందరూ వెళ్ళారు. కాని ఆంధ్ర, హమీర్‌పూర్, పూనా, నాగపూర్ ప్రేమికులను మాత్రం బాబా చెప్పేవరకు వేచి ఉండమన్నారు. తరువాత వారందరిని విడి విడిగా కౌగిలించుకుని వారి వారి యిళ్ళకు ఆరోజునే బయలుదేరి వెళ్ళమని బాబా చెప్పారు. పూనా భజన బృందం వారు వారి మధుర సంగీతంతో బాబాను అలరించారు. తరువాత బాబాకు హారతి యిచ్చారు. మధుసూదన్‌ను చూసి బాబా —''నీవు ఎన్నో పాటలు నామీద రచించి గానం చేస్తున్నావు. హారతి పాట కూడా రచించావు. నీపాట వలన ఎక్కువగాను యింకా ఎక్కువగాను నన్ను ప్రేమించడానికి నా ప్రేమికులకు వీలయింది. మీరంతా నాపనిని శ్రద్ధతోను, ఉత్సాహంతోను, శక్తితోను, ప్రేమతోను చెయ్యాలి. పూనా నగరం నా జన్మస్థలమని మరచిపోకండి.'' అన్నారు. బాబా అందరినీ ఆలింగనం చేసుకొని సెలవు యిచ్చి వెళ్ళమని పంపారు.

ఫ్లారిస్‌కి, ఎనాలెమన్‌కి బాబా తమ ఆలింగన భాగ్యమిచ్చి బొంబాయిలో యింకా 15 రోజులుండి అక్కడి బాబా ప్రేమికులను పరిచయం చేసుకొనుట కనుజ్ఞ యిచ్చారు. ఐకిన్‌కోసి బీర్ "ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా" సచిత్రవారపత్రికా సంపాదకుని తీసుకువచ్చి బాబాకు పరిచయం చేసింది. అతడు అమితానందం పొందాడు. పూనా దర్శనకార్యక్రమం (14-1-56) వర్ణ చిత్రాలు తన వద్ద నున్నవనీ వాటితో బాబా గురించిన వ్యాసమొకటి వ్రాసి యిస్తే తన వారపత్రికలో ప్రకటిస్తానని చెప్పగా చక్రధర్ దేశ్‌ముఖ్ మరునాడే వ్రాసి యిచ్చాడు అతడు చెప్పిన ప్రకారం ఆ సంపాద కుడు తన పత్రికలో ఆ వారమే బొమ్మలతో ప్రచురించాడు. మరునాడు (7-2-56) భోజనమయిన తరువాత బాబా మండలితో బొంబాయి వీడి సతారాకి వెళ్ళారు. వెళ్ళే ముందు అనాలెమన్‌ను, ఫ్లారిస్ ఆడమ్‌ను పిలిచి ఆస్ట్రేలియా ప్రేమికులకు ఒక సందేశం యిచ్చారు.

15-2-56 వ తేదీన ప్రారంభించి బాబా కఠినమయిన ఏకాంతవాసంలో ఒక సంవత్సరం గడుపుతానని పాశ్చాత్యుల సహవాసం కోసం మధ్యలో తమ ఏకాంత వాసానికి కొన్నిరోజులు భంగం కలుగుతుందని చెప్పి అనంతరం బాబా జూలై నెలలో మొదటివారంలో బయలుదేరనున్నానని యీ వార్త పాశ్చాత్యుల కందజేసారు. బాబాతో ఎరచ్, నీలు, మెహెర్‌జీ, ఆదీ (సీనియార్) యీ అయిదుగురు వెళ్తారని తెలిసింది. ఈపర్యటన కయే ఖర్చులు అక్కడి బాబా ప్రేమికులే భరించవలసి ఉంటుంది. బాబా యొక్క ప్రపంచ యాత్రకు అన్ని ఏర్పాట్లు చేయుటకు న్యూయార్క్ మహానగరంలో వసతి సౌకర్యాలు ఏర్పాట్లు కూడా చేయుటకు మేరియన్ ఫ్లోర్‌షీమ్‌ను బాబా నియమించారు.

త్వరలోనే న్యూయార్క్‌లో మెహెర్ బాబా అతిథి సత్కారసంఘం అని మేరియన్ ఫ్లోర్‌షీమ్ అధ్యక్షత క్రింద ఒక సంఘం రూపొందింది. ఆసంఘానికి ఫ్రెడ్‌వింటర్ ఫెల్ట్ ఉపాధ్యక్షుడుగా నియమితుడైనాడు. ఈ సంఘంలో 7 గురు సభ్యు లున్నారు. ఇంకా మిర్టిల్ బీచ్ సెంటరు తరపున ఎలిజబెత్ పాటర్‌సన్, లాస్ ఏంజిలెస్‌లో రూత్ వైట్, ఓజైలో ఆగ్నెస్ బారెన్ సాన్‌ఫ్రాన్సిస్కోలో లడ్ డింఫల్ ముఖ్యులుగా స్థానిక సంఘాలు ఏర్పడ్డాయి. బాబా కార్యక్రమాలు పత్రికలలో ప్రకటించడానికి ఐవీడ్యూక్, డాన్‌స్టీవెన్స్ యిద్దరూ పూనుకున్నారు. అలాగే లండన్ బృందానికి విల్ బాకెట్, స్విడ్జర్లాండులో హెడ్‌మెర్టెన్స్, ఆస్ట్రేలియాలో ఫ్రాన్సిస్

బ్రాబజాన్ నాయకత్వం వహించి పర్యటనకు కావలిసిన ఏర్పాట్లు చేస్తున్నారు. తమ హృదయాలను మేల్కొల్పే పరమ పురుషుడు రానై యున్నారని ప్రేమికులందరూ శక్తివంచనలేక విరాళాలిస్తూ పాటుపడసాగారు.

15-2-56 వ తేదీన బాబా ఏకాంతవాసం ప్రారంభించారు. మార్చి 13వ తేదీన బాబా యిద్దరు మస్తులను రావించి వారితో ఏకాంత సాంగత్యం గావించారు.

1956 జూన్ 10 వ తేదీన బాబా సతారానుంచి పింపల్‌గామ్‌కి కారులో వెళ్ళారు. అక్కడ జూలై 6 వ తేదీవరకు ఉన్నారు. బాబా యీ 26 రోజులలోను ప్రపంచ పర్యటనలో అన్నిదేశాలలోను చదివించడానికి అనేక విషయాల మీద సందేశాలు చెప్పి వ్రాయించారు. ఇవన్నీ తరువాత ఒక పుస్తకరూపంలో ప్రచురణ చేయిస్తారు.

బాబా పింపలగామ్‌లో ఉండగా బీట్రిస్ పిగో అనే నీగ్రో నాయకురాలు అమెరికా నుంచి వచ్చి కోరగా ఆమెతో అరగంట సంభాషించారు. ఆమె బాబా దర్శనం చేసుకోవడం ఆయన యొక్క దీవెన పొందడం ఆమె మహాభాగ్యంగా ఎంచుకున్నది. పింపలగామ్ లోనే బాబా సోదరుడు జాల్‌భాయి కూడా వచ్చి బాబా అనుమతి పొంది ఆయన దర్శనం చేసుకున్నాడు.

స్త్రీ మండలి ప్రార్థించగా బాబా కొన్ని కొత్త బట్టలు కుట్టించుకోవడానికి అంగీకరించారు. ఆకుపచ్చని కోటు ఒకటి, ఎర్రని కోటు ఒకటి వారికి కుట్టించారు. అహమద్‌నగర్‌లో ఒక కుట్టుపనివాడు అవి తయారుచేసాడు.

జూన్ 18 వ తేదీన బాబా మోటారుకారులో బొంబాయి వెళ్ళి పింపలగామ్ ఆ సాయంత్రానికే తిరిగి వచ్చారు. 21 వ తేదీన బాబా మెహెరాబాద్ కొండమీదికి వెళ్ళారు. జూలై 9 వ తేదీ రాత్రి 12 గంటల నుంచి 10 వ తేదీవరకు రాత్రి 12 గంటలవరకు 24 గంటలకాలం పూర్తి మౌనం పాటించాలి. ఆ కాలంలోనే పాక్షిక ఉపవాసం కూడా ఉండమన్నారు బాబా. ఒక్కమారే రెండు కప్పులు టీ గాని, కాఫీ గాని తీసుకోవచ్చును. రోజులో పగలు గాని రాత్రిగాని ఎప్పుడైనా తీసుకోవచ్చును. ఒక్కమారే సాయంకాలం భోజనం చేయవచ్చును. అని బాబా అందరికి తెలియ పరచారు.

[illegible] తేదీన బాబా అందరికి యీవిధంగా సర్క్యులర్ లేఖ పంపించారు—

"ఇదివరకు ప్రకటించినట్లు నేను దేశ కాలాలకి, వాగ్దానాలకి కట్టుబడి యుండలేదు. జరిగే సంఘటనలన్నీ మాయా రాజ్యంలో జరుగుతున్నా విషాదకర మయిన ఒక గొప్ప సంఘటన నాకు నా ప్రేమికులకు ఎదుర్కొబోతోంది. చాలా కాలం నుంచి జరుగుతూందనుకుంటున్న అవమానం దగ్గరలోనే ఉంది. అది రేపే జరుగవచ్చు. లేక యీ సంవత్సరంలో ఏ రోజునయినా కావచ్చును. లేక వచ్చే సంవత్సరంలో (1957 లో) జరుగవచ్చును.

నా ప్రేమికుల ప్రేమ, ధైర్యము, విశ్వాసములకు దివ్యన్యాయం చేత కఠిన మయిన పరీక్ష పెట్టబడుతుంది. ఈ అవమానకాలం పరాకాష్ఠలో నా కొంగు పట్టుకుని వీడనివారు మాయని తరించి సత్యంలో నివసిస్తారు.

నా యొక్క అవమానము, విషాదకర సంఘటన అవి అవసరం అయినప్పటికి అవి తాత్కాలికమే. వాటికి మహిమాన్వితమయిన పరిణామం తప్పకుండా విధి నిర్ణయం ప్రకారం జరుగక తప్పదు.

అందరికి "నా ప్రేమ —" అని బాబా ఆపీ ద్వారా ప్రకటన సంపించారు.

జూలై 7 వ తేదీనాటికి బాబా సతారా తిరిగి వెళ్ళారు.

1956 వ సం॥ జూలై మాసంలో బాబా సతారాలో ఏకాంతవాసంలో ఉన్నారు. ఆ ఏకాంతవాసం మధ్యలో బాబా పాశ్చాత్యులకు యీ దిగువ సందేశం పంపించారు.

"ఇదివరలో నేను ప్రకటించినట్లుగా వాగ్దానాలు నన్ను బంధించవు. నేను దేశకాలాలకు అతీతుడను. అవి కూడా నన్ను బంధించవు అన్నీ యీ మాయలో జరిగే సంఘటనలే అయినా ఒక గొప్ప విషాద సంఘటన నాకు నా ప్రేమికులకు ఎదురవుతుంది. ఎప్పటినుంచో వస్తుందనుకుంటున్న అవమానం సమీపిస్తోంది. ఇది రేపే జరుగవచ్చు. లేక యీ సంవత్సరంలో ఎప్పుడైనా జరుగవచ్చు. లేక అది వచ్చే సంవత్సరంలో జరుగవచ్చును. నా యొక్క ప్రేమికుల విశ్వాసము, ప్రేమ, ధైర్యము కఠినమైన పరీక్షకు గురి అవుతాయి. ఆ పరీక్ష నా వల్ల కాదు కాని అది దైవ న్యాయము వల్లనే జరుగుతుంది. ఎవరయితే నాకు అంటిపెట్టుకుని ఉంటారో యీ క్లిష్ట సమయంలో, వారు మాయను అధిగమించి సత్యమును వదలక యుండగలరు.

ఈ లేఖలోని అంశములు – అవి ఎంత నిరాశా జనకముగా నున్నను – నా ప్రేమికుల ఉత్సాహమును భంగపరిచేదిగా ఉండకూడదు. ఎందుచేతననగా నా అవమా

నము, విషాదమయిన యీసంగతి అవసరమయినా అవి తాత్కాలిక సంభవములు మాత్రమే. వాటికి వైభవోపేతమయిన అంతము వాటికిదివరకే నిర్ణయమయింది.''

బాబా యిచ్చిన ''దివ్యానందము – మానవులబాధ'' అను మరియొక సందేశంలో (సాధారణ మానవుడు తన కొరకే బాధపడతాడు. సద్గురువులు మానవకోటి కొరకు బాధపడతారు. మరి అవతార పురుషుడు మానవుల కొరకే గాక సృష్టిలోని ప్రతిప్రాణి కొరకు ప్రతి వస్తువుకొరకు బాధపడతాడు'') అనే విషయమును బాబా చెప్పారు.

బాబా తరుచుగా చెప్పేమాటలు ''నేను యీవిశ్వానికి ప్రభువును. నా ప్రేమికులకు బానిసను'' – వీటికి మూలమయిన అర్థం బాబా తో సన్నిహిత సాంగత్యంలో ఉండే అవకాశం కలిగిన ప్రేమికులకు గాని తెలియదు.

యూరప్, అమెరికా, ఆస్ట్రేలియా వగైరా దేశాలలో ఉండే అనుచరుల యొక్క గొప్ప ప్రేమ బాబాను వారి గాఢమయిన మౌన అభిలాషకు అంగీకరించి, అది కొద్దికాలంపాటయినను, వారి మధ్యకు వెళ్ళడానికి బయలుదేరదీసింది.

ఆప్రకారంగా బాబా ఏకాంతంలో ఉంటూనే సతారా నుంచి 16 వ తేదీన చీకటితో బయలుదేరి బొంబాయికి వెళ్ళారు. పాశ్చాత్య ప్రేమికులకు సహవాసభాగ్యం కలుగజేయ వలెననే వాంఛయే ప్రయాణానికి మూలకారణం.

యూరప్, అమెరికా, ఆస్ట్రేలియా దేశాలలో ఒక నెల రోజులు సంచారం చేద్దామని బాబా నిశ్చయం చేసుకోగానే కొన్ని నెలల నుంచి ముందుగానే విమాన ప్రయాణాలకి ఏర్పాట్లు, ఏనగరంలో ఏరోజున విమానం ఎక్కాలో ఎక్కడ ఏరోజున దిగాలో ఎక్కడ ఎప్పుడు దర్శనాలివ్వాలో, ఎక్కడ ఎప్పుడు సంభాషణలు చేయాలో యీమొదలైన వాటన్నిటికీ ముందుగానే ఏర్పాట్లు చేసుకోవడంలో మండలివారు కార్యోన్ముఖులయారు. కార్యక్రమాల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలు ముఖ్యంగా బాబా చెల్లెలు మణిజా ముందు సతారా నుంచి తరువాత మెహెరాజాద్ నుంచి జరిపింది.

బాబా నిరంతరము శాశ్వతము అయిన ఆనందం పొందుతున్నా మన అందరిలోను ఆయన బంధింపబడినట్లు నిత్యమూ బాధపడుతున్నట్లు భావిస్తున్నారు.

గురువు యొక్క ఆనందకరమయిన సన్నిధానంలో భయములు విపత్తును గురించి ముందు సూచనలు ఆయన దివ్య సాహచర్యంలో సహవాస్‌లో మరచిపో

బడ్డాయి. కాని సద్గురువు యొక్క దివ్యానందం లోనే ఆయన యొక్క ఆంతరికమైన బాధ జ్ఞాపకం వస్తూనే ఉంటుంది. ఆయన ఆనందంవలెనే బాధకూడా నిరంతరంగా ఉంటూనే ఉంది. సిలువమీద బాధపడిన క్రీస్తును నేను అని ఆయన చూపుడు వ్రేలిమీద యింకోచేతి చూపుడు వ్రేలును అడ్డముగా రెండవది, సిలువవలె ఉంచి, సంజ్ఞ చేసారు.

బాబా పాశ్చాత్యదేశాలకు వెళ్తారని తెలియగానే అనేకమంది ప్రేమికులు భారతదేశం నలుమూలల నుంచి బొంబాయి విమానాశ్రయంలో వారికి వీడ్కోలు యివ్వడానికి వస్తామని అందులకు బాబా అనుమతి కోరుతున్నామని ఉత్తరాలువ్రాసారు. కాని బాబా ఏకాంతవాసంలో ఉంటూ ఉండినందు వలన వారు ఎవరికీ ఆ విధంగా అనుమతి నీయలేదు. ఈ సంగతి సర్క్యులర్ లేఖల ద్వారా అందరికీ తెలుపబడింది. బాబా ఇండియా వదలి వెళ్ళిన తరువాత ఆస్ట్రేలియా నుంచి కేబిల్‌ద్వారా బాబా తిరిగి వచ్చినపుడు బొంబాయి విమానాశ్రయానికి ప్రేమికులెవరూ బాబాకు స్వాగతమివ్వడానికి రాకూడదని ఇండియాలోని భక్తులకు తెలుపబడింది. బాబా ప్రత్యేకంగా ఒక్క నెల మాత్రం వారి ఏకాంతవాసానికి భంగం కలుగజేసుకుని పశ్చిమ దేశయాత్ర చేయడానికి బయలుదేరారు. ఈ ఏకాంతవాసం ఫిబ్రవరి 15, 1957 లో అంత మవుతుంది. బాబా యిండియాకు తిరిగి ఆగస్టు (1956) 17వ తేదీన వచ్చి వారి ఏకాంతవాసం మరల సాగిస్తారు. బాబా ఇంగ్లండులోను, న్యూయార్క్‌లోను, మిర్టిల్ బీచ్ లోను, వాషింగ్టన్‌లోను, లాస్ ఏంజిలెస్‌లోను, ఓజైలో మెహెర్ మౌంట్ వద్దను, శాన్‌ఫ్రాన్సిస్కోలోను, సిడ్నీలోను, మెల్బోర్న్‌లోను తమ ప్రేమికులకు సహవాస మిచ్చారు.

ఈ 30 రోజులలోను అనేకమయిన ప్రశ్నలకు బాబా జవాబు లిచ్చారు. వాటిలో కొన్ని ఉదాహరణకి ఇక్కడ పొందుపరుస్తున్నాను.

ప్రశ్న :—సత్యమును పొందుట మానవునికి సాధ్యమేనా ?

జవాబు :—సాధ్యమే. ఎట్లు సాధ్యమో చెప్పుటకు ఒక్క వాక్యములో చెప్పవచ్చును. చెప్పవలెనంటే అనేక గ్రంథములు కూడా చాలవు. నేను ఒక్క వాక్యములో చెప్పెదను. సత్యమును పొందుటకై అసత్యమును వదలిపెట్టుము. అసత్య మంటే యేమిటి ? చిరకాలము నిలిచియుండనిది అసత్యమన్నమాట నిజమే. అందుచేత శాశ్వతముగా నిలిచియుండనిది వదలివేయుము. నీవు సత్య దర్శనము చేయగలవు.

ప్రశ్న :—జీవాత్మలో ఏభాగమయినా శాశ్వతముగా నుండునా ?

జవాబు :—(ప్రశ్నించు నతనివైపు చూపుచు) 'నీవే' శాశ్వతముగా నుందువు. నీలో మిగిలినదంతా నీ నిజమైన ఆత్మను తెలిసికొనుటకుగాను వదలివేయ వలయును.

ప్రశ్న :—బాబా ! మీరు భగవంతుడు – మీకు అన్నీ తెలుసును. అయినా అంత తరుచుగా నేను మిమ్ములను ప్రేమిస్తున్నానా లేదా అని ఎందుకు అడుగుతారు. నేను మిమ్ములను చాలా ప్రేమిస్తున్నాను బాబా !

జవాబు :—నా ప్రేమికులు నన్ను ప్రేమిస్తున్నారని వినడం నాకు ఎంతో సంతోష కారణం. నాకు సర్వము తెలుసునన్న విషయంలో ఏమీ సందేహం లేదు. నా ప్రేమికు డెవరయినా "బాబా ! నేను నిన్ను ఎక్కువగా ప్రేమిస్తున్నాను." అని చెప్తే నాకు సంతోషంగా ఉంటుంది. ఉదాహరణకి నిత్య జీవితంలో పరస్పరం ప్రేమించు కుంటున్న దంపతులున్నారనుకోండి. వారు ఒండొరు లను ఎంతగానో ప్రేమిస్తారు. ఆ సంగతి యిరువురికి తెలుసును. అయినా ఆ భర్తగాని ఆ భార్యగాని తరచుగా రెండవవారిని అడుగుతుండడం మామూలు. "నా ప్రియతమా ! నీవు నన్ను ప్రేమిస్తున్నావా?" అని. ఈ ప్రశ్నకు ఎప్పుడూ జవాబు "నేను నిన్ను అన్నిటికంటె ఎక్కువగా ప్రేమి స్తున్నాను" అనే ఉంటుంది. నా ప్రేమికులను నేను అడగడానికి వారినుంచి "బాబా ! నేను నిన్ను ఎక్కువగా ప్రేమిస్తున్నాను" అనే జవాబు రాబట్ట డానికి నాకు సంతోషంగాను ఆనందంగాను ఉంటుంది.

ప్రశ్న :—భగవంతుడు అనంతప్రేమమూర్తి, కరుణామయుడు అయినా ప్రపంచంలో యింత దుఃఖం యింత బాధ ఎందుకు ఉండాలి

జవాబు :—శాశ్వతానందానికి అందరిలోని ఆత్మయే మూలం; శాశ్వత దుఃఖానికి కారణం అందరిలోని స్వార్థపరత్వమే. స్వార్థపు ఆలోచనలు ఉద్యమాల వలన తృప్తి కలిగినంతవరకు దుఃఖం ఎప్పుడూ ఉంటుంది. అనంతమయిన ప్రేమ వలన భగవంతుని కరుణ వలన భూమిమీద ఉన్న దౌర్భాగ్యం వలన మాన వునిలో అనంతానందానికి మూలమనియు తన అనంతాత్మ ఆవిష్కరణానికే ప్రేమతో బాధ అంతా పడుతున్నాడనీ తెలుసుకోగలడు.

ఈ ప్రపంచ పర్యటనలో బాబా వద్దకు సంత్ కృపాల్‌సింగ్ అనుయాయులు స్వామి శివానంద అనుచరులు వచ్చి దర్శనం చేసుకున్నారు. బాబా వారందరినీ

ప్రేమతో కలుసుకొని ఆశీర్వదించారు. బాబాను చూడడానికి వచ్చి వారిలో ఒకరిద్దరు ఆయనకు విరోధులు కూడా లేకపోలేదు. తీరా బాబా యెదుటకు వచ్చి ఆయన సాంగత్యంచేసేసరికి వారి విరోధభావాలు ఏమయినాయో బాబా యెడల అమితమైన గౌరవంతో ఆయనను మెచ్చుకుంటూ వెళ్ళారు.

## బాబా - ఇంగ్లండు మరియు అమెరికన్, ఆస్ట్రేలియా ప్రేమికులతో సహవాసం

జూలై 16 వ తేదీన అర్ధరాత్రి శాంతాక్రూజ్ విమానాశ్రయంలో, బొంబాయి నుంచి నలుగురు మండలితో బాబా బయలుదేరారు. అక్కడకు ఎవరూ వచ్చి తమకు వీడ్కోలు యివ్వకూడదని తాము ఏకాంతవాసంలో ఉన్నామని బాబా ప్రేమికులకు వ్రాయించారు. భారతదేశం వదలి మళ్ళీ నెలరోజుల్లో తిరిగివచ్చేవరకు తాత్కాలికంగా ఏకాంతవాసం వాయిదా వేశారు బాబా. లండన్ వెళ్తూ జూలై 17 వ తేదీ మధ్యాహ్నం, జూరిచ్ (స్విడ్జర్లాండు) విమానాశ్రయంలో బాబా విమానం కొంతసేపు ఆగింది.

హెడీమెర్టెన్స్ మొదలయిన బాబా ప్రేమికులు బాబాను కలుసుకోవానికి బాబా అనుమతి పొంది అనేక స్థలాలనుంచి జూరిచ్ విమానాశ్రయానికి వచ్చారు. కొందరు తెల్లవారుజామున చల్లని వేళ బయలుదేరి సెయింట్ గోథార్ట్ మీదుగా ప్రయాణం చేసారు. వారు ష్విక్ అనే వూళ్ళో కలిసారు. ఎండ బాగా కాస్తోంది. వారు మంచి ఉత్సాహంగా ఉన్నారు. వారు ప్రయాణం చేసే దారిలో ఫాలెన్‌ఫ్లూ అనే చోటికి వచ్చేసరికి ఆకాశం అంతా వెలుగుతో నిండిపోయింది. ఆ బాబా ప్రేమికుల ఉత్సాహం యినుమడించింది. ఆల్ప్స్ పర్వతాలలో నుంచి ఒక రోడ్డుమీదుగా యీ ప్రేమికులు ప్రయాణం చేసారు. వారు యీ దారినే యిదివరలో 1934 వ సం॥లో బాబాతో ప్రయాణం చేసారు. అవన్నీ జ్ఞాపకం పెట్టుకొని యీ దారినే బాబాతో వెళ్ళాము అని గుర్తు తెచ్చుకున్నారు.

జూలై 17 వ తేదీ మధ్యాహ్నం జూరిచ్‌లో ఐరీన్ బిల్లో అన్ని ఏర్పాట్లు చేసింది. ఆమెయొక్క ఆహ్వానంమీదనే వారంతా బాబాను కలియుటకు వచ్చారు. వచ్చిన వారిలో డా॥ అరవింద్ అనే ఒక భారతీయ విద్యార్థి కూడా ఉన్నాడు. ఇతడు డా॥ జంగ్ శిష్యుడు. ఇంకా డా॥ బోస్, డా॥ షోబెల్ కూడా వచ్చారు. తుఫాన్ వల్ల బాబా ప్రయాణం చేసిన పాన్ అమెరికన్ ఏర్‌వేస్ వారి విమానం జూరిచ్‌కి ఒక గంట ఆలస్యంగా చేరింది. విమానం దిగి బాబా అక్కడ సమావేశమయిన హెడీ

మెర్టెన్స్, హాఫ్లింగర్ దంపతులు వగైరాలంతా ఉండగా ఆయన ప్రేమికులయిన ఐరీన్‌బిల్లో వగైరాలవైపు నడచి వస్తూంటే వారి హృదయాలు పొంగి ఆనందంతో గంతులు వేసాయి. బాబా వారందరిని పలకరించి కుశలమడిగారు. ఆనవాలు పట్టి బాబా కొందరిని దగ్గరకు రమ్మని పిలిచారు. హెలెన్ కూడా వచ్చింది. చాలారోజులు తరువాత వారందరిని చూసినందుకు బాబా ఎంతో ఆనందించారు. టోబియాస్ నుంచి వచ్చిన మాల బాబా కంఠం మీద బంగారంలా మెరసిపోతోంది. ఎరచ్ ద్వారా బాబా వారితో సంభాషించారు. బాబా వారితో మాయను గురించి మాట్లాడారు. మాయ ఉండడం ఉన్నది కాని అది నిజమయినది కాదు. వారి ఎదురుగా మూర్తీభవించినది వారు చూస్తున్నది నిజమయిన బాబా కాదు. ఆయన తొడిగిన దుస్తులు ఎంత సత్యమయినవో ఆయన శరీరం కూడా అంతే. బాబా యొక్క ఫొటోలు తీసుకుందామని బాబా ప్రేమికులు కెమేరాలు తెచ్చుకున్నారు కాని బాబా చెప్పేమాటలు వింటూ ఆయన యొక్క సన్నిధిలో తేజోవిరాజమానమయిన బాబాను చూస్తూ ముగ్ధులయిపోయి వారి కర్తవ్యాన్ని మరచిపోయారు

సంపూర్ణమయిన ఏకాంతవాసం నుంచి పాశ్చాత్య ప్రేమికుల కోసం ఒక్క నెల విరామం తీసుకొని బయలుదేరి వచ్చానని బాబా వారితో చెప్పారు. ఆ ఏకాంతం మరల ఇండియాకు తిరిగి వచ్చిన తరువాత కొనసాగిస్తానని బాబా వారితో అన్నారు.

బాబా ఎక్కిన విమానం జూరిచ్‌లో బయలుదేరి మరల పారిస్‌లో ఆగింది. బాబాతోకూడా వెళ్దామని ఐరీన్ బిల్లో, హెడీమెర్టెన్సు, మాక్స్‌హాఫింగర్ ఆ విమానమే ఎక్కి లండన్‌కి వెళ్ళారు. పారిస్ విమానాశ్రయంలో బాబాను కలిసేందుకు ఒక డజనుమంది వచ్చారు. బాబా వారితో మాట్లాడుతూ ఒక పళ్ళరసంతో నిండి ఉన్న ఒకగ్లాసువైపు చూపిస్తూ "మదిర త్రాగితే కలిగే మత్తు వలన వచ్చే మరుపు వలెనే దివ్యప్రేమ ద్వారా స్వార్థాన్ని మరచిపోయేలా అవుతుందని" చెప్పారు.

అనితా దోజర్‌లు చేసే విమానంలో పారిస్ నుంచి లండన్ వెళ్ళారు. వీరు, బాబాతో ప్రయాణం చేసినవారు, అంతా లండన్‌లో హొటల్ రుబెన్సులో బసచేసారు.

1956 జూలై 17 వ తేదీ సాయంకాలం లండన్ విమానాశ్రయం బాబా ప్రేమికులతో హడావిడిగా ఉంది. రాత్రి 8 గంటల 15 నిమిషాలయింది. బాబా ప్రయాణం చేసిన విమానం దిగి నేలమీద ముందుకు వెళ్ళి మళ్ళా విమానాశ్రయంలో వెనుకకు తిరిగి వచ్చింది. ఆగంతకులు ఎంతవరకు వెళ్ళడానికి వీలుందో బాబా

వస్తున్నారన్న సంతోషంతో, ఆయనను చూడాలన్న ఆతురతతో ముందుకు వెళ్ళి నిలబడ్డారు, విలియం బాకెట్ ప్రభృతులందరూ. విమానం దగ్గరకి ఒక బస్సు వెళ్ళి ప్రయాణీకులందరినీ ఎక్కించుకుని యిపతల స్నేహితులందరు వేచియున్న స్థలం వద్దకు వచ్చి ఆగింది. బాబా ఎదురు వచ్చి వారందరికి ప్రణామం చేసారు. వారంతా ప్రతినమస్కారం చేసారు. కస్టమ్స్ శాఖ వారితో పని అయిన తరువాత బాబా వారందరి వద్దకువచ్చి ఒక్కొక్కరినినే కౌగిలించుకున్నారు.

నాలుగు కార్లు బాబా కోసం, ఆయన మండలిని సామానును ఎక్కించుకుందా మని, వేచి ఉన్నాయి. కార్లలో సామాను సర్దారు. అందరూ లండన్ వెళ్లడానికి కార్లలో ఎక్కారు. రాజవీధి గుండా కార్లు వెళ్తున్నాయి. మూడు రోజులనుంచి పొత్తిగా బాబాకు అసలు విశ్రాంతేలేదు. కారులో ఎక్కిన తరువాత బాబా మండలిలో ఒక డయిన మెహెర్‌జీ, లండన్ ప్రేమికులతో "బాబాకి హోటల్ రూబెన్సులో ఏర్పాటుచేసిన గదులు వేరేగా ఏ విధమయిన శాంతి భంగము కలుగకుండా ఉన్నాయనుకుంటాను" అన్నాడు. బాబా ఏకాంతవాసంలో ఉపవాసాలు చేస్తూ బయలుదేరే ముందు సతారాలో 25 మంది వృద్ధుల కాళ్ళు కడిగి దక్షిణనిచ్చి వారిని గౌరవించారు అని చెప్పి మెహెర్‌జీ కారులో వెళ్తూ "అయ్యో ? విమానాశ్రయం వద్ద సామాను తెచ్చి కార్లలో పెట్టిన పోర్టరుకు నేను డబ్బు యివ్వడం మరచాను" అన్నాడు. హోటలుకు వెళ్ళాక కూడా "నేనొక అవకాశాన్ని పోగొట్టుకున్నాను. పోర్టరుకు కూలి యిచ్చి ఉంటే అతనికి బాబా ప్రేమను ఆ రీత్యా అందజేసి ఉంటేవాడనుకదా" అని నొచ్చుకున్నాడు.

బాబా ఎక్కిన కారే విమానాశ్రయం నుంచి ముందు బయలుదేరింది. కాని బాబా బసచేయబోయే రూబెన్సు హోటలు వద్దకు వెళ్ళేసరికి బాబా కారు అందరి వెనుక ఆఖరున వచ్చి ఆగింది. విమానాశ్రయానికి రాలేకపోయిన మిగిలిన వారంతా హోటలు వద్దకు వచ్చి వేచియుండి బాబా రాగానే ఆయనకు ప్రణామాలు చేసి స్వాగతం పలికారు. లిఫ్టులో మేడమీదకు వెళ్ళడానికి అందరి వెనకాల వెళ్ళి ఆయన నిలబడితే బాబా ఆకారం చూసిన, వారంతా అయ్యో! ఆయన ఎంత అలసిపోయి ఉన్నారో అని అనుకోకుండా ఉండలేకపోయారు. ఆయన అణుకువలో ఆయన సంపూర్ణత్వం గోచరిస్తోంది. హోటలు రూబెన్సులో బాబా కోసం ఒక పెద్దగది మండలికోసం వేరే యింకొక గది ఏర్పాటుకాబడి ఉన్నాయి.

బాబా వారి గదిలోకి ప్రవేశించిన తరువాత "నాకోసం వేచియున్న వారిని పైకి నాగదిలోకి పంపిస్తే వారిని చూస్తాను" అని క్రిందకు కబురు పంపించారు. అది చూసి అక్కడి ప్రేమికులు " ఆహా! ఆ మహానుభావుడు ఇసుమంత విశ్రాంతి కూడా తీసుకోకుండా మనలను పైకి రమ్మన్నారు. మనం ఎంత అదృష్టవంతులం?" అని అనుకున్నారు. బాబా తిన్నగా వారి గదిలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకుంటూ పరుంటారని వారు అనుకున్నారు గాని వెళ్ళి వెళ్ళడంతోనే వీరిని పైకి రమ్మంటారని అనుకోలేదు. తరువాత విమానాశ్రయంలో బాబాను కలిసిన వారిని కూడా పైకి రమ్మంటున్నారని కబురు వచ్చింది. వారి గదిలో మరల బాబాను దర్శించే అవకాశం ఆరాత్రి కలిగినందుకు వారిని వారే అభినందించుకున్నారు. ఆరాత్రి ఏర్పాటు చేసిన సన్మానసభ లో విల్, మేరీ, చార్లెస్‌లు బాబా ప్రక్కనే కూర్చున్నారు. వచ్చినవారికి స్వాగతం యిచ్చి బాబా వద్దకు తీసుకొని వెళ్ళి కుర్చోపెట్టడానికి డరోతీ, డెలియా, టామ్‌లు నియమింపబడ్డారు. బాబా కూర్చున్న చోటంతా పువ్వులు చల్లారు.

ఆ మరునాడు టీపార్టీ చేసుకున్నారు. బాబా అక్కడినుంచి అమెరికా వెళ్ళాలని ఉద్దేశంతో ఉన్నారు. ఈమారు బాబా డెలియాని అమెరికా రమ్మనమని చెప్పలేదు. అందుకోసం ఆమె చాలా విచారిస్తోంది. అప్పుడు ఆమెతో బాబా తరువాత అన్నారు – "అయ్యో! నీవు నీస్వంత ఖర్చులతో రాగలవని నాకు తెలియలేదు" అని. ఆరోజున బాబా అందరితోను వేరే వేరే సంభాషించారు.

సాయంకాలం కార్యక్రమం ఏర్పాటయింది. లండన్ లోని సంఘ సభ్యులందరు నూరుమందికి పైగా సమావేశానికి హాజరయారు. ఆసభకి బాబా అధ్యక్షత వహించారు. సభ్యులకు మధ్య ఉన్న అభిప్రాయ భేదాలను బాబా సరిచేసారు. అక్కడి బాబా ప్రేమికుల సంఘానికి ముగ్గుర్ని – విల్ బాకెట్‌ని, డెలియా డి లియాన్‌ని, చార్లెస్ పర్డమ్‌ని చేర్‌మెన్‌లుగా నియమించారు. ఆపదవిలో ఒక్కొక్కరు ఆరునెలలు ఉండి సేవచేసారు. డరోతి హాప్కిన్సన్ అనే ఆమెను కార్యదర్శిగాను కోశాధికారిగాను నియమించడం అయింది. వచ్చినవారందరికీ టీ బిస్కట్లు యిచ్చారు. ఆసమావేశంలో బాబా అసలయిన పని అంటే ఏమిటో ఒక ప్రసంగ పాఠం వారికి యిచ్చారు. ఆప్రసంగంలో బాబా చెప్పిన మాటలలో యీ విధంగాఉంది -- ఈ ప్రసంగం ఛార్లెస్ పర్డమ్ చేత చదివించారు.

"నాప్రేమికుల దగ్గర నుంచి నేను కోరేది కల్తీలేని స్వచ్ఛమయిన ప్రేమ. నన్ను హృదయపూర్ణంగా ప్రేమించండి. సమయం ఆసన్నమయింది. అందుచేత

యిప్పుడు గుణనకి వచ్చేది ప్రేమ మాత్రమే. నన్ను ప్రేమించండి. అప్పుడు మీరు నా విజయాపాన్ని చూడగలరు. మీ వద్దనుంచి నేను ఏదీ కోరడంలేదు అర్పణగాని, శరీరం గానీ ఏదీ నాకువద్దు నాకు కావలసింది మీ ప్రేమ మాత్రమే.'' డెలియా సోదరుడు జాక్ రెండుమార్లు వచ్చి బాబాను ఆలింగనం చేసుకున్నాడు. గత సంవత్సరం యితడికి తీవ్రంగా జబ్బుచేసింది. ఈ సంవత్సరం బాబాదర్శనంఅయ్యాక జాక్‌చనిపోయాడు. బాబా డెలియాకి యీ సందేశం పంపించారు_

''జాక్ అంటే నాకు చాలాయిష్టం. అందుచేత అతడు మంచి చేతులలో ఉన్నాడని తెలుసుకో'' ఎడ్మండ్ వర్దమ్ కూడా రెండుమార్లు వచ్చి బాబా దర్శనం చేసుకున్నాడు. ఆదీ (జూనియర్) తనభార్యతో వచ్చి బాబా దర్శనం చేసుకున్నాడు. అందుకే డగ్లస్ ఈప్ దంపతులుకూడా వచ్చారు.

వచ్చినవారందరిని బాబా కలిసారు. వారికోసం ఒక చిన్న ప్రసంగం కూడా చేసారు. 18 వ తేదీన హోటలులో బాబా గదిలో ఉదయం 9-30 గంటల నుంచి ఒక్కొక్కరిని పిలిచి బాబా సంభాషణలు చేసారు. ఒక్కొక్కరికి బాబా ఏదో చెప్పి పంపించారు.

కె అనేవాడు మాంచెస్టర్‌నుంచి వచ్చిన ఒక అన్వేషకుడు. బాబా పుస్తకం చదివిన వెంటనే ఆయన దర్శనం చేసుకోవాలనే అభిలాష కలిగింది. అతడు చేస్తూ ఉన్న ఉద్యోగం మానివేసి మార్చి (1956) మాసంలో ఇండియాకు వచ్చి ఆయన దర్శనం చేసుకోవాలని విచారించగా బాబా అప్పుడు సతరాలో ఏకాంతవాసంలో ఉన్నందున ఏలులేకపోయింది. బాబా అతనిని తిరిగి ఇంగ్లండు పంపించేసారు. ఇప్పుడు లండన్‌లో అక్కడికి వస్తే ఆయనను దర్శించే అదృష్టం అతనికి కలిగింది. ఇప్పుడు అతనితో బాబా ప్రత్యేకంగా సంభాషించారు.

విమానచోదకుడుగా ఉండి మరణించిన నోజర్ అన్న అయిన హెచ్. దాదా చాన్‌జీ వచ్చి బాబాను దర్శించాడు. సోదరుని మరణానికి శోకిస్తున్న అతనిని బాబా ఓదార్చి ఆఖరు శ్వాస వరకు నోజర్ బాబాను స్మరించాడనీ యిప్పుడతడు బాబా లోనే శాశ్వతానందం పొందుతున్నాడనీ బాబా దాదాచాన్‌జీతో చెప్పారు.

పనామా నుంచి డెలియా స్నేహితురాలయిన మిసెస్ ఓటిలియా తేజీరా రూబెన్సు హోటలుకి వచ్చి బాబాదర్శనం చేసుకొంది. జె. పి. అనే అతడు వచ్చి బాబాను దర్శించగా ''జ్ఞానం మూడురకాలుగా ఉంటుందని – మొదటిది పుస్తకాలు

చదివినందువలన, బుద్ధిచేత ఊహించినందువలన కలిగిన జ్ఞానము; రెండవది ప్రత్యక్షంగా చూసినందువలనకలిగిన జ్ఞానము; మూడవది – అనుభవపూర్వకంగా ఆచరణ వలన కలిగిన జ్ఞానము – '' అని బాబా వివరించి చెప్పారు.

యి. పి. అనేవాడు ఒక నటుడు. జీవితంలో ప్రతి వ్యాపారానికి ప్రతి కార్యానికి దానికి దానినకాకుండా అది ఆచరించవచ్చునని బాబా చెప్పారు. ఇతడు బాబా యొక్క ప్రేమ అవగాహన అనే వాతావరణంలో తన తండ్రి తనను పెంచి పెద్దవానిని చేసాడని చెప్పాడు.

ఎ, వై అనే వారితో మాట్లాడుతూ బాబా ——''ప్రతివారిలోను ప్రతిదానిలోను భగవంతుడున్నాడని స్పష్టంగా ఉద్ఘాటించారు. మాటలు హృదయం నుండి వచ్చినంత వరకు భాష ఏదయినా ఫరవాలేదు. ఎందుచేతంటే దేవుడు హృదయము నుండి వచ్చినది ఏదయినా వింటాడు. హృదయ శాంతిని, మానసిక సమత్వాన్ని పరీక్షించడానికి మానవులు సుఖంగా ఉన్న స్థితిలోనే ప్రపంచపు సంక్షోభాన్ని ఎదుర్కొనేలా చేయాలి. మరియు యితరులను సుఖపెట్టడం కోసం తన స్వంతసుఖాలను త్యాగం చేయడం ఆధ్యాత్మిక ప్రయోజనాలకి మిక్కిలి ప్రధానం''—— అని చెప్పారు.

టి. హెచ్ అనేవాడు ఎంత ప్రేమ ఉన్నా, ఎంత శ్రద్ధ ఉన్నా బాబా దేవుడంటే విశ్వసించలేకుండా ఉన్నాడు. బాబాను దేవునిగా భావించలేకుండా ఉన్నాడు. మంచి చెడ్డల ఫలితాల గురించి ఏమీ విచారించక అవి బాబాకి వదిలెయ్యమని అతనికి చెప్పారు బాబా. ప్రతిరోజు రాత్రి నిద్రపోయేముందు బాబాను తలచుకొనమని అన్నిచోట్లలందు అందరియందు బాబాను చూడడానికి ప్రయత్నం చేయమని దేనిని గురించి ఎప్పుడూ ఎంతమాత్రమూ ఆందోళన చెందవద్దని హితోపదేశం చేసారు.

విల్‌బాకెట్ అనే సన్నిహిత శిష్యుడు తనలాటి ప్రేమికుల జీవిత వృత్తాలకు బాబా ఒక కేంద్రము పరిధికూడా అయారని అన్నాడు.

మనసును ఆకర్షించే ఇంద్రియ భోగాల వైపుకి వెళ్ళక వాటికి దూరంగా ఉండమని జీవితం పవిత్రంగా ఉంచుకోమని తరుచుగా బాబాను స్మరిస్తూ ఉండమని యిద్దరు బాలురతో బాబా చెప్పారు.

ఎఫ్. ఎమ్. అనే భక్తునితో బాబా ''నాయెడల నీకున్న ప్రేమ ఎక్కువయినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను'' అన్నారు.

18 వ తేదీ ఉదయాన యీ సంభాషణల నుంచు సూబెన్స్ హోటలులో క్రింద హాలులో బాబా ప్రేమికుల సమావేశం అయింది. 150 మంది ఆ సమావేశానికి వచ్చారు. వారంతరు బాబా దర్శనం చేసుకున్నారు. తరువాత బాబా వచ్చినవారందరిని ఒకరి తరువాత ఒకరిని పిలిచి వారితో సంభాషించారు. వారిని బాబా స్పృశించి వారికి ప్రసాదం యిచ్చి ఆశీర్వదించి పంపించారు. వారు బయటికి వచ్చినతరువాత బాదాను వదలి వెళ్ళలేక చాలామంది మరల యింకొకమారు బాబా కనిపిస్తే బాగుండునని బయట తచ్చాడుతూ ఉన్నారు.

మేరీ తనువు వీడినపుడు ఆమె బాబా వద్దకు వచ్చిందని, స్పష్టంగా చెప్పారు.

అతిశయమైన ప్రేమగలవారి కోసం, వారితో మరికొంచెంసేపు మాట్లాడడం కోసం, లోపలికి ఒకరి తరువాత ఒకరు వెళ్ళే ప్రవాహానికి అప్పుడప్పుడు అడ్డు ఏర్పడేది.

బాబా లండన్‌లో ఉండగా నూరుమందితో విడి విడిగా ఏకాంత సంభాషణలు జరిపారు. ఈ ప్రపంచ పర్యటన ముగించి తిరిగి ఇండియా చేరుకునేసరికి మొత్తం 30,000 మైళ్ళు చేసిన ప్రయాణంలో బాబాను గురించి విన్నవారు, బాబా ఆశీస్సులు పొందినవారు ఆయన అనుగ్రహం ప్రసరించినవారు అనేకులున్నారు.

బాబాను సందర్శించడానికి వచ్చినవారిలో పాతవారు అంటే 1931, 1932 సంవత్సరాలలో బాబా వచ్చినపుడు వారిని దర్శించిన భక్తులు బాబా మండలి నలుగురిని కలుసుకుని వారితో మాట్లాడుతూ బాబా గురించిన విశేషాలు తెలుసుకుంటున్నారు. తరువాత జూరిచ్ నుంచి పారిస్‌నుంచి వచ్చిన వారిని కూడా కలుసుకుని వారి పరిచయాన్ని వృద్ధి చేసుకుంటున్నారు.

బాబా ఉన్న గదికి ప్రక్క గదిలో దర్శనార్థులయిన బాబా ప్రేమికులు చేరారు. వారితో గావించిన సంభాషణలలో సర్వజ్ఞుడయిన బాబా యొక్క అఖండజ్ఞాన సంపద అందరికి ద్యోతకమయింది. వారి ప్రేమ అందరిని పరవశులను చేసింది. బాబా ఒక్కొక్కరికి జవాబు చెప్పి ఎవరికి తగినట్లు వారికి హితవుగరిపి, ధైర్యం చెప్పి అందరికి తృప్తిని సంతోషాన్ని కలుగజేసారు. చిన్నవారికి, పెద్దవారికి, గృహస్థులకి, బ్రహ్మచారులకి, స్త్రీలకు పురుషులకు, వ్యాపారపు చిక్కులలో ఆర్థికమైన యిబ్బందులలో సతమతవుతున్న వారికి తగినట్లు హృదయంలో నుంచి బరువును దింపేసి వారిని తేలికపరచి వారికి ఆనందం కలిగించి బాబా వారిని చిరునవ్వుతో సాగనంపారు.

యూరప్ ఖండం నుంచి వచ్చిన ఒకనికి, ఏదో భౌతికమయిన చిక్కులో ఉన్న అతనికి, బాబా తమ నామమును ప్రతిరోజూ ఒక నిర్ణీతసమయంలో ఏడు మారులు ఉచ్చరించమని చెప్పారు. ఇదియొక ఆధ్యాత్మిక శిక్షణగా భావించి చెప్పినట్లు చేసినట్లయితే అన్ని చిక్కులు తొలగిపోయి మనశ్శాంతి కలుగుతుందని వానికి నమ్మకం కలిగింది. ఈ విధంగా ఒక్కొక్కరికి ఏడెనిమిది నిమిషాలుపాటు సమయం యిచ్చి ప్రేమికులతో సంభాషణలు జరిపారు. సతీయుక్తంగా వచ్చినవారిని భార్యాభర్తలు యిరువురిని బాబా కౌగిలించుకుని ఆశీర్వదించారు. ఆ దంపతులు ఒక నూతన యుగంలో అడుగిడినట్లు భావించుకున్నారు.

బాబా సంభాషణలు చేసేటప్పుడు వారి చూపులో, వారి హావభావాలలో, వారు చేసే సంకేతాలలో అన్ని సమస్యలు బాబా సన్నిధిలో పరిష్కారం అయిపోతాయనే విషయం తెలుసుకున్నారు.

ఇండియాలో ఉన్న ఒక జిల్లాలోని ప్రేమికుల గురించి బాబా చెప్తూ బాబాను సేవించే అవకాశాల ద్వారా వారి అహంకారాన్ని నాశనం చేసుకుంటున్నారని చెప్పారు.

అనేక వందలమంది బాబా దర్శనం చేసుకుని, ఆయన ఫొటోను, ఆయన చేతితో యిచ్చిన, 'ప్రసాదాన్ని' అందుకుని (ఆ ప్రసాదం స్వీకరించినవారే ఏకాంతంగా తినాలి) బాబా వారి హృదయ గ్రంథాలను చదివి చూసారన్న సంగతి వారు గ్రహించి తృప్తిని పొందారు. ఒక్కొక్కరిని బాబా బుగ్గమీద స్పృశించారు. మరియొకరిని భుజం మీద గాని వీపు మీదగాని తట్టారు. మొదట కలుసుకున్నప్పుడు బాబా వారితో కరచాలనం చేసి ఆలింగనం చేసుకున్నారు. కొందరు ఏదో తమకు హితవు చెప్తారనుకుని ఏదోదీర్ఘంగా మట్లాడదామనుకుని వచ్చి "నీ సంగతంతా నాకు తెలుసులే, నీకు నేను సహాయం చేస్తాను" అని ఒక్కమాటతో వారి సంభాషణ ముగిసినప్పటికి వారి సమస్యలు తీరినట్లుగా వారు సంతోషించిబయటకు నడిచారు. కొందరు కుటుంబాలతో పిల్లలతో వచ్చినపుడు బాబా తనయుల వైపు ముందుచూసి తరువాత తల్లిదండ్రుల ముఖాలవైపు సారించిన వారి దృక్కులలోని అనిర్వచనీయమైన ప్రేమతరంగాలతో భారికుటుంబసభ్యులందరూ కూడా ఉత్తేజితులై నూతనోత్సాహంతో సెలవు తీసుకొని వెళ్ళారు. ఒకడు ఎంతో కృంగిపోయి నిరాశతో బాబాను సమీపించగా వానిని బాబా ఒక్క ఆలింగనంతో పునరుజ్జీవనం కలుగజేసి హృదయంలో నూతనమైన ఆశలను చిగురింపచేసి అతనిని పంపించారు.

రెండవసారిగా బాబాను కలుసుకున్న ఒక భక్తుడు మొదటిసారి కలిగిన అద్వితీయమైన తన అనుభవాన్ని జ్ఞాపకం చేసుకుంటూ వచ్చాడు. అతడు దూరాన్నుంచి చూస్తూ ఉన్నాడు. బాబాదగ్గరకు ఒక్కొక్కడు వచ్చి వెళ్తూంటే బాబా యొక్క శక్తి ఆయన వదనంలోని తేజసు కొంచెం కొంచెంగా తగ్గుతున్నట్లు అతనికి స్ఫురించింది. ఒక ప్రక్క కొంచెంసేపట్లో సంగీతం రికార్డువేసి ఒక్కపాట వింటూంటేనే అంతలోనే బాబా యొక్క అపారమైన శక్తి నవోత్సాహంతో నూతన తేజంతో ఆయన ముఖం ఆనందంతో తొణికిసలాడుతోందని గమనించి ఆశ్చర్యపోయాడు.

వచ్చిన వారినందరినీ చూసిన తరువాత బాబా యింక విశ్రమించబోతూ "ఎవరయినా ఆలస్యంగా వచ్చినట్లయితే నా వద్దకు పంపండి. వారిని కూడా చూసి పంపిస్తాను" అన్నారు. ఒక్కరిని కూడా వదలివేయకుండా బాబా యొక్క దర్శనావకాశాన్ని అందరికి కలుగజేసారు.

రెండవరోజున, 19 వ తేదీన, ఉదయం అన్నీ యథాప్రకారంగానే జరిగాయి. ఆ మధ్యాహ్నం హోటలులో ఒక విందు (టీ పార్టీ) ఏర్పాటయింది. ఇంగ్లండులో యీ విధంగా 48 గంటలు గడిపి బాబా 19 వ తేదీ సాయంకాలం విమానాశ్రయానికి బయలుదేరి వెళ్ళారు. ఒక్కొక్కరితోనూ మాట్లాడుతూనే బాబా వారి విశ్వకార్యాన్ని అవిచ్ఛిన్నంగా సాగిస్తూనే ఉంటారు.

ఈ సంగతి బాబా వైపు చూస్తూ వారిని గమనిస్తూ ఉన్న వారికి తేటతెల్లమవుతుంది.

విమానాశ్రయానికి వెళ్తూ ఉంటే కారులో బాబా మండలిలో ఉన్న శిష్యుడొకడు తన హాస్యరసపూరిత సంభాషణతో బాబాకు నవ్వు పుట్టిస్తూ వినోదం కలిగించాడు. అలసట కలిగించే బాబా కార్యక్రమాలకు యీ వినోద పూరిత సంభాషణ జీవం పోస్తుంది. విశ్వానికి సేవచేస్తూ తన ప్రేమికుల ప్రేమకు దానిసయై అన్నివరిస్థితులలోను ప్రభులకు ప్రభువైన మెహెర్‌స్వామి అన్ని సంఘటనలకు మూలమై యొప్పుతున్నారు.

విమానాశ్రయంలో ప్రయాణీకులు కూర్చున్నచోట కొంతసేపు వేచియున్న తరువాత ప్రయాణీకులు కస్టమ్సుశాఖకు వెళ్ళవలసిందిగా కోరబడినారు. బాబా చుట్టూ ఆయన ప్రేమికులు కూర్చుని ఆయన సమక్షంలో కలిగే సంతోషాన్ని అనుభవిస్తున్నారు. ఈచుట్టూ కూర్చున్న వారిసంఖ్య నిమిష నిమిషానికి ఎక్కువ కాజొచ్చింది. అంతలో

యిద్దరు కొత్తవారు (ఎప్పుడూ బాబాను చూడనివారు) ఉన్నారు. అందులో ఒకడు "ఆయన ప్రవక్తయా?" అని అడిగాడు. ప్రపంచంలో సదవగాహన, సౌభ్రాతృత్వము పెంపొందించుటకే ఆయన వచ్చారు అని వారికి ఒక పాత ప్రేమికునిచేత సమాధానం యివ్వబడింది.

ఈవిధంగా ఆఖరి నిమిషం వరకూ బాబా వారి సహవాస భాగ్యాన్ని ప్రేమికుల కిచ్చారు. సమయం కాగానే 'రెయిన్ బౌ' అనే విమానంలో ఎక్కి అమెరికాకి ప్రయాణం అయి వెళ్తున్నారు.

జూలై 20 వ తేదీ శుక్రవారం రోజున ఇనుము ఒక సూదంటురాయిచేత ఆకర్షింపబడినట్లు 60 మంది ప్రేమికులు ఆ ఉదయం 6 గంటలకు ఐడిల్ వైల్డ్ (న్యూయార్క్) విమానాశ్రయం వద్ద బాబాకు స్వాగతం చెప్పడానికి సమావేశ మయారు. అప్పుడే తెల్లవారుతోంది. అనేకమంది న్యూయార్క్ నగరం నుంచి వచ్చారు. కొంతమంది దూర దూర ప్రదేశాలయిన కాలిఫోర్నియా, టెక్సాస్ మొద లయిన రాష్ట్రాలనుంచి, దక్షిణకెరోలినా నుంచి బాబాను దర్శించడానికి ఆయనతో ఉండడానికి వచ్చారు. బాబా విమానం దిగుతారనగా అక్కడ ఉన్న ప్రేమికులందరకు ఉద్వేగం ఉత్సాహం మిన్నుముట్టాయి. బాబాకి ప్రణామాలు చేయడానికి సిద్ధంగా ఉన్నారు. 'రెయిన్ బౌ' అనే విమానం బాబాను తీసుకువస్తోంది. పాన్ అమెరికన్ సంస్థవారి విమానం అది. లండన్ నుంచి అది సరిగా ఉదయం 7 గంటలకు రావలసి ఉంది.

ఇది బాబా అమెరికాకు రావడం 5 వ సారి. క్రితంమాటు 1952 వ సం॥లో వచ్చారు. అప్పుడు బాబా దర్శనం చేసుకోనివారు చాలా మంది యిప్పుడు వచ్చారు ఇంతకు ముందు బాబాను దర్శించకపోయినా ఆయనచేత ఆకర్షితులై ఆయన ప్రేమి కులుగా అనేక సంవత్సరాలుగా వారి దర్శనానికై ఎదురు చూస్తున్నారు కొందరు. ప్రియతముడు ఆయన యొక్క పాత కొత్త ప్రేమికులు ఆయన దివ్యమైన సహ వాసం పొందే భాగ్యం కల్పించుట కొరకు ఆయన అవలంబిస్తూ ఉన్న ఏకాంత వాసాన్ని భంగపరచుకొని వారికోసం యీ సుదీర్ఘ ప్రయాణం చేసి వచ్చారు. 1952 వ సం॥లో బాబా అమెరికానుంచి వెళ్తూ తమకు వీడ్కోలు యివ్వడానికి వచ్చిన ఆయన ప్రేమికులతో "మీ ప్రేమయే నన్ను మరల యీ పాశ్చాత్య దేశాలకు తీసుకొని వస్తుంది" అని చెప్పారు. అలాగే దివ్యపురుషుడయిన బాబా యిప్పుడు

ఇండియానుంచి నలుగురు శిష్యులతో అమెరికాకు వస్తున్నారు. ఇంతలోనే విమానం వచ్చింది. కొంవరు బాబా విమానం దిగుతూంటేనూ దిగివస్తూంటేనూ ఫొటోలు తీయాలని ఆయత్తమయారు. 'రెయిన్ బో' అనే పాన్ అమెరికన్‌వారి విమానమే యిప్పుడు వచ్చిన విమానం అని తెలియగానే అందరికీ ఉద్రేకాలు రేగాయి.

సరిగ్గా విమానాశ్రయంలో దిగిన విమానం 7 గంటల 5 నిమిషాలకు బాబాకోసం వేచియుండి నిలబడియున్న ప్రేమికులకెదురుగా వచ్చి ఆగింది. అందరూ బాబా కనిపిస్తారేమో అని విమానం కిటికీలవైపు నిశితమైన దృష్టి సారించారు. ముందు నిలబడియున్నవారు, కెమేరాలు తయారుగా ఉన్నవారు బాబా మొదటి చిరునవ్వు దర్శించారు; దానిని వారి కెమెరాలలో గ్రహించగలిగారు. ఆ చిన్నబృందం వారి చేతులూపుతూ సంతోషంతో బాబాకు స్వాగతం యిచ్చారు. బాబా దిగిరావడం వారు ఆనంద భాష్పాలతో తిలకిస్తున్నారు. బాబా గులాబీరంగు కోటు తెల్లని సద్రా ధరించియున్నారు. వారివైపు ప్రకాశవంతమయిన చిరునవ్వును చిందించారు బాబా. చాలా రోజులనుంచి వస్తారు వస్తారనుకున్నవారు వచ్చేసారు. విమానాశ్రయం మేడమీద వసారాలోనుంచి చూసిన వారంతా గబగబా క్రిందకి దిగి కస్టమ్స్‌వారి గదిబయట బాబా కోసం వేచియున్నారు. కాని కస్టమ్స్ శాఖలోనే ముప్పావుగంట అయింది; బాబా బయటకు వచ్చేసరికి. అంత ఆలస్యమయింది. ఇతర ప్రయాణీకుల తలలపై నుంచి బాబా చేయి ఊపుతూ తమ ప్రేమికులను చూసారు. బాబా రెండు ఆధ్యాత్మిక సంస్థలకి అతిథిగా అమెరికా వచ్చారు. వాటిలో ఒకదానికి ఐవీడ్యూక్, రెండవదానికి ఎలిజబెత్ పాటర్సన్ ప్రతినిధులుగా ఉన్నారు. కస్టమ్స్ అధికారులు వీరిరువురిని బాబాను చూడడానికి లోపలకు వెళ్ళనిచ్చారు. ఆ ప్రకారం లోపలికి వెళ్ళి బాబాకు ముందుగా స్వాగతం పలికారు.

బాబా యీవలకు రాగానే ప్రేమికులందరు ఆయనను చుట్టుముట్టారు. వెంటనే వారిని కౌగిలించుకోవడం ప్రారంభించారు. మొట్టమొదట వారి శిష్యులలో పాతవారి వద్దకు వెళ్ళారు. తరువాత అందరినీ పలకరించారు, కుశల మడిగారు. ఇదివరలో బాబాను దర్శించని వారిని కూడా బాబా కలిసారు. బాబాకు స్వాగతం యిచ్చిన ఆ ప్రేమికులు ఎరుపు, తెలుపు, నీలం వర్ణాలుగల పుష్పాల దండలను బాబా మెడలో అలంకరించారు. ఈ దృశ్యాన్ని ఫొటోలు తీయడానికి కెమేరాలు క్లిక్కుమనిపించారు. బాబా అమెరికాకు ఏతెంచిన అపూర్వ దృశ్యాన్ని యీవిధంగా శాశ్వతం చేసుకున్నారు బాబా ప్రేమికులు. ఐక్యరాజ్య సమితికి వచ్చిన యుక్రేనియా దేశపు ప్రతినిధి అప్పుడు

ఆ విమానాశ్రయంలో యీ దృశ్యాన్ని తిలకించి "ఆయన ఎవరు? ఆధ్యాత్మిక నాయకుడా? కస్టమ్స్ శాఖ నుంచి బయటకు రాగానే మిస్సుల నందరను కలిసాడే ఆయన! ఎంత అబ్బురము! నేను యింతవరకు నా జీవితంలో చూసిన గొప్పవారె వరిలోనూ యింత అద్భుతమైన వ్యక్తిని నేను చూడలేదు. ప్రతివారిని కలిసి, శుభాకాంక్షలు తెలిపి, అందరిని కౌగిలించుకుని వచ్చిన వారినెవరినీ వదలకుండా ప్రతివారిని పలకరించిన వారినెవరినీ యింతవరకూ చూడలేదు." అన్నాడు.

బాబా యిప్పుడు వారికోసం వేచియున్న మోటారుకారు వైపుకి నడిచారు. నలుగురు భారతీయ శిష్యులు ఆయనను అనుసరించారు. వారు ఎవరనగా ఒకడు శిష్యుడయిన డాక్టర్ నీలకంఠ్, మెహెర్ ప్రచురణలకు యజమాని బాబా కార్యదర్శి అయిన అదీ. కె. ఇరానీ, బాబా యొక్క ప్రఖ్యాత వ్యాఖ్యాత ఎరచ్ జెస్సావాలా, మెహెర్జీ కార్కేరియా అనే ప్రసిద్ధి చెందిన బొంబాయి వ్యాపారస్తుడు. బాబా 1954 వ సంవత్సరంలో అక్షరఫలక విసర్జనం చేసినప్పటినుండి బాబా యొక్క సంజ్ఞలను భాషలో పెట్టి చెప్పేవాడు ఎరచ్. భగవద్వచనం (గాడ్స్పీక్స్) అనే గ్రంథము యొక్క తరువాత భాగం ఎరచ్ యీ విధంగా బాబా సంజ్ఞలు చేస్తూ చెప్పగా ఆంగ్లభాషలో వ్రాసాడు.

బాబా కూర్చున్న కారు యొక్క కప్పును అనేక మార్లు తెరిచారు, బాబా కనిపించడం కోసం. బాబా కనిపించగానే ఫోటోలు తీసేవారు వారి కెమేరాలను ఉపయోగించారు. మిగిలిన వారు వారి ప్రియతముని తిలకిస్తూ కారుకు చుట్టూ నిలబడ్డారు. బాబా 1954 సెప్టెంబరులో వారి అంతిమ ప్రకటన చేసిన తరువాత మరల బాబాను చూసేవరకు వారికి నమ్మకం లేక పోయింది. బాబా కారు వెనకాల అనేక లారీలు, కారులు, టాక్సీలు నిలబడిపోయాయి. ఒక పోలీసు యిలా ఆగిపోవడానికి కారణం ఏమిటని తెలుకోడానికి వస్తే, వాషింగ్టన్.నుంచి వచ్చిన బాబా ప్రేమికు డొకడు "వచ్చిన వారెవరో తెలియదా? ఉండమను వెనకాల వాళ్ళందరినీ" అని గదమాయిస్తూ అన్నాడు. ఆ వచ్చినవారు ఎవరో ఏమిటో అని ఆ పోలీసు వెనుక బళ్ళన్నీ ఆపేసాడు.

కొంతసేపటికి బాబా కారు అక్కడినుంచి వెళ్ళే కార్ల ప్రవాహంలో చేరింది. మిగిలిన భక్తులు వారి వారి కార్లలో బయలుదేరారు. కొందరు బస్సుల్లో ఎక్కారు. బాబా వచ్చేశారన్న సంతోషము, ఇన్ని సంవత్సరాలుగా ఎదురు చూస్తున్న వారి

ప్రయత్నమునితో కొద్దిరోజులు సహవాసంలో గడుపుతామనే ఆశను ఆనందాన్ని కలిగించగా వారు ఉత్సాహంతో ఉరకలు వేస్తున్నారు.

కొద్దిమంది బాబా దిగబోయే హోటలు వెల్మానికో దగ్గరకు వచ్చారు. బాబా వస్తారని వారు హోటలు ద్వారం వద్ద వేచియున్నారు. బాబా వచ్చి కారు దిగగానే, వారంతా వచ్చి ఆయనకు స్వాగతం చెప్పారు. కొద్దిసేపట్లో 18 వ అంతస్తులోని వారి గదిలోకి వెళ్ళారు బాబా. వెంటనే బాబా తమ ప్రేమికులతో ముందు చేయవలసిన పర్యటన గురించి అనేకసమస్యలు చర్చించడం మొదలుపెట్టారు. ఐవీడ్యూక్, వెర్మాంట్ కార్వల్ హోంలతోను, టెలివిజన్ ప్రతినిధులతోను, పత్రికా విలేఖరులతోను బాబా సంభాషణలు జరిపారు.

న్యూయార్క్, వాషింగ్టన్, మిర్టిల్ బీచ్, పశ్చిమతీరము మొదలగు స్థలముల నుంచి వచ్చినవారిని వారి 1952 వ సంవత్సర ప్రయాణములలో చెప్పినట్లుగా తమ రాక గురించి ఏ విధమయిన ప్రకటనలు చేయవలదని యీ మారు చెప్పలేదు. మెహెర్‌బాబా ఆతిధ్యసంఘమునకు అధ్యక్షురాలయిన మేరియన్ ఫోర్‌షీస్‌తో బాబా ఆయన సంచారము గురించి చర్చించారు. ఈ సంఘము వారు, బాబా యొక్క విశ్వపర్యటనలో విమాన ప్రయాణ ఖర్చులు వగైరాలకు కావలసిన సొమ్ము వారి యొక్క భక్తులనుంచి అమెరికాలోని స్నేహితులనుంచి వసూలుచేసారు. బాబా అంవరి యొక్క అతిధికదా. పాత శిష్యులతో కూడా బాబా వేరేగా సంభాషణలు జరిపారు. లండన్ నుంచి వచ్చేటప్పుడు విమానంలో ఆ రాత్రి బాబాకి ఆయన మండలికి నిద్రలేక పోయినప్పటికి వారిని 'విశ్రాంతి తీసుకోండి' అని అమెరికా భక్తులెవరో అంటే "నేను సతారా వదిలినప్పటి నుండి నేను విశ్రాంతి ఎరుగను. నా శరీరం వదిలేవరకు నేను విశ్రాంతి తీసుకోను" అన్నారు. 30 రోజులలో 30,000 మైళ్ళు ప్రయాణం చేసే సుడిగాలి వంటి యీ పర్యటనలో నిజంగా ఆయనకు విశ్రాంతి ఎలా ఉంటుంది? ఎందుచేతంటే ఆయనకోసం వచ్చే వందలాది ప్రజలకు దర్శనం యిచ్చి వారితో సంభాషణలు ముగించి వారి గదిలోకి వెళ్ళిన తరువాత వారి విశ్వకార్యక్రమం చూసుకుంటారు; రాత్రిళ్ళు చాలా కొద్దిసేపు నిద్రపోతారేమో. లేకపోతే అదీ ఉండదు. స్థూల శరీరం నిద్రపోయినా సూక్ష్మ మానసిక శరీరాలు ఆయా భూమికలలో పనిచేస్తూనే ఉంటాయి.

క్రింద సంభాషణలకోసం కేటాయించిన గదులలో బాబా ప్రేమికులు తగిన ఏర్పాట్లు, అలంకారాలు చేస్తున్నారు. అవి కంటికి యింపుగా ఉండేటట్లు చేసారు. బాబా

కూర్చునే సోఫా మీద తెల్లటి దుప్పటి పరిచారు. దానిపద్ద పుష్పాలు ఆకులు అమర్చిన పాత్రలు ఉంచి అలంకరించారు. దర్శనార్థులకు ఒక్కొక్కరికి 'ప్రసాదం' యిస్తారు కదా బాబా. అందుకోసం గింజలు లేని తెల్లద్రాక్షపళ్ళను ఒక పళ్ళెంలో ఉంచారు. బాబా వారి సంచారంలో యివే వారి అనుగ్రహ ప్రసాదంగా అందరికీ బాబా ప్రేమతో పంచియిచ్చారు.

మధ్యాహ్నం ఒంటిగంటయేసరికి దర్శనార్థులు వచ్చి గదులలో కూర్చోవడం ప్రారంభించారు. ద్వారం పద్ద ఒక చిన్న బల్లమీద ఎల్లా వింటర్ ఫెర్ట్ కూర్చొని ఇంటర్వ్యూ లిస్టులో (దర్శనార్థుల జాబితాలో) వచ్చి వెళ్ళిన వారి పేర్లకు వారి సంభాషణ అయిపోయినట్లు గుర్తుపెడుతోంది. ఒక్కొక్కరికి అయిదు నిమిషాల సమయం యిచ్చి జాబితా తయారు చేయబడింది. పైకి ఎక్కే లిఫ్టులవద్ద కింద హాలులో చాలా మంది వేచియున్నారు. బాబా అక్కడికి వచ్చినపుడు మొదటిసారిగా వారిని చూడవచ్చునని వారి ఉద్దేశం. వారు అనుకున్నట్లుగానే చిరునవ్వుతో బాబా వారి మధ్యకు వెళ్ళారు. వారి చుట్టూ ఉన్న ప్రేమ వాతావరణం వర్ణించలేనిది. అందులో వారిలోని కొందరు పొందిన అనుభూతికూడా అనిర్వచనీయమైనదే.

గదిలోకి వెళ్ళి బాబా కూర్చోగానే కార్యకర్తలను పిలిచారు.వారికి దాదా సంజ్ఞామూలకంగా యిచ్చిన సందేశాన్ని ఎరచ్ యీవిధంగా భాషాకరణం చేసాడు.

"మిమ్మలనందరను యీరోజున కలవడం వలన నేను చాలా సంతోషిస్తున్నాను. మీ అందరకు నాప్రేమను యిస్తున్నాను. మీరంతా నన్నుప్రేమిస్తున్నారని నేనెరుగుదును. మీ యెడల నాకున్న ప్రేమవల్లనే మీరునన్ను ప్రేమిస్తున్నారు. మీరు నన్ను యింకా ఎక్కువగా, యింకా అధికంగా ప్రేమింపగలిగితే ఒక రోజున మీరు నేను నిజంగా ఉన్నట్లుగా నన్ను చూడగలుగుతారు. నేను మీకు కనిపించే యీ భౌతిక రూపాన్ని కాదు. నేను మహాసముద్రుణ్ణి – అపారమైన ప్రేమ మహాసాగరుణ్ణి. నన్ను యింకా యింకా అధికతరంగా ప్రేమించడానికి ప్రయత్నంచేయండి. అప్పుడు మీరు నన్ను తెలుసుకుంటారు."

అప్పుడు దర్శనార్థులు ఒక్కొక్కరే వస్తే వారిని బాబా కలుసుకుంటారని అందరికీ తెలియజేయబడింది. బాబా ఒక పాత ప్రేమికురాలి వైపు తిరిగి "నీవు ఒక్కతెవు తప్ప అందరూ బాబాను ప్రేమించడం నేర్చుకున్నారు." అన్నారు ఆమెను ఏడిపిస్తూ. "నేను ఒక్కతెనుతప్పా? బాబా మీరే నా గురువు. మీరు నాకు ప్రేమించడం నేర్పలేదు

వరి నాకు మీరు నేర్పి ఉండవలసింది.'' అని ఆమె జవాబిచ్చింది. బాబా ఆమె వైపు ప్రేమతో చూసి "నేను నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాను.'' అని సంజ్ఞచేసారు-

ఆరోజున మొదట బాబాకు పరిచయం చేయబడిన వారు ఆయన ప్రచురణ కర్తలయిన మిస్టర్‌బాండ్, మిస్టర్ ఫెల్ప్స్ ప్లాట్ అనువారలు. ఇరువురూ కూడా డాడ్‌మీడ్ అండ్ కంపెనీ అధినేతలు. వారే "గాడ్‌స్పీక్స్'' (భగవద్వచనము) అనే గ్రంధాన్ని ముద్రించి ప్రచురించారు. వారు బాబాను చూసి ఎంతో ప్రభావితులయారు.

తరువాత మిగతావారు ఒక్కొక్కరుగానో చిన చిన్న బృందాలుగానో బాబాను దర్శించేందుకు లోపలకు వెళ్ళారు. వారి గురించి సూక్ష్మంగా చెబుతూ బాబాకు వారిని పరిచయంచేసారు బాబా ప్రేమికులు. క్రొత్తవారెవరయినా లోపల ప్రవేశించగానే ఆయన నిరుపమానమైన చిరునవ్వుతోనే ముందు వారిని ఉత్తేజపరుస్తారు. ఆయన యొక్క ప్రేమాన్వితమయిన ఆలింగనము, చేయి జాపి వారితో గావించెడి కరచాలనము, ఒక్కొక్కరిగురించి ఆప్యాయంగా ఆయన వారి స్వంత విషయాలు తెలుసుకోవడము. ఒక్కొక్కరి సమస్యల గురించి ఆయన ఎంతో ఓర్పుతో విని తగిన సమాధానం చెప్పడము, వారు సెలవు తీసుకొని వెళ్ళేటప్పుడు ఒక్కొక్కరికి ఒక ద్రాక్ష పండు 'ప్రసాదం' యివ్వడం యివన్నీ వారి హృదయంలో చెరగని ముద్రవేస్తున్నాయి. వారంతా నిజంగా ఎంత ధన్యులో చెప్పడానికి అలవికాదు. ఆయన నుంచి వారి హృదయాలలో తిన్నగా చొరబడే ప్రేమకిరణాలు ఆయన నిజంగా దివ్యప్రేమమూర్తి అని వారి అనుభూతి వల్ల వారే తెలుసుకుంటున్నారు. పరమాత్మ నుంచి జీవాత్మకు ప్రసరించే ఆ ప్రేమ కిరణాలు వారిని నఖ శిఖ పర్యంతము ముంచెత్తి నూతన వ్యక్తులుగా చేసివేస్తున్నాయి. ప్రేమ మూలంగానే ప్రపంచానికి ఒక వింత అందాన్ని ఒక క్రొత్త రూపాన్ని కలుగజేస్తుంది.

న్యూయార్కులో యీ దర్శన దినాల గురించి జీన్‌ఫాస్టర్ ఒక గ్రంధంలో బాగా వర్ణించింది.

బాబా సోఫాలో వారి గులాబీకోటుతోను తెల్లటి సద్రాతోను కూర్చుని తేజో విరాజమానమయిన వదనంతో అలరారుతున్నారు. అందమయిన సుగంధపుష్పాలు వాతావరణమంతా సౌరభయుతంగా చేస్తున్నాయి. పెద్ద పెద్ద పసుపుపచ్చని గులాబీ గుత్తులు తీసుకువచ్చారు. ఆ పుష్పాల పరిమళం ఆ గది అంతా ఆవరించింది. ఇలా ఆ గులాబీలు గుబాళిస్తూంటే యింకా అనేక రకాల పుష్పాలు తెచ్చి ప్రభువుకు

కానుకగా యిస్తున్నారు. కొందరు చక్కగా వికసించిన ఒక్కొక్క పువ్వు పొడుగాటి కాడతో తెచ్చి బాబా చేతికి అందిస్తున్నారు.

బాబా మండలి ఆయన ప్రక్కనే ఉన్నారు. కుడిప్రక్కనుంచి బాబాలో నమ్మకం ఉండి ఆయనను దర్శించాలనే ఆకాంక్ష ఉన్నవారు వస్తూంటారు. డార్విన్ తనసతి జీన్‌ను బాబా సన్నిధిలోకి తీసుకువచ్చాడు. బాబా చుట్టూ తేజోవంతమయిన వెలుగును నా కళ్ళతో చూసాను ! అని ఆమె చెప్పింది. డార్విన్‌షా ఇండియాలోని బాబా ఆశ్రమం నుంచి ఆ పవిత్రభూమి నుంచి తీసుకువచ్చి, ఆమె కొక రాతిముక్కను యిచ్చాడు. ఆ రాతిని ఆమె చేతిలో ఉంచుకున్నది. దానిని బాబా చేతితో పట్టుకొని డార్విన్‌షాకు యిచ్చారు. అప్పటినుంచి జీన్‌షా దానిని తన చేతిసంచీలో వేసుకొని తన వద్దనే ఉంచుకుంటోంది. బాబా ఆ రాతిని చూడగానే చిరునవ్వుతో దానిని అందుకుని ఆయన రెండు చేతులతో దానిని నొక్కి పట్టుకొని మళ్ళీ ఆమె చేతికి యిచ్చారు. ఆయన ఆశీర్వాదం చేసినట్లుగా జీన్‌కు అనిపించింది. దానితో ఆమె యొక్క చైతన్యం ఆమె శరీరం తట్టుకోలేనంతగా చేయబడింది.

ప్రక్కగదిలోని వారు ఆయనను గురించి చిన్న కంఠాలతో చెప్పుకుంటున్నారు. ఆ గదిలో అన్నిరకాలవారు ఉన్నారు. వృద్ధులు, చిన్నవారు, తెల్లవారు, నల్లవారు, గోధుమ వర్ణంగా ఉన్నవారు వగైరాలంతా ఉన్నారు. చిన్నపిల్లలు కూడా ఉన్నారు. బాబాతో సంభాషణలకు ముందుగానే సమయం నిర్దేశం చేసుకున్నవారు యింకా వేచి ఉన్నారు. మిగతావారు బాబా గురించి యింకా సంగతులు ఏమయినా తెలుస్తాయేమోనని ప్రయత్నిస్తున్నారు. బాబా దర్శనార్థం కూర్చున్నవారిలో ఒక గర్భిణీ స్త్రీ ఉన్నది. ఆమెకు జన్మించబోయే శిశువును బాబా ఆశీర్వదించాలని ఆమె ఆకాంక్ష. ఆతిథ్య సంఘ సభ్యులు దర్శనార్థులను ఒకరి తరువాత ఒకరిని వరుసలో పంపుతున్నారు. మొదటిసారిగా బాబా దర్శనార్థం వచ్చిన వారికి మిగిలినవారు సహాయం చేస్తున్నారు. ఆ గదికి బయట ఉన్న హాలులో అనేకమంది స్త్రీ పురుషులు బాబా ఒక్కసారి కనిపిస్తారేమో చూద్దామని కనిపెట్టుకుని ఉన్నారు. బాబా పై అంతస్థులలో వారి గదికి వెళ్ళడానికి ఎలివేటర్‌లో ఎక్కడానికి యివతలికి వస్తే చూడడానికి వీలవుతుందేమో అని ఆ అవకాశాం కోసం ఎదురు చూస్తున్నారు. వారి వదనాలలో ఎక్కడా విసుగులేదు. సంతోషమే కనబడుతోంది. గదిలోనుంచి హాలులోకి వచ్చి ఎలివేటర్‌లో ఎక్కే అంత వ్యవధిలోనే బాబా అక్కడ ఉన్నవారి సుఖదుఃఖాలని గమనించి వారి ఆశయాలను తెలుసుకొని ఆయన యొక్క ప్రేమతో వారిని ఆశీర్వదించుచున్నారని

వారికి అనిపించింది. క్రొత్తగా వచ్చిన ఒక స్త్రీ "బాబాను చూసేవరకు అసలు ప్రేమ అంటే ఏమిటో తెలియదు నాకు" అని అంది. మన మానవ ప్రేమలన్నీ ఆయన దివ్యప్రేమ అనే మహావృక్షం క్రింద గడ్డిపరకలని చెప్పవచ్చును. ఎంతమంది వరుసలో బాబా వద్దకి వెళ్ళినా మొట్టమొదటి వ్యక్తి బాబాను చూసినపుడు ఎంత ఆప్యాయంగా ఆసక్తితో అతనిని బాబా పలకరించి మాటలాడేరో అంత శ్రద్ధగాను ఆఖరి మనిషితో కూడా బాబా విసుగులేకుండా వ్యవహరించారని చెప్పడానికి ఏమీ సందేహం లేదు. ఇందులో అతిశయోక్తిలేదు. ఆఖరున వచ్చినవారితో కూడా అంత ప్రేమతోను మాట్లాడి బాబా దీవించి పంపించారు.

ఒకామె బాబాకు అనేకరకాల కానుకలను తెచ్చింది. ఆ కానుకలలో రెండు చిన్న దేవతా విగ్రహాలు కూడా ఉన్నాయి. అప్పుడు బయటనున్న స్త్రీలనందరిని బాబా పిలిచి –

"ఇండియాలో నాభక్తులు నన్ను ఆరాధించినపుడు, వారు నేను మానవాకారంలో ఉన్నానని ఒక్కొక్కప్పుడు మరచిపోతారు. వారు నాకు ధూపం వేస్తారు.; కానుకలు తెస్తారు. ఆ ధూపం వల్ల నాకళ్ళలో నుంచి నీరు వస్తుంది. నాపాదాల చెంత వారు కొబ్బరికాయలు కొడతారు. నన్ను ఒక విగ్రహం లాగే వారు భావిస్తారు. ఇదంతా నాకు యిబ్బందిగానే ఉంటుంది. నేను మానవుణ్ణి కూడా కదా మరి. ఇప్పుడు తెచ్చినామెతో బాబా —

"ఈ కానుకలన్నీ మీరు నాకెందుకు తెస్తారు? అవి అవసరం లేదు. ప్రేమ ఒక్కటే గణనీయమైనది. బాబాకి యివేమీ అక్కరలేదు. ఇవి మీరు బాబాకి యిస్తున్నందు వల్ల మీరు బాబామీద ఒక బరువు పెడుతున్నారన్నమాట. దానికి బదులు అవి కావలిసిన వారికి యివ్వండి." అన్నారు బాబా.

ఆమె "బాబా! నేను మిమ్మ ప్రేమిస్తున్నాను గనుకనే తెచ్చాను." అని జవాబిచ్చింది.

బాబా "నీ ప్రేమను తీసుకువచ్చి నాకిస్తే చాలదా? నీవేమీ అంత ధనికురాలవు కావు కదా" అన్నారు. "కాని బాబా! మీమొడల నాకున్న ప్రేమను వ్యక్తం చేయాలి కదా" అని ఆమె అంది "అలాగయితే నాపేరు చెప్పి ఎవరెయినా బీదవారికియ్యి!" అన్నారు బాబా. "నేను ప్రజలు కోరేది వారికివ్వను. వారికేది అవసరమో అదే యిస్తాను." అని బాబా చెప్పారు.

తరువాత ఆమె "బాబా ఆయన దివ్యమైన ఆత్మకు సంబంధించిన ఆత్మ తత్వాన్నే యిస్తారు." అని తన స్నేహితులతో చెప్పింది.

అనంతరము యింకా కలిసిమాట్లాడేవారు లోనికి వెళ్ళి బాబాను దర్శించారు. నాలుగు గంటలకు యీ కార్యక్రమం గురించి అడుగుదామని ఎల్లాను బాబా లోనికి పిలిచారు. అప్పుడు ఆమెకు బాబా "ప్రపంచం అంతా మాయ అది ఒక కల వంటిది. భగవంతుడొక్కడే సత్యము." అని చెప్పారు. బాబా యింకా వేచి ఉన్నారని – వారు ఒక వందమందికి పైగా ఉన్నారు. పిలిచి అందరూ సమావేశమయిన తరువాత ఐపేడ్యూ్యస్‌తో యిప్పుడు బాబా ఎల్లాకు చెప్పిన సంగతి అందరకు చెప్పమన్నారు. ఆమె చెప్తూంటే బాబా "నీవేదో కలలో ఉన్నట్లు మాట్లాడుతున్నావు." అన్నారు. అందరూ నవ్వారు.సద్దుమణిగాక బాబా యిలా చెప్పారు.

బాబా ఎల్లాతో "ఇదంతా ఒక కల. భగవంతుడు మాత్రమే సత్యము. భగవంతుడు ప్రతిదానిలోను, నీలోను, నాలోను ఉన్నాడు. ఎల్లా నిద్రపోయినపుడు, ఆ నిద్రలో ఒక స్వప్నం వచ్చిందనుకోండి. ఆమె నిద్రలో పడకమీద పరుండి యున్నది. అయినా ఆమె ఆ కలలో ఇల్లంతా తిరుగుతోంది. చక్కగా భోజనం చేస్తోంది. సుఖం అనుభవిస్తోంది. ఒక్కొక్కప్పుడు ఆమె ఏదో బాధపడుతుంది. దుఃఖపడుతుంది. చింత అయినా ఆనందమయినా కలలో అనుభవిస్తోంది. కాని ఆమె మంచం మీదే పరుండి ఉంది. ఆమె ఎక్కడికీ వెళ్ళలేదు. ఏ పనీ శరీరంతో చేయడం లేదు. అయినా ఆమె ఆనందిస్తోంది. ఆ కలలో ఆమెకు బాబా కనిపిస్తారు. ఆమె ఒక మాయలో బాధ పడుతోంది. బాబా ఆమెతో అంటారు – "ఎల్లా! చింతించకు. ఇదంతా పోతుందిలే. ఇది వట్టి కల సుమా" అని. ఆమె జవాబు "బాబా! అది యెట్లు? నేను బాధపడుతున్నాను కదా. బాబా! మిమ్ము నేను చూస్తున్నాను. ఇతరులను చూస్తున్నాను. కొందరు నాకు బాధ కలిగిస్తున్నారు. కొందరు ఆనందాన్నిస్తున్నారు. ఇది వట్టి కలే అని ఎలా అనుకోను. అది అంత నిజంగా ఎలా ఉంటుంది!" అని అంది.

"ఆమె ఉదయాన్నే మేలుకొనగానే 'ఇదంతా స్వప్నమా?' అని నిజం తెలుసుకుంటుంది. బాబా తన కలలో కనిపించి అది అంతా కల అని వివరించారు. ఆమె ఏడవకూడదు. ఆమె బాధపడకూడదు. అని బాబా చెప్పారు. ఆమె బాబామాట వినలేదు. అందుకు ఆమె ఏడవడం ప్రారంభించింది. రాత్రి కల వచ్చిందన్న సంగతి తెలుసుకుని అంతా మరచి పోయి ఆమె తన పని చేసుకుంటుంది.

తరువాత బాబా ఆమెతో చెప్పారు. "ఎల్లా! నీవు రాత్రి పరున్నప్పుడు నీకు కలిగిన అనుభవం అంతా ఒక కల. ఇప్పుడు నేను చెప్తున్నాను యిది యింకో కల. నీవు జీవిస్తూ, పనిచేసుకుంటూ, యిక్కడ కూర్చుని నావద్ద మాట్లాడుతూ ఉన్నది, యిక్కడ నీవు చూసేది, యీ న్యూయార్క్ నగరము, ఇక్కడికి బాబా ప్రేమికులు రావడము, బాబా యే యిక్కడ కూర్చోవడము, అంతా వట్టిమాయ. అది ఒక పెద్ద కల." అప్పుడు ఎల్లా అంటుంది— "బాబా! యిది ఎలా నమ్మేది? నేను చూస్తున్నాను. వింటున్నాను. మీరు యిక్కడ కూర్చున్నారు. నాకు చెప్తున్నారు. ఇదంతా మాయ, ఏమీలేదంటే నమ్మడమెలా! అయినా బాబా ఎల్లాతో యిదంతా కలగాని మరేమీ కాదని అంటున్నారు. కొన్ని సంవత్సరాలయిన తరువాత బాబా అనుగ్రహం ఆమెపై పడిన తరువాత ఎల్లా హఠాత్తుగా యీ మాయ నుంచి, యీ శూన్యస్వప్నమునుంచి మేల్కొంది ఆమె ఏమి చూసింది? భగవంతుడు మాత్రమే సత్యమని ఆమె కనుగొంది. భగవంతుడే అనంతుడని తెలుసుకుంది. ఆ అమితానందం ఆమె పొందినపుడు, అపరిమితము అవిచ్ఛిన్నము అయిన ఆ ఆనందాన్ని అనుభవిస్తూ బాబా చెప్పినది నిజమే అనుకుంటుంది.

"క్రీస్తు యీ విషయమే చెప్పాడు. ఇంకొకరు మళ్ళీ మనకి ఎందుకు చెప్పడం? ఎందుచేతననగా మానవులు ఆయన చెప్పినది ఎప్పటికీ వినరు గనుక. ఆయన ఏమి చెప్పాడు— "నేనే సత్యమును. నన్నే అందరు అనుసరించండి. ఈ కలనుండి మేల్కొనండి" అని అన్నాడు. ఎవ్వరూ వినడం లేదు. అదే మరల మరల సంభవిస్తుంది. అందుకే నేను చెప్తున్నాను— "నన్ను యింకా యింకా ప్రేమించండి. ఇతరులను నన్ను ప్రేమించేలా చేయండి. మీరు యితరులను సుఖింపచేయండి. భగవంతుడు అది గమనిస్తాడు. అందువలన భగవంతుడు ఆనందిస్తాడు. ప్రార్థనలు, ధ్యానాలు, ఆరతులు ఎన్నిచేసినా భగవంతునికి ఆనందం కలుగజేయవు అవన్నీ ఆయన వినిపించుకోడు. ఇతరులకు నీవు ఎప్పుడయితే సహాయం చేస్తావో, సేవ చేస్తావో, నీకు కష్టం కలిగినప్పటికీ వెంటనే భగవంతునికి నీవు చేస్తున్నవి తెలుస్తాయి. ఆయన సంతోషిస్తాడు." అని బాబా ముగించారు.

బాబా అప్పుడు ఆయన గదికి వెళ్తానని చెప్పారు. మరల మరునాడు ఉదయం 9-30 గంటలకు వస్తానన్నారు. ఆయన మేడమీదకు వెళ్ళడానికి హాలులోకి వచ్చినపుడు ఆఖరు క్షణంలో వచ్చిన వారెవరో ఉంటే వారి పరిచయం కోసం

కొంచెంసేపు ఆగారు. కొన్ని నిమిషాలయిన తరువాత 10, 12 గురు ఉంటే వారితో మాట్లాడడానికి వారిని గదిలోకి రమ్మన్నారు.

బాబా వారి భక్తులతో మాట్లాడుతూ సహియుక్తుడైన ఒక యువకుని "నీవు బాబాను ప్రేమిస్తున్నావా?" అని అడిగారు. అతడు "అవును బాబా! నేను బాబాను ప్రేమిస్తున్నాను." అనే జవాబు అతడు యివ్వగా అతని భార్యతో బాబా "నీకేమయినా అసూయగా ఉందా? బాబా ప్రేమనుగురించి నీవు ఎప్పుడూ అసూయపడకూడదు. బాబా ప్రేమ వేరు." అన్నారు.

అందరినీ కౌగిలించుకున్న తరువాత ఆయన తన 'బిడ్డలను' యింటికి పంపించి బాబా తమ దివ్యకార్యములో నిమగ్నమయారు.

## జూలై 21 శనివారం :

ఆరోజున బాబా అనేక చిన్నబృందాలతో సమావేశం జరిపారు. ఒక పెద్ద ప్రజాదర్శన కార్యక్రమం ఒకటి తలపెట్టానని వచ్చే ఫిబ్రవరి మాసంలో ఆయన ఏకాంతవాసం అయిపోగానే ఆయన యింకా శరీరం వదలిపోకుండా ఉంటే మిగిలిన ఏకాంతవాస సమయంలో అది జరుగుతుందని బాబా చెప్పారు. ఈ మాటు పాశ్చాత్యులను – స్త్రీలను పురుషులను కూడ – ఆహ్వానిస్తానని యిదివరలో 1954 సహవాస్‌లో వలె గాకుండా యిప్పుడు అందరూ రావచ్చునని తెలిపారు. ఆ పెద్ద సమావేశం తరువాత అన్నీ జరుగుతాయన్నారు – ఆయన అవమానము, ఆయన వైభవము, ఆయన మౌనవిరమణము, ఆయన శరీరత్యాగమును, మరల బాబా అన్నారు – "నేను ఆ సనాతన పురుషుడను. నేను యీ విశ్వానికి నాధుడను."

బాబా కుర్చీలోంచి లేచారు. చేతులు కాళ్ళు చాచుకున్నారు. ఆ గదిలో అటూ యిటూ పచారు చేసారు. బోనులో ఉన్న సింహంలా అలా తిరుగుతూంటే "ఆహా! యీయనకు బ్రహ్మాండమయిన శక్తి కలిగి, ఆ అనంతశక్తిని సంపూర్ణంగా తన అదుపులో ఉంచుకున్నారు" అనిపిస్తుంది. ఆ గదిలో యీ మధ్యనే తీసిన బాబా ఫొటో ఒకటి ఉన్నది. ఒక మూలలో బాబా యొక్క చిత్రానికి తుది మెరుగులు దిద్దుతూ ఒక యువ కళాకారుడు ఉన్నాడు. ఆయన దివ్యమంగళ రూపాన్ని ఆధునిక రీతులలో తయారు చేద్దామని అతని ఆశయం. అతని వైపు చూసి అయిందా అని అడిగారు బాబా. అతడు లేచి నిలబడి అసంపూర్ణమయిన తన పనిని చూపించాడు.

బాబా యొక్క ఆధ్యాత్మిక సౌందర్యానికి పోల్చలేని ఆయన భౌతిక సౌంద ర్యంవు వైపు చూస్తూ—— ఆయన యొక్క ఫొటోకి, ఆ చిత్రలేఖనానికి ప్రక్కన నిలబడిన ఆ సజీవ అవతారమూర్తిని తిలకిస్తూ ఆధ్యాత్మిక తేజాన్ని గ్రహించి అమిత శక్తివంతమయిన స్వార్థరహితమయిన, ఆ సరళ స్వభావాన్ని, ఆ వినయాన్ని, అన్నిటికంటె ముఖ్యమైనది వర్ణింపనలవికాని ఆ ప్రేమ పుంజాన్ని యివన్నీ మూర్తీభ వించిన ఆ బక్కపలచని చురుకయిన అరవై యేళ్ళు నిండిన ఆ శరీరాన్ని ఒక చిత్రంలో రూపొందించడం ఎంతకష్టమో ఆలోచించవచ్చును. ఆ దివ్యత్వానికి శరీరం కలిగింది. ఆ శరీరం బాబా యొక్క ఆంతరంగిక సత్యాన్ని ఆ సంపూర్ణ శారీరక సౌందర్యం ద్వారా ప్రదర్శిస్తోందా అన్నట్లుంది. ఇది చూడలేనివారు ఎంతమంది కలరో !

ఆరోజు ఉదయం 9-30 గంటలకు సంభాషణలు ప్రారంభం అయాయి. వచ్చిన ప్రతివారి పేరు గుర్తుపెట్టుకుంటోంది, ద్వారంవద్ద కూర్చున్న ఎల్లా వింటర్ ఫెల్ట్. వారి పేర్లు పిలవగానే సమయ నిర్ణయ సూచనతో యిచ్చిన చీటీలు చేతులలో ఉంచుకుని వారు వరుసలో నిలబడ్డారు. బాబా గది ప్రవేశ ద్వారంవద్ద వ్రేలాడుతున్న తెరవద్ద వారు వచ్చి నిలబడి ఉన్నారు. ఆ తెరలోనుంచి ఏమయినా కనిపిస్తుందా అని ముందు నిలబడ్డవారు కొందరు చూస్తున్నారు. ఆ వరుస యింకా పెద్దదవుతున్నందున వచ్చినవారు రెండు వరుసలుగాను మూడు వరుసలుగాను ఏర్పాటు కావలసి వచ్చింది. వారు ఎంతో ఆతురతతో వేచియున్నారు. వారిలో అనేకమంది ఆ దేశంలో మారు మూలల నుంచి బాబాను కొద్ది నిమిషాల పాటు దర్శించుటకు విమానాలలో ప్రయాణించి వచ్చారు.

ఆ గుంపులో కొందరు గర్భిణిస్త్రీలున్నారు. ఒకామె బాబాను చూడవచ్చినపుడు ఆమెను చూస్తూ బాబా ఆయన కడుపును రాచుకున్నారు. ఆమె గర్భమందలి బిడ్డను ఆయన ఆశీర్వదించారు. అది మిక్కిలి ప్రత్యేకత కలిగిన ఆత్మ అన్నారు ఆ బిడ్డను గురించి.

బాబా రోజుకి ఒక్కమారే భోజనం చేస్తున్నారు. మేడమీద ఆయన గదిలో ఏకాంతంగా భుజిస్తారు. అలా భోజనం కాగానే మరల క్రిందకు దిగారు, ఆయన దర్శనార్థం వచ్చినవారిని చూడడానికి క్రిందకు ఎలివేటర్‌లో వచ్చి వారివైపు చూస్తూ బాబా గదిలోకి వెళ్ళారు. ఈ ఎలివేటర్ పనిచేసేవారికి బాబా కోసం యింతమంది

రావడం వెళ్ళడం వలన వారికి కూడా పని వత్తిడి కలిగింది. ఇది వారి అనుభవంలో ఒక అపూర్వమయిన సంగతి. వారికి కూడా వారి పుణ్యావశమున అనేకమారులు బాబా 'సాంగత్యం' కలిగింది ఎలివేటర్‌లో.

ఒక గంట అయిన తరువాత మంది పలచబడ్డారు. అప్పుడు వేరు వేరు బృందాలలోని వారి ప్రేమికులను బాబా రమ్మన్నారు. మిగిలినవారు కూడా వారితోటి వచ్చి లోపల బాబాకు ఎదురుగా చుట్టూ కూర్చున్నారు. తెరలు వేయబడ్డాయి. లవెల్ షా, చార్‌మియాన్‌డ్యూస్, డాన్‌స్టీవెన్స్, బి. బి. సి. టెలివిజన్ కెమేరా మనిషి వీరంతా ఫిలిం ఫొటోలు తీయడానికి సంసిద్ధులయ్యారు. బాబా చుట్టూ ఉన్న చిన్న బృందం మీద ప్రసరిస్తూ ఆదీపాలు అద్భుతంగా దేదీప్యమానంగా వెలిగి పోతున్నాయి. వారంతా వచ్చియున్నందుకు ఎంతో ఆనందం వ్యక్తపరుస్తూ బాబా చిన్న ప్రసంగం చేసారు—

"మీరు భగవంతునితో ఏకమయినప్పుడు, మీరు అనుభవించే ఆనందం శాశ్వతమయినది, అనంతమయినదీను. ఆ ఆనందంలో అంతరాయం ఉండదు. అది తైలధారలా అవిచ్ఛిన్నమయినది. మీరు యితరులను ఆనందపరచవచ్చును. వారిని ఆనందపరచుటకు మీకు అధికారం కలుగుతుంది. నేను ఆదిలో అవతారమెత్తి వచ్చినప్పటినుంచి నేను చెప్పే ఆ ఒక్కటీ ఏమిటంటే "భగవంతుని ప్రేమించండి." యుగయుగాలలోను నేను యిది చెప్తూనే ఉన్నాను. "దేవుని ప్రేమించండి" అని.

"ప్రేమ. ఇప్పుడు ప్రతివారు యీ 'ప్రేమ' అనేమాటను ఉపయోగిస్తున్నారు. అది చాలా చవక అయిపోయింది. నిజంగా ప్రేమిస్తున్నవాడు ఆమాట ఉచ్చరించడు. దేవుని ప్రేమించడం అంటే యేమిటి? అది నిజంగా చాలా చాలా గొప్పవిషయం. నిజమైన భగవత్ప్రేమికుడు ఏమీ చెప్పడు. అతడు దేవుని ప్రేమిస్తున్నట్లే మరచి పోతాడు.

"నీవు దేవుని ఎలా ప్రేమిస్తావు? నీవు దేవుని ఎలా ప్రేమించాలి? ధ్యానాల ద్వారా కాదు. ప్రార్థనల ద్వారాను యితరమైన వాట్ల ద్వారాను కానేకాదు. రెండు మార్గాలున్నాయి. ఒకటి సర్వమునూ, అన్నిటినీ వదలివేయడం. అంటే నీది అన్నది ఏదీ లేకుండా చేసుకోవడం. నీ శరీరం కూడాను. అన్నిటినీ నీవు త్యాగం చెయ్యాలి. అన్నిటినీ అంటే నీ పరిసరాలే గాక (నీయిల్లు వాకిలి, నీ భార్యాబిడ్డలు, నీవు సంపాదించిన ధనం— (ఆస్తి-సమస్తమూ) నిన్నుకూడా కలుపుకుని అన్నమాట.

"రెండవది— అది చాలా గొప్పది. ఇందులో నీవు ఏదీ వదిలెయ్యనక్కర లేదు. నీ కుటుంబంతో మామూలుగా జీవనం చెయ్యవచ్చు. నీ యింట్లో నీవు ఉండ వచ్చు. ఈ ప్రాపంచిక జీవితం జీవించవచ్చు. నీ ఉద్యోగం నీ వృత్తి నీ వ్యాపారం అన్నీ నీవు మామూలుగా చేసుకుంటూ ఉండవచ్చు. నీవు సినిమాలకు, నాటకాలకు వెళ్ళవచ్చు; పార్టీలకు, విందులకు వెళ్ళవచ్చు. అన్నీ చేయవచ్చు— కాని ఒక్కటి చేయాలి. ఎల్లప్పుడూ యితరులను సుఖింపచేయాలని నిరంతరమూ ఆలోచించాలి, ప్రయత్నించాలి— నీ సుఖానికి అంతరాయం కలిగినా సరే, నీకు సుఖం లేకుండా పోయినాసరే, నీకు కష్టం కలిగినా కూడా అందుకు ప్రయత్నించాలి. ఇది భగవంతుని ప్రేమించే రెండో విధానం."

ప్రక్కనున్న పళ్ళెంలోని పండ్లలో ఒక పీచ్ (ఎర్రగా ఉండే ఉసిరికాయంత పండు) చేతితో తీసుకుని బాబా— "ఎవరు మీలో బాగా పట్టుకోగలరు?" అని ఆ పండు విసిరారు. ఆ పట్టుకోవలసిన వాడు అసలు పట్టుకోలేకపోయాడు. "ఏమిటీ యిది వంకర తిరిగే బంతిలా ఉందే" అన్నట్లుగా ఉంది ఆ విసరడం. అది అనుకో కుండా యింకొకడెవడో పట్టుకున్నాడు. అలా చాలా మార్లు బాబా పండ్లు విసిరారు; వారందరికి వినోదం కలిగించారు.

తరువాత జాన్‌బాస్‌ని ఉద్దేశించి బాబా "జాన్ అంటాడు 'బాబా! మీరు విశ్రాంతి తీసుకుని కాస్త టీ పుచ్చుకోండి' అని. ఏదీ ఆ టీ కనబడనే కనబడదే." అన్నారు. 1952 వ సం॥లో యిలాగే బాబాకి టీ కావాలనుకున్నప్పుడు "జాన్‌కి టీ కావాలట" అనేవారు – అది అతడికి జ్ఞాపకం వచ్చింది.

అకస్మాత్తుగా ఫిలిం తీయడం కోసమని పెద్దలైట్లు వెలిగించారేమో విద్యుత్ ఫ్యూస్ పోయి దీపాలన్నీ ఆరిపోయాయి. అప్పుడు అంతా మసక చీకటిగా అయి పోయింది. బాబా ఆ సమయంలో "అందరూ కళ్ళుమూసుకుని మీ మనస్సులను ఆలోచనారహితంగా చేసుకోండి అయిదు నిమిషాలసేపు" అన్నారు.

అక్కడ ఉన్నవారందరూ ప్రేమావతారుడయిన ప్రభువును గూర్చి మనసులో ధ్యానం చేస్తున్నారు. వారంతా కళ్ళు తెరచేసరికి బాబా చేతుల వ్రేళ్ళు వేగంగా కదులు తూన్నట్లు చూసారు. వారు ఆధ్యాత్మికంగా పనిచేస్తున్నట్లు అదియొక గుర్తు. బాబా నేత్రాలు అంతర్ముఖం అయాయి. వారి ఎడమ చేతిని వారి శిరస్సున ఉంచుకున్నారు వారి కళ్ళు ఎక్కడికో దూరదూరాలను చూస్తున్నట్లుగా ఉన్నాయి.

కొంచెంసేపట్లో దీపాలు వెలిగాయి. కొందరు బాబాతో సంభాషించడానికి తొందరపడ్డారు. ఎరచ్ కంఠం ద్వారా బాబా తమ ప్రేమికులతో యిలా అన్నారు.

"బాబా నిరతము ఆనందంగా ఉంటాడు. అయితే సదా బాధపడుతూ ఉంటాడు. ఇక్కడ బాబా బాబావలె స్వేచ్ఛగా ఉన్నాడు. కాని మీలో బాబా బంధితుడై యున్నాడు. మీరు నిజంగా నన్ను మీ హృదయపూర్వకంగా ప్రేమిస్తూ ఉంటే నాలాగే స్వేచ్ఛగా ఉండవచ్చును. అప్పుడు ఎడతెరిపి లేని ఆనందం కలుగుతుంది.

"నా సోదరి మణి నన్ను చాలా ఎక్కువగా ప్రేమిస్తోంది. ఆమె దేనిని గురించి ఆందోళన చెందదు. ఆమె నాకు విధేయత చూపిస్తుంది. ఉదయం నుంచి రాత్రి వరకు బాబా కోసమే ఆమె పనిచేస్తుంది. ఆమెకు బాబా దేవుడని తెలుసు. ఆమె బాబాను దేవునిలాగానే ప్రేమిస్తోంది. పూర్వ సంబంధాల వల్ల మెహెరాను నేను ఎంతో అధికంగా ప్రేమిస్తున్నాను. నేను మిమ్మల్ని కూడా ప్రేమిస్తున్నాను. మీరు నన్ను ప్రేమిస్తే మీరు నాతో ఉంటారు. తరువాత నావద్దకు మీరు వస్తారు. ప్రేమ ద్వారా మీరు నాతో ఏకం కావచ్చు.

నా సోదరుడు జామ్‌షెడ్ నన్ను చాలా ఎక్కువగా ప్రేమించేవాడు. నే నంటే పిచ్చిగా ప్రేమించేవాడు. ఒకమారు నా యెడల ప్రేమను పట్టలేక అతడు శరీరాన్నే వదలిపెట్టాడు. కాని అతడు చనిపోయేముందు "బాబా!" అని అరిచాడు. అతడు నావద్దకు వచ్చి శాశ్వతంగా నాతో ఉన్నాడు.

మీ అందరికి నేను చెప్పేదేమంటే నా సోదరులు నా చెల్లెలూ నన్ను దేవునిలా ఎంతో ప్రేమిస్తున్నారు. నా సహాధ్యాయులు కొందరితో నేను చిన్నప్పుడు వీధిలో గోళీలాడేవాడిని. అప్పుడు వారు నాతో దెబ్బలాడే వారు కూడాను—వారు కూడా నన్ను ప్రేమిస్తున్నారు, నేను భగవంతుణ్ణి గనుక. నేను అలా చెప్తే వారు నన్ను నమ్ముతున్నారు. అది వారికి ఒక ఊహ మాత్రమే కాదు. అందులో అంతకంటె ఎక్కువగా వారు చూస్తున్నారు. వారికి ఆ గట్టి నమ్మకం ఉంది. నేను దేవుణ్ణని వారు నమ్ముతున్నారు. "మీరు కూడా నేను దేవుణ్ణని నమ్ముతున్నారు. మీరు నన్ను ప్రేమిస్తున్నారు; నాకు తెలుసును. కాని నన్ను ప్రేమించడం, నన్ను గౌరవించడం, నాలో నమ్మకం ఉంచడం, నేను దేవుణ్ణని విశ్వాసం ఉంచుకోవడం నాతో గోళీకాయలాడిన వారికి, నాతో పోట్లాడినవారికి, పాఠశాలలో నా ప్రక్కన కూర్చుని నాతో కూడా చదువుకున్న వారికి చాలా కష్టంగానే ఉన్నది — డాన్! నేను చెప్పేది

వింటున్నావా ? వారికి, నా పాత పాఠశాలలోని స్నేహితులకు, నా కుటుంబం వారికి చాలా కష్టముగా నుండెను. వారు యిప్పుడు నా కోసం ప్రాణాలు త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నారు.

"నా తండ్రి షెరియార్జీ - అంత మంచివాడు - గొప్ప భగవత్ప్రేమికుడుగా ఉండేవాడు. ఆయన సత్యాన్వేషకుడై కాలినడకను ఊహూరా తిరిగేవాడు. తరువాత నన్ను ఆరాధించేవాడు. నా ఫొటో ఒకటి ఆయన స్వంత గదిలో పెట్టుకునేవాడు. దాని దగ్గర ఒక కొవ్వొత్తి వెలిగించేవాడు. ఆయన నా ఫొటోను నన్ను అర్చించేవాడు.

"మీ అందరికీ అధికారంతో చెప్తున్నాను – ఇతరులకు వారి ఊళ్ళలో చెప్పినట్లుగానే – నేను ఆ సనాతన పురుషుడను. నా యొక్క మౌనం విరమించగానే ప్రపంచం నే నెవరినో తెలుసుకుంటుంది ...

ఇప్పుడింక ఆడుకుందామా? అన్నారు బాబా. ప్రక్కనున్న పళ్ళెంలోని ద్రాక్ష పండ్లు ఒకటొకటే లేసి బాబా ఒక వైపు చూస్తూ మరియొక వైపుకి విసురుతూంటే అందరికీ నవ్వు వచ్చింది. ఆసమయంలో కొంతమంది పట్టు కోలేక పోయారు. అను కోకుండా కొంతమంది పట్టుకోగలిగేవారు. ఈ వినోదకర క్షణాలను కూడా వారు తీసే ఫిలింలో దింపాలని ఆదుర్దా పడుతున్నారు ఫిలిం తీసేవారు.

మరల బాబా దృష్టి అంతర్ముఖం అవడం కనిపించింది. ఆయన చేతివ్రేళ్ళు త్వరితంగా కదలడం ప్రారంభించాయి. ఆయన గబ్బుమని లేచి వారి గదిలోకివెళ్ళి పోయారు. ఆయన కోసం టీ తీసుకురమ్మని కబురు పంపించారు. కాని అది యింకా రాలేదు. మిగతావారు బాబా మేడమీద వారి గదిలోకి వెళ్ళారేమో అని అనుకున్నారు. బాబా వెళ్ళిన తరువాత టీ వచ్చింది. ఈ విధంగా 1954లో జరిగిన సహవాస్ కార్యక్రమంలో కూడా అకస్మాత్ గా వారి ప్రేమికులను విడిచి బాబా ప్రత్యేకమయిన పనిమీద వెళ్ళారు.

కొన్ని నిమిషాలయిన తరువాత బాబా తిరిగి వచ్చి వారి సోఫా మీద కూర్చున్నారు. ఇప్పుడు ఫిలిం కెమేరా వాళ్ళు మళ్ళీ ఫిలిం ఫొటోలు తీసుకున్నారు. అప్పుడు బాబా సంజ్ఞలతో – "నేను భగవంతుడను, పురాణపురుషుడను, నేను అవతారుడను" అని చెప్పారు.

బాబా గదివదిలి వెళ్ళిన తరువాత కొందరు బయటకు వెళ్ళిపోయారు ఇదివరకు లాగే కొంతమంది ఉండిపోయారు. అదృష్టవశాత్తు వారిని బాబా మేడ మీదకి వారి

గదికి యింకోమారు 'ప్రసాదం' కోసం రమ్మని పిలుపు పంపించారు. వచ్చిన వారం దరికి చక్కెరతో చేసిన మిఠాయి ఉండ ఒక్కొక్కటి తీసి తలొకటి పంచిపెట్టారు. ఒక యువ నాట్యబృందంవారు డెల్మానికో హోటలునుంచి బయటకు పోతుంటే బాబా వారిని పిలిపించి వారికి కూడా 'ప్రసాదం' యిచ్చారు. ఆ ప్రసాదంతో వారికి కూడా అంతులేని అనుగ్రహాన్ని బాబా ప్రసరింపజేసారు. ఈ నాట్యమండలి వారంతట వారు బాబా వద్దకు రాకపోయినా సర్వే జనాః సుఖినోభవంతు అనే సూక్తి బాబా పాటించారు.

ఆ సాయంకాలం యిదివరకు అనుకున్నట్లుగానే బాబాను మండలితో ఫ్రాంక్ లొస్సర్ అనే భక్తుడు వినోదరసభరితమగు "అతి ఆనందయుతమయిన అబ్బాయి" (మోస్ట్ హాపీ ఫెలా—**Most Happy Fella**) అనే సంగీత ప్రహసనానికి తీసుకు వెళ్ళాడు. అది బాబాతో వెళ్ళి చూడాలనుకున్న వారంతా టిక్కెట్లు కొనుక్కొని వారితో వెళ్ళారు. అన్నితరగతులలోను కొంతమందికి కూర్చుని చూసేందుకు చోటు దొరక్క పోతే నిలబడే చూసారు. ఆ నాటకం అంత బాగా ఉండి మంచి ప్రఖ్యాతి పొందిందన్న మాట ప్రేమికులందరు నాటకశాల వసారాలో ఉండగా బాబా ఒక ఎర్రని ఉన్ని కోటు తొడుగుకొని వారి పొడుగాటి శిరోజాలు కోటు క్రిందకు వేసుకుని వారి మధ్యకు వచ్చారు. మామూలు మనిషిలా జనంలో కలిసిపోయి బాబా తిరుగుతూంటే ఆ గుంపుకి ఆయన ఎవరో తెలియక పోవడం చూస్తే బాబా ప్రేమికులకు అదొక విధమయిన అబ్బురమైన భావన కలిగింది.

బాల్కనీలో మొదటి పంక్తిలో బాబా కూర్చున్న కుర్చీ ఉంది. బాబాకి ఒక ప్రక్కన ఎలిజబెత్ పాటర్సన్ రెండో ప్రక్కన బాబా శిష్యుడొకడు కూర్చున్నారు. ఒక చిన్నవాడు వచ్చి బాబా చేతిలో కార్యక్రమం కాగితం పెట్టాడు, ఆ విధంగా వాడు అనుకోకుండానే బాబా దర్శనం పొందాడు. నాటకం జరుగుతున్నపుడు కూడా బాబా ఆంతరికమైనపనిలోనిమగ్నమయినట్లు కనిపించారు. ఆయనవ్రేళ్ళుటెలిగ్రాములు యిస్తున్నట్లు పనిచేస్తున్నాయి. బాబాతో ఉండడం కోసం మిగిలినవారు వచ్చారు కాని ఆ నాటకం వారికి అంతగా నచ్చి చూడాలని ఉండికాదు వారు వచ్చి కూర్చున్నది. నాటకశాలలో బాగా చలిగా ఉండుటచేత డా॥ హేమన్ తన కోటును విప్పి బాబా భుజాలమీద వేసాడు. బాబా చాలా అలసియున్నట్లు కనిపించారు. విశ్రాంతి సమయం రాగానే బాబా తమ మండలితోను యితర ప్రేమికులతోను బయలుదేరి హోటలుకు వెళ్ళిపోయారు. వారి శిష్యులు పెంపరాశే పరుందామని హోటలుకు వచ్చేసారు.

ఆ రోజున అందరూ కొంతవరకు అలసిపోయినా ఆధ్యాత్మికంగా ఉత్తేజం కలిగింది వారికి.

## జూలై 22 ఆదివారం :

బాబా ప్రేమికులు ఆదివారం నాడు దర్శనార్థులు వచ్చే గదిలో పువ్వులు పచ్చని ఆకులు కలిగిన కొమ్మలు పెట్టి అలంకరించారు. ఒక పళ్ళెం నిండా ('ప్రసాదం' కోసం) బాబా కూర్చునే చోట సిద్ధం చేసి ఉంచారు.

ఉదయం 9 గంటలకు దర్శనార్థులు వచ్చి గదిలో బాబా కోసం వేచి యుండడం ప్రారంభించారు. మేడ మీద టెలివిజన్ కెమేరా వాళ్ళు వచ్చి బాబాతో మాట్లాడుతున్నందు వలన బాబా క్రిందకి దిగి రావడం ఆలస్యమయింది. టి. వి. కెమేరా వారు క్రిందకి వచ్చి బాబా కోసం వచ్చే దర్శనార్థులను ఫొటోలు తీస్తున్నారు. నిజంగా యింత మంది భక్తులు అమెరికాలో ఒక భారతీయ సద్గురువు కోసం వచ్చారంటే అది భారతీయులు సంబరపడే సంగతే.

10-30 గంటలకు బాబా క్రిందికి రాగానే స్పెయిన్ దేశీయులయిన ముగ్గురు అప్పచెల్లెళ్ళు బాబాను సమీపించారు. ఒక నీగ్రో బాలుడు పొడుగాటి ఒక అయిర్లాండు దేశస్థుడు కూడా బాబా దర్శనార్థం వచ్చారు. బాబా వారందరిని కౌగిలించుకుని వారికి తలొక ద్రాక్షపండు ప్రసాదం యిచ్చారు. తరువాత వచ్చినవారందరూ బాబాకు ఎదురుగా కూర్చున్నారు. ఇదివరకు వలెనే వారి వైపు ద్రాక్షపండ్లు విసిరేసరికి ఆ 'ప్రసాదాన్ని' కొందరు పట్టుకోగలిగారు. ప్రొద్దుఎక్కిందని బాబా త్వరత్వరగా సంభాషణలకు వేచియున్న వారిని పిలిచి పని పూర్తిచేయడానికి పూనుకున్నారు. ఆరోజున అనేకమంది భారతీయులు వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. వారిలో పొడుగయిన ఒక సిక్కు ఉన్నాడు. బాబాకు సమీపంలోనే ఇండియాలో అతడు కాపురం ఉండేవాడినని చెప్పాడు. బాబా అప్పుడు ఏకాంతవాసంలో ఉండుటచేత ఆయన దర్శనం చేసుకోలేక పోయాడు. అమెరికాలో ఆయనను దర్శించడానికి అతడు అమితానందం పొందాడు. ఇంకొకడు బాబాను దర్శించి హిప్నోటిజం వలన గడచిన జన్మల వృత్తాంతమును జ్ఞాపకం చేసుకోవడం (తెలుసుకోవడం) సాధ్యమేనా అని బాబాను అడిగాడు. అందుకు బాబా అరుదుగా క్రిందటి జన్మలు జ్ఞాపకం చేసుకోవచ్చుగాని అది చాలా అపాయకరమని చెప్పారు.

భోజనాలవగానే అందరినీ బాబా సమావేశ పరచారు. బాబా ఆజ్ఞప్రకారం డాన్‌స్టీవెన్స్ లేచి 'నిజమైన కానుక' అను బాబా సందేశాన్ని చదివాడు. అందులో

ఈవిని గురించి మనం ఎలా ఉండాలో బాబా వివరించాడు. భగవంతుడు ఆయన యొక్క ప్రేమను ప్రసాదించినపుడు ఆయన ప్రేమికుల యెడల ఎంతో ఉదాసీనంగా ఉన్నట్లు కనబడుతూ ఆ ప్రేమ కానుక ఆయన మనకు యిచ్చిన సంగతే పూర్తిగా మరచిపోయినట్లు నటిస్తాడు.

తరువాత యింకొక సందేశమును – ''శాశ్వతమైన వర్తమానము'' అనేదానిని డాన్ చదివాడు. తాత్కాలికమైన జీవిత పరిస్థితులకు బానిసమై ఉంటే శాశ్వతమైన దానిని, ఎల్లప్పుడు ఉండే దానిని, మనం పోగొట్టుకుంటామని బాబా అందులో చెప్పారు. సర్వము భగవంతుని మీదే వేసి శాశ్వతమైన వర్తమానంలో నివసిస్తే గతంలో జరిగినది విమర్శిస్తూ కూర్చోవడం భవిష్యత్తులో యిది చెయ్యాలి అది చెయ్యాలని మాయ కోరికలు పెట్టుకోవడం అనే యీ రెండింటికంటె చాలా మంచిది అని బాబా చెప్పారు.

నూరుమందికి పైగా భక్తులు ఆ గదిలోకి వచ్చి యున్నారు. వారందరికి బాబా స్వంతంగా తమ సాంగత్యం కలుగజేయాలని ఆతురతగా ఉన్నారు. చిన్న సమూహాలుగా అంటే ఏడుగురు ఒక్కొక్కమాటుగా పైన తమ గదిలోకి లిఫ్టులో రమ్మని ఎరచ్ ద్వారా చెప్పించి బాబా వారి గదికి వెళ్ళారు. మిగిలిన వారంతా బయట ఉన్న నడవలో వేచియుండగా ఒక్కొక్కమారు ఏడేసిమంది లోపలికి బాబా వద్దకు వెళ్తున్నారు. ''సోమవారం రాత్రి బృందం'' ఒకమారు, (అంటే వారు ప్రతి సోమవారం రాత్రి కలుస్తూ ఉంటారు గనుక వారు ''మన్‌డే నైట్ గ్రూప్'' అని పేరు పెట్టుకున్నారు), స్కెనెక్టడీ బృందము, సూఫీ బృందము, మార్గరెట్ క్రాస్కె శిష్యురాండ్రయిన నాట్యకత్తెల బృందము, అరిజోనా నుండి వచ్చిన చిన్న బృందము యీ విధంగా చిన్న చిన్న బృందాలుగా విభజన చేసుకుని బాబా సహవాస్ కోసం ఒక బృందం తరువాత మరియొకటి లోపలికి వెళ్ళారు. అందరికీ యీ విధంగా ఆ పవిత్రమూర్తియొక్క సన్నిహిత సన్నిధిలో ఉండే అవకాశం కలిగింది. వారు ఆయనను వారి స్వంత సమస్యల గురించి అడగడానికి వారి స్వంత విషయాల గురించి బాబా సలహాలివ్వడానికి యీ పద్ధతిలో వీలు కలిగింది. బాబా వారిని ప్రేమిస్తారు; ఆయన వారితో ఆడతారు; వారిని తమాషాగా ఏడిపిస్తారు; వారంటే అపరిమితమయిన ఆప్యాయత ఆపేక్ష కనబరుస్తారు. తమ హృదయాలలో దాచుకుని పైకి తెలియనీయకుండా ఆయన యెదుట ఆ స్వంత రహస్యాలను వెలికి చెప్పడానికి

మొహమాటపడే ఆ ప్రేమికులను బుజ్జగించి ఆ దాచుకున్న రహస్య విషయాలను కూడా వెలికి లాగి వారిని బాధిస్తున్న సమస్యలను పరిష్కరించారు బాబా.

న్యూయార్క్ మహానగరంలో ఒక భాగమయిన స్కెనెక్టడీ నుంచి వచ్చిన ఒక కుటుంబంతో —

"నా ప్రేమికులతో ఉన్నప్పుడు నేనెంతో ఆనందంగా ఉంటాను. నాకు యిప్పుడు చాలా సంతోషంగా ఉంది. ఈ ప్రపంచ మానవులు ఎప్పుడు సంతోషంగా ఉంటారు? వారికి బాగా ఆకలి వేస్తూంటే మంచి భోజనం, పుష్టిగా చేసినపుడు వారు తుష్టిగా సుఖంగా ఉంటారు. ఆకలి వేసినపుడు తింటే ఆనందంగా ఉంటుంది కదా. మరి నాకు వేసే ఆకలి ఏమిటి ? నా ఆకలి నా ప్రేమికులను కలుసుకున్నప్పుడే తీరుతుంది. నేను మీ ప్రేమను కనుగొన్నప్పుడే నేను సంతృప్తి చెందుతాను – అదే నా భోజనము." అని బాబా అన్నారు.

సోమవారం రాత్రి బృందంతో బాబా —

"ఈ ప్రపంచం అంతా శూన్యము – మాయ. నేను అన్నింటిలోను ఉన్నాను. నా అధికారంతో మీతో చెప్తున్నానని, నేను ప్రతిదానిలోను ఉన్నాను. నన్ను ప్రేమించండి. అలా చేస్తే మీరు మీ శరీరాలు వదలినపుడు మీరు నాతో శాశ్వతంగా ఉండిపోతారు" అన్నారు.

సూఫీ బృందం వారితో —

"నేను చాలా మారులు చెప్పి ఉన్నాను. నేను ప్రేమ ప్రభువును. అదే సమయంలో నా ప్రేమికులకు బానిసనుకూడా. ఇది ఊరికే చెప్పడం కాదు. ఇది నిజమే."

బాబా మాటలు ఎరచ్ యింకా చెప్తున్నాడు —

"ఇండియాలో బాబా మస్తులను సాంగత్యం చేయడం కోసం వెళ్ళేటప్పుడు ప్రేమమూర్తి అయిన దేవుడు, దైవమస్తులను కలుసు కుంటాడు. సతారాకి 70 మైళ్ళ దూరంలో ఒక మస్తు ఉన్నాడు. అతని పేరు దోండిబువా. బాబా అతనంటే చాలా యిష్టపడతారు. అతడు చాలా ఆరోగ్యంగా ఉంటాడు. అతడు ఏవిధమయిన బట్టలూ ధరించడు. అతడు ఆహారం కోసం బిక్షమెత్తడు. దేనినీ అతడు యాచించడు. దేని కోసమూ అతడు ఎవరినీ అడగడు. అతడు ఏమీ కావాలని అనడు. మీరు అతనికి ఏదయినా యిద్దామని వెళ్ళినా అతడు తీసుకోడు. అతడు ఏబట్టలూ ధరించకపోయినా అతనికి చలివేయదు. శీతాకాలంలోను, వర్షం కురుస్తున్నా అలాగే అక్కడే కూర్చుంటాడు–

వేసంకాలంలో, ఎలా ఉంటాడో అలాగే మనకు కనిపిస్తాడు. పగటి వేళ, రాత్రి వేళ అతని వద్దకు బాబా చాలా సార్లు వెళ్ళారు. అతడు ఏమీ కదలకుండా అలాగే కూర్చుని ఉన్నాడు. బాబా అతని వద్దకు వెళ్ళి అతనికి సదుపాయం చేద్దామని ప్రయత్నిస్తారు. ఆయన అతని పాదాలు ముద్దు పెట్టుకుంటారు. అతని బుగ్గలు నిమురుతారు. అతని దగ్గర కూర్చుంటారు- అప్పుడు ఆమస్తు చాలా సంతోషిస్తాడు. బాబాకు సన్నిహితంగా ఉన్నందుకు అతడు చాలా ఆనందిస్తాడు. అతడు ఒక చిన్నపిల్లవాడి వంటివాడు. కాని యీ ప్రపంచం అంతా ఏమీ లేదని వట్టి మాయ అని అతనికి బాగా తెలుసును. అతడికి ఏమీ అక్కరలేదు. మన కోరికలే మనలను బంధించేవి. మనకు ఏదో కావాలని ఉంటుంది. అందుకే మనం బంధనంలో ఉంటాము, నిజంగా మనకు ఏదీ అక్కరలేనపుడు మనం సార్వభౌములం లా ఉంటాము. మనము సర్వమూను. అందుచేత అప్పుడు మనం ఏదీకావాలని అనుకోము.... ...."

అక్కడ ఉన్నవారిలో ఒకడు—— "నాకు ఎలా ప్రేమించాలో నేర్చుకోవాలని ఉంది" అన్నాడు.

డాన్‌స్టీవెన్స్ చెప్పాడు—— "బాబాతోగాని బాబాకు వీలయినంత సన్నిహితంగా గాని ఉండమంటాను లేకపోతే మీరు బాబా తో ఉండలేకపోతే, ప్రజలలో బాబాను చూడండి, ప్రజలను ప్రేమించండి. ఎందుచేతంటే ప్రజలను ప్రేమించడం వల్లనే తాను తిరిగి ప్రజలచేత ప్రేమింపబడతాడు." తరువాత ఎరచ్ యిలా చెప్పాడు (బాబా సంజ్ఞలను వ్యాఖ్యానిస్తూ) "ఇండియాలో ఒకరు బాబాని ఎలా ప్రేమించాలి అని అడిగారు. అప్పుడు బాబా యిచ్చిన జవాబు చక్కగా ఉంది. బాబా అన్నారు——

"మీరు నన్ను ఎలా ప్రేమించాలో నాకు తెలియదు. నన్ను మీరు ఎలా ప్రేమించాలో మీరే చెప్పాలి. నేను ప్రేమసాగరుడను. మీరు నన్ను ఎలా ప్రేమించాలో నాకు ఎలా తెలుస్తుంది? నన్ను మీరే ప్రేమించాలి. నేను నన్ను ప్రేమించండి అని చెప్తాను. ఎలా నన్ను ప్రేమించాలో అది మీరు చూసుకోవాలి. ఆ ప్రేమ సముద్రుడనే నేనయినప్పుడు నన్నెలా ప్రేమించాలో నాకెలా తెలుస్తుంది?'

"బాబా ఏమంటున్నారో మీకేమయినా తెలుస్తోందా!" అని ఎరచ్ అడిగాడు.

బాబా యిలా వివరించారు - "మీరు ఒక అందమయిన పిల్లను కలిసారనుకోండి. చూడగానే ఆమెను ప్రేమించారు. మొదటి చూపులోనే ప్రేమలో పడ్డారు. మీకు అప్పుడు ఏమీ తోచదు. మీరు ఆమెను ఎంతవరకు ప్రేమిస్తారంటే _..మీకు నిద్దుర పట్టదు.

ఆకలి వెయ్యదు; ప్రపంచంలో ఏఅభిరుచీ మీకు ఉండదు; ఆమె మీది కావాలంతే - అలాగే నిద్రమాట మరచిపోయి, ఆహారం విశ్రాంతి యివేమీ తలవకుండా, బాబాతో ఏకం కావాలన్నమాట తప్ప యింకేమీ అక్కర్లేకుండా, ఉండాలి. అంటే నిజంగా ఆహారం నిద్ర మానెయ్యమని కాదు. సహజంగా ఏమీ తోచకుండా ఉండాలి. అది ఎలా వస్తుంది? బాబాను గురించే ఆలోచించండి. ఆయనను తరుచుగా స్మరించండి.''

''క్రీస్తు చెప్పాడు - ''అన్నీవదలిపెట్టి నన్నే అనుసరించండి'' అని. అలా అంటే అతడు ఏమన్నట్లు? అంటే అతడు శరీరము, ఆహారము, నిద్ర అవన్నీ వదిలివెయ్యమని చెప్పినట్లు కాదు. ఆయన అన్నదానికి అర్థం ఏమిటంటే - అన్ని ఆస్తులు యొక్క ఆలోచనలు, ప్రాపంచికపు ఆలోచనలు, అన్నీ - అవేమీ ముఖ్యమైనవి కావు గనుక - వదలి ఆయననే తలుచుకోవాలి అన్నమాట.

బాబా అంటారు ''నన్నే తలవండి. నేను ఎంత దూరంలో ఉన్నా సరే. మీరు నా శరీరాన్ని యిక్కడ చూస్తున్నారు. నేను ఎంత దూరంలో ఎక్కడ ఉన్నా సరే నన్ను తలచుకుంటే మీరు భౌతికంగా కూడా నన్ను చూడగలరు. ఇండియాలో నన్ను ఎంతగా ప్రేమిస్తారంటే వారు నన్ను శరీరంతో వారి యెదుటకి వచ్చినట్లు కూడా చూడగలిగేంత నన్ను ప్రేమిస్తారు - నేను వేల మైళ్ళ దూరంలో ఉన్నాసరే.

''నా మండలిలో కైకోబాద్ అని ఒకడున్నాడు.'' డాన్ - ''సూర్యులు చంద్రులు అతనిలోంచి వస్తున్నట్లుగా చూస్తాడు అతడేనా?''

బాబా - ''అవును. ఇప్పుడు నన్ను అన్ని చోట్లా ప్రతీవస్తువులోను చూస్తాడు. అనుభవపూర్వకంగా నన్ను అన్నిటిలోను చూస్తున్నాడు. నేను యిక్కడ భౌతికంగా ఉన్నాను. కాని అతడు నన్ను అన్నిచోట్లా చూస్తాడు. అలా బాబాను అన్నిచోట్లా చూస్తున్నానని యితరులకు చెప్తాడు కూడాను. కొన్ని సంవత్సరాల నుండి అతడు నన్ను ప్రేమిస్తున్నాడు. అతనికి అతని భార్య కుటుంబం ఉన్నారు. కాని వారిని అతడు వదలి వేసాడు. వారంతా ఒక చోటే ఉంటారు. అతడు నా వద్ద వుంటాడు. నిరంతరము, రోజుకి 24 గంటలూ కూడా, నన్నే తలచుకొంటూ ఉంటాడు.

''మీరు నన్ను ప్రేమించలేకపోతే మీరు ఏమీ విచారించకండి, నేను మిమ్మలను ప్రేమిస్తూనేఉంటాను.'' దానితో ఆరోజు సహవాస్ పూర్తి అయింది.

బాబా న్యూయార్క్‌కి వచ్చారంటే ఎక్కువ మందికి బాగా జ్ఞాపకం ఉన్నది ఏమిటంటే తూర్పు 66 వ వీధిలో మన్హట్టన్ హౌస్‌లో లాంగ్ ఛాప్స్ రెస్టారెంటులో

మెహెర్‌బాబా ఆతిథ్య సంఘం వారు బాబాకు యిచ్చిన స్వాగతము - విందు – ఇది మరుపలేని మహత్తర సంఘటన. ఆనాడు జూలై 22 వ తేదీ, ఆదివారం. బాబా యిదివరలో 1952 వ సంవత్సరం లో న్యూయార్క్ కి విచ్చేసినప్పుడు కూడా యీ భవనానికి వచ్చారు. ఈ విందు జయప్రదంగా జరగడానికి అది చిరకాలం జ్ఞాపకం ఉండేటట్లు జరిపించడానికి కారణం మారియన్ ఫ్లోర్‌కీమ్, ఆమె సంఘము ఎన్నో వారాలనుండి ఎడతెరపి లేకుండా చేసిన కృషి ఫలితమే అది. వారి దివ్య అతిథిని మనసులో ఉంచుకొని వారు చేసిన బ్రహ్మాండమైన ఏర్పాట్లు అంత విజయానికి కారణం అని చెప్పాలి.

న్యూయార్క్ నగరం నుంచి అమెరికాలోని యితర, రాష్ట్రాల నుంచి అనేక మంది ఆహ్వానింప బడ్డారు. మొత్తం 150 మందికి పైగా ఉన్నారు—వచ్చిన అతిథులు. వారంతా బాబాను దర్శించడానికి యీ మహానగరానికి వచ్చినవారే. లాంగ్‌ఛాప్స్‌లో సాయంకాలం అయిదు గంటలకు అందులోని పెద్ద విందు భోజనశాలలో సమావేశ మయారు. అక్కడ నుంచి కిటికీలలో నుంచి మన్హాటన్ హౌస్ యొక్క ఉద్యానవనం సుందరంగా కనబడుతూ ఉంటుంది. చిత్రలేఖనం కళలో ఆరితేరిన హెలెన్‌దామ్ అనే (స్విస్) కళాకారుడు చిత్రించిన బాబా యొక్క చిత్రము యొక్క ఫోటోతో కూడిన మనోహరమయిన కార్యక్రమపు ముద్రణము ప్రతి అతిథి యొక్క ప్లేటువద్ద ఉంచబడింది. ఈ హెలెన్‌దామే మెహెరాబాద్ లోని బాబా సమాధి భవనము లోపల గోడలమీద చిత్రాలను లిఖించినది కూడా. పెద్ద బల్లకు ఒక వైపున అగ్రభాగమున చిరకాలము నుంచి బాబా శిష్యులుగానున్న వారగు మార్గరెట్ క్రాస్కే ఎనిడ్ హార్ఫ్, ఎలిజబెత్ పాటర్సన్, జాన్‌బాస్, డార్విన్ షా వీరు కూర్చుని ఉన్నారు.

బాబా తెల్లని సద్రా మీద తమ గులాబీ రంగు కోటు తొడుగుకొని సరిగ్గా సాయంకాలం అయిదు గంటలకు వారి నలుగురు మండలితోను విందుశాలలోనికి ప్రవేశించారు. వారికి నమస్కరిస్తూ అందరూ లేచి నిలబడ్డారు. బల్లకి మధ్యస్థానంలో బాబాకు ఏర్పాటు చేసిన స్థానంలో బాబా కూర్చున్నారు. బాబాకు అటు యిద్దరు యిటు యిద్దరు మండలి ఉపవిష్టులయారు. దివ్య ప్రియతమునితో భోజనానికి అందరూ కూర్చున్నారు.

అతిథులందరి దృష్టి బాబా మీదే కేంద్రీకరింపబడి ఉంది. బాబా అంతమంది ప్రేమికుల మధ్య ఉండడానికి చాలా ఆనందిస్తున్నారు. ఆయన వదన మండలం అసాధారణ తేజస్సుతో ప్రకాశిస్తోంది.

వడ్డించేవారు అందరికి తలొక గ్లాసు ద్రాక్షరసం తీసుకువచ్చి అందించారు. బల్లమీద అందరివద్ద రొట్టె కూడా పెట్టారు. ఆ రాత్రి భోజనంలోని ప్రత్యేకత ప్రియతముడు అందరి మధ్యను వారితోబాటు ఉండడమే. అందరూ లేచి నిలబడి మౌనంగా బాబా ఆరోగ్యంకొరకు వాంఛిస్తూ ద్రాక్షరసాన్ని త్రాగారు. బాబా మాత్రం ద్రాక్షరసంతో ఉన్న ఆ గ్లాసును తమ పెదవులతో స్పృశించారు అంతే. బల్లలన్నీ కూర్చున్నవారికి బాబా బాగా కనిపించేటట్లుగా వేసారు. ఎవరూ కూడా తన ప్రక్క వారితో మాట్లాడలేదు. అందరి ఆలోచనలు అందరి దృష్టులు బాబా మీదే కేంద్రీక రింపబడి ఉన్నాయి.

కొద్దిసేపటిలోనే బాబా వారు కూర్చున్న కుర్చీ నుంచి లేచి అందరి దగ్గరకు వచ్చి ఆయన ప్రేమికులను పలకరిస్తున్నారు. ప్రేమతో ఒక్కొక్కరిని చేతితో తాకుతూ, చిరునవ్వుతో దయారసంతో నిండిన వీక్షణంతో అందరిని పరామర్శించారు. చాలా మందికి తెలుసును బాబా నగరం విడిచి యితర నగరాలకు వెళ్ళేముందు వారిని దర్శించడానికి యిది ఆఖరి అవకాశం అని. ఆ గది అంతా నిశ్శబ్దం రాజ్యం చేస్తోంది. బాబా ఒక బల్ల వద్ద నుంచి యింకొక బల్ల వద్దకు వెళ్తూంటే ఆయనతో కూడా అందరికళ్ళు ఆయన వైపుకి కదులుతున్నాయి. ఇంకా బాగా చూద్దామని మెడలు నిగిడించి దృక్కులు సారిస్తున్నారు.

ఎవరి యెడల ఉదాసీన భావం వహించారన్నది లేకుండా అందరివద్దకీ వెళ్ళి అందరికీ తృప్తికలిగించారు బాబా. తరువాత మరల బాబా వారి కుర్చీలో కూర్చు న్నారు. మారియన్, మైక్రోఫోన్‌లో బాబాకు మండలికి అమెరికాకు వారు వచ్చిన సందర్భంలో బాబాకు స్వాగతం చెప్పింది. ప్రపంచంలో అనేక చోట్లనుంచి వచ్చిన శుభాకాంక్ష సందేశాలను ఆమె చదివింది. ఇండియాలోని డా॥ సి. డి. దేశ్‌ముఖ్ వద్ద నుంచి ఒకటి వచ్చింది. ఇంకొకటి లండన్‌లోని ఇంగ్లీషు బృందం వద్దనుంచి వచ్చింది. ఇంకొకటి మిర్టిల్‌బీచ్ నుంచి వచ్చింది. ఇది అక్కడ ఉన్న నోరీనా మాచెబెల్లీ, కిట్టీదేవీ, ఫ్రాంక్‌లు యిచ్చారు. మరియొకదానిలో యిలా వ్రాసారు. — ''మేలుకొలిపే మెహెర్‌బాబాకు, లాస్ ఏంజిలెస్ హరీవుడ్ ప్రాంతం నుండి యీ సందర్భంలో శుభాకాంక్షలు. కృతజ్ఞతలతో మేము సంతోషంగా మీతో ఏకత్వంలో అక్కడకు వచ్చి ఉన్నవారందరిని మా ఆత్మలతో కలుస్తున్నాము. ఈ ప్రాంతాలకి బాబా మరల వచ్చినందుకు మేము చాలా అదృష్టవంతులముగా భావిస్తున్నాము. బాబాను

భౌతికంగా కలుసుకోవడం కోసం కూడా ఆతురతతో ఎదురు చూస్తున్నాము. మా ప్రేమను పంపుతున్నాము.''

యూరపియన్ బ్రిటిష్ బృందంవారు —

''ప్రియతమ బాబాకు ప్రేమ పూర్వకమయిన నమస్కృతులు యివ్వడంలో మేమందరము మీతో కలుస్తున్నాము '' అని అమెరికాకి తంతి సందేశం పంపించారు.

కార్యక్రమం ముద్రించి ప్రపంచంలోని అన్నిదేశాలలోను ఉన్న బాబా ప్రేమికులకు పంపించారు. సరిగ్గా యీ సమయంలో అందరు వారి హృదయాలను ప్రేమతో ప్రియతమునితో విందుకు కూర్చున్న ప్రేమికులందరి వైపుకి త్రిప్పి వారిని మనసార తలుచుకుంటారు. ప్రియతమునికి హృదయాలను సమర్పించుకుంటారు.

అక్కడ చేరి ఉన్న బృందనాయకులు కొంతమంది లేచి బాబాకు శుభాకాంక్షలు తెలిపారు. ఐవీడ్యూక్స్ లేచి ఒక హాస్యరసపూరితమైన కథానిక చెప్పింది.

ఒక ఓడలో కొంతమంది ప్రయాణం చేస్తుండగా తుఫాను వచ్చింది. అప్పుడు ఆ ఓడ కెప్టెన్ భయపడుతూన్న ఒక స్త్రీతో అమ్మా ! మనం యిప్పుడు భగవంతుని చేతిలో ఉన్నాము'' అన్నాడు. ఆమె అప్పుడు ''అయ్యో ! (మనమని) అంతవరకు వచ్చిందా !'' అని అడిగింది.

ఐవీడ్యూక్స్ చెప్పింది – ''అదృష్టవశాత్తు చాలా కాలం క్రిందటే అంతవరకూ వచ్చింది మనకు. మన అదృష్టంచేత భగవంతుని చేతుల్లోకి వచ్చాము.'' అని ముగించింది.

ఫ్రెడ్ వింటర్ ఫెల్ట్ మైక్రోఫోన్ తీసుకుని ''మా హృదయపు లోతులనుంచి బాబాకు స్వాగతం యిస్తున్నాము. మెహెర్ బాబాకి జై'' అని భారతీయ రీతిగా ఉచ్చైస్స్వరముతో జయధ్వానం చేసాడు.

ఎలిజబెత్ పాటర్సన్ – ''ఇండియాలో యిలాంటి సందర్భాలలో పాడే పాటలు పూర్తిగా ఆధ్యాత్మిక అర్థాలతో కూడుకొని ఉంటాయి. అమెరికాలో మనం భోజనాల సమయంలో యిచ్చే ఉపన్యాసాలు స్థిరత్వం లేకుండా వెఱ్ఱిగా ఉంటాయి. కాని ప్రజా రంజకమయిన ఒక పాట ఉంది.

"ఈ పుణ్యదినమునకై వేచి యున్నాము – ఈరోజు కొరకే మనముపుట్టాము" అని అందరూ పాడారు. ఈపాట యీ నాటి మన భావాలను వ్యక్తీకరిస్తోంది అందరూ అలా పాడుతూంటే.

కరుణా మయుండగు బాబాను ప్రేమింప మానవుల నందరను ప్రేమించినట్లే- మరి వారు ఆయన బిడ్డలే కదా – మెహెర్ బాబా నీకు సుస్వాగతమురా – అని ఎలిజబెత్ పాటర్‌సన్ ఆపాటకు స్వరం కలిపింది.

డాన్‌స్టీవెన్స్ లేచి "బాబాకు స్వాగతం చెప్పడం అసాధ్యం. హృదయం నుంచి హృదయానికి తంతి పూర్వకంగా చెప్పాలి.

"ఇండియాలో 1954 సం॥లో జరిగిన సహవాస్ సమావేశాలలో బాబా చెప్పారు—పశ్చిమాన ఉన్న నా భక్తుల ప్రేమయే నన్ను మరల అక్కడికి తీసుకు వెళ్తుంది అన్నారు. మనం అంటున్నాము బాబా—"మీరే మీ ప్రేమతో మమ్ము నిలబెడుతున్నారు" అని చెప్పాడు.

"గడచిన అనేక సంవత్సరాలలో అనేక ఉదాహరణలు మనం చూసాము, ప్రతీ జీవి యెడల బాబా యొక్క కరుణ ఏవిధంగా వ్యక్తమయినదీను. వారి ఏకాంత వాసమును భంగపరచుకుని మన కోసం మన వద్దకు వచ్చిన మన ప్రియతమునికి ఎంత కృతజ్ఞతంగానో ఉండాలి మనం"— అని డార్విన్ షా పలికాడు.

ప్రేమికులు చెప్పిన యీ మాటలకు బాబా వీరిహృదయాలలోని ప్రేమను ఆయన గ్రహించి ఆయన యీ క్రింది మాటలు ఆణిముత్యాలులా జవాబుగా చెప్పారు. ప్రతి మాట అఖండమైన నిశ్శబ్దంలో అందరూ శ్రద్ధగా విన్నారు. బాబా చెప్పిన ఆ మాటలు ఎరచ్ నోట పలికాడు యీవిధంగా—

"ఈరోజున మీ అందరితోను ఉన్నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. నా ఏకాంతవాసంలో నుంచి మీ భక్తియే నన్ను యీ పశ్చిమ దేశాలకు వచ్చేలా చేసింది. ఏదయినా నా విశ్వహృదయాన్ని స్పృశిస్తుందంటే అది ప్రేమయే. నేను పరిమితమయిన భూగోళంలోని యీ సముద్రాలను దాటి మీకు అపారమయిన అనంతమయిన దివ్యప్రేమ సాగరాన్ని తీసుకువచ్చాను. నన్ను ప్రేమించడానికి సాహసించలేని వారు, తీరాల మీద ఉండే రక్షణకై చూసుకుంటారు. నన్ను ప్రేమించే మీరు

యీ దివ్య సముద్రంలో ఈదులాడుతున్నారు. నాలో మీరు మునిగిపోయే వరకు నన్ను అధికంగాను అధికతరంగాను ప్రేమించండి. అనంతమయిన సాగరంలో మీరు లోతులకి వెళ్ళి చూస్తే మీకు అమూల్యమయిన ఏకత్వం అనే ఆణిముత్యాన్ని కనుగొంటారు.''

ఎరచ్ మాటలు చెప్పడం ఆపేసిన తరువాత ప్రేమ తరంగాలు ఆ దివ్య సముద్రాన్నుంచి రావడం అవి వారిని స్పృశించడం అక్కడ వింటున్న ప్రేమికులు అందరు అనుభవించ గలిగారు. ఎవరి భావాలలో వారు ఉన్నారు.

తరువాత ఒక సందేశం చదువబడింది – ''దివ్య ఆనందము – మానవ దుఃఖము'' అనునదే ఆ సందేశము–

సాధారణ మానవుడు తన కోసమే బాధపడతాడు- సద్గురువులు మానవకోటి కోసం బాధపడతారు. అవతార పురుషుడు అందరి కోసము అన్నిటి కోసము అన్ని జీవరాసుల కోసమూ బాధ చెందుతాడు.

1952 వ సం॥లో మోటారు ప్రమాదం కలిగిన తరువాత తరుచుగా అడిగే ప్రశ్నకు యిది జవాబుగా చెప్పేవారు బాబా.

విందు భోజనాలు జరుగుతూ ఉండగా డేవిడ్ రాస్ అనే గానకళా విశారదుడు బాబాకు అంకితమయిన అనేక ఆధ్యాత్మిక గీతాలు చక్కగా గానం చేసాడు. ఇతడు రేడియో లోను టెలివిజన్ లోను పాడుతూ ఉంటాడు- కబీర్ రచించిన యీ గీతాలను పాటలలోనే తర్జుమాలు చేయ బడ్డాయి. హాఫీజ్‌రచించినవి, కబీర్ పాటలు కూడా బాబాకు యిష్టమయినవి పాడాడు.

హాఫీజ్ యొక్క పాటః– ఈరోజు అన్ని రోజుల కంటె నాకు ప్రియమయినది– నేడు నా ప్రియతమ ప్రభువు నా యింటిలో అతిధిగా నున్నాడు.

నాగది, నా ప్రాంగణము, ఆయన సన్నిధిలో అందమయినాయి - నా వాంఛలు ఆయననామం అలపిస్తాయి- ఆయన అంతులేని సౌందర్యంలో అవి అదృశ్యమౌతాయి-

ఆయన పాదప్రక్షాళనం చేస్తాను. ఆయన వదనం తిలకిస్తాను. ఆయన ప్రోల నామనస్సు నాశరీరము నాసర్వస్వము ఉపహారంగా అర్పిస్తాను.

నా పెన్నిధి అయిన నా ప్రియుతముడు నా యింటికి వచ్చిన రోజు ఎంత ఆనందకరమయిన రోజు :

నా ప్రభువును చూసినపుడు నా హృదయం లోని దౌష్ట్యమంతా ఎగిరి చక్కా పోయింది.

నా ప్రేమ ఆయనను స్పృశించింది. ఆనామమే సత్యము. దాని కోసమే నా హృదయం పరితపిస్తోంది.

కబీర్ గీతం:—

ప్రభువు నాలో ఉన్నాడు; ప్రభువు నీలోనూ ఉన్నాడు – ప్రతి విత్తులోను ప్రాణం ఉన్నట్లే.

ఓ సేవకా: నీ అసత్య గర్వాన్ని దూరం చేసుకో - ఆయనను నీలో అన్వేషించు.

కోటి సూర్యులు వెలుగుతున్నారు; నీలాకాశం విస్తరిస్తోంది; జీవిత సంరంభం చల్లారింది; మచ్చలన్నీ మాసిపోయాయి, నేను ప్రపంచం మధ్యలో కూర్చున్నప్పుడు.

వాయించని గంటల నాదము విను; మ్రోయించనిడోలు మ్రోత విను; ప్రేమలోనే ఆనందించు;

నీరు లేకుండానే వర్షం కురుస్తోంది; నదులల్లో వెలుతురు ప్రవహిస్తోంది.

మన ప్రేమే ప్రపంచం అంతా వ్యాపించింది; అది బాగా తెలిసినవారు కొద్ది మందే.

హేతువాదం చేత చూద్దామనుకునేవారు అంధులు — ఆ హేతువే వేరవడానికి కారణం.

కారణాల ఆగారము చాలా దూరంలో ఉంది.

కబీర్ ఎంత ధన్యుడు! యింత గొప్ప సంతోషం మధ్యలోనూ అతడు తనలో తానే పాడుకొంటాడు.

అది పరమాత్మ ఆత్మతో సమాగమం! అది దుఃఖాలను మరపించే సంగీతం.

ఆ సంగీతం రాకపోకలన్నిటినీ అధిగమించింది.

హాఫీజ్ పాట మరియొకటి —

నీ రూపంతోటి నీ లావణ్యం తోటి నా హృదయాన్ని కలచివేసావు. నీకు ఎవరన్నా ఖాతరు లేదు: అయినా నీ నుండి ఒక్కడూ తప్పించుకు పోలేడు.

కొన్ని సమయాలలో నా హృదయం లోంచి నిట్టూర్పులు వస్తాయి; అది నా ప్రాణమా? లేక వదునైన నీ ప్రాణమా?

నా హృదయంలో నేను సహించే బాధలు నేను ఏ మాటలచే నయినా చెప్పగలనా ?

నీ మధురాధరాన్ని ఆ మాణిక్య వర్ణంతో దాన్ని నా శత్రువులకు ఎలా చూపించి అనుభవించమనగలను ?

అనాగరికమైన ఆత్మయొక్క వివరణలు తృణీకరించబడినపుడు రోజు రోజుకి నీ అందం పెరుగుతోంది, దానికి బలం వస్తోంది యింత చక్కటి రూపురేఖలను యింకా నింగిలోని తారకతో పోల్చగలమా ?

నా హృదయం బీటలు వార జేసావు నీవు; నా ఆత్మను చేకొను; నీ దుఃఖానికి ఒక ప్రతినిధియా ? ఏమి నాటకం ! నాలాగ దుఃఖంలో ఆరితేరినవాడు పంచిపెట్ట గలడు.

"ఓ హాఫీజ్ ! ప్రేమ యొక్క పవిత్ర ఆలయంలో ఎట్టకేలకు నీ అడుగు పడింది; ఆయన కొంగు పట్టుకో నీ చేతితో; ఈ రోజు నుంచి యింక అందరితోను సంబంధం వదులుకో.

డెలియా డిలియాన్ రచించిన "ప్రియతముడు" అను ఒక పాట రాస్ గానం చేసాడు.—

"నీ దయార్ద్ర దృష్టి నా ఆత్మను ఆకర్షించింది; నా హృదయాన్ని ప్రేమ రగుల్కొలిపింది నీకోసం ఎల్లప్పుడు; —నేను ఎంత అయోగ్యుడనయినా —నాకు ఎన్నో కలుగజేసావు. ఎంతో నాకు ఉపకారం చేసావు;

నీ ఇచ్ఛ ప్రకారం చేయడం, నిన్ను యింకా, యింకా ప్రేమించాలని, ఆఖరికి నీలో ఐక్యం అయిపోయి నేను లేకుండా పోవాలని,

నీ ప్రేమలో నేను కలిసిపోవాలని,

నా ప్రార్థనగా ఉండుగాక!"

తరువాత నోరీనా మాచెబ్లీ రచించిన "విశ్వాత్మత్వము" అనే పాట పాడి బాబాకు వినిపించాడు రాస్ —

"ఓ జీవుడా! "నేను వేరు" అను నీ అజ్ఞానమే నిన్నిట్లుబంధితుని చేస్తోంది.

నీవు ఏ చర్చికి వెళ్ళినా, నీ మతం ఏదయినా, నీ నమ్మకం ఎటువంటిదయినా

నీ జీవితంలో ఏ వృత్తిలో ఉన్నా – నీవు సత్యములో జీవించు. నీలో ఉన్న వ్యక్తిగత 'అహము' తొలగించి వేసి విశ్వాత్మత్వానికి చోటు యివ్వాలి; నీవు వ్యష్టిగా ఉన్న నీ అజ్ఞానపు సంకుచితాత్మ నుంచి వెలుపడి విశ్వాత్మత్వము యొక్క నిత్య యౌవన అమరత్వంలో నీవు స్థిరపడిపోవాలి; అనంతము అమృతము అగు ఆ విశ్వాత్మలో ఏకమయిపోవాలి.''

రాస్ యీ పాటలూ, యింకా తన స్వంత పాటలు పాడుతూంటే బాబా ఒక్కొక్కమారు నిశ్చలంగా కూర్చున్నారు. దానిని బట్టి యిక్కడ ప్రేమికుల మధ్యలో కూర్చున్నా బాబా ఎక్కడికో, ఏదూర ప్రదేశానికో .... వెళ్ళి ఏదో పని చేస్తున్నట్లుగా కనుపించారు. భోజనాలు వడ్డించిన తరువాత కూడా అందరూ బాబా వైపే తమ చూపులు నిగిడించే వారు. భోజనాలు వడ్డించే బృందానికి నాయకుడయిన ఆటో తరువాత యిలా అన్నాడు –

''నా జన్మలో యింతమందితో ఉన్న బృందము యింత నిశ్శబ్దంగా గౌరవనీయ మయిన తమ అతిథియైన వారి దృక్కులు కేంద్రీకరించి భోజనాలు చేయడం, యింత వరకు చూడలేదు. అసలు యిలాంటి దివ్యమైన అతిథి రానేలేదు యిక్కడికి. నేను ఎప్పుడు బాబా వారి వద్దకు వెళ్ళినా వారి సాంగత్యము చేసినందు వలన వారికి విస్మయం కలిగించే ఒక విధమయిన షాక్ తగులుతుందని చెప్తూ ఉన్నట్లు నాకు అనుభవం కలిగింది !

వర్తమానంలో జరుగుతున్న యీ సంవత్సరానికి ముందు బాబా ఎప్పుడూ కానుకలు స్వీకరించక పోయినప్పటికి అక్కడ సమావేశమయిన ప్రేమికులెల్లరకు వారికి ఏదో ఒకటి సమర్పించడానికి బాబా అనుమతి యిచ్చారు. బాబా యొక్క సోదరి మణి ద్వారా బాబాకు ప్రయాణం చేసేటప్పుడు తమతో కూడా తీసుకు వెళ్ళేందుకు అనువయిన ఒక గడియారం అందరు కలిసి సమర్పిస్తే బాగుంటుందని నిశ్చయించారు. ఆ ప్రకారంగా హారీథోర్న్‌షీమ్, జాన్‌బాస్‌లు అటువంటి గడియారం కొనితెచ్చి బాబాకి బహూకరించారు. భారతీయ కాలమానం ప్రకారం సమయం దిద్ది ఆ గడియారం బాబాకి యిచ్చారు. ఇంకా సోదరి మణి కోసం లండన్ సమయం ప్రకారం సరిచేసిన గడియారం ఒకటి, మండలి నలుగురికి కూడా, తలొక గడియారం మిర్టిల్‌బీచ్ సమయం ప్రకారం, లాస్ ఏంజిలస్ సమయం ప్రకారం, శాన్‌ఫ్రాన్సిస్కో సమయం ప్రకారం, ఆస్ట్రేలియా సమయం ప్రకారం సైతం పెట్టి కానుకలు తెచ్చి మండలి

కోసం బాబాకి యిచ్చారు. పాశ్చాత్య ప్రేమికులు యిచ్చిన కానుకలు చూసి బాబా చాలా సంతోషించారు. బాబా మండలికి మణికి వారి వారి గడియారాలు స్వయంగా అందజేసారు.

బాబాతో కూర్చున్న ప్రేమికులందరు మేరియన్ అడిగినందున ఒక్కనిమిషం మౌనం పాటించారు. ఆ వెంటనే నాలుగు అంతస్తులుగా తయారుచేసిన అద్భుత మయిన ఒక పెద్ద కేక్ తీసుకు వచ్చారు. ఆ రొట్టె చుట్టూ కొవ్వొత్తులు వెలిగించారు. "ఆయనతో ప్రేమద్వారా ఐక్యం పొందడమే మన జీవిత గమ్యం" అనే వాక్యాన్ని అందరూ స్మరించారు. మేరీ ఆండ్రియాని తయారు చేసిన ఒక చిన్న బాబా జెండా ఆ కేక్ పైన అమర్చారు. ఆ జెండా సప్త వర్ణాలతోను అలరారుతోంది. ఏడు భూమి కలకు ఏడు వర్ణాలన్నట్లు ఉన్నాయి ఆరంగులు. ఏడేళ్ళ బాలప్రేమికుడు —లారీ క్రాష్—, పన్నెండేండ్ల బాబీ ఫెరన్ జీ అనే బాలిక యిరువురు కలిసి మంచి సుగంధయుతమయిన పుష్పాలతో తయారు చేసిన ఒక హారాన్ని బాబా మెడలో అలంకరించారు. ప్రియతముడు వారిరువురిని ఆలింగనం చేసుకొని ముద్దుపెట్టు కున్నారు. ఇది మాత్రం టెలివిజన్ ఫిలిం కెమేరాల కోసం బాబాను కోరగా మళ్ళీ ఆచరించారు. బాబా వైపు ప్రకాశవంతమయిన దీపాలు త్రిప్పి టి. వి. ఫొటోలు తీసారు. తరువాత మనోహరమయిన చిరునవ్వుతో బాబా లేచి "పుట్టిన రోజు జ్ఞాపకార్థం" కేక్ కోసారు. అప్పుడు అందరూ తలోముక్క తీసుకోడానికని అందరి వద్దకు చక్రాల బండిమీద పెట్టి ఆటో ఆకేక్ తీసుకొని వెళ్ళాడు. అందరూ సాంప్రదాయసిద్ధంగా హాపీ బర్త్డే పాట పాడారు. 'మెహర్ మస్' (ఫిబ్రవరి 25 వ తేదీ) జ్ఞాపకార్థం యీ పాట గానం చేసారు.

ఆ సమయంలో ఐవీడ్యూక్ లేచి— "ఈ ప్రపంచ మంతటా బాబా యొక్క జన్మదినోత్సవం చేసుకున్నారు. కాని ఆయన పుట్టినరోజు పండుగనాడు మనందరి తోట బాబా ఉండే అవకాశం యింతవరకు మనకు లేకపోయింది. కాని యీనాడు మనం ఆ భాగ్యం కలుగజేసుకున్నాం. ఇదివరకు పార్సీ పంచాంగం ప్రకారం బాబా జన్మదినోత్సవం అనేక తారీఖులలో జరిపించారు. ఇప్పుడు ఫిబ్రవరి 11వ తేదీన అయింది. కానీ బాబా యిప్పటినుంచి పాశ్చాత్యుల కాలెండరు ప్రకారం ఆయన పుట్టినరోజు అయిన ఫిబ్రవరి 25వ తేదీన వారి జన్మదినోత్సవం జరిపించాలని బాబా చెప్తున్నారు. ఈ కేక్ బాబా జన్మదిన జ్ఞాపకార్థం ఉద్దేశింప బడింది. వారితో మనం జరుపుకునే ఉత్సవం నాడు వారి పుట్టిన రోజును జ్ఞాపకం చేసుకోవచ్చునని, యీనాడు

మనం మెహెర్ మస్ రోజు జ్ఞాపకార్థం, యీ పండుగ జరుపుకుంటున్నాము.'' అని ఆమె చెప్పింది.

ఆ సమయంలో ఒక పెద్ద గాలిపడగ బాబా చిత్రంతోను, వివిధములయిన ఏడురంగుల కాగితాలతోను వారి సంతకాల కోసం అందరి వద్దకు తీసుకొని వెళ్ళబడింది. దానిమీద బాబా మాటలు యిలా ఉన్నాయి - ''గాలిపడగ ఎక్కడికి వెళ్తుందో దానితోక కూడా అక్కడికే వెళ్తుంది– తోక, ఆ గాలిపటానికి అంటిపెట్టు కుని ఉన్నంతవరకు. అలాగే నీవు నీ పట్టు గట్టిగా ఉంచుకున్నంత వరకు నీవు ఒక సాధువువయినా ఒక పాపాత్ముడవయినా ఎవరయినా ఏమీ భయంలేదు.'' తరువాత ఆ గాలిపడగని బాబా మిర్టిల్ బీచ్‌కి తీసుకుని వెళ్ళారు.

వారివద్దకు రానటువంటి భక్తుల కోసం బాబా ఆరాటపడజొచ్చారు. బాబా లేచి త్వరత్వరగా ఆగది చుట్టూ తిరిగి వచ్చారు. అలా తిరిగేటప్పుడు అక్కడక్కడ బాబా ఆగుతూ వచ్చారు. ఆ తిరగడంలో బాబా ప్రేమను వారిమీద ప్రసారం చేసారు. తమ కుర్చీలోకి వచ్చి కూర్చున్నాక బాబా ''ఎవరయితే యింతవరకు నేను స్పృశించలేదో వారు లేచి నా బల్లవద్దకు రావాలి'' అన్నారు. అంతట కొందరు లేచి బాబా వద్దకు, వరుసగా వచ్చారు. అమూల్యమయిన యీ దర్శన్ పొందే అవకాశం వచ్చిందని వారు చాలా సంతోషించారు. బాబా కొందరిని కౌగిలించుకున్నారు. కొందరితో కరచాలనం చేసారు; వారి బల్లకు ఎదురుగా వచ్చిన వారినందరను, యీ విధంగా తాకారు. ఈ ప్రకారం వచ్చిన 150 మంది అతిథులకు బాబా సాంగత్యము యిచ్చినవారయారు. అందరినీ బాబా ఆశీర్వదించారు. టెలివిజన్ కెమేరాతో యీ అమూల్య దృశ్యాలు ఫొటోలు తీసారు. కొన్ని అద్భుతములయిన స్థిర చిత్రాలు కూడా రోసెన్‌ఫాల్ అనే ఐక్యరాష్ట్రి సమితి ఛాయా చిత్ర గ్రాహకుడు తీసాడు. సాధారణంగా ఆ దేశంలో విందు సమయాలలో ఫొటోలు తీయించుకుంటారు. ఈ విందులో తీసిన చిత్రాలు అపూర్వమయినవి.

ఒక ప్రేమికురాలికి యీ ఫొటోల వలన మంచి అనుభవం కలిగింది. ఆమె మొదట భోజనానికి అందరితోను వచ్చి కూర్చున్నపుడు ఆమె బాబాకు చలివేస్తోందని, ఆయన చేష్టలవలన గమనించి వెంటనే అయ్యో! అనుకుని సమీపంలోని తన నివాసానికి పరుగెత్తుకుని వెళ్ళి తన శాలువాను తీసుకొని వచ్చింది. ఆమె వచ్చి చూడగానే బాబా ఆయన స్థలంలో లేరు. అప్పుడు ఆయన గదిలో నడుస్తున్నారు

అందుచేత ఆమె ఆ శాలువా బాబా మండలిలో ఒకరి చేతికి యిచ్చి ఆమె కుర్చీలో కూర్చున్నది. తరువాత బాబా "నేను స్పృశించని వారు యింకా ఎవరేనా ఉంటే ఒకమారు నావద్దకు రండి" అని చెప్పగా ఆమె మొదట లేచి బాబా వద్దకు వెళ్ళింది. బాబా ఆమె వేపు చూసారు. ఆమె వెళ్ళిన తరువాత జరిగిన దేమిటో ఆమెకు తెలియలేదు.

కొన్ని వారాలయినాక ఆ నాటి ఫొటోలు వచ్చాక భోజన సమయంలో తీసిన ఫొటోలో ఆమె భర్త ప్రక్కనే బాబా నిలబడియుండుట చూసింది. అందులో ఆమె భర్త బాబా వైపు ఎంతో ఆనందంగా చూస్తున్నాడు. బాబా యెడల అతనికి ఉన్న ప్రేమను ఆ కళ్ళలో ప్రదర్శిస్తున్నాడు. అప్పుడు ఆమె ఏమి పోగొట్టుకున్నదో ఆమె తెలుసుకుంది. ప్రక్కన ఉన్న ఆమె కుర్చీ ఖాళీగా ఉండెను. (ఆ ఫొటోలో). తమ బల్లవద్దకు బాబా వచ్చినపుడు ఆమె లేకుండా యింటికి వెళ్ళిందని, ఆమె ఎంతో నొచ్చుకున్నది. నిజంగా ఆమె బాబాకు సేవచేయాలనే సదుద్దేశంతోనే వెళ్ళింది గనుక ఆమె విచారించనక్కరలేదు. బాబా న్యూయార్క్ నుంచి వెళ్ళేముందు ఆయన ఆశీస్సులతో ఆమె శాలువాను ఆమెకు తిరిగి యిచ్చివేసారు. ఈ విధంగా ఒక్కొక్కరికి ఒక రకమయిన అనుభవం కలిగింది. ఆ కాస్తసేపు ఆయన సన్నిధిలోనే ఆయనకు సన్నిహితంగా ఉండడమే ముఖ్యం అని అందరూ తెలుసుకున్నారు.

ఇంకొక ప్రేమికురాలు ఆ విందులో ఆమెకు కలిగిన అనుభవాన్ని యిలా వర్ణించింది —

"బాబా భోజనశాలలోకి వారి మండలితోను, వారి భక్తులతోను వచ్చి బల్లవద్ద కూర్చున్నప్పుడు వారి వారిలోని వ్యక్తిగత మానవ చైతన్యం తొలగిపోయి దాని స్థానే దివ్యమైన వెలుగుతో వారి అంతరంగాలు నిండిపోయాయి. సంగీతాలతోటి, ప్రశంసా ప్రసంగాలతోను విందు జరుగుతున్నప్పుడు బాబా చాలా ఆనందిస్తున్నట్లు కనిపించారు. కేక్ బాబాకు సమర్పించినపుడు ఆ కొవ్వొత్తుల వెలుగు అస్వయం ప్రకాశమానమైన బాబా వదనం మీద పడింది. నిజంగా ఆయన తన ప్రేమికుల బానిసలాగే ప్రవర్తిస్తూ ప్రతియొక్కరి వద్దకు వెళ్ళి వారిమీద తమ అనుగ్రహాన్ని ప్రసరింపజేసారు. అనంతమయిన బాబా పరిమితి కలిగిన యీ వ్యక్తుల వద్దకు వెళ్తూంటే వారికి ఎంతో ఉత్తేజం కలిగింది. ఆ హాలులోని వాతావరణం అంతా బాబా యొక్క దివ్య ప్రేమతో నిండి పోయింది. అందులో ఉన్న ప్రతి వ్యక్తి ప్రభావితుడు కాకుండా ఉండలేదు."

భోజనాలు జరుగుతూన్నంతసేపూ ఆల్వా కోయిల్ డెనిజన్ అను ప్రేమికు రాలు ఆమె యొక్క స్వంత రచనలయిన పాటలను రికార్డులు వేసి వినిపించింది. జాన్ ఆలివర్ చదివిన 'పశ్చాత్తాప నివేదనం' కూడా రికార్డు వేసింది. డేవిడ్ రాస్ అప్పుడు బాబా యొక్క సెర్మన్ (ఉపదేశము)ను చదివాడు. భగవద్వచనంలో నుంచీ, 'జీవితము యొక్క మతము' అనే గ్రంథము నుంచి దాగాలుకూడా చదివాడు. బాబా సాక్షాత్తు అక్కడ ఉండగా ఆయన సమక్షంలో యీ పరమ సత్యాలను చదువుతూండడం అదొక అద్భుతమైన అనుభవం. ఆయన వైపే దృక్కులు సారించి ఉండడం ఆయన చెప్పిన మాటలు వింటూ ఉండడం వల్ల ఆ మాటలు అందరి హృదయాలలోను చెరగని ముద్రవేసాయి.

అప్పుడు అందరి హృదయాలను తేలిక పరిచే సంఘటన ఒకటి జరిగింది. టామ్ మార్లో అను నటకుడు డాన్ మార్షల్ పియానో వాయిస్తూండగా రెండు పాత సినిమాల లోని - మొదటిది ఛార్లీ చాప్లిన్ చలన చిత్రము, రెండవది మేరీ పిక్ ఫర్డ్ ఫిల్ముల్లోని టామ్ కొన్ని నాట్యాలను చేసి చూపించాడు. అతని చురుకయిన అడుగులు కదలికలు చూచి బాబా చాలా సంతోషించారు. ఎరచ్ మాత్రం యీ పాత పాటలను వింటూ నిశ్చేష్టుడయాడు.

ఈ విధంగా ఆ సాయంకాలం కార్యక్రమం రెండు గంటలు పట్టింది. ప్రేమికులందరి తోను బాబా ఎంతో ఓపిగ్గా కూర్చున్నారు. ఆదివ్య పురుషుని కదలికలు ఆయన పనులు అన్నీ దివ్యత్వాన్ని చూపుతూ ఉన్నాయి. బాబా యొక్క సహవాస్ కోసం వారంతా ఎంత ఆకలితో పరితపిస్తున్నారో పాపం. బాబా వారికి దివ్యాహారం యిచ్చారు. ఆయనమట్టుకు ఆయన ఏమీ తిన్నదే లేదు. కొంచెం తిన్నట్టు ఆనవాలు కోసం ఆయన పళ్ళెంలోని ఆహారం చేతితో కొంచెం స్పృశించారు. బాబా ఆఖరున చెప్పిన మాటలు "నేను తినవలసిన అవసరం కలుగలేదు నాకు. మీరు నాకు యిచ్చిన ప్రేమయే నాకు పండుగ భోజనంలా పని చేసింది." అందరకు కేక్ ముక్కతో బాటు చిన్న బాబా జెండా కూడా యిచ్చారు. "ఈ చిన్న జెండాలతో బాటు నా ప్రేమనుకూడా తీసుకువెళ్ళండి – మీతో. నన్ను తలచుకుంటూ ఉండండి." అని బాబా చెప్పారు. బాబా యింక వెళ్ళడానికి లేవగానే అందరూ అనుసరించారు. వారు తలొక బాబా జెండా కొద్దిగా పుష్పాలు వారి బల్లల మీద నుంచి తీసుకొని వెళ్ళారు. దివ్య ప్రియతమునితో విందు భోజనం యీవిధంగా ఆనందంగా ముగిసింది.

న్యూయార్క్‌లో లాంగ్ ఛాంప్స్‌తో యీ రోజున (జూలై 22 వ తేదీన) విందు యింక ప్రారంభం అవుతుందనే ఆ సమయంలోనే లండన్‌లో బాబా పేరున ఒక యింటిలో సమావేశమయిన పదముగ్గురు ప్రేమికులలో ఒకరికి నిద్ర వచ్చింది. ఆ రోజున ఆ సమావేశంలో బాబా యిచ్చిన బుధవారం సందేశం ఆ సమయంలో ఒకటి చదువుతున్నారు. అతడు 70 సంవత్సరాల వయసుగల అంధుడు. కాని అతనికి ఆ నిద్రలో బాబాను చూసినట్లు స్వప్నం వచ్చింది. ఆ కలలో వారుసమావేశమవుతున్న గదిలోకి బాబా ప్రవేశించారు. వారి చేతిలో ఒక పళ్ళెం నిండా మిఠాయిలు పువ్వులు ఉన్నాయి. అక్కడ చేరిన వారందరికీ తలొక మిఠాయిఉండ తలొక పుష్పం బాబా పంచిపెట్టారు. బాబా ఆ గదిలో పచారు చేస్తూ ఈ కల గంటున్న అతనివైపు చూసి "ఇక్కడకు వచ్చిన వారందరికి నాప్రేమలో ఒక్కొక్కముద్దు ఇయ్యి" అని బాబా ఆదేశించారు అతనిని.

ఇలాటి అనుభవాలు బాబా అనుగ్రహం వల్ల కలిగినప్పటికీ అవి అలా కలుగుతున్నాయని బాబాకు తెలియదని అన్నారు. అవి ఆ అనుభూతి కలిగిన వాని ప్రేమ విశ్వాసాలననిబట్టి కలుగుతాయని బాబా చెప్పారు. ఈ సంగతి ప్రేమికులంతా వెళ్ళిన తరువాత మరల మరునాడు ఉదయం చెప్పగా బాబా యొక్క సన్నిధిలో ఆయన ప్రేమను అనుభవించినట్లు అయింది.

జూలై 23, సోమవారం :

ఉదయాన్నే 9 గంటలకు బాబా కొద్దిమంది ప్రేమికులను వారి గదికి పిలిచారు. బాబా వారితో అన్నారు "కొన్ని నెలలుగా నేను ఏకాంతవాసం చేస్తూ నా గదిలోనే తాళం వేసుకొని ఉండిపోయాను. ఇప్పుడయినా ఆ ఏకాంతవాసానికి తాత్కాలికంగా భంగం చేసి యీ హోటలు గదిలోనే ఉండేకన్నా ఎక్కడికన్నా బయటకు పోతే బాగుంటుంది" అన్నారు. అప్పుడు ఆ ప్రేమికులు న్యూయార్క్ నగరదృశ్యాలు చూడడానికి వెళ్దామా బాబా ! అని అడుగగానే బాబా సరేఅన్నారు. అక్కడకు బాబా పిలువగా వచ్చినవారు గాక మరి కొద్దిమందితోనే బాబా బస్సులో బయలుదేరారు. ఆ బస్సు పట్టినంతమందే బాబాతో వెళ్తున్నారు. బస్సులో బాబాతో వెళ్ళడానికి వారెంతో ఆనందించారు. బస్సులో వెళ్తూ బాబా మరునటిరోజు ఉదయాన్నే ప్రయాణానికి విమానాశ్రయానికి వెళ్ళాలని ఆ ప్రేమికులకు జ్ఞాపకం చేసారు.

దర్శనార్థులను పిలిచి మాట్లాడడం (ఇంటర్వ్యూలు యివ్వడం) యిది మూడవ రోజు. ఈ రోజున బాబాను చూడడానికి గత రెండు దినాలలోను వచ్చినవారికంటె

చాలా ఎక్కువమంది వచ్చారు. మొత్తం న్యూయార్క్‌లో బాబా ఉన్న మూడు రోజుల్లోను 700 మంది వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. మామూలు ప్రకారంగా ఏవో కానుకలు బాబా కోసం పట్టుకువచ్చారు. కొందరు ఆయన కోసం బట్టలు కుట్టించి తెచ్చారు. పటికిబెల్లం, పళ్ళు, మిఠాయిలు సరేసరి. ఇద్దరు స్త్రీలు వారు తయారుచేసిన బాబా శిల్పాలుతెచ్చి బహూకరించారు. ఒకామె ఒక పెట్టెలో పెట్టి ఒక చిన్న *చిన్‌చిల్లాను తీసుకువచ్చింది. బాబా దానికి ఆశీర్వాదమునిచ్చి "దీనికి నా స్పర్శ తగిలింది గనుక మళ్ళీ జన్మలో మానవరూపం తీసుకుంటుంది" అన్నారు. ఒక బాలిక *రాబిన్‌ను తీసుకు వచ్చింది. దానికి పాపం సుస్తీగా ఉంది. ఒక బాలుడు బాబా బొమ్మను కుంచెతో చిత్రించి తెచ్చాడు. బాబా చేతితో పట్టుకొని దానిని పునీతం చేసి అతనిని దీవించారు. తరువాత బాబా వెళ్ళేటప్పుడు ఆ చిత్రాన్ని వారి గదిలోకి తీసుకొని వెళ్ళాడు.

11 గంటలకు బాబా ఏర్పాట్లు చేసి ప్రేమికులను పిలిచారు. న్యూయార్క్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ టెలివిజన్ వారు కెమేరాలు తీసుకువచ్చి బాబాను ఒక చిన్న ఫిలిం తీసుకుంటామని అడిగి అనుమతి పొందారు. అందరూ వచ్చి బాబా యెదుట గుండ్రంగా తివాసీ మీద కూర్చున్నారు. ఫిలిం తీయడానికి తగిన యేర్పాట్లు అన్నీ చేసారు. దర్శనార్థులను పిలువగానే వారంతా ఉండగానే వారు బాబా వద్దకు వెళ్ళారు. డాన్‌స్టీవెన్స్ అప్పుడు "అమర జీవనము" అనే బాబా సందేశాన్ని బాబా ఆదేశానుసారం చదివాడు. —

## అమర జీవనము:—

"సత్యమయిన ఉనికికి జీవితము ఒక నిజమయిన ప్రదర్శనము. దానిని మామూలు మరణం అంతం చేయలేదు. జనన మరణాల పరంపర నుండి ముక్తి బడయవలెనంటే జీవించియుండగానే మరణాన్ని యాపుమాపాలి."

తరువాత బాబా ఆయన యొక్క సంజ్ఞా భాషలో సంకేతాలు చూపుతూంటే ఎరచ్ ఈవిధంగా వ్యాఖ్యానించాడు – ఎరచ్ బాబా ప్రక్కన నేలమీద సుఖాసనం వేసుకుని కూర్చున్నాడు —

* (1) చిన్ చిల్లా అంటే దక్షిణ అమెరికాలో దొరికే ఎలుకవలె ఉండే ఒక చిన్న జంతువు. విశేషం ఏమిటంటే దాని బొచ్చు ఎంతో మృదువుగా ఉంటుంది.

* (2) ఎర్రటి రొమ్ము కలిగి పాట పాడే ఒక చిన్న పక్షి.

(ప్రతి మానవునికి ఆనందంగా సుఖంగా ఉండడం జన్మహక్కు. కాని చాలా మంది అభాగ్యులు దుఃఖిస్తూ విచారిస్తూంటారు. పరిణామ జన్మపరంపరలో వారు ప్రోగు చేసుకున్న సంస్కారాల భారము యొక్క ఫలితం అది. మనం రాయి, పురుగు, చేప, పక్షి యీ మొదలయిన రూపాలలో అనేక సంస్కారాలు సంపాదించి యున్నాము. ఎప్పుడయితే మనం మానవరూపం పొందామో, మానవ చైతన్యం మనకు వచ్చిందో, అప్పుడు మనకు సంపూర్ణ చైతన్యం కలిగిందన్నమాట. ఆ తరువాత ఆ మానవుడు తన మనసుని 'నేను' అనే దానికి మళ్ళించాలి స్వేచ్ఛను పొందేందుకు. కోరికలు లేకుండా భగవంతుని జీవితం జీవించాలి.

"దినదినము పనులు చేసుకుంటూనే భగవంతుని జీవితం అంటే నిజాయితీ గల ప్రేమద్వారా దివ్య పితృత్వము విశ్వమానవ సోదరత్వము అభ్యాసం చేయడం. శాశ్వతంగాను నిరంతరమూ మీ అందరితోను నేను ఒకడినని మీ అందరిలోను నేను ఉన్నానని తెలిసి నా దివ్యాధికారంతో చెప్పగలను.)

ఏ దేవతకి ప్రణమిల్లినా, పూజచేసినా, స్థావరం కానీ జంగమం కానీ, ఏ సాధువుకి ఏ గురువుకి, ఏ యోగికి, అభివృద్ధి చెందిన ఏ ఆత్మకి నమస్కారం చేసినా అది చివరకు నాకే చెందుతుంది.

"పరిశుద్ధము నిర్మలము అయిన ప్రేమ ఎవరికయినా దేనికయినా యిస్తే అది నాకే చెందుతుంది. నా దివ్యాధికారంతో నేను చెప్తున్నాను; మనం అందరం ఒక్కటే, దనికులు గాను బీదవారు గాను, ఉండడము, చదువుకున్నవారు గాను, చదువులేనివారు గాను ఉండడము, కులభేదాలున్న దేశాల్లో అగ్రకులంలో పుట్టినవారు గాను, కడజాతి వారు గాను ఉండడము యివన్నీ మన పరమ ప్రియతముడయిన భగవంతుని ప్రేమించడానికి అడ్డురావు.

ప్రతివాడు సుఖంగా ఉండగలడు. కాని కొందరు సుఖిస్తారు. కొందరు దుఃఖంతో ఉంటారు. కోరికలు లేకుండా చేసుకోవడం కోరికలు తీర్చుకోవడం కంటె అత్యుత్తమం కదా. ఎందుచేతంటే, — అసలు ఏదీ కోరకుండా ఉన్నవానికి అన్నీ లభిస్తాయి. కోరికలు ఉంటే వాటితోనే కూడా ఉంటుంది దుఃఖం, దైన్యం. వారి స్వంతం కోసం ఏదీ కోరకుండా ఎవరయితే ఉంటారో -వారికి సుఖం కలుగుతుంది ఎందుచేత ? వారు యితరులు ఆనందించాలని కోరుకుంటారు కనుక. భగవంతుడు అన్నిటిలోను అందరిలోను ఉన్నాడు. ఆయన మామూలు కర్మకాండలను చూడడు.

మసీదులలోను, చర్చిలలోను, మందిరాలలోను, జరిపే ప్రార్థనలను వినడు. కాని హృదయాన్నుంచి వచ్చే విలాపాన్ని ఆలకిస్తాడు. మీరు యితరులకు సహాయం చేసినవుడు భగవంతునికి వెంటనే తెలుస్తుంది. తెలుసుకుని సంతోషిస్తాడు. ఎంత ధ్యానం చేసినా ఎంత ప్రార్థన చేసినా ఏమీ లాభం లేదు. ఆయన వినిపించుకోడు. ఇతరులకు సహాయంచేసి వారిని సంతోషపరచడం తో ప్రార్థనలను పూజలను పోల్చలేము.

గణనకి వచ్చేది నాయెడల ఉన్నట్టి ప్రేమయే. నన్ను మీరు ఎలా ప్రేమిస్తారు? భగవంతుని ప్రేమించుటవలన; పరులను ప్రేమించుట వలన. ఇతరులను మీరు సుఖింపజేస్తే భగవంతుడు చూసి మీకు సుఖం కలుగజేస్తాడు. తెలిసిందా మీకు?

యుగయుగాలుగా నేను అదే సందేశాన్నిస్తున్నాను, అందరం ఒక్కటే అని. మనం అందరం ఒక్కటే. మీరంతా నన్ను ప్రేమించండి.

నేను అన్నింటిలోను ఉన్నాను. నాలో అన్నీ ఉన్నాయి. ఇండియాలో కుష్ఠు రోగులకు, పేదవారికి, వికలాంగులకు నేను ప్రణమిల్లుతాను. ఎందుకు వారికి ప్రణామం చేస్తాను? ఎందుచేతంటే నేను అందరిలో ఒకడుగా ఉన్నాను. భగవంతుడు అందరిలోను ఉన్నాడు.''

యుగ యుగాలుగా యిదే సందేశం నేను యిస్తున్నా, మానవులు దానిని పెడచెవిని పెడుతున్నారు. క్రీస్తు సిలువ వేయబడినాడు. లేకపోతే అతని మాటలను మానవకోటి పట్టించుకునేదే కాదు ''

''నేను ఆ పురాణపురుషుడను అని చెప్పి బాబా ముగించారు.

ఆ రాత్రే న్యూయార్క్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ వారు టెలివిజన్‌లో తీసిన ఫిలిమ్ అంతా ప్రదర్శించారు.

న్యూయార్క్ నగరం నుంచి అనేకమంది పత్రికా విలేఖరులు రాగా బాబా ప్రక్కగదిలోకి వారితో మాట్లాడడానికి వెళ్తున్నారు. వారు ఒక డజను మంది ప్రక్క గదిలో వేచియున్నారు.

విలేఖరులు సమావేశమయిన చోట కారపల్‌హో అను విలేఖరి ఐవీడ్యూస్‌ను సూఫిజం రీ - ఓరియంటెడ్ అనే సంస్థకు అధ్యక్షురాలిగాను బాబా రచించిన గాడ్‌స్పీక్స్ అనే ఉద్గ్రంథానికి యిరుపురి లోను ఒక సంపాదకురాలుగాను (రెండవ వాడు డాన్

స్టీవెన్స్) అందరికి పరిచయం చేసాడు. ఆమె బాబా యొక్క జీవితంలో కొన్ని విశేషాలను చెప్పింది. ఆ సమయంలో బాబా యీ గదిలోకి వచ్చారు. ఎరచ్ వారిని అందరకు తెలియ జేసాడు. బాబా యీ విధంగా వారితో ఎరచ్‌ద్వారా చెప్పారు ——

"నేను మీ అందరిని కలిసినందుకు సంతోషిస్తున్నాను. కొద్ది నిమిషాల ముందు నేను కొందరితో మాట్లాడుతుండగా ఒక పెద్దమనిషి "బాబా! మిమ్మల్ని ఏమంటారు? అని అడిగాడు" (విలేఖరితో) మీకు జ్ఞాపకంఉందా?"

విలేఖరి :— ఉంది బాబా నాకు తెలుసును.

ఎరచ్ యింకా చెప్తున్నాడు—

"బాబా అతనికి చెప్తున్నారు. ఇండియాలో భారతీయులు బాబాని 'అవతార్' అంటారు. అంటే మానవరూపం ధరించిన దేవుడు అన్నమాట. బాబా అంటున్నారు— "నేను అందరికీ చెప్తున్నాను. మీరందరూ అవతారులే. ఎందుచేత ? దేవుడు అందరిలోను ఉన్నాడు. నేనూ మీరు ఒక్కటే. అదే నేను అందరికీ చెప్తాను. ఇండియాలో దర్శనం యివ్వడానికి వివిధ స్థలాలకు వెళ్ళినపుడు నావద్దకు ప్రజలు వచ్చి ప్రణామం చేసినపుడు —అప్పుడు నేను వారికి ప్రణమిల్లుతాను; పిల్లలకు, వృద్ధులకు, కుష్ఠు రోగులకు —ఉన్న సత్యము భగవంతుడే అని వారికి తెలియజేయుటకు. ప్రతివాడు కూడా ఆనందంగా ఉండాలి, కాని ఎవరూ అలాలేరు.

ఎందుచేత ? అజ్ఞానం వల్ల. దేవుడు అందరిలోను వసించి ఉన్నాడని, దేవునికి అన్నీ తెలుసునని వారికి తెలియదు; అర్థం కాదు. వారు అన్నీ దేవుని ఇచ్ఛకు వదిలివేస్తే వారు సుఖంగా ఉంటారు. అప్పుడు వారికి సుఖంగా ఎలా ఉండాలో తెలుస్తుంది. స్వార్థం గురించి అసలు ఆలోచించకూడదు. ఇతరుల గురించే ఆలోచించాలి. పరులను సుఖపెట్టాలనే ప్రయత్నించాలి. అప్పుడు పోరాటమే ఉండదు. అందరూ సుఖంగా ఉంటారు. ప్రతిదీ సామరస్యంతో ఉంటుంది."

నిన్న బాబా యీ సందేశం యిచ్చారు అని ఎరచ్ యిలా చదివాడు—

"భగవంతుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, ఆయన అంతా ప్రేమమయుడు, ఆయన కరుణామూర్తి, ఆనందమయుడు. ఆయన అందరిలోను ఉన్నాడు. మన అందరిలోను యీ అనంత కల్యాణ గుణాలకి విరుద్ధమైన గుణాలు కూడా ఉన్నాయి— నిస్సహాయత, అజ్ఞానము, ఆశ, క్రూరత్వము, మొదలయినవి. ఎవరయితే

భగవంతుడు కావాలను కుంటారో వారిలో దయ, నిస్వార్థత, (స్వార్థత్యాగము) వికసిస్తాయి. అశాశ్వతమయిన ఛాయామాత్రమయిన ఈ ప్రాపంచిక కోరికల కోసం ఎవరు పరుగులు పెడతారో వారిలో స్వార్థము, ఆశ, ద్వేషము అభివృద్ధిచెందుతాయి. ముందు చెప్పినవి ప్రపంచమందు శాంతిని నెలకొల్పులాయి. ఈ తరువాత చెప్పినవి యుద్ధాలకు వినాశానికి కారణభూతాలు. తుచ్ఛమయిన కోరికలను, అనవసరమయిన వాంఛలను విడనాడండి.మీకు స్వర్గము కరతలామలక మవుతుంది.

ఒక విలేఖరి ప్రశ్నించాడు – "మీ మౌనము గురించి మీరు చెప్పిన అనేక సందేశాల పాఠాలు ఉన్నాయి. వీటిలో ఏవయినా యితరమయిన వాటికంటె, విశిష్టత కలిగిఉందా?

బాబా జవాబు యిచ్చారు – "ఒకటి ఉంది - నేను నా మౌనం భంగం చేసినపుడు ఎవరికోసం నిరీక్షిస్తున్నారో ఆ భగవంతుడను నేనేనని ప్రపంచమానవులందరూ తెలుసుకుంటారు."

విలేఖరి :—మీ మౌనము ఎందుకు ప్రారంభించారు?

బాబా :—నా మౌన విరమణ చేసిన తరువాత ప్రపంచం నన్ను తెలుసుకోవడం కోసం.

విలేఖరి :—ఏ పరిస్థితులలో మీరు మౌనం వహించారు? మీకు ఏదయినా దృశ్యం కనిపించిందా? లేక ఏదయినా సందేశం వచ్చిందా?

బాబా :— నా జ్ఞానము. నేను దీనిని గురించి ఆలోచించనవసరంలేదు. నాకు అది తెలుసును. నేను మొదట మౌనం మొదలుపెట్టినపుడు ప్రపంచం నన్ను తెలిసుకుంటుందని నాకు తెలుసును. అందుచేత ప్రారంభించాను.

ఎరచ్ :—మీరు బాబా చెప్పేది తెలుసుకుంటున్నారా ? అది చాలా ముఖ్యము.

విలేఖరి :—అవునండి. తెలుస్తోంది. చాలా మంది అనేకసంవత్సరాలుగా మాట్లాడకపోతే వారికి మాట్లాడే శక్తి పోతుంది. సమయం వచ్చినపుడు మీరు మాట్లాడగలరని మీకు విశ్వాసం ఉందా?

ఎరచ్ :—నూటికి నూరుపాళ్ళు.

ఆదీ :—తప్పకుండాను.

ఇంకొక విలేఖరి :— మీరు తప్పకుండా మాట్లాడగలరని ఎలా చెప్పగలరు?

బాబా :—నాకు తెలుసును గనుక.

విలేఖరులు తమలో తాము మాట్లాడుకొనుచుండగా కార్వల్ హూ బాబా ఏదయినా చెప్పాలను కున్నప్పుడు ఆ చెప్పదలిచిన మాటకు మొదటి అక్షరమును బాబా సంజ్ఞ ద్వారా తెలియపరచే వరకు ఎరచ్ అక్షరాలను ఏవిధంగా చెప్తున్నాడో దాని గురించి వ్యాఖ్యానించాడు. అవసరమయితే ఆ మాటలోని అన్ని అక్షరాలూ కూడా ఎరచ్ తెలుసుకునే వరకు బాబా చెప్పిస్తూ ఉంటారు. బాబా యింకా యిలా చెప్పారు —

"నా మౌనం ప్రారంభించిన తరువాత నేను వ్రాయడం మానివేసాను. చదవడం మానివేసాను. అప్పుడు అక్షరాలున్న పలక ఒకటి ఉపయోగించడం మొదలు పెట్టాను. ప్రజలు నా వద్దకు వచ్చినపుడు ఆ పలక మీద వారికి వివరించే వాడను. అనేక వేల మందికి యీ విధంగానే సందేశా లిచ్చేవాడను. ప్రజలు నా వద్దకు అనేక వేల మంది వచ్చేవారు. పలక మీద నేను చెప్పే సందేశం వినడం కోసం మౌనంగా కూర్చునేవారు. ఈమధ్యనే (7-10-54) అక్షర ఫలకం ఉపయోగించడం మానివేసాను. ఇప్పుడు నేను చెప్పాలనుకున్నది సంజ్ఞలవల్ల వ్యక్తం చేయడానికి ప్రయత్నిస్తున్నాను."

ఎరచ్ బాబా మాటలు యింకా యిలా చెప్తున్నాడు — "నేను చెప్పాలని అనుకున్నది ఎరచ్ గ్రహించలేకపోతే బాబా ఒకసంజ్ఞ చేస్తారు — అప్పుడు ఎరచ్ ఆగి ఎ, బి, సి, డి .... అని యీ విధంగా అక్షరాలు చెప్తాడు. నాకు కావలిసిన అక్షరం వచ్చేసరికి అతనిని ఆపుతాను."

బాబా:—మిమ్మల్నందరను చూసినందుకు నేను సంతోషిస్తున్నాను. ఆ విలేఖరి మళ్ళీ "నేను యింకొక ప్రశ్న అడగవచ్చునా? మీరు సాధించ దలచినది పొందాలని అనుకున్నవారికి మీరు వారిని మౌనం అవలంభించమంటారా?

బాబా :—అనను.

విలేఖరి:—మీరు అలా ఉండమనరు. క్రైస్తవమత బోధకుడయిన బిల్లీ గ్రాహం అనే అమెరికా దేశస్థుని గురించి మీరు విన్నారా? మీరు అతనితో కలిసి మాట్లాడేరా?

బాబా :—లేదు.

విలేఖరి ;—అతని పని గురించి మీరు విన్నారా ?

బాబా ;—నాకు తెలుసును.

విలేఖరి ;—అతని పని గురించి మీ అభిప్రాయమేమిటో చెప్తారా ?

బాబా :—దేవుడు పేరుతో, జీసస్ ప్రభువు పేరుతో చేసే పని ఏదయినా మంచిదే. కాని అది నిజాయితీ తోను శ్రద్ధతోను గర్వం లేకుండాను, ఫలాపేక్ష లేకుండాను చెయ్యాలి.

ఆసమయంలో బాబా యింక వెళ్దామనుకున్నారు. లోపల వారికోసం కొంత మంది కనిపెట్టుకుని ఉన్నారని సూచించారు.

విలేఖరి యింకొక్క ప్రశ్న అడిగాడు—"మీరు 31 సంవత్సరాలుగా పాటిస్తూన్న మౌనము యీ ప్రస్తుత అమెరికా పర్యటనలో విరమిస్తారా ?

బాబా :—లేదు. లేదు. నేను యిండియాలో ఉన్నపుడు ఒక సంవత్సరం పాటు ఏకాంతవాసం చేయాలని నిశ్చయించాను. ఆవార్త నా ప్రేమికుల కందరికీ తెలియపరిచాను. ఆ నా ఏకాంతవాసంలో మధ్యను ఒక నెల విశ్రాంతిలో యీ పర్యటన చేస్తున్నాను. నేను ఇండియాకు వెళ్ళినపుడు మళ్ళా ఏకాంత వాసం కొనసాగిస్తాను. సంవత్సరం పూర్తవడానికి యింకా అయిదు నెల లున్నాయి నా ఏకాంతవాసం అయినాక ఎప్పుడు వీలని నాకు తోస్తుందో అప్పుడు నా మౌనం విరమిస్తాను.

విలేఖరి :—కాని యీ దేశంలో కాదా ?

బాబా :—కాదు.

విలేఖరి అప్పుడు మహాత్మా గాంధి గురించి ఒక ప్రశ్న అడిగాడు.

బాబా :—నాకు రాజకీయాలతో సంబంధం లేదు. గాంధీజీ మంచివాడు. అతడు నన్ను చాలా ఎక్కువగా ప్రేమించాడు. ఆదీ ఇరానీ మీకు ఆ వివరాలు చెప్తాడు - చాలా మంది యీ సంగతి నన్ను అడిగారు. నా జవాబు అతనికి తెలుసును. గాంధీ నన్ను మిక్కిలిగా ప్రేమించాడు. నన్ను అతడు మూడు మారులు కలుసుకున్నాడు. అదంతా ఇరానీ మీకు చెప్తాడు.

ఆ సమయంలో బాబా విలేఖరులతో గోష్ఠి ఆపుదామని అనుకున్నారు. విలేఖరు లంతా యింకా ఉండమని పట్టుబట్టారు. పునర్జన్మ సిద్ధాంతములో ఏమయినా సత్యము న్నదా? అని అడిగారు. బాబా వారి భగవద్వచనము అనే గ్రంథంలో యీ ప్రశ్నకు జవాబు ఉందన్నారు.

విలేఖరి :—ప్రపంచములో బాబాకు ఎంతమంది అనుయాయు లున్నారు?

ఎరచ్ :—వారిని మేము లెక్కపెట్ట లేము. దక్షిణ ఇండియాలో ఆంధ్రప్రదేశ్ అనే రాష్ట్రంలో ప్రతి యింటివారికి బాబాను తెలుసును. వారు బాబాను ప్రేమిస్తారు. అక్కడ పిల్లలు కూడా బాబా స్తోత్రం చేస్తూ పాటలు పాడతారు. ఎంతమందీ అంటే యింతమంది అని లెక్క చెప్పడం సాధ్యంకాదు.

బాబా: —ఎంతమందున్నారో ఎవరయినా ఎలా చెప్పగలరు? నాతలమీద ఎన్ని వెంట్రుకలున్నాయో నీవు చెప్పగలవా? అలా అని బాబా గదిలోకి వెళ్ళిపోయారు.

విలేఖరులు యింకా మండలితోను, ఐవీడ్యూక్, ఎలిజబెత్ పాటర్సన్‌ల తోను కొంచెం సేపు మాట్లాడి తరువాత వెళ్ళిపోయారు.

12-30 గంటలయింది. భోజనాలయాయి. మధ్యాహ్నం 2-30 గంటలకే బాబా క్రిందకి వస్తారని దర్శనార్థులు హాలు నిండా వచ్చి కూర్చున్నారు. ఎలివేటర్ వచ్చి తలుపులు తెరిచినపుడల్లా బాబా వచ్చారేమో అనే చూసేవారు. అందులో కొంతమంది ఉదయాన్నే వచ్చి బాబా దర్శనం చేసుకున్నా తనివి తీరక యింకొక మారు ఆయన కనబడతారేమో అని మళ్ళీ వచ్చారు. కొద్దిసేపయాక బాబా వచ్చారు. ఆయనను చూడాలని అందరూ దగ్గరకు వెళ్ళాలని ప్రయత్నించారు. అంతమందిలో నుంచి దారి చేసుకొని చిరునవ్వుతో బాబా తమ సంభాషణల గదిలోకి వెళ్ళారు. మధ్యాహ్నం అంతా ఒకరొకర్నే పిలిచి బాబా వారితో మాట్లాడారు. బాబా వద్దనే ఉండి వచ్చిన వారిని బాబాకు పరిచయం చేసినవారు అనేక రకాల దృశ్యాలు చూసారు. ప్రేమ, భక్తి అనేక రకాలుగా ప్రదర్శితమయాయి. బాబాను దర్శించిన తరువాత చాలా మంది బాబాను విడిచి వెళ్ళలేక అక్కడే బయట తచ్చాడుతూ ఉన్నారు. కొంతమందికి నేత్రాల నుండి ఆనంద బాష్పాలు ధారగా కారాయి. మరికొందరు ఏదో ఆలోచనలో నిమగ్నమయి యున్నట్లున్నారు. వారి అనుభవాలు తమకు తెలిసిన యితరులతో పంచుకుంటున్నారు కొంతమంది. బాబా గురించిన పుస్తకాలు కొనుక్కొని చదువుతూ కూర్చున్నారు మరికొందరు.

సాయంకాలం 4 గంటలకు బాబా మేడపైన వారి గదికి వెళ్ళడానికి బయట హాలులోకి వచ్చారు. ఎలివేటర్ రావడం ఆలస్యమయింది. ఇదే అవకాశం అని కొందరు పిల్లలు బాబా చుట్టూ మూగారు. ఆయన చేతులు పట్టుకున్నారు. బాబా వాళ్ళతో ఆడారు. వారి చిన్నారి ముఖాలు చేతితో నిమిరారు. ఎలివేటర్ రాగానే బాబా వారి వద్ద

సెలవు తీసికొని అందరివైపుకి చేయిఊపుతూ పైకి వెళ్ళిపోయారు. బాబాతో నలుగురు మండలి కూడా వెళ్ళారు.

సాయంత్రం న్యూయార్క్ నగరంలో దృశ్యాలు చూడడానికి వెళ్ళేవారంతా సమావేశమయారు. ఎండగా ఉంది. అందువేత వాతావరణం వేడిగా ఉంది. ఈ బృందం తూర్పు 46 వ వీధిలో ఐక్యరాజ్యసమితి భవనం వద్ద ఆగారు. బాబాతో ఉన్నవారు ఆయన వ్రేళ్ళు వేగంగా కదలడం చూసారు. తరువాత కొందరు యిలా వ్రేళ్ళు ఎందుకు కదులుతాయని ఆదీ ఇరానీని అడిగారు. అప్పుడు ఆదీ అవి సంజ్ఞలు కావని బాబా ఆంతరికంగా చేసేపని వల్ల శరీరం మీద కనబడే ప్రతిబింబాలని చెప్పాడు. ఒక్కొక్కప్పుడు బాబా వ్రేళ్ళతో గాలిలో కొడితే అది ప్రపంచంలోని వారి ఆధ్యాత్మిక ప్రతినిధులతో గాని, లేక ఆధ్యాత్మిక భూమికలలోని ఆంతరంగిక ప్రతినిధులతో గాని మాట్లాడుతున్నారన్న మాట.

ఐక్యరాజ్యసమితి భవనంవద్దనుంచి థర్డ్ ఎవిన్యూలో నుంచి ఫిఫ్త్ ఎవిన్యూకి వెళ్ళారు. అన్నీ చూపించి వాటి గురించి చెప్పే గైడ్ అనేవాడు ''మిలియనేర్స్‌రో'' అనే కోటీశ్వరుల గృహాలవైపు చూపించాడు. హెర్ట్రూబిన్‌స్టిన్ అనే హాత్యగావించ బడిన కోటీశ్వరుని యిల్లు యిదే అని అతడు చెప్పినపుడు బాబా బాధతో తల త్రిప్పుతున్నారు. బాబా డ్రైవర్‌ని సెంట్రల్‌పార్క్ గుండా వెస్ట్‌సైడ్ హైవే కి అక్కడనుంచి పెద్ద పెద్ద ఓడలను చూడడానికి తీసికొని వెళ్ళమని చెప్పారు. అతడు మామూలుగా ఆ రోడ్డు మీదకు బస్సులను పోనివ్వరని చెప్పాడు. కాని బాబా చెప్పి నట్లుగా చేసాడు. ఆ ప్రాంతాలకి పోయినపుడు మరల బాబా వారి ఆధ్యాత్మిక కార్యం చేసుకుంటున్నారు. బాబా తల మీదకు ఎండ రావడం చూసి ఒక యువతి తన ప్రక్కన ఉన్న అతనితో రహస్యంగా చెప్పింది. చెవిలో చెప్పిన యీ మాటలు ముందున్న బాబాకి వినిపించడానికి అవకాశం లేదు. అయినా, అప్పుడు బాబా ఆమెతో ఫరవాలేమలే అని ఆమెకు సంజ్ఞ చేసారు. అయినప్పటికి బాబా తల మీద ఎండ పడకుండా ఆదీ బాబా యొక్క రుమాలును తీసి పట్టుకున్నాడు. బాబా ఏలోకంలో ఏంపని చేస్తున్నారో గాని ఏవృశ్యాలనూ చూడలేదు. ఇరుప్రక్కలా కనిపించే భవనాల వైపు చూడలేదు. ఆయన ''బిడ్డల'' తో ఉన్నారనే తృప్తి మాత్రం మిగిలింది. అప్పుడప్పుడు వారికి పంచిపెట్టబడే తీపి బిళ లు తినమని బాబా తమ నిరుపమానమైన చిరునవ్వుతో అందరివైపు చూసేవారు. ఇంతలోకే బస్సు టైమ్సు స్క్వేర్ కివచ్చింది. బాబా తమ ఆంతరికమైన పనిని మరింత ఉధృతంగా చేయడం ప్రారంభించారు.

ఒక పోలీసు ఎడమకు యీ బస్సును తిరగనివ్వడంతో నాలుగు నిమిషాలలో డెల్‌మానికో దగ్గరకు (బాబా దిగిన హోటలు) వచ్చి చేరారు.

ఆ సాయంకాలం 7 గంటలకు బాబా ఆతిథ్య సంఘాన్ని సమావేశపరిచారు వారి గదిలో. మేరియన్ ఫ్లోర్‌షీమ్ ఆర్థిక పట్టిక చదివింది. కొంచెం సొమ్ము మిగిలితే బాబాని అది ఏమి చేయమంటారని అడిగింది. ఆయన ఏకాంతవాసంలో సొమ్ము తాను స్వీకరించడం గాని ఒకరికి యివ్వడం గాని చేయనన్నారు.

మేరియన్ :—"బాబా! మీరు శరీర త్యాగం చేస్తే స్త్రీ – మండలి మాటేమిటి? వారి యోగక్షేమాలు ఎవరు చూస్తారు.?" అని అడిగింది.

బాబా :—"నేను వచ్చే అయిదు నెలల ఏకాంతవాసంలో ఎప్పుడో శరీరం వదలి వేస్తాను. అయినా నా శరీర త్యాగం గురించి మీరు విచారించకూడదు. నన్ను ఎలా ప్రేమించడం అని మీరు విచారించాలి. నేను అంతిమ ప్రకటనలో ఎలా చెప్పేనో అన్నీ అలాగే జరుగుతాయి. డా॥ దేశ్‌ముఖ్ ఒకమారు నాకు రాబోయే అవమానం గురించి తలుచుకుంటూ ఏడుపు మొదలు పెట్టాడు. అప్పుడు నేను నా అవమానం గురించి ఎందుకు తలుస్తావు? నా వైభవం గురించి ఎందుకు తలుచుకోవు? అని అడిగాను. బాబా యింకా యిలా అన్నారు –

"మీరు సుఖంగా ఉండాలి. ఇప్పుడే మీరు నాతో బస్సులో షికారు తిరిగి వచ్చారు. నేను విశ్వాలన్నిటికీ కేంద్రాన్ని (అని చెప్తూ బాబా తమ ఎడమ అరచేతిలో కుడిచేతి చూపుడు వ్రేలితో ఒక వృత్తం గీసి అందులో మధ్యను చుక్క పెట్టారు). నేను మీతో బస్సులో వెళ్ళేటప్పుడు అన్ని లోకాలలోను నేను పని చేస్తూనే ఉన్నాను. నేను ఎలా బాధపడుతున్నానో మీకు తెలియదు. విశ్వంలోని ప్రతీదీ నా వద్దకే వస్తుంది. అయినా గాని నేను ఆనందంగా ఉంటాను. క్రీస్తు సిలువ మీద మానవుడు పడలేని బాధను అనుభవించాడు. కాని అతని ఆనందానికి అంతరాయం కలుగలేదు.

1957 ఫెబ్రవరి 15 వ తేదీన ఏకాంతవాసం ముగియగానే ఒక పెద్ద బహిరంగ కార్యక్రమం బొంబాయిలో ఏర్పాటవుతుందని అప్పుడే ఒక పెద్ద సమావేశం జరుగుతుందని బాబా సూచించారు. దానికి హాజరవడానికి కొంతమంది పాశ్చాత్య స్త్రీ పురుషులను ఆహ్వానిస్తానని బాబా చెప్పారు. అందులో ఆ గదిలో ఉన్నవారందరూ ఉంటారన్నారు. పిలుస్తే వస్తారా అని బాబా అక్కడ కూర్చున్న వారందరినీ అడిగారు. తప్పకుండా వస్తామని అందరూ జవాబు చెప్పారు. "మీరు శాయశక్తులా ప్రయత్నం చేసినా రాలేకపోయినటు అయితే ఏమీ బాధపడకండి." అని బాబా ముందుగానే

హెచ్చరించారు''. మీరు వచ్చే ప్రయాణం గురించి విచారం పెట్టుకోకండి. నా 'సహవాస' లభిస్తుంది గనుక సంతోషంగా ఉండండి. నేను శరీరం వదలిపెట్టడం గురించి అసలు ఆలోచించవద్దు. నేను శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళిన తరువాత మిగిలిన డబ్బు ఏమి చెయ్యాలమో చెప్తాను.'' అని బాబా అందరినీ ఆలింగనం చేసుకుని పంపించేసారు.

మరునాడు ఉదయం బాబాతో అమెరికా పర్యటన చేసే 44గురుని నెవార్క్ విమానాశ్రయానికి వెళ్ళడానికి హోటల్ డెల్‌మానికోకి పెందరాళే రావాలని చెప్పారు. దీని తరువాత సహవాస సౌత్ కెరోలినా లోని మిర్టిల్ బీచ్ మెహెర్ సెంటర్‌లో జరుగుతుందన్నారు.

## జూలై 24, మంగళవారం:—

ప్రొద్దున్నే చీకటితో 5–30 గంటలకు లేచేసరికి వానజల్లు పడుతోంది. పాశ్చాత్యులందరూ బాబాతో బయలుదేరవలసిన వారు హోటల్ డెల్‌మానికోకి వారి వారి సామానులతో చేరేసరికి ఉదయం 6-45 గంటలయింది. వీరందరిని బాబాను మండలిని నెవార్క్ విమానాశ్రయానికి తీసికొని వెళ్ళడానికి రెండు బస్సులు తయారుగా ఉన్నాయి. ఫ్రెడ్ వింటర్ ఫెల్ట్ ఎవరెవరు వెళ్ళేవారో అందరూ వచ్చారా లేదా అని పరిశీలించి చూసాడు. 44 గురు పాశ్చాత్య స్త్రీ పురుషులు, నలుగురు బాబా మండలివారు ఉన్నారు. నాట్స్ దంపతులు వీరందరి ప్రయాణపు ఏర్పాట్లన్నీ చేసారు. వీరు కూడా బాబాను అందరినీ విమానాశ్రయం వరకు తీసుకుని వెళ్ళి వారికి వీడ్కోలు యివ్వడానికి వచ్చి ఉన్నారు. వీరుభయులు ప్రయాణీకులందరికీ హవాయీ కుసుమాలు వారి దుస్తులకు గుచ్చిపెట్టారు.

బాబా నూలు పైజమా తొడుగుకుని ఎర్రని వున్ని కోటు వేసుకున్నారు. కాళ్ళకు తోలు చెప్పులు తొడిగారు- అందరిని మరి యొకమారు లెక్కపెట్టగా ఒకమ్మాయి అక్కడ హాజరుగాలేనట్లు తెలుసుకున్నారు. ఆమె హోటలుకి ఫోను చేయగా "ఆమెను మీరు గాభరా పెట్టకండి,'' అని జవాబు వచ్చింది. బాబాకు యీ సంగతి చెప్పగా ఆమె కోసం వేచిఉండి అమె వచ్చిన తరువాత రెండవ బస్సులో మిగిలినవారు ఆమెకోసం 7–20 గంటలవరకు వేచి ఉండి తరువాత బయలుదేరి రమ్మని చెప్పు న్నారు. మొదటి బస్సు బాబాతో వెళ్ళింది.

ఆమె కోసం 7-15 వరకు మిగిలిన వారు వేచి యున్నారు. ఆమె వస్తున్నట్లు కబురు కూడా లేక పోయినందున మిగతావారంతా రెండవ బస్సులో విమానాశ్రయానికి వెళ్ళారు.

అక్కడ బాబా ఒక బెంచీ మీద కూర్చున్నారు. వారి చుట్టూ ప్రేమికులు నిలబడ్డారు బాబా వారిని అడిగారు వెనుక ఉండిపోయిన అమ్మాయి వచ్చిందా అని. ఆమె రాలేదు అని తెలియగానే అనేకమందిని పిలిచి ఆమె ఎందుకు రాలేదో కనుక్కొని చెప్పమని చెప్పారు. బాబా ఆమె సంగతి తెలిసిన వారినే ఎన్నుకుని యీ విషయం కనుక్కోమన్నారు. తేలిన సంగతేమిటంటే ఆమెకు యింకొకామెకు నిన్నటి రోజున బాబా వద్దకు దర్శనార్థులను ఒకరి తరువాత ఒకరిని పంపడంలో ఏదో అభిప్రాయ భేదమేర్పడింది. ఆ రెండో ఆమె ఆ సంగతి మనసులో పెట్టుకో లేదు గాని యీమె మాత్రం వీరందరితోను ప్రయాణం చేయకూడదనుకుంది. ఈ సంగతి తెలుసుకోగానే బాబా "అయితే యీ సంగతి నాతో నిన్ననే ఎందుకు చెప్పలేదు ?" అని అడిగి ఆమెతో అభిప్రాయభేదం వచ్చిన ఆ రెండో ఆమెను పిలిచి బాబా "ఆమెకు వెంటనే ఒక టెలిగ్రాం యిచ్చి, దీని తరువాత బయలుదేరే విమానంలో తప్పకుండా మిర్టిల్ బీచ్‌కి, నేను రమ్మన్నానని నా సందేశంగా చెప్పు." అని చెప్పారు.

అనేక మంది క్రొత్తవారు వచ్చి విమానాశ్రయంలో బాబాకు పరిచయం చేయ వలసిందిగా వారి మిత్రులను కోరారు. అందులో స్థానికంగా ఉన్న ఒక రాజకీయ వేత్త కూడా ఉన్నాడు. నాట్స్ దంపతులు బాబా మెడలో అందమయిన లవెండరు పూలమాల అలంకరించారు. ఆ దండతోనే బాబా విమానంలో మొట్టమొదట ఎక్కారు. ఆ విమానం నిండా ఒక్క స్త్రీ ప్రయాణీకురాలు తప్ప మిగిలినవారంతా బాబా ప్రేమికులే ఉన్నారు.

విమానం సరిగ్గా 8 గంటలకు బయలుదేరింది. ఆకాశం మేఘావృతమైంది. ఆ అమెరికా దేశపు బాబా ప్రేమికులు ఎంత అదృష్టవంతులు ! అవతారపురుషునితో ఆకాశ ప్రయాణం చేస్తున్నారు. విమానం ఆకాశంలోకి ఎగురగానే బాబా ఎరచ్‌తో లేచి అందులో తమతో వచ్చే ప్రేమికులందరినీ పలకరించి వారిని ఎరునవ్వుతో ఒక్కొక్కరినీ వీపుపై తట్టి తమ ప్రేమను వారికి అందించారు. బాబా వారితో చాలా సరదాగా గడిపారు. తెల్లపిప్పర్‌మెంట్లు వారివైపు చూసి

విలాసంగా విసురుతూ వినోదంగా గడిపారు. విమానంలో ఉన్న ఒక క్రొత్తమనిషి, బాబా ఎవరో అని తెలుసుకోవాలని బాబా ప్రేమికులను అడుగగా డాన్‌స్టీవెన్స్ ఆమెకు బాబా గురించిన చిన్న పుస్తకం ఒకటి యిచ్చాడు. విమానంలో పనిచేసే స్టివార్డెస్ కూడా బాబా గురించి తెలుసుకోవాలని ఆతురత కనపరిచింది. ఏ కారణం చేతనో గాని బాబా బృందము వారికి ఏర్పాటు చేయబడిన మొదటి తరగతి విమానం కాదు యిది పొరపాటున బాబా పరివారంతో యిందులో ఎక్కారు. అందుకే వారికి యిచ్చిన అల్పాహారాలు మామూలివిగా ఉన్నాయి.

రిచ్‌మండ్ దాటిన తరువాత వాతావరణం నిర్మలంగా ఉంది. విల్‌మింగ్‌టన్ (నార్త్‌కెరోలినా) విమానాశ్రయంలో దిగినపుడు సూర్యరశ్మి బాగా ఎక్కువుగా ఉండెను. అక్కడ బాబా పరివారంతో దిగేసరికి బృందములోని మిగతావారంతా విమానాశ్రయంలో వీరికి స్వాగతం యిచ్చారు. న్యూయార్క్ నుంచి వారు తరువాత బయలుదేరిన విమానం మొదటి తరగతి విమానం అగుటవలన విల్‌మింగ్‌టన్‌కి ముందు చేరు కుంది. అక్కడ దిగిన వెంటనే బాబా కొంతమందితో కూడా ఒక పెద్ద కారులో మిర్టిల్‌బీచ్‌కి బయలుదేరి వెళ్ళారు. ఆ కారు హారీ హార్ట్‌షార్న్ నడిపాడు. ఇతడు ప్రసిద్ధ బాబా భక్తురాలయిన ఎలిజబెత్ పాటర్‌సన్‌కి మేనల్లుడు. అతడు విస్కాన్సిన్ నుంచి బాబాతో సహవాస్ కోసమని మిర్టిల్‌బీచ్‌కి వచ్చాడు.

దక్షిణ కెరోలినా రాష్ట్రీయ డాకటు పరివారంలో ఒకరిని బాబా యెవరు అని అడిగాడు. బాబా ఒక గొప్ప ఆధ్యాత్మిక నాయకుడని తెలుసుకోగానే మిగతావారిని కొందరిని మిర్టిల్ బీచ్‌కి తనకారులో తీసికొని వెళ్తాను రమ్మన్నాడు. అతడలా అనగానే డా॥ బెన్ హేమన్, అంధుడయిన డా॥ హారీకెన్మోర్ అతని కారులో ఎక్కి వెళ్ళారు. డెలావిన్ దంపతులు ఎలిజబెత్ పాటర్‌సన్ మొదలగువారిని వారి కారులో తీసుకొని మిర్టిల్ బీచ్‌కి వెళ్ళారు. మిగిలిన వారందరు ఒక ఏర్‌కండిషన్ చేయబడిన బస్‌లో బయలుదేరి ఒక గంటసేపటిలో మిర్టిల్‌బీచ్‌కి చేరుకున్నారు. సముద్రతీరాన్నే సమతల ప్రదేశంలో రోడ్డు సౌత్ కెరోలినా రాష్ట్రంలోనుంచి వెళ్ళింది.

విమానాశ్రయం వద్ద ఒక యువకుడు బాబాను చూడాలని కోరగా అతడు ఒక వ్యవసాయదారుడని పరిచయము చేయబడెను. అప్పుడు బాబా "నేను కూడా వ్యవసా యదారుడనే. యీ విశ్వాన్ని దున్నుతాను." అన్నారు. ఈ దివ్య వ్యవసాయదారుడు ప్రపంచంలోని మానవుల కఠిన హృదయ క్షేత్రాలను దున్ని దివ్యప్రేమ బీజాలను వాటిలో చల్లి సాగుచేస్తాడు.

బాబా కారు మిర్టిల్‌బీచ్ మెహెర్ సెంటర్‌లో బ్రియర్‌క్లిఫ్ ద్వారంలో నుంచి ప్రవేశించింది. గేటువద్దరకొచ్చి బాబా ప్రేమికులు స్వాగతం యిచ్చారు. వారిలో 20 సంవత్సరాలు ఇండియాలో బాబా ఆశ్రమంలో ఉండివచ్చి మిర్టిల్‌బీచ్‌లో నాలుగు ఏళ్ళనుంచీ ఉంటూఉన్న కిట్టీడేవి ఒకతె. సెంటర్‌ను జాగ్రత్తగా చూస్తూ ఉన్న ఫ్రాంక్ ఈటన్ అనునతడు, ఇంకా డిలాంగ్ దంపతులు, ట్రోబెల్ దంపతులు యితరులు ఉన్నారు. కొంవరు ఫ్లారిడా రాష్ట్రాన్నుంచి వచ్చినవారు కూడా ఉన్నారు.

మనోహరమయిన చిరునవ్వుతో బాబా కారులోనుంచి కుడిచేయి యెత్తి వారి హార్దిక స్వాగతానికి జవాబిచ్చారు. కిట్టీని కారులో కూర్చోపెట్టుకుని బాబా "లాంగ్ లేక్" అనే పెద్ద సరస్సుకి ఎదురుగా ఉన్న వారి గృహానికి వెళ్ళారు. ఇంతలోనే బస్సు, మిగిలిన కార్లు కూడా మెహెర్ సెంటర్‌కి చేరుకున్నాయి.

బాబా ముందు దిగి ముందటి వసారాలోనుంచి సరస్సువైపు దూరాన కుడివైపున సూర్యరశ్మిచేత మెరుస్తూ పొడుగాటి చెట్లలోనుంచి కనబడుతున్న సముద్రం వైపు చూసారు. ఎడమవైపుకి చూడగానే బాబా కోసం ఒక క్రొత్త వసారా అందులో అమర్చిన ఒక ఊయెల కనిపించాయి. తరువాత లోపలికి బాబా చెప్పిన ప్రకారం 1952 వ సంవత్సరంలో నిర్మింపబడిన యింట్లోకి వెళ్ళి వారి గదిలోకి అడుగుపెట్టారు. అందరూ వారి వెనకాలే వెళ్ళారు. వారి భావాలు ఏమిటోగాని బాబా మాత్రం స్వంత యింట్లోకి వచ్చినట్లుగా భావన వారి ముఖంలో ద్యోతక మవుతూంది. బాబా మంచి చురుకుగా బలంగా అందరికీ కనిపించారు. ఆయన వదన మండలం తేజోమయంగా ఉంది. కిట్టీ బాబా కోసం తయారుచేసి ఉంచిన భోజనం సిద్ధం చేయడానికి గెస్టుహౌస్‌కి వెళ్ళింది. ఆమె వెళ్ళిన తరువాత కొంతసేపట్లో దంతపురంగు వేసిన ప్లెయిమౌత్ కారు ఎక్కి వెళ్ళి బాబా గెస్టుహౌస్ ముందట దిగారు. బాబా యిల్లు, యీ గెస్టు హౌస్ ఒక ఎత్తయిన ప్రదేశం మీద ఉన్నాయి. దాని అంచుకి బాబా ఎరచ్‌ని తీసుకొని వెళ్ళి అక్కడ నుంచి మంచినీటి సరస్సు అయిన లాంగ్‌లేక్‌ని, అట్లాంటిక్ మహాసముద్రాన్ని చూపెంచారు. ఇదివరలో 1952 లో బాబా మొట్టమొదట యిక్కడకు వచ్చినపుడు ఎరచ్ ఆయనతో రాలేదు. బాబా చాలా సామాన్యమైన భోజనం ముగించి నొరీనా మాచెబెల్లీని చూడడానికి వెళ్ళారు. ఆమె చిరకాలం నుంచి బాబా ప్రేమికురాలని చదువరులకు తెలుసును. ఆమెకు యిప్పుడు సుస్తీగా ఉంది. దగ్గరలోనే ఆమె కేబిన్‌లో విశ్రాంతి తీసుకుంటోంది.

ఆమెను పరామర్శ చేసిన తరువాత బాబా క్రవంతెన మీదనుంచి యింకా అక్కడ ఉన్న గదులు భోజనాలు చేసే డాబా అవన్నీ చూసారు.

ఇక్కడ న్యూయార్క్ బృందంవారు భోజనాలు చేస్తున్నారు. వచ్చినవారిలో సగం మందికే సెంటరులో ఉండడానికి వీలయింది. ఎక్కువ మందికి బస చేయడానికి తావులేదు. అందుచేత మిగిలినవారు ఊరిలోని హోటళ్ళలో చోటు చూసుకున్నారు. వారితో విమానంలో రాని యితరులను బాబా చూసి అందరను మధ్యాహ్నం 3 గంటలకు రమ్మని చెప్పారు. వచ్చిన వారికోసం ఎలిజబెత్, కిట్టీ అన్ని సదుపాయాలు వీలయినంత వరకు చేసారు. ప్రతి గదిలోను మంచం పరుపు అమర్చబడి ఉన్నాయి. ఇవన్నీ నోరీనా ఆరోగ్యంగా వున్నప్పుడు ఆమె సహాయంతో చేసిన ఏర్పాట్లే. ఇలా 22 మందికి సెంటరులో బసచేయడానికి వీలు చేసారు. కాని తరువాత 30 మంది కూడా ఉండేలా ఏర్పాటు జరిగింది. ఇప్పుడు యింకో అయిదుగురికి కూడా అక్కడే వసతి కల్పించారు. చివరికి బాబాతో వచ్చిన 44 గురు, మండలి 4 గురు వీరంతా మిర్టిల్‌బీచ్ మెహెర్ సెంటర్ లోనే సర్దుకున్నారు.

ఇన్నాళ్ళుగా ఎలిజబెత్ వడ్రంగిని దగ్గర పెట్టుకుని అనేక పనులు చేయించింది. ఇదివరకు ఉన్నవి గాక కొత్తగా స్నానపుగదులు పడక గదులు ఎక్కడెక్కడ అవసరమో ఎక్కడ వీలవుతుందో అక్కడక్కడ ఏర్పాటు చేయించింది. బాబా రాకముందె మిర్టిల్ బీచ్ మెహెర్ సెంటర్‌కి యీ విధంగా ఉత్తరంలో వ్రాయించారు– సహవాస్ కొసం వచ్చేవారు అందరూ సెంటరులో ఉండడానికి వీలులేక కొందరు బయట హోటళ్ళలో బస చేస్తారు గనుక, వారందరిని ప్రతిరోజున భోజనానికి పిలవాలని. తీరా బాబా వచ్చాక ఒక్కొక్క రోజున 150 మంది అతిథులు భోజనానికి వచ్చేవారు. భోజనాలు వడ్డించడం హూస్టన్ సతి యాజమాన్యాన జరిగేది. ఎలిజబెత్ యొక్క వంటలక్క బెస్సీ, ఆమె యిద్దరు కుమార్తెలు సహాయం చేసేవారు. పీటర్ ఫబోడూ అనేవాడు ఏవయినా పనులు చేసి పెట్టడానికి సిద్ధంగా ఉండేవాడు.

మూడు గంటలకి ముందే బాబా వారి గృహం నుండి బయలుదేరి క్రవంతెన మీద నుంచి అడ్డదారిన తమ ప్రేమికులున్నచోటకి గబగబ నడచి వచ్చారు. మండలిలో ఒకడు వారితో నడవలేక పరుగెత్తుతూ వెంబడే ఆయనకు ఎండ తగులకుండా గొడుగు పట్టుతూ వచ్చాడు.

బాబా అలా వస్తూంటే 70 మంది ప్రేమికులు అన్నిచోట్ల నుంచి వచ్చి ఆయనను అనుసరించారు. 'బార్న్' అనే భవనానికి బాబా దారితీసారు. ఈ 'బార్న్' అనేది కర్రతో నిర్మించిన ఒక పాతఎయిన పెద్దగది. అది మొదట 20 మైళ్ళ దూరంలో ఉండేది. అది విప్పించి అక్కడ నుంచి తీసికొని వచ్చి యిక్కడ పునర్నిర్మించారు. దానిని యింకా అభివృద్ధి చేసారు ఇది ఎలిజబెత్ చేత సమావేశ స్థలంలా రూపొందించబడింది. క్రిందటిమాటు బాబా వచ్చినప్పుడు (1952 సం॥ మే నెల 17 వ తేదీన) యీపెద్ద గదిలోనే అనేక వందల మందికి బాబా దర్శన మిచ్చారు. అప్పుడు దర్శనం చేసుకున్నవారికి యిప్పుడు బాబా ఆ గదిలోకి అడుగుపెడుతూంటే వెనుకటి దర్శన కార్యక్రమం అంతా జ్ఞాపకం వచ్చింది.

ఇదివరకు చూడని ప్రేమికులయిన మేరియన్ ఫ్లోరెన్షియ్ మొదలయిన వారికి బాబా ఆ 'బార్న్' చూపించారు. బాబా యివరలో 1952 వ సం॥ లో ఆయన ఉపయోగించిన ఎత్తుగా ఉన్న కుర్చీలోనే కూర్చున్నారు. బాబా అప్పటికి యిప్పటికి కొంచెం వయసుమీదకి వచ్చినట్లు, జుట్టు కొంచెం అప్పటికంటె తెల్లబడినట్లు కనిపించినా వారి తేజస్సుమాత్రం అలాగే అద్భుతంగా ఉంది ఆయన నుంచి వెలువడే ప్రేమ ప్రవాహం అలాగే అవిచ్ఛిన్నంగా వస్తోంది. ముఖ్యంగా సన్నిహిత ప్రేమికులు ఆయన చుట్టూ కూర్చున్నప్పుడు ఆ ప్రేమ కిరణాలు నిరవధికంగా వారిమీద ప్రసరిస్తూంటాయి. ప్రకాశవంతంగా మెరిసే ఆయన నేత్రాలు, అప్పుడే వికసించిన తామరపువ్వులా ఉన్న బాబా యొక్క ముఖ మండలము, యువకునివలె చురుకుగా కదిలే ఆయన చేతులు అన్నీ యిదివరకు లాగే ఉన్నాయి.

జూలై 28 వ తేదీ వచ్చే శనివారం సాయంకాలం 7 గంటలకు అందరిని ఆ కర్ర గదిలోనికి వచ్చి బాబాతోపాటు వారిని కూడా కొంతసేపు మౌనము వహించి ఉండమని బాబా ఆదేశించారు. పైవారిని కూడా రమ్మనాలా అని అడిగితే బాబా దర్శనం కోసం ఆయన సహవాసం కోసం మిర్టిల్‌బీచ్‌కి ప్రయాణమై వచ్చిన వారందరినీ రమ్మనమని చెప్పమన్నారు. ఇంకా సమీప నివాసుల్ని కొందరిని కూడా పిలవమని బాబా చెప్పారు.

కాలిఫోర్నియా నుంచి వచ్చిన డింపిల్స్ ఎక్కడ బసచేసి ఉన్నారని బాబా అడిగారు. వారు ఒక హోటలులో దిగారని తెలిసి వారిని కూడా రమ్మనమని బాబా కబురు చేసారు. తరువాత మిర్టిల్‌బీచ్‌లో యితర చోట్ల అరణ్యంతో కూడిన స్థలాల్లో

లాగే పాములు తిరుగాడుతూ ఉండవచ్చును గనుక అందరూ తగిన జాగ్రత్తతో ఉండాలని పాదాలను పూర్తిగా మూసి ఉంచే పాదరక్షలు ధరించాలని అందరిని హెచ్చరించారు. ఒకవేళ ఎవరికంటనయినా పాము పడితే వారు వెంటనే "బాబా!" అని ఉచ్ఛరించాలని చెప్పారు. అలా అనగానే అది వారి జోలికి రాకుండాపోతుందని చెప్తూ బాబా యింకా యిలా అన్నారు—"మీరు కాలికి, బొటనవ్రేలు పైకి కనిపించేటటువంటి పాదరక్షలు వేసుకొని "బాబా!" అన్నా ప్రయోజనం లేదు. మీరు నేను చెప్పినట్లు సరియయిన జాగ్రత్త తీసుకోకుండా ఉంటే ఏపామయినా ఎవరినయినా కరిస్తే వాళ్ళని చెరువులో పారెయ్యడం తప్ప యింక లాభంలేదు. నేను చెప్పినట్లు మీ జాగ్రత్త మీరు పడిన తరువాత "బాబా" అంటే ఎలాంటి పామయినా మిమ్మల్నేమీ చేయకుండా పారిపోతుంది." అని స్పష్టీకరించారు బాబా. అప్పుడు కిట్టీని ఇండియాలో ఆమె ఉన్నప్పుడు ఏమి జరిగినదీ బాబా చెప్పమన్నారు.

ఒకమారు కిట్టీని ఏడిపిద్దామని బాబా మండలి ఒక అబద్ధపు (రబ్బరు) పామును ఆమె నడిచే దారిలో పడేసారు ఆమె అది పామే అనుకొని వంటయింటిలో పనిచేసే ఒక కత్తిని చేతితో పుచ్చుకొని ధైర్యంగా ఆ పాముని చంపుదామని సిద్ధపడింది. అందరూ నవ్వడం ప్రారంభించారు. దానితో అది నిజమయిన పాము కాదని కిట్టీ తెలుసుకుంది. అయినా యీ సంఘటన వలన నిజమయిన పాములకి కూడా భయపడ నంత ధైర్యశాలి అయింది కిట్టీ. బాబా ఒకప్పుడు యిలాంటి సందర్భాలలో చెప్పారు—"ఒక మనిషిచేతిలో పాము చచ్చిపోతేనే దానికి ఆ పాము జన్మపోయి యింకో జంతువుగా పరిణామం చెందుతుంది." ఇండియాలో అనేక త్రాచుపాములు వృద్ధాప్యం వచ్చిన తరువాత మనుష్యులచే చంపబడాలని వారి నివాసాల వద్దకు వస్తూంటాయని పెద్దలు అంటారు.

బాబా అప్పుడు బయటకువెళ్ళి ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. ఎరచ్ ప్రక్కన బాబా మీదకు ఎండ పడకుండా గొడుగుపట్టాడు; మిగిలిన మండలివారు దగ్గరే నిలబడి యున్నారు. బాబా అప్పుడు ఒకరొకరినే ప్రేమికులను తమ వద్దకు పిలిచి వారి స్వంత సమస్యల గురించి హితవుచెప్పారు. బాబా అలా విశ్రాంతిగా ఆ వృక్షమూలమున కూరుచుండియుండగా చార్మియూన్ (ఐవీ డ్యూస్ కుమార్తె) మొదలయిన వారు కెమేరాలతో బాబాను ఫొటోలు తీసారు.

తరువాత బాబా లేచి వారి యింటికి ఎలజబెత్ నడిపిన కారులో వెళ్ళారు. ఆ రోజుకి బాబా మరల బయటకు రాలేదు. ప్రేమికులందరూ ఎవరికార్లలో వారు, కొంతమంది బస్సులోను ఊళ్ళోవారి బసలకు వెళ్ళిపోయారు. ఆ రాత్రి అందరూ రసవంతమయిన శాఖాహార భోజనం చేసి వారి వారి గదులకు వెళ్ళారు. కొందరు అందమైన ఆ ఉద్యానవనంలో కొంతసేపు విహరించి మరీ వెళ్ళారు.

బాబా మండలి బాబా తాలూకు బట్టలను తీసికొని వచ్చి ఫిల్లిస్‌కి యింకొకరికీ ఉతికి ఆరవెయ్యమని యివ్వగా అలాంటి సేవకోసం ఎదురుచూసేవారు మహా భాగ్యమని ఆ బట్టల్ని తీసుకొని అవి సబ్బుతో పరిశుభ్రపరచి ఆరవేసారు కొన్నిచోట్ల బాబా ప్రేమికులకు యీ సేవచేసే అవకాశం లభిస్తుంది. న్యూయార్క్‌లో ఉన్నపుడు జీన్ షా యీపని దొరికింపని ఎంతో సంతోషించింది. బాబా ఆమెను "ఈ పని నీకెందు కిస్తున్నానో తెలుసా?" అని అడుగగా ఆమె "మీరు నన్ను ప్రేమిస్తున్నారు గనుక" అంది. అపునన్నట్లుగా తలఊపారు బాబా. ఫిల్లిస్ యిప్పుడు బాబా యొక్క గులాబీరంగు సిల్కుచొక్కా, తెల్లటి సద్రా ఆరవేస్తూంటే అందులోనుంచి ఆమె వైపు నిర్మలమైన ప్రేమ, వెలుతురు ఆమెవైపు ప్రసరిస్తున్నట్లుగా అనుభూతి చెందింది. ఆపనిచేస్తూంటే నేను వాటిని శుభ్రపరుస్తున్నానా? అవే నన్ను శుభ్రపరుస్తున్నాయా? అనే భావన కలిగిందామెకు. ఉదయానికి బాబా ధరించడానికి వీలుగా అవి ఆరేవరకు ఆలస్యమయినా వేచియుండి ఇస్త్రీ చేసి తయారుగా పెట్టేసారు వారు.

## జూలై 25, బుధవారం :—

మామూలుగా బాబా కారు ఉదయం 7 గంటలకే గెస్టుహౌస్ బయటకు వచ్చి నిలబడింది. అక్కడ బాబా, కాల్చిన రొట్టెని టీని తీసుకుంటారు. అల్పాహారాలు తీసుకున్నాక 7-30 గంటలకు బాబా మిగిలిన ప్రేమికులు ఉన్న భోజనశాలలోకి వెళ్ళారు. బాబా అందరినీ కుశలప్రశ్నలతో పలకరించారు. కొందరిని కౌగిలించుకున్నారు దానితో పోటీలుపడుతూ మిగిలినవారు కూడా వారి ఆలింగనంకోసం ఆరాటపడ్డారు. ఏరోజు అయినా యిలా ప్రారంభించడం కంటె భాగ్యమేముంది ఎవరికయినా ?

బయట బాబా చొక్కా (నిన్నరాత్రి ఆరవేసి మడతపెట్టినది) ఒక చేతిమీద వేసుకొని నిలబడియున్నాడు ఎరచ్. బయటకు వచ్చి బాబా కొందరితో "మాట్లాడ"

డానికి వారిని పిలిచారు. ఈ దివ్య పురుషుని సహవాసం కోసమే కదా వారంతా అంతంత దూరాల నుంచి కష్టపడి ప్రయాణం చేసి వచ్చారు! నిలబడి అయినాసరే బాబాకు దగ్గరగా ఉందామనే ఉంటుంది వారికి. అందులో వారికి కష్టం ఉన్నట్లే భావించారు.

సెంటరు బయట దిగినవారు 8 గంటలకు వచ్చారు. వారితో ఒకరొకరితోనూ బాబా సంభాషణలు కోసం కేటాయించిన ఒక చిన్న గదిలోనికి వెళ్ళారు బాబా. సరిగా 9 గంటలకు సంభాషణలు ప్రారంభించాలని బాబా తొందరచేసారు. ఉదయం అంతా కొత్తవారు – భక్తులు రావడం, వారిని బాబా పిలిచి మాట్లాడడం తోనే సరిపోయింది. బాబా సంజ్ఞలు భాషలో తెలియ జెప్పడానికి ఎరచ్ ఉన్నా ప్రతివారు బాబాతో ఎవరికి వారు ఒంటరిగా ఉన్నట్టే భావించేవారు. ఎరచ్ ఒక్కడే కాకుండా యింకా ఎంతమంది ఉన్నా ఆ భావనే కలుగుతుంది. బాబా దివ్యసన్నిధానంలో మిగతావారు ఎవరు ఉన్నా వారులేనట్లే ఉంటుంది. వారికి కనిపించడం కూడా బాబా ఒకరే కనిపిస్తారు. ఆయన ఒక్కరే తమతో ఉన్నట్లుగా భావిస్తారు. అది బాబా యొక్క ప్రేమ మహిమకాబోలు.

ఈ రోజున అనేకమంది క్రొత్త వారు అనేక స్థలాల నుంచి - లేక్‌వేల్స్, సెంట్ పీటర్స్‌బర్గ్, ఫ్లోరిడా, జార్జియా, నార్త్‌కెరోలినా, యింకా అనేక దక్షిణ ప్రాంతాల నుంచి – బాబా దర్శనార్థమై వచ్చారు. బాబా ఆ చిన్నగదిలో నీలిరంగు సోఫాలో జేర్లబడి కూర్చున్నారు. ఇదివరలో 1952 లో కూడా అనేకమంది బాబా దర్శనం ఆ గదిలోనే చేసుకున్నారు. అవతారపురుషుని దర్శనం చేసుకున్న స్థలం – ఆ చిన్నగది – చరిత్రాత్మకమయినదయింది.

సుమారు 12 గంటలకు బాబా బయటకు వచ్చారు. అడీల్ వాల్‌కిన్, ఫిల్లిస్ ఫ్రెడెరిక్ బాబాతో వెళ్ళారు. మెహెరాకి, మణికి యిక్కడి విశేషాలు వ్రాయడానికి బాబా అనుమతి కోరగా ఆయన వెంటనే సరే అన్నారు. ఆయన తొడుగుకుని ఉన్న చొక్కాలాంటిది కొత్తది యింకొకటి కుట్టిస్తామని వారు అనగానే బాబా చిరునవ్వు నవ్వారు. అది వారు అంగీకారంగా భావించారు. బాబా వారి యింటికి వెళ్ళారు. అందరూ భోజనాలు చేసి వంతెన దిగువన చేరి మాట్లాడుకుంటున్నారు.

2–30 గంటలకు బాబా గెస్టహౌస్ నుంచి త్వరగా నడుస్తూ వచ్చారు. పైజమా, సద్రా మాత్రమే ధరించారు బాబా. ఉక్కగా ఉన్నందువలన ఆయన కోటు వేసుకోలేదు. మరల బాబా దర్శనార్థులను పిలిచి సంభాషణలు ప్రారంభించారు.

బాబా వారిని పిలిచి స్వంతంగా వారితో వేరేవేరేగా మాట్లాడారు 3-30 గంటలయాక అందరిని వారి యింటికి రమ్మని బాబా ఆహ్వానించారు. మొత్తం బృందం అందరూ 80 మంది ఉన్నారు. బాబా వెనుక అందరూ వెళ్తున్నారు. బాబా వారి యింటికి వారందరిని తీసుకొని వెళ్ళి అక్కడ ఉన్న ఒక పెద్ద ఓక్ వృక్షము క్రింద కూర్చున్నారు. సూర్యుడు కాంతివంతంగా ప్రకాశిస్తున్నాడు. సూర్యరశ్మి ఆ తటాకం మీద, దూరాన సముద్రం మీద పడి నీరు తళతళ మెరుస్తోంది అవి చూస్తూంటే వారికి పూర్వకాలంలో క్రీస్తునాటి గెలిలీ తటాకం జ్ఞాపకం వస్తోంది. ఆ చెట్టుక్రింద చుట్టూ అర్ధవలయాకారంగా అందరూ కూర్చున్నారు.

ఇప్పుడు బాబా గులాబీకోటును తొడిగారు. గవ్వలతో గుచ్చిన దండ ఒకటి బెట్టీ ఫిబోడూ తయారుచేసి యివ్వగా 'ఎలినోర్‌కిట్టీ' బాబాకు యిచ్చారు. అది బాబా మెడలో వేసుకున్నారు. ఎలిజబెత్, నోరీనా, కిట్టీలకు ముగ్గురకు కలిపి యీ పేరు బాబాయే పెట్టారు. గవ్వలన్నీ ఏడు రంగు రిబ్బనులతో దండగా కట్టారు. ఆ దండలో రిబ్బనుల మీద "ఓ ప్రభూ! ఇదంతా నీ పనేకదా – నీ మహిమ ఎన్నతరమా?" అని వ్రాసారు. తెల్లటి యీ సముద్రపు గుల్లల (గవ్వలు) మీద స్వాభావికమైన గుర్తులు సిలువ వలెను, అయిదు రేకలున్న పుష్పాల వలెను, అయిదు కోణాల నక్షత్రాల వలెను ఉన్నాయి. వాటి మీద అయిదు కన్నాలు కూడా ఉన్నాయి. ఇవన్నీ క్రీస్తుని జ్ఞాపకం చేస్తున్నాయి.

ఆ దండవేపు చూపించి బాబా అవి మానవుని ఏడు ఆధ్యాత్మిక స్థాయిలులా ఉన్నాయని, అందులో ఒకటి పగిలిపోగా "ఈ స్థాయిలలో జంతువులస్థితి పోయింది" అన్నారు. సరదాగా డా॥ బెన్‌సామన్ గోల్ఫ్ టోపి తీసి బాబా ధరించి అందరికీ వినోదం కలిగించారు. ఆ టోపీ వేసుకొని బాబా యిలా అన్నారు__

"మీరంతా తెలుసుకోవలసిందేమిటంటే నేననేక స్థలాలలో ఉన్నాను – ఇండియాలో నేను మస్తులకోసం ప్రయాణాలు చేసినపుడు ఒక్కొక్కప్పుడు పెద్ద పెద్ద సౌధాలలోను, ఒక్కొక్కప్పుడు ధర్మశాలలలోను, ప్రత్యేకమయిన విశ్రాంతి గృహాలలోను, కొన్ని సమయాలలో చెట్లక్రింద, రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫామ్‌ల మీద ఉండేవాడిని. అస్పృశ్యులు నావెంట వచ్చేవారు. కాని యిక్కడ నాకోసం ఎలిజబెత్ ఎంతో సదుపాయం గల అందమయిన యిల్లు కట్టించింది. ఇక్కడ ఉన్న ప్రతీదీ ఆమె కృషిచేసి నాకు సమర్పించింది. మొత్తం యీ 500 ఎకరాల భూమి నాకు కానుకగా యిచ్చింది. నా యెడల ఆమెకు ఉన్న ప్రేమ వలన యిదంతా ఆమెకు

సాఫల్యమయింది. రేపు ఎలిజబెత్ జన్మదినం. ఆమె జన్మదినోత్సవం చేయడానికి నేను సరిగా సమయానికి వచ్చాను. రేపు ఆమెను నేను ఏడుమార్లు కౌగిలించుకోవాలి. మీరెవ్వరూ నాకు కానుకలు యివ్వరాదు.

ఇప్పుడు యిల్లు తెరిచి ఉంది. లోపలికివెళ్ళి అన్నీ చూసి రండి. కాని అక్కడి నుంచి ఏమీ పట్టుకొని పారిపోకండేం! (అది విని అందరూ నవ్వారు). నేల చాలా నున్నగా ఉంది. జారిపడకండి సుమా! అది ఒక ప్రత్యేకరకమయిన తివాసీ.

"ప్రపంచంలో అన్ని స్థలాలకంటె యీ యింట్లో నాకు ఎక్కువ సౌఖ్యంగా ఉంటుంది. ఇక్కడి వాతావరణం వేడిగాను ఉక్కగాను ఉన్నా నాకు యిక్కడ ఉండడం చాలా యిష్టం. బాబా ముందు వసారాలో నిలబడి యుండగా వారి ప్రక్కనుంచి ఒకరొకరే లోపలికి చూడడానికి వెళ్ళారు. ఒకడు కాలి జోడు తీసి బయట వదలి లోపలకు వెళ్లాలనుకుంటూండగా బాబా వారించి అలాగే లోపలికి పంపించారు. వారు లోపలకు వెళ్తూండగా యిద్దరికి మాత్రం తలొక సందేశం యిచ్చారు. అది వారి స్వంత విషయానికి సంబంధించినది. అంత ప్రేమ చూపించేవాడు బాబా.

ప్రేమికులంతా బాబా పడక గదిలో ఉండగా లోపలికి వెళ్ళి బాబా మంచం మీద కూర్చున్నారు. దగ్గర వున్న బల్లమీద బాబా ప్రయాణానికి ఆతిధ్య సంఘం వారు కొన్న సామాను ఉంది. వారి యెడల ఉన్న ప్రేమచేత యీ మహామహుడు సముద్రాలు దాటి యింత దూరం రావడం తలుచుకుంటే వారికి ప్రేమచేత ఒడలు పులకరిస్తోంది.

అందరూ బయటకు వెళ్ళిన తరువాత బాబా వారితో 'మీరు యిష్టము వచ్చిన టుల ఆనందించండి. ఈతాలాడండి. విశ్రాంతి తీసుకోండి, తినండి, తిరగండి, దెబ్బలాడుకోండి, జీవించండి, కాని ఏపని చేస్తున్నా నన్ను ప్రేమించడం మాత్రం మరచిపోకండి.'' అన్నారు.

ఈతాలాడండి అంటే బాబా ప్రేమ సముద్రంలో ఈత కొట్టండి అని; విశ్రాంతి తీసుకోండి అంటే శాంతంగా హాయిగా ఏ విధమయిన విచారాలు లేకుండా ఉండండి అని, తినండి అంటే నేను యిచ్చిన ఆధ్యాత్మికాహారం తీసుకోండి అని; తిరగండి అంటే ఆధ్యాత్మిక వీధుల్లో విహరించండి అని; దెబ్బలాడుకోండి అంటే మీలో ఉన్న కామక్రోధాదులతో సంఘర్షణ పడండి అని; జీవించండి అంటే పవిత్రము, పరిశుద్ధము నిస్స్వార్థము అయిన జీవితమును గడపండి అని; నన్ను ప్రేమించండి అంటే నా

సంతోషం కోసం మీరు ఏ పనయినా చేయాలి. మీరు చేసే పనులు నాకు ఆనందాన్ని కలిగించేవిగా ఉండాలి, ఏపని చేస్తున్నా నన్ను స్మరిస్తూ చేయాలి అని అర్థం – ఇలా బాబా విశదీకరించడం ఎన్నాక ప్రేమికులంతా అందులోని అంతరార్థం తలుచుకుంటూ వెనక్కి మళ్ళారు. వారిలో ఒకడు తన భార్యను వెదకుతూ "ఆమె యెక్కడ ఉంది?" అని అడిగాడు. ఆ దంపతులు ఇద్దరు కలిసి వారి బసకి వెళ్దామనుకున్నారు. అతడు ముందుకు సాగాడు.ఆమె వెనకాల వెళ్తుంటే ఒంతెన వరకు వెళ్ళేసరికి ఆమెకు అడుగుపడలేదు. వెనకాల ఎవరో ఆమెను పిలుస్తున్నట్టు అనిపించి ఆగిపోయింది. ఈ విధంగానే బాబా యెడల ఆధ్యాత్మికాకర్షణ కొందరికి కలుగుతుంది. తరువాత ఆమె వెళ్ళిపోకుండా ఉన్నందుకు చాలా సంతోషించింది.

కొందరిని బాబా సెంటరులో ఆ సాయంకాలం ఉండి పొమ్మన్నారు. స్టెల్లా ఫెరెన్జ్, ఆమె కుమార్తె ఇజ్రాయిల్ నుంచి వచ్చిన కారీబెన్ షెమ్మాయి, బంటీ కెల్లీ అనే నృత్యకళాకారిణి, పీటర్ సాల్, వీరంతా సెంటర్‌లో ఉండిపోయారు. వర్జీనియా, హరోల్డ్‌రడ్ వీరిరువురు చెరువులోని ఒక పడవలో ఉండడానికి బాబా అనుమతి పొందారు. ఆ రాత్రి పిడుగులతో ఒక తుఫానువచ్చింది. ఫిల్లిస్ వర్జీనియాకు తన వర్షపుకోటు యిచ్చింది గనుక అది చలివేయకుండా కప్పుకుంది.

## జూలై 26 వ తేదీ, గురువారం :—

ప్రాతఃకాలం చాలా నిర్మలంగా ఉంది. గతరాత్రి పెద్దవర్షం కురిసినందున వాతావరణం యిప్పుడు చల్లగా బాగా ఉంది. బాబా బయలుదేరి గెస్ట్‌హౌస్ వద్దకు వెళ్ళేసరికి అయిదుగురు ప్రేమికురాండ్రు బాబా దుస్తులు తలొకటి పట్టుకొని గేటువద్ద నిలబడి ఉన్నారు. బాబా వారిని లోపలకు రమ్మని వారి చేతులలోవి అందుకుని ఒక్కొక్కరిని ఆలింగనం చేసుకున్నారు. బాబా అలసియున్నట్లు కనిపిస్తున్నారు.

ఐవీ డ్యూక్ బాబాతో "బాబా! రాత్రంతా పని చేస్తూ ఉన్నారా" అని అడిగింది. చేతులు తలమీద పెట్టుకుంటూ నిట్టూర్పువిడుస్తూ బాబా "అవును. రాత్రంతా పనిచేస్తూనే ఉన్నాను. మీకు తెలియదు. ఈ విశ్వభారం అంతా నా తలమీద ఉంది. ఈ ఉదయం నాకు చాల కష్టంగా ఉంది." అంతకంటె బాబా ఏమీ వివరించలేదు.

సెంటరు వదిలి ప్రేమికులు బయటకువెళ్ళి పత్రికలు చూసేసరికి సూయజ్ కాలువ గురించిన గందరగోళం జరిగినట్లు తెలిసింది. ఆరోజే ఆండ్రీ డోరియా అనే ఓడ మునిగిపోయింది.

భోజనాల గదికి వెళ్ళేదారిలో బాబా అక్కడి పడవ యింటివద్ద ఆగి అందులోని వర్జీనియాతోను హెరాల్డ్ రెక్ తోను రాత్రి బాగా నిద్రపోయారా అని కుశల ప్రశ్న వేసారు. పిడుగు పడ్డప్పుడు భయం వేసిందా, అని వారిని బాబా కుశలం అడిగారు. ఏమీ భయం వేయలేదని అక్కడే ఉంటామని వారు చెప్పారు.

బాబా అక్కడనుంచి కదిలేసరికి దానాఫీల్డ్ బాబా వద్దకు వచ్చి 15 నిమిషాలు ఆయనతో ఉన్నాడు. బాబా ఆయన విశ్వ కార్యం చేస్తూనే ఉన్నారు. వారి రెండు చేతుల వ్రేళ్ళు కూడా కదులుతున్నాయి. అక్కడి బెంచి మీద బాబా కూర్చోడానికి ఎరచ్ రుమాలు పరిచాడు. బాబా దానిమీద కూర్చున్నారు. వాతావరణంలో ఏదో ఒక నవీనత చల్లదనం నిండి ఉంది. ప్రాతఃకాల వాయువులు తోటలోని పుష్పాల సుగంధాన్ని తీసుకువస్తున్నాయి. అయిదు నిమిషాలయిన తరువాత బాబా ముఖం మీద ఏర్పడిన స్వేదబిందువులను తుడుచుకున్నారు. అప్పుడు చల్లగా ఉన్నా ఆయన చేసే పని ఒత్తిడివల్ల చెమట పట్టింది. మనోహరమయిన ఆ కాసార దృశ్యాన్ని తిలకిస్తున్నారు బాబా. ప్రకృతియొక్క అందము బాబా యొక్క సన్నిధానం వలన మరింత ఇనుమడించింది. బాబా కొంత తడవు నిశ్చలంగా కూర్చున్నారు. ఏ లోకాల నుంచో సందేశాలను అందుకుంటున్నారేమో అనిపిస్తోంది. ఎక్కడ ఏమి అన్యాయం జరిగితే బాబా అది సరిదిద్దుతున్నారో, లేక భవిష్యత్తుకు మానవ కళ్యాణం కోసం ఏమి పథకాలు వేస్తున్నారో అని అనుకున్నారు బాబా ప్రేమికులు.

మరి కొందరు ప్రేమికులు వచ్చి బాబాకు నమస్కారం చేయగా వారిని మాట్లాడ కుండా సద్దుచేయకుండా కదలకుండా ఉండమని చెప్పారు వారితో. బాబా వారి మండలితో సరస్సుకు ఎదురుగా కూర్చున్నారు. ఒకడు బాబాకి ఛత్రం పట్టాడు.

బాబా సామీప్యంలో ఆయన మౌనంగా ఉంటూ ఉండగా ఆయన నిశ్చలంగా ఉన్నప్పుడు యీ వాతావరణం లోకి బయట ప్రపంచంలో నుంచి వచ్చినవారు రాగానే పవిత్రమయిన యీ పరమపురుషుని సన్నిధిలోకి రాగానే వారుకూడా మౌనము నిశ్శబ్దము సహజంగా అలవాటు చేసుకుంటారు. వారు మెట్టిన భూమి కూడా బాబా చరణ కమల స్పర్శ చేత పునీతమయినదని తెలుసుకుంటారు. ఫిల్లిస్ కొంచెం ఎడంగా నిలబడి వ్రాసుకుంటుంటే బాబా ఆమె వేపు చిరునవ్వుతో చూసారు. ఆమె 'భగవంతుడు మా మధ్యను తిరుగాడు తున్నాడు.' అని వ్రాస్తోంది. బాబా కొంచెంసేపు ఏకాంతంగా ఉండదలచి వారి ఆంతరికమైన పని కొనసాగించడం కోసం బాబా

ఒక్కరే ఒక చోట కూర్చున్నారు. ఆయన ఏం చేస్తున్నారో ఎవరికీ తెలియదు ఆయన అసలు కదలకుండా నిశ్చలంగా కూర్చొని ఉన్నారు

అల్పాహారాలు అయాక ఏడు గంటల ముప్పావుకు అందరూ ఒకచోట తోటలో సమావేశం అయారు. అక్కడనుండి ఆ సరస్సు చక్కగా కనిపిస్తోంది. బాబాకు కొంచెం దూరంగా వారంతా నిలబడ్డారు. అందరి కళ్ళూ ఆ మౌనమూర్తి మీదే ఉన్నాయి.

కొద్దిసేపట్లోనే బాబా లేచి పశ్చిమంగా తిరిగారు. ఆయన వ్రేళ్ళు వేగంగా కదులుతున్నాయి. ఆయన ముఖము అవనతమయింది. ఆయన యెంతో బాధపడు తున్నారు. ప్రపంచపు బాధ అంతయు ఆయన వహిస్తున్నట్లుంది. బయట నగరంలో నుంచి వచ్చిన ప్రేమికులు యింతలో వీరందరితో కలిసారు. అంతటా నిశ్శబ్దం ఆవ హించింది. కీచురాళ్ళ చప్పుడు, కాసారం లోని చిరుకెరటాల సవ్వడే గాని యింకేమీ వినబడటం లేదు.

బాబా లేచి కొంతదూరం వెళ్ళి తూర్పు దిశగా తిరిగారు. మరల పని ప్రారంభిం చారు. అలా యింకా రెండు సార్లు కదలి మరల మరల పనిచేస్తూ వచ్చారు. నాలుగు రోడ్లు కలిసిన కూడలి వద్ద నిలబడ్డారు. ఆయన వదనం యిప్పుడు తేటగా ఉంది. బాధయొక్క గుర్తులన్నీ మాయమయాయి. ఆయన లోపల సమరస భావం తొంగి చూస్తోంది. ఆయన మొఖం ఆనందంగాను తేజోవంతంగాను మారిపోయింది.

తరువాత బాబా అందరినీ కూడా రమ్మని బార్న్ వద్దకు నడిచారు. కొన్ని వందల అడుగులు నడిచిన తరువాత బాబా అందర్నీ ఆగమన్నారు. ఒకనిమిషం బాబా వారి కళ్ళల్లోకి అందరినీ చూసి దృష్టిని కేంద్రీకరించమని చెప్పమని ఎరచ్‌తో చెప్పారు. ఎరచ్ అందరికీ యీసంగతి చెప్పగా అందరూ బాబా యెదుట చుట్టూ నిలబడి ఆ ప్రకారం చేసారు. ఒక్క నిమిషం అని బాబా చెప్పారు గాని వారందరికీ ఆ నిమిషం సేపు ఒక యుగంలా అనిపించింది. బాబా తూర్పు దిక్కుగా తిరిగి అడవివైపు చూస్తున్నారు. సూర్యుని రశ్మి ఆయన కళ్ళమీద పడుతోంది. బాబా నల్లగా ఉన్న బాబా కళ్ళలోకి ఏకాగ్రతగా వారంతా చూస్తూంచే ఆధ్యాత్మిక తేజస్సు ఉట్టిపడుతున్న ఆ కళ్ళు ఒక విధమయిన నీలివర్ణంగా ఉన్నట్లు వారికి కనిపించాయి.

కొంతమంది ఆ కళ్ళల్లోకి తేరిపార జూస్తుంచే కదలకుండా ఆ కళ్ళు వెయ్యి కళ్ళులాగ చూసేవారికి తోచింది. అయినా తెల్లటి దుస్తులు ధరించి యున్న బాబా నిశ్చలంగా నిలబడి యున్నారు. ఆయన చుట్టూ గాలి శక్తివంతంగా సుళ్ళుతిరిగినట్లు

కనిపించింది. చుట్టూ ఉన్న వస్తువులు నామరూపాలు లేకుండా అదృశ్యమయ్యాయి. ఒక విశాలమైన వెలుగుకిరణం వ్యాప్తిచెంది ఆయన మీద ప్రకాశిస్తోంది. కొంత మందికి ఎక్కడ జూసినా సంఖ్యలు లెక్కలు వేసిఉన్నట్లు కనిపించింది. ఒక్క క్షణం అలా ఉంటే యీప్రపంచ స్పృహ కొంతమంది కోల్పోయేవారు. ఆ క్షణంలో బాబా వారి ధ్యానాన్ని భంగపరిచారు. ఈ విధంగా అనేకమందికి అనేక రకాల అనుభూతులు కలిగాయి ఆ ఒక్క నిమిషంలోను.

బాబా అటువైపుకి తిరిగారు. అటునుంచి ఆ సమయంలో ఫ్లోరిడా రాష్ట్రపు నెంబరు ఉన్న కారు ఒకటి సమీపిస్తోంది. సెంట్ పీటర్స్ బర్గ్ అనే నగరము నుంచి మహిళ్‌, మరియొకరు బాబా దర్శనార్థం వచ్చారు బాబా ఆమెను ఒక వైపుకి రమ్మని ఆమెతో 'మాట్లాడారు' కొంచెం సేపు. తరువాత ఆమెను ఆలింగనం చేసుకున్నారు. తరువాత శీఘ్రంగానే ఆమె తిరిగి ప్రయాణమై వెళ్ళిపోయింది.

బాబా మరల తమ సంభాషణల కేబిన్‌లోనికి వెళ్ళారు. మరల దర్శనార్థులను 9 గంటల నుంచి పిలిచి ఒకరొకరితోను సంభాషిస్తున్నారు. డా॥ ఫ్రెమాన్ బిర్డి అనే పార్శీ డాక్టరు కూడా ఫ్లోరిడా నుండే వచ్చాడు. ఇదివరకు లాగే వచ్చినవారితో మాట్లాడుతూ బాబా ఉదయం అంతా గడిపారు.

మొదట్లో బాబా న్యూయార్క్‌కి వచ్చినప్పుడే బాబా ఎలిజబెత్‌ని పిలిచి మిర్టిల్ బీచ్‌లో ఆయన సమయమంతా సంభాషణలతో అయిపోకుండా చూడమని చెప్పారు. కొంత సమయం ఆయన ఏకాంతంలో ఉండాలని అనుకున్నారు. తరువాత వివిధ ప్రేమిక బృందాలతోను గడపడానికి కూడా కొంత సమయం కావాలన్నారు. అందు చేత శని ఆదివారాలకి ఏర్పరచిన ఇంటర్‌వ్యూలు బుధ గురు వారాలకి మార్చారు. అలా అయినా కొంతమంది వారి ఇంటర్‌వ్యూలు జరుగలేదని వాపోయారు. వారిని మధ్యాహ్నం బార్న్‌లోకి రమ్మని బాబా చెప్పారు. ఆ విధంగా వారు బాబాతో ఎక్కువ కాలమే గడపగలిగారు.

తూర్పు దేశాలలోలాగ బాబా దర్శనార్థం వచ్చే వేల సంఖ్యలో ఉన్న ప్రేమికులతో పోల్చి చూస్తే యిక్కడ అంతమంది రాకపోయినా బాబా చెప్పిన మాటలబట్టి చూస్తే తీవ్రమయిన ప్రేమ కలిగిన వారు కొద్ది మందయినా మంచిదే అనిపిస్తుంది. బాబా ఏమన్నారంటే - "ఈ రోజున నేను మీతో యిక్కడ ఉన్నందుకు ఒక్కడయినా

నన్ను ఏ విధంగా ప్రేమించాలనుకుంటానో అలాగ ప్రేమించినట్లయితే నేను వచ్చిన పని పూర్తి అయినట్లే అన్నారు.

సెంటరులో దాదాను కలిసినవారు వ్రాసిన ఉత్తరాలను బట్టి వారు ఆయనను ఎంతగా ప్రేమిస్తున్నారో విశదం అవుతుంది. మచ్చుకి కొన్ని చూడండి. అందులో కొందరు ప్రేమికులు యిలా వ్రాసారు —

"పరమాత్మ స్వరూపుడయిన అవతారునితో ఉండడము, ఆయనను చూడడము. ఆయనతో మాట్లాడడము జీవితం మీద, జీవించడం మీద ఆయన చేసిన మహత్తరమయిన ప్రసంగాలను వినడము యివన్నీ అంతులేని ఆనందాన్నిచ్చేవే మాకు యింకా అనేక మందికి భగవంతుడు యిచ్చిన అవకాశానికి మేము ఎంతో కృతజ్ఞులముగా ఉన్నాము. బహుశా ఆచరణలో ఉన్న ప్రేమను మా జీవితకాలంలో చూడడం — బాబాలో మేము గమనించడం యిదే మొదలు అని మాకు తోస్తోంది.

మా హృదయాంతరాలకి చేరుకున్న ఆ ప్రేమ ప్రసరిస్తూన్న బాబా యొక్క ప్రభావం మాకు తెలుస్తోంది. మా జీవితాలలో మరల యీ జగత్తులో యీ విధంగా బాబాను కలుసుకుంటామో లేదో—కలుసుకుంటామనే మా మనస్సులు చెబుతున్నాయి. మా చేతల ద్వారాను మా హృదయాలద్వారాను వారికి మేము సర్వదా మా ప్రేమను అర్పిస్తూ ఉంటాము. బాబా మాతో అన్నమాట—"మీ ప్రేమ తప్ప యింకేదీ బాబా కోరడు— మేము మా జీవితాలలో మరచిపోలేము. ఆ దయామయునికి మేము ఎల్లప్పుడూ మా ప్రేమను యిస్తూనే ఉంటాము"

ఇంకొకరి ఉత్తరంలో—"నాలో ఆయన అనుగ్రహం వెల్లివిరియుట చేత నేను మారిపోవడమే కాకుండా నా మార్పు నా సన్నిహితులను కూడా మారుస్తోంది. వారిని బాబా వైపుకి లాగుతోంది...."

మరియొక లేఖ యీ విధంగా ఉంది—". అయిదేళ్ళనుంచి ఆయన కోసం వేచియుండటం ఎంతో దీర్ఘకాలం నేను నిరీక్షించినట్లు కనిపించింది, కాని యిప్పుడు అయిదేళ్ళు (5) కాదు ఎన్ని ఏళ్ళగా ఆయనను చూడకపోయినా నేను ఉండగలను. నా యిదివరకటి అనుభవము అది శాశ్వత ఫలితాన్నే యిచ్చింది నాకు. ఆయనను ప్రేమించి యున్నందుకు మనం ఎంత అదృష్టవంతులం ! ఇది నిజమేనా ? మనకు నిజంగా అంత అదృష్టం కలిగిందా ! దానికి మనం అర్హులమేనా ? అని అనుకునేంత అద్భుతంగా ఉంది, ఆయనతో మన సాంగత్యం తలచుకొన్నకొద్దీ !

ఈ విధంగా అనేకులకు అనేకరీతుల అనుభవాలు కలిగాయి.

బాబా మామూలుగా భోజనం చేసారు గెస్టుహౌసులో. డాన్ స్టీవెన్స్ అడిగితే అస్సిసీవాసుడయిన సెయింట్ ఫ్రాన్సిస్ గురించి బాబా చెప్పారు. ఫ్రాన్సిస్ యొక్క భగవత్సాక్షాత్కారం గురించి బాబా చెప్తూ "ఫ్రాన్సిస్ పాశ్చాత్య దేశాలలో సద్గురువయిన కొద్దిమందిలో ఒకడు" అన్నారు. "ఎవరయినా సద్గురు సహాయం లేనిదే భగవంతుని పొందలేరు," అని చెప్పారు. డాన్ అప్పుడు అడిగాడు – "పాశ్చాత్య దేశాలలో ఆ కాలంలో సద్గురువు లేకపోయినా ఫ్రాన్సిస్ ఎలా భగవంతుని సాక్షాత్కరింప జేసుకున్నాడు?" అని అడిగాడు.

(డాన్ స్టీవెన్స్ చాలా మంచి ప్రశ్న అడిగాడు బాబా అప్పుడు ఐవీడ్యూక్ వేపు తిరిగి "పూర్వకాలంలోని సూఫీ ప్రవక్త అయిన ఖ్వాజా ఖిజిర్ అనే అతని గురించి నీకు తెలుసునా": అని అడిగారు. "మూర్షిదారబియా మార్టిన్ ఆయన గురించి చెప్పగా నేను విన్నాను. 'గాడ్‌స్పీక్స్'లో బాబా వ్రాసారుకదా ప్రతికాలంలోను అయిదు గురు సద్గురువులు ఉంటారని." అని ఐవీ జవాబిచ్చింది.

"ఖ్వాజాఖిజిర్ అప్పుడప్పుడు కావాలని తోచిన యెడల భౌతిక శరీరం వహించే వాడు. కావాలని తోస్తే అంటే ఆధ్యాత్మిక అవసరం కలిగినపుడు అన్నమాట. ఆ కాలంలో ఆ దేశంలో సద్గురువు లేనందువలన, సెయింట్ ఫ్రాన్సిస్‌కి ఆ విధంగా అతని వలన జ్ఞానోదయం అయింది. లావెర్నా కొండమీద, అస్సిసీ సమీపంలో ఒక రాత్రి ఖ్వాజాఖిజర్ ప్రత్యక్షమై యీ పాశ్చాత్య సాధువుని అనుగ్రహించి సంపూర్ణుని చేసాడు. ఆ విధంగా అతడు సద్గురువయాడు." అని బాబా వివరించారు)

మధ్యాహ్నం 2 గంటలకు ఎలిజబెత్ జన్మోత్సవపు విందు ప్రారంభం అయింది. బాబా స్వయంగా భోజనశాలలో పైన గులాబీరంగు వేసిన రొట్టెని (కేక్‌ను) కోసారు. బాబా ఎలిజబెత్‌ను ఏడుసార్లు కౌగిలించుకున్నారు. అందరూ 'హేపీ బర్త్‌డే' పాడారు. ప్రతియొక్కరు వారి వాటా కేక్ ముక్కను ఐస్‌క్రీముసు తిన్నారు. తరువాత బాబా బార్న్‌కు వెళ్తూంటే అందరూ ఆయనను అనుసరించి వెళ్ళారు. కొందరు కుర్చీలమీద కొందరు క్రింద తివాసీ మీద బాబాకు ఎదురుగా కూర్చున్నారు. బాబా పసుపు పచ్చని క్రిసెన్‌థమమ్ పుష్పాలతోను లవెండరు గ్లాడియోలాలు అనే పుష్పాల తోను స్నేహితులంతా తయారుచేసిన పెద్ద పుష్పగుచ్ఛాన్ని ఎలిజబెత్ కు బహూకరించారు. మరల ప్రపంచం అంతటి లోకి యీచోట ఉన్నప్పుడే బాబాకు సుఖంగా

ఉంటుందని ఆయనకు యీ మెహెర్ సెంటర్ అన్నివిధాలా నచ్చిందని అన్ని సముపాయాలు యిక్కడ ప్రత్యేకంగా బాబా అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఎలిజబెత్ కల్పించిందని బాబా మరల ఉగ్గడించారు. బాబా అప్పుడు మేరియన్‌తో "నీవు నాతోనిన్న ఏమి చెప్పావో యిప్పుడు మళ్ళీ చెప్పు" అన్నారు. మేరియన్ లేచి నిలబడి యిలా అంది- "ఇక్కడ అన్ని ఏర్పాట్లు ఎంత బాగున్నాయో చూసి ప్రతివారు వారి హృదయ పూర్వకంగా ఎంతో సంతోషిస్తున్నారు. ఎలిజబెత్‌కి యిష్టమయితే ఆడవాళ్ళకి ఒకటి మొగవాళ్ళకి ఒకటి వేరే వేరే పరుండే హాలులు రెండు మా ప్రేమతో కట్టిస్తామని ఉంది - అని బాబాతో అన్నాను" —

ఎరచ్ :—అందుకు బాబా ఏమని జవాబిచ్చారు ?

మేరియన్: —ఈ స్థలం యావత్తూ ఎలిజబెత్ సృష్టించింది. ఇంక యితర స్థలాలన్నిటి కంటె దీనిని ప్రపంచంలో ఎక్కువగా నేను ప్రేమిస్తున్నాను. ఆమె చేతిలో యీ ఏర్పాట్లు అన్నీ జరిగాయి. నాకు యిదంతా యిలా ఉండడమే యిష్టం అన్నారు.

అప్పుడు బాబా సంజ్ఞాయుక్తంగా మరల చెప్పగా ఎరచ్ ఆయన మాటలు యీ విధంగా చెప్పాడు —

"ఇక్కడ మీకు కనిపించేదంతా ఎలిజబెత్ యొక్క ప్రేమపూర్వకమయిన కృషి. ఈ సెంటరులో నాకు సుఖంగా ఉండాలని అన్ని సదుపాయాలతోను యిక్కడ ఏమేమి చెయ్యాలో అన్నీ చేసింది. బయటవారెవరయినా దీనికి మళ్ళీ యింకొకటేదైనా చేయిస్తామంటే .... ...." ఇక్కడ బాబా సంజ్ఞలకు వ్యాఖ్యానం చెప్పడానికి ఎరచ్ ఏమి చెప్పాలో ఆ మాట తెలియలేదు. అనేకమంది అనేక రకాలయిన మాటలు అందించారు.

మేరియన్ మళ్ళీ యిలా చెప్పింది — "బాబా యింకొక సందేశం కూడా యిచ్చారు. ఆయన పశ్చిమదేశాల నుంచి ఇండియాకు వెళ్ళి మరల ఏకాంతవాసంలో ప్రవేశించి అయిదు నెలలపాటు 1957 ఫిబ్రవరి 15 వరకు అలా ఉంటారు. ఆయన డబ్బు ఏదీ యిప్పుడు అంగీకరించరు. ఆయనతో కూడా ఏమీ ఇండియాకు తీసికొని వెళ్ళరు. మెహెర్‌బాబా ఆతిథ్యసంఘం వారి చేతిలో ఏమి మిగిలినా (బాబా మండలితో ప్రపంచ పర్యటన చేయుటకు విమానయానపు ఖర్చులు అన్నీపోను) దానిని గురించి

అంటే ఆ మొత్తం ఏమి చేయాలో బాబా శాన్‌ఫ్రాన్‌సిస్కో వెళ్ళిన తరువాత చెప్తానని యిదివరకే చెప్పారు."

"బాబా ఇండియాకు తిరిగి వెళ్ళిన తరువాత కఠినమైన ఏకాంతంలో ఉంటారు, ఆ అయిదు నెలలూనూ. వారు చాలా తీవ్రంగా పని చేస్తారు. ఉపవాసాలు కూడా చేస్తారు. బహుశా ఆయన సతారాలో ఉండరు." అని ఎరచ్ చెప్పగా బాబా యిలా అన్నారు– "ఏమో నేను సతారా లోనే ఒక్కణ్ణే తాళం వేసుకుని ఉండవచ్చు. లేకపోతే యింకొక స్థలానికివెళ్ళవచ్చు. లేక నేను ఏకొండపైకయినా వెళ్ళవచ్చు. ఎందుచేతనంటే నా మౌనభంగం చేసే సమయం ఆసన్నమవుతోంది.

మేరియన్ యింకా యిలా చెప్పింది –

"అయిదు నెలల ఏకాంతవాసం అవగానే బాబా ఇండియాలో పెద్ద సమావేశం ఏర్పాటుచెయ్యబోతున్నారు. పాశ్చాత్య స్త్రీ పురుషులును, ఇండియాలో అనేక స్థలాల నుంచి సాధుపుంగవులు కూడా వస్తారు. చాలా పెద్దయెత్తున జరుగుతుంది. బాబా యిప్పటినుంచి మనలను ఇండియాకు వెళ్ళడానికి ఖర్చులకు డబ్బు జాగ్రత్త పెట్టుకోమంటున్నారు. అది లేని దురదృష్టవంతులకు సహాయం చెయ్యమన్నారు. రాగలిగిన వారంతా ఇండియాకు రండి. ఇవ్వగలిగిన వారు వచ్చేవారికి అవసరమయిన వారికి యివ్వండి. రాలేని వారు ఆ సమావేశసమయంలో బాబా హృదయంలో ఉంటారు. వారు రాలేకను, యితరులకు సహాయం చేయనూ లేనివారు ఏమీ విచారించకండి—" బాబా అప్పుడు "బాబా చెప్పింది అందరూ విన్నారా? ఎవరికయినా వినిపించలేదా? డాన్! నీవు ఒకమారు చెప్పవయ్యా విన్నదేమిటో" అన్నారు బాబా. ఇప్పుడు బాబా చెప్పారని మేరియన్ చెప్పినది డాన్ మరల చెప్పాడు. అప్పుడు బాబా యిలా చెప్పడం ప్రారంభించారు —

"ఇండియాలో చాలా మంది సత్పురుషులున్నారు. కొందరు మార్గంలో ఉన్నారు. కొందరు అభివృద్ధి చెందినవారు. డెక్కన్‌లో గాడ్గేమహరాజ్ అనే అతడున్నాడు. డాన్! అతన్ని చూసావా? అతని గురించి విన్నావా!

డాన్ లేదని జవాబిచ్చాడు.

"అతనికి చాలామంది అనుచరులున్నారు. అతడు సుమారు 90 ఏళ్ళవాడు. ఎప్పుడూ తిరుగుతూనే ఉంటాడు. అందరికీ భగవంతుని ప్రేమించమని చెప్తూంటాడు. గాడ్గే మహరాజ్ నన్ను గాఢంగా ప్రేమిస్తాడు. ఇండియాలో 1954 వ సం॥ లో

సహవాస్‌లో పాశ్చాత్యులు చాలా మంది అక్కడ ఉండగా గాడ్గే మహరాజ్ నా దర్శనంకోసం వచ్చాడు. అప్పుడు అతన్ని ఎవరెవరు చూసారు? అని బాబా అడిగారు. ఫ్రెడ్ వింటర్‌ఫెల్ట్, డార్విన్‌షా, జాన్‌బాస్, డానాఫీల్డ్, జోసెఫ్ హార్బ్ యింకా ఎవరో యితరులు అని జవాబుచెప్పారు. డా॥ హేమన్ 'నేను ఇండియాకి కొంచెం ఆలస్యంగా వెళ్ళాను' అన్నాడు.

బాబా — గాడ్గే మహరాజ్ నా వద్దకు వచ్చి నాకు ప్రణామం చేసాడు. అతనిని నాకు దగ్గరగా కూర్చోబెట్టుకున్నాను. అలా చాలాసేపు కూర్చున్నాడు. అతడు డక్కన్‌లో ఉంటూ ఉన్నాగాని ఇండియాలో చాలా చోట్ల అనేకులు అతనిని బాగా ఎరుగుదురు. అతడు ఎక్కడికి వెళ్ళినా అతడు చెప్పిన మాటలని వినాలని చాలా మంది అతని వద్దకు చేరుతారు. అతడు నన్ను బాగా ప్రేమిస్తాడు. నే నెవరో అతడు తెలుసుకున్నాడు ఒకమారు అతడు ఆదీతో ఏమి చెప్పాడంటే — (అని బాబా ఆదీవైపు చూసారు) ఆదీ జ్ఞాపకం చేసుకుంటూ యిలా చెప్పాడు —" "బాబాతో నన్ను ఆశీర్వదించమని చెప్పు. ఆయన జగద్గురువు. నేను మామూలు సాధువును. ఆయన బ్రహ్మాండమయిన భాస్కరుడు. నేను ఒక జ్యోతిని మాత్రమే. ఆయనతో నన్ను దీవించమని చెప్పు అని, నాతో చెప్పాడు."

బాబా — ఇండియాలో చాలామంది సాధువులున్నారు. కాని వారిలో ఏడుగు నాకు ప్రియతమమయిన బిడ్డలు.

"నేను ఫిబ్రవరి 15 వ తేదీ తరువాత పెట్టుకోబోయే పెద్ద సమావేశానికి ఆ యేడుగురిని ఆహ్వానిద్దామనుకుంటున్నాను. ఈ సమావేశం చాలా పెద్దదిగా ఉంటుంది. మీరు అవకాశం వదులుకోకండి. మిమ్మల్ని నేను రమ్మంటే రావడానికి ప్రయత్నించండి. ఎలిజబెత్! నీవు ప్రయత్నించడం కాదు. తప్పక రావాలి. ఆ సమావేశం తరువాత నా మౌనవిరమణము, నా అవమానము, నా మహిమాన్విత వైభవ ప్రకటనము, నా వ్యక్తీకరణము యివన్నీ నేను చెప్పిన ప్రకారం త్వరత్వరగా ఒకదాని తరువాత ఒకటి జరిగిపోతాయి.

"మీరంతా ఒకటి జ్ఞాపకం ఉంచుకోండి. ఫిబ్రవరి 15 వ తేదీ తరువాత మీకు ఇచ్చవచ్చినచో డబ్బు యివ్వవచ్చును. ఇప్పటినుండి డబ్బు పొదుపు చేసుకోండి, మీ ప్రయాణపు ఖర్చులకు దాచుకోండి, మీరు ఆహ్వానింపబడితే సభకు హాజరుకావడానికి. అప్పుడు మీకు డబ్బు సిద్ధంగా ఉంటుంది- బాబాకు యిప్పుడు యిద్దామని అనుకోకండి." అని బాబా చెప్పారు.

బాబా యింకా యిలా చెప్తున్నారని ఎరచ్ చెప్తున్నాడు —

ఇండియాలో బాబా ఏకాంతవాసంలోకి వెళ్ళినపుడు ఆయన ఒక గదిలోకి వెళ్ళి తాళం వేసుకుంటారు. అన్ని తలుపులు కిటికీలు కూడా మూసివేసుకుంటారు. లోపల గాలి కూడా ఆడదు. బాబా ఎవరినయినా వారితో ఉండడానికి అనుమతిస్తే ఆ లోపల ఉండే అతడు గాలిలేక ఉక్కిరిబిక్కిరి అవుతాడు. బాబా రోజంతా అలాగే కూర్చుని ఉంటారు. బాబా ఏకాంతవాసంలో ఉన్నపుడు ప్రపంచమంతా ఆయనకు యింకా సమీపమౌతుందని అంటున్నారు.''

బాబా ఆజ్ఞప్రకారం అప్పుడు డాన్‌స్టీవెన్స్ లేచి ప్రభువుయొక్క సందేశాలు మూడు చదివాడు — ''బంధించేగతం'', ''కర్మ ధర్మం'', ''ద్వంద్వాలనుండి విముక్తి,'' అనేవే యివి.

అతడు చదవడం ముగించాక బాబా చప్పట్లు కొట్టారు. ఎందుకు? డాన్ తన సందేశాలు బాగా చదివాడని కాదు. అవి వినకుండా ఎలిజబెత్ నిద్రపోతోంది. అందుచేత డాన్‌ని ఆ సందేశాలు మరల చదవమన్నారు. చదివి వివరించమన్నారు కూడా. మొదటి సందేశంలో బాబా చెప్పారు – ''గతాన్ని మార్చలేము. అది గడ్డకట్టుకు పోయిన చెరువు లాంటిది. (అటువంటి చెరువులు హిమాలయ పర్వతాల మధ్యలో ఉంటాయి) కాని వర్తమానం మీద గతం యొక్క ప్రభావం ఉంటుంది. ఈ పరిమిత 'అహం' యొక్క భవిషత్తును కూడా అది మలుస్తుంది'' ఇంకో సందేశంలో స్థూల శరీరపతనం అయిన తరువాత మనము 'స్వర్గము' 'నరకము' అనుభవిస్తాము అన్నారు.

బాబా :—''మీకు అర్థమౌతోందా?

డాన్ :—తల ఆడించాడు డాన్ తెలియడం లేదంటున్నాడని బాబా చెప్పారు. అందరూ నవ్వారు.

బాబా :—స్వర్గం ఎక్కడ ఉంది. నరకం ఎక్కడ ఉంది. డాన్! వివరిస్తావా?

డాన్ :—నాకు అర్థమయినంత వరకూ అవి మాయా స్థితులు. అవి మనస్సులోనే ఉన్నాయి. వాటికి సత్యమైన అస్తిత్వం లేదు. అవి మాయలో ఒక భాగం.

బాబా :—నా చిన్నతనంలో నేను 13 ఏళ్ళ వాడినిగా ఉండగా నేను ఒక ఇరానీ పెద్దమనిషిని కలిసాను. అతడు చాలా లావుగా బలంగా ఆరోగ్యంగా ఉన్నాడు.

ఇంకా యిద్దరు ముగ్గురు అతని స్నేహితులతో అతన్ని కలిసారు. వారు నన్ను పిలిచి నన్ను వారి వద్ద కూర్చోమన్నారు. నేను చిన్నపిల్లవాడిని. ఒక ఇరానీ ఇండియాదేశపు భంగు తయారు చేస్తున్నాడు. అది మత్తు కలిగించే ఒక రసం. వాళ్ళు ముగ్గురు హాయిగా త్రాగుతున్నారు. ఒక ఇరానీ అందులో తెలివయిన వాడు. అతడు మానాన్నగార్ని ఎరిగున్నవాడు. అందుకని నన్ను పిలిచి తన దగ్గర కూర్చోమన్నాడు. అతడు బాగా త్రాగాడు. మిగిలిన వాళ్ళతో "ఈ వేళ నేను స్వర్గంలో ఉన్నాను" అంటూ మొదలు పెట్టాడు. వాళ్ళు మాట్లాడేది తమాషాగా వింటున్నాను. అప్పుడు అతడు లేచాడు. లేవగానే మిగిలిన యిద్దరూ కూడా లేచారు. లేచి నడవడం ప్రారంభించారు. రోడ్డుకు అడ్డంగా ఎక్కడ నుంచో వచ్చిన నీళ్ళు చిన్న కాలువలా పారుతున్నాయి. భంగు త్రాగిన వాడికి కొంచెం నీరు చూసినా పెద్ద సముద్రంలా కనిపిస్తాయి. ఆ మందు దారితీసిన వాడు ఆ చిన్న నీటి కాలువని చూసి ఆగి అది పెద్ద కాలువ అనుకుని అది దాటాలని దానిమీద నుంచి గెంతుదామని అనుకున్నాడు. పెద్ద గంతు వేసాడు. ఆ గెంతడంలో పాపం కాలు విరగ గొట్టుకున్నాడు. అప్పుడతడు "అరే! ఇప్పుడు నరకంలో పడ్డానురా" అని అరిచాడు.

"అందుకని యీ స్వర్గనరకాలు రెండూ అలాగే ఉన్నాయి. అవి అనుభవిస్తారు గాని అవి ఉన్నలోకాలు కావు. అవి మాయలో భాగాలు."

డాన్ అప్పుడు "కర్మధర్మం" అనే సందేశం రెండవమారు చదువుతున్నాడు. చదివిన తరువాత డాన్‌ని బాబా ఆ సందేశం యొక్క సారాంశం చెప్పమన్నారు. **డాన్** అన్నాడు — "బాబా ? దీనిని బట్టి నేను సర్వప్రపంచము ధర్మం వల్లనే పరిపాలించబడుతోందని తెలుసుకున్నాను. ఈ విధంగా పరిపాలింపబడుతున్న భౌతిక ప్రపంచం అంతా అర్థం కాదు గాని మొత్తానికి విశ్వమంతా – ధర్మం వల్లనే ఒక మంచి వ్యాపారం లాగ పాలించబడుతోంది."

బాబా — "విశ్వమంతా మాయ అయినప్పటికి అది ఒక నిర్దేశింపబడిన న్యాయము చేత పాలన చేయబడుతోంది. ఆ న్యాయము అన్ని విషయాలకి కూడా చెందుతుంది. కర్మసూత్రానికి లొంగకుండా మనం తప్పించుకోలేము. కాని మనసు మాయను అధిగమించినపుడు యీ న్యాయం ధర్మం మనలను యింక బంధించవు."

అది :—అలాంటివాడు స్వేచ్ఛను పొందుతాడు (ముక్తుడవుతాడు)

బాబా :—అదే అర్జునునికి కృష్ణుడు చెప్పాడు. "నీ బంధువులను చంపు. నీ స్నేహితులను హతమార్చు యీ కురుక్షేత్ర మహాయుద్ధంలో." మీరు ఆ మహా సంగ్రామం గురించి వినే ఉంటారు. అర్జునుడు ఆ మాట ప్రకారం చేయక "నా గురువులనే నన్నెలా చంపమంటావు కృష్ణా ! నా వారిని నా బంధువులను నేను ఎలాచంపగలను ?" అన్నాడు. కృష్ణుడు అన్నాడు "నేను న్యాయానికి అతీతుడను. ఈ సృష్టి యావత్తూ నాలోనుంచే వచ్చింది. నేనే స్రష్టను. నాకు విధేయుడవుకమ్ము. నీకు బంధనాలుండవు"

"ఇప్పుడు యిక్కడ ఒక చీమ ఉన్నదనుకోండి. దాన్ని అకస్మాత్‌గా డాన్ చంపుతాడు. అప్పుడు ఒక బంధనం ఏర్పడుతుంది. ఆ చంపిన క్రియ యొక్క ముద్ర ఆ సంస్కారము నుండి నీవు ముక్తుడవు కాలేవు నీవు చీమను చంపావు గనుక నీకు బంధం ఏర్పడింది. నీవు చేసిన ప్రతీ పని నిన్ను బంధిస్తుంది. మంచిపని కూడా బంధిస్తుంది – సువర్ణ శృంఖలంతో బంధిస్తుందని అందాం పోనీ. ఆ పనులు చెడ్డవి అయితే ఇనుప సంకెళ్ళతో బిగిస్తాయి.

క్రీస్తు అన్నాడు – "అన్నీ వదలి నన్ననుసరించు." అని. అంటే యేమిటి?

"మనకున్న యీ సర్వస్వమూ వదిలి పెట్టెయ్యాలని కాదు. ప్రపంచ జీవితం వదిలేసి సన్యాసం తీసుకోమనీ కాదు. ఆయన చెప్పినట్లు చెయ్యాలని. అంటే—

"మీ ఆలోచనలన్నీ, మీ స్వార్థపూరిత ఆలోచనలన్నీ కట్టిపెట్టి నన్ను అనుసరించండి. నాకు విధేయులు కండి. అప్పుడు మీరు విముక్తులవుతారు. మీరు స్వేచ్ఛగా ఉంటారు. మీరు అలా చేయలేకపోతే మీరు యింకా మరీ మరీ బంధనాలలో చిక్కుకుంటారు; ఎందుచేతంటే మీరు చేసే ప్రతీపనీ బంధం కలిగిస్తుంది గనుక.

"డాన్! నీవు చాలా పాతవాడివి. ఎన్నో యుగాలనుంచీ ఉన్నావు. నీవు బంధింపబడి ఉన్నావు. ఇలాగే యింకా బంధనాలలో చిక్కుకుంటావు. ఒక జన్మ తరువాత యింకొక జన్మలో అవే బంధనాలు నిన్ను బంధిస్తాయి. నీవు ముక్తి పొందాలని ప్రయత్నిస్తావు. అలా చేయడం చేత మళ్ళీ బంధింపబడతావు. కానీ ఒక్కమారు పూర్తిగా ముక్తుడవయ్యావా నీకసలు బంధాలే లేవని తెలుసుకుంటావు. అదంతా ఊహ మాత్రమే. ఒక కల లాంటిది..... నీవు ఒక కల మాత్రమే చూస్తున్నావు. అనుభవిస్తున్నావు

"మీరందరూ చాలా సనాతనులు. అందరూ భగవత్స్వరూపులు. మీలో ప్రతి యొక్కరిలోను భగవంతుడున్నాడు. ఆయన శాశ్వతుడు. మీరంతా శాశ్వతులే. ఇప్పుడు మీరు బంధాలలో చిక్కుకున్నారు. మీరు బంధింపబడ్డట్టు భావిస్తున్నారు. మీరిలా బంధింపబడుతూనే ఉంటారు. కాని ప్రతి మనిషి కూడా విముక్తుడయే సమయం వస్తుంది విమోచనం పొందే రోజు వస్తుంది. అప్పుడతడు వాని బంధనాలన్నీ నిజం కావనీ ఒక కల మాత్రమేననీ, తాను ఒక కలగంటున్నాననీ తెలుసుకుంటాడు.

"క్రీస్తు యితరుల బాధలను తనపై వేసుకున్నాడు. ఎందుచేత ? మానవులకు ముక్తి కలుగజేయడానికి. కాని బంధనాలన్నీ అలాగే ఉన్నాయి. మానవకోటి బంధింపబడే ఉంది. అయినా ముక్తి పొందడానికి ఏమీ సమయం పట్టదు. మీరు యుగాలుగా బంధింపబడియున్నారు. కాని మీకు ముక్తి లభించినపుడు అది క్షణమే జరుగుతుంది. అది ఒక మెరుపులా వస్తుంది.

"ఆలోచించి చూడండి. అందరిలోనూ భగవంతుడున్నాడు. ప్రతియొక్కరిలోను. ఆయన అనంతుడు. భగవంతుడు సర్వశక్తిమంతుడు. భగవంతుడు ఆనందమయుడు. అయినా భగవంతుడు ప్రతివారిలోను ఉన్నప్పటికి మనం ఎంత నిస్సహాయులుగా భావిస్తాము ? మనం ఏడుస్తాము; మనం బాధపడతాము; మనం దుఃఖిస్తాము– అంత అనంతశక్తిమంతుడు, ఆనందమయుడు మనలో ఉన్నా కానీ. ఎందుచేత ? మన బంధనాలచేతనే. కానీ యీ బంధనాలనుండి విడిపడుటకు ఒక్క మార్గమున్నది– అదే ప్రేమ ద్వారా.

డాన్ అప్పుడు బాబా యిచ్చిన మూడవ సందేశం— "ద్వంద్వాల నుండి స్వేచ్ఛ" అనునది యింకొక మారు బాబా ఆజ్ఞానుసారం చదివాడు. బాబా మామూలుగానే ఆ సందేశానికి యీ విధంగా కొంత చేర్చారు— "మీరు యిది చదువగా విన్నారు. ప్రతి యొక్కరు విన్నారు. అది అనుభూతి చెందినట్లు కాదు— వినడం మాత్రమే. అది మానసికంగా అర్థంచేసుకోగలరు. మనసు దాన్ని మెచ్చుకోగలదు. మనసు యిదంతా అర్థంచేసుకుంటుంది. కాని కావలసిందేమిటంటే నిజమైన అనుభవం. మీకు అనుభవం కలుగగానే మీరు తెలుసుకుంటారు. అంతా మాయయని మీకు తెలుసును. భగవంతుడు నిజమని కూడా మీకు తెలుసును.

"నేను కాలేజీలో చదువుకొనే రోజుల్లో యీ విషయాలన్నీ చదివి తెలుసుకుందామని ఉండేదికాదు. ఆధ్యాత్మికతత్వంతో నాకు పనిలేకుండెను. వేదాంత గ్రంథాలు గాని ఆధ్యాత్మిక గ్రంథాలు గాని నేను ఎప్పుడూ చదువలేదు. మా నాన్నగారు

షెరియార్జీ ఎల్లప్పుడూ భగవంతుని గూర్చి ఆలోచిస్తూ అన్వేషిస్తూ ఉండేవారు. ఆయన ఒక అన్వేషకుడు. గొప్ప అన్వేషకుడు. ఆయన ఇరాన్ దేశంలో ఒక స్థలం నుంచి యింకో స్థలానికి కాలినడకను ఊరూరా తిరిగేవారు. తరువాత ఆయన ఇండియాకు వచ్చి అన్వేషణ సాగించారు కాని ఆయన దేనికోసం వెతికేవారో అది కనుగొనలేదు. ఇండియాలో ఆయన వివాహం చేసుకున్నారు. ఎందుచేత ? పూర్వ సంబంధాల వల్ల, యివదరకటి జన్మలలోని సంస్కారాల వలన.

నేను కాలేజీలో చదువుతుండగా బాబాజాన్‌ను కలిసాను. నా సైకిల్ మీద వెళ్తూంటే బాబాజాన్ ఒక చెట్టుక్రింద కూర్చొని ఉంది. ఆవిడ చుట్టూ కొందరు పఠాను లున్నారు. వాళ్ళు చాలా పొడగరులు. చూడటానికి, భయంకరంగా ఉన్నారు. బాబాజాన్ నన్ను చూసి తనవద్దకు రమ్మని సైగ చేసింది. ఆమె పిలువగానే నేను సైకిల్ దిగాను. అప్పుడు ఆమె నా నుదుటిమీద ముద్దుపెట్టుకుంది. నాకు ఆ అనుభవం తెలుసును. ఆ క్షణంలో ప్రపంచం అంతా కూడా అదృశ్యమయిపోయింది. పూర్తిగా మాయమయిపోయింది. ఎందుచేత, నేను అనంతుడనయినట్లు కనుగొన్నాను. నాకు తప్ప యీ విశ్వంలో యింక దేనికీ చోటులేదు ఆ ముద్దు నన్ను అనంతుణ్ణి చేసింది. అప్పుడు నాకు తప్ప యింక దేనికీ చోటు లేకపోయింది. నేను తప్ప అన్నీ మాయమయి పోయాయి.

ఆ అనుభవం మీకు నేనెలా వివరించి చెప్పగలను ? ఆ అనుభవం మీకు కలిగినపుడు అది ఎలాంటిదో మీకు తెలుస్తుంది.

నేను ఆ ఆనందం, ఆ అనంతానందం అనుభవించినపుడు దానికి అంతరాయం లేకుండెను. అది అఖండానందం. అది యిప్పుడు కూడా ఉంది. అది శాశ్వతమైనది. ఎడతెరిపి లేనిది. తరువాత నేను సాయిబాబా వద్దకు ఉపాసనీ మహారాజ్ వద్దకు వెళ్ళాను. నేను అక్కడికి ఎలాగో లాగబడ్డాను. మహారాజ్ నన్ను మామూలు చైతన్యస్థితికి తీసుకువచ్చాడు. మామూలు చైతన్య స్థితికి రావడం అంటే మీకు తెలియదు. ప్రతీక్షణము నాకు సిలువ వేయడంలా ఉండేది. ఆ అనంతానంద స్థితి నుండి మామూలు యీ ప్రపంచస్థితికి రావడం అంటే అపరిమితమయిన బాధగా సిలువ వేసినట్లుండేది.

"ఇప్పుడు కూడా అలాగే ఉంది. మీరు నన్ను ఆనందంగా ఉన్నట్లు సంతో షంగా ఉన్నట్లు చూస్తున్నారు. కానీ నా లోపల అంతరంగంగా నేను అనంతమయిన

ఆవేదనలో ఉన్నాను. ఎందుచేత ? మీ అందరి ద్వారాను మీ బంధనాలను నేను అనుభవిస్తున్నాను గనుక.

"మీరు నన్ను ప్రేమించగలిగితే, భగవంతుని ప్రేమిస్తే మీ ప్రేమ నన్ను తెలుసుకునేలా చేస్తుంది. మీ సుఖం చూసుకోకుండా మీ ప్రేమ ద్వారా యితరులను సుఖపెట్టగలిగితే యీ బంధనంలో నుంచి మీరు విముక్తులౌతారు అప్పుడు నేను నిజంగా ఎలా ఉన్నానో అలా నన్ను మీరు చూడగలుగుతారు. ఆ అనుభవం మీకు కలుగగానే మీరు విముక్తులైనట్లు తెలుసుకుని అనంతమయిన ఆనందం అనుభవిస్తారు.

ఎవరో "బాబా! ఈ కాలంలోని అయిదుగురు సద్గురువులు ఎవరు" అని అడుగగా బాబా "సాయిబాబా, ఉపాసనీ మహరాజ్, హజరత్ బాబాజాన్, నారాయణ మహరాజ్, తాజుద్దీన్ బాబా" అని చెప్పారు. కాని వీరందరూ అప్పటికే దేహం చాలించేసారు. వీళ్ళ తరువాత సద్గురువులు ఎవరని స్వేచ్ఛకుని ప్రశ్న. కానీ అది చెప్పడం బాబాకు యిష్టంలేదు కాబోలు. పరివారం అందరూ వెంటరాగా బాబా సెంటరుకి వేడిగా వెళ్ళారు. పిల్లలందరూ చెరువు మీద షికారుకి వెళ్ళడం కోసం పడవ యిల్లు ఎక్కికూర్చున్నారు. బాబా పడవ ఎక్కి ఒక్కొక్క పిల్లవాడిని ఒక్కొక్క పిల్లని ప్రేమతో ముద్దుపెట్టుకుని లాలించారు. బాబా ప్రేమికులు కూడా వచ్చిన వారంతా ఒడ్డునే నిలబడి చూస్తున్నారు. పిల్లలు యింకా చాలా మంది ఒడ్డున ఉన్నారు. బాబా ఒక బాలుణ్ణి నీవు తెడ్డు వేసి పడవ నడపగలవా? అని అడిగారు. వాడు "ఓ! వేస్తాను నాకు చేతనవును" అన్నాడు.

పిల్లలతో పడవ షికారు అయిన తరువాత ఇటుకలతో కట్టిన సోపానాలు యెక్కి ఒడ్డుమీద తటాకపుటంచున ఉన్న బెంచీ మీద కూర్చున్నారు. తరువాత ప్రేమికులందరితోను బాబా ఆడడం ప్రారంభించారు. ప్రసాదం (మిఠాయిలు) విసరడం మొదలుపెట్టారు బాబా చాలా ఆనందంగా కనబడ్డారు. బాబా విసిరిన మిఠాయిలు పట్టుకుందామని ఒక్కొక్కరు ఎంతో ఆదుర్దాగా ఉన్నారు. తమాషాగా బాబా అటు చూసి యిటు విసరడం యిటు చూసి అటు విసరడం అందరూ చూసి సరదాగా ఆడారు. వారందరిలోను ఉన్న ఒక అంధుని చేతులలోకి పడేలా బాబా ఒకటి విసిరారు. మిఠాయిలన్నీ అయిపోతే కిట్టీ పరుగెత్తుకుని వెళ్ళి యింకా తెచ్చింది. బాబా ఎంత సంతోషంగా ఉన్నారో! ఆయన వైపు చూపిస్తూ ఒక చిన్న పిల్లవాడు అతని తండ్రి భుజం మీదనుంచి "బాబా: బాబా!" అంటున్నాడు చప్పట్లు కొడుతూను. ఒక యువకుడు అతని చేనో

స్వంత సమస్యలుండి వేదనపడుతూ బాబా ముందు మోకరించాడు. బాబా అతనికి ఆయన ప్రేమాన్వితమయిన కౌగిలింత యిచ్చారు. ఆయన అనుగ్రహం కొందరి మీద జలపాతంలా పడుతుంది.

అప్పుడే సాయంకాలం 5-30 గంటలయింది. బాబా వారి యింటికి వెళ్ళి ఎవరికీ తెలియని వారి పని చేసుకోవడం కోసం వెళ్ళారు.

రాత్రి భోజనాలయాయి. వసారాలో కూర్చుని చూస్తుంటే నిండు చంద్రుడు పున్నమి వెన్నెలలు వెదజల్లుతున్నాడు. బాబా ప్రేమికులందరూ ఇండియా నుంచి వచ్చిన ఆదీ. కె. ఇరానీ చుట్టూ మూగారు. అతణ్ణి అనేక ప్రశ్నలువేసి దాదా గురించి అనేక సంగతులు తెలుసుకుంటున్నారు. అలా మూడు గంటలు చెప్పుకున్నారు. ఒకరికి బాబా యొక్క చేతి వ్రేళ్ళు అలా ఎందుకు కదులుతాయని సందేహం వచ్చింది. ఆదీ యిది వరకు ఒకమారు చెప్పినట్లే అవి సంజ్ఞలూ సంకేతాలూ కావని బాబా అంతరంగంలో ఏదో పని చేస్తూండబట్టి వ్రేళ్ళు కదులుతున్నాయని ఆయన ఆంతరిక కార్యానికి అది బాహ్య చిహ్నమని ఆదీ వివరించాడు.

దానాఫీల్డు 'సమాధి' గురించి అడిగాడు. ఆదీ సమాధులు నాలుగు రకాలున్నాయని అవి తాత్కాలిక ఫలితాన్నిస్తాయి గాని ఆచరణ యోగ్యం కావన్నాడు. పైగా అందువలన సంస్కారబంధనాలు కలుగుతాయన్నాడు. (సమాధినుంచి మేల్కొని అందులో ఉన్న శాంతిని తను మామూలు స్థితిలో పొందలేనప్పుడు దానికి బదులుగా ఇంద్రియ సుఖాలు కావాలని కోరడం దానికోసం ప్రయత్నించడం జరుగుతుంది అని చెప్పాడు. అందుకనే బాబా అంటారు – "నిన్ను ఎప్పుడూ వదలని శాశ్వతమయిన దానికే నేను ఎక్కువ విలువ యిస్తాను" అని.)

గాడ్‌స్పీక్స్ అనే గ్రంథం గురించి మాట్లాడుతూ, 1922 లోనూ తరువాత 1924 లోనూ బాబా – "మీకు మరల సందేహాలు కలుగకుండా మీ బుద్ధికి నమ్మకం బాగా కుదిరేటట్లు చేస్తాను." అన్నారు. ఈ మాట, గాడ్‌స్పీక్స్ రచించి మీకు యిస్తాను అని చెప్పడమే అని ఆదీ అన్నాడు. అయితే బుద్ధివలన కలిగిన జ్ఞానము అనుభవంతో కలిగిన జ్ఞానానికి సరిపోదు అని ఆదీయే ఒప్పుకున్నాడు. అయితే ఇండియాలో కూడా గాడ్‌స్పీక్స్ వల్ల ఆధ్యాత్మికస్థితులు మొదలయిన వాట గురించి అనేక ప్రశ్నలకి సందేహాలు నివృత్తి అయాయి. ఈ మూడు గంటలసేపు బాబా గురించి వారు అడిగిన ప్రశ్నలకి ఆదీ యిచ్చిన సమాధానాలు మైక్‌లాఫ్టస్ అనే ప్రేమికుడు టేప్ రికార్డ్ చేసాడు.

## జూలై 27, శుక్రవారం :—

టెలివిజన్ వారు వస్తామన్నారని బాబా ఉదయాన్నే అల్పాహారం ముగించుకుని కూర్చున్నారు. భోజనాల గదికి వెళ్ళేదారిలో ఆయన పాశ్చాత్య ప్రేమికురాలు ఫిల్లిస్ కనబడగా అడీల్, బెరిల్ వగైరాలు ఇండియా స్త్రీ మండలికి (మెహెరా, మణి లకు) ఉత్తరం వ్రాసారా ? అని బాబా అడిగారు. "నీవు సుఖంగా ఉన్నావా ? సంతోషంగా ఉండు" అన్నారు బాబా ఫిల్లిస్‌తో. పద్మినియాతో బాగా కడుపునిండా తినమని బాబా చెప్పారు.

ఈ రోజున మెహెర్ సెంటర్ అంకితం చేయడం, కార్యక్రమంలో ఒక అంశముగా ఉంది. జాతీయ టెలివిజన్ కార్యక్రమానికి న్యూయార్క్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్_టి. వి. కెమేరావారు న్యూయార్క్‌నుంచివచ్చి ఆరోజు కార్యక్రమాన్ని టెలివిజన్ ఫొటోలు తీయడానికి వస్తారు. అందుకు మిర్టిల్ బీచ్ మేయర్‌ని కూడా రమ్మని ఆహ్వానించారు. ఆ రోజున యింకా చుట్టుపట్ల నివాసులందరు బాబా వద్దకు వచ్చి వారి దర్శనం పొందవచ్చునని బహిరంగ దర్శనం ఏర్పాట్లు కూడా చేసారు. ఈ విషయం పత్రికలలో ప్రకటనలు కూడా చేసారు.

ప్రేమికులంతా వెంటరాగా బాబా బార్న్ లోకి వెళ్ళారు. బాబా ముందున్న మెట్లదగ్గర అగ్నిస్ బారన్, మార్గరెట్ క్రాస్కీలను కూర్చోమని చెప్పి దర్శనానికి వచ్చేవారి పేర్లను జాబితా వ్రాయమన్నారు. మార్గరెట్ వచ్చిన ప్రతివారితోను___

"మీకు బాబా ఒక సందేశం యిచ్చారు. ఈ రోజున రహస్య సంభాషణలేమి ఉండవు. బాబాను మీరు ఏ ప్రశ్నలూ వేయరాదు. ఊరికే బాబాను దర్శించి ఆయన ప్రేమను స్వీకరించండి అంతే."

జీన్‌షా వారితో చెప్పింది___ బాబా యిచ్చిన ప్రసాదం మీరు తినాలి. ఈ విధంగా అందరితోనూ చెప్పి వచ్చిన వారి పేరులన్నీ వ్రాసారు. మొదట కొద్దిమంది మాత్రం వచ్చి బయట కుర్చీలలో కూర్చున్నారు. బాబా ఒక్కరూ బార్న్ వెనుకకు కొంతసేపు వెళ్ళి ఉన్నారు. వచ్చిన వారందరూ బాబాను దర్శించడానికి, వారు యిచ్చే పండో పిప్పరమెంటో తీసుకోడానికి ఒక వరుసలో నిలబడ్డారు. బాబా లోపలికి వచ్చిన తరువాత ఫిల్లిస్ లేచి ఆయన కుర్చీ వద్దకు లోపలికి వెళ్ళింది. ఆ వెళ్ళే టప్పుడు అటూ యిటూ వూగుతూ నడిచింది. ఆమె వైపు బాబా అదో మోస్తరుగా నవ్వుతూ చూసారు. చేయి జాపి ఎర్రటి చెర్రీ పండు ఒకటి ఆమెకిచ్చారు బాబా.

ఆమె అది తీసుకొని వంగి ఆయన చేతిని ముద్దుపెట్టుకున్నది. తరువాత వరుసలో అందరూ వచ్చి ఆమె చేసినట్లే చేసారు. ఒకరిద్దరు మాత్రం బాబా పాదపద్మాలను స్పృశించారు.

ఇంతలో చాలా మంది రావడం ప్రారంభించారు. జనం తగ్గగానే బాబా తమ ప్రేమికులవైపు చూస్తూ మీరు చేసిన ఏర్పాటు బాగుంది అన్నట్లు సైగచేసారు. ఒకసారి బయట ఉన్న నలుగురు ప్రేమికులను ఫిల్లిస్ ఫ్రెడెరిక్, మార్గరెట్ క్రాస్కి, అడీల్, డెలిల్ - లోనికి రమ్మని పిలిచారు. పిలిచి వారు ఇండియాకు సంయుక్తంగా వ్రాసిన ఉత్తరం వారిని చదవమని బాబా విన్నారు. అంతా విన్నాక అడీల్, డెలిల్ వ్రాసినది బాగా లేదని మరల వ్రాయమన్నారు. అడీల్ భాగంలో వ్రాయమని బాబా యీ క్రిందిది చెప్పారు.

బాబా ఆత్మలన్నిటికీ పరమాత్మ
దేవతలకి ప్రియతముడు
తన ప్రేమికులకు జీవము
తన ప్రియులకు ఆయన బానిస.

అడీల్ మరల వ్రాసిన దానిలో బాబా యిలా చెప్పి వ్రాయించాలని వ్రాసింది. అది విని బాబా మరల అది కొట్టించేసి మళ్ళీ వ్రాయమన్నారు. అందరూ నవ్వారు. ఆమె కొంచెం చిన్న బుచ్చుకుంది. అప్పుడు బాబా - "నేనెందుకిలా చేస్తున్నానో తెలియదా? అందువలన మీరంతా నాకు దగ్గరగా ఉండే అవకాశం కలగాలని" అన్నారు.

ఈ విధంగా యీ నలుగురిని బాబా తమ దగ్గరకి నాలుగుమార్లు పిలిచారు. అయిదవమారు బాబా సిల్వియా అను అయిదవ ఆమెనుకూడా పిలిచారు.

11 గంటలవుతూంటే బాబా దర్శనార్థు లెవరూ లేకపోయిట్టి బాబా బయటమెట్ల వద్దకు వచ్చారు. బాబాకు ఏమి కావాలో తెలియక అక్కడ ఉన్న ఒక పుష్పమాలికను తీసి ఫిల్లిస్ ఆయన మెడలో వేస్తూ "ఈ దండ మేయర్ వేయవలసింది మీకు. ఆయన ఊళ్ళో లేడుట. అందువేత రాలేదు కాని 'అంకితం' చూడడానికి పత్రికా విలేఖరులు వచ్చారు. బాబా అప్పుడు ఒక అగాధమయిన నవ్వును నవ్వారు.

మిర్టిల్ బీచ్‌సన్, మిర్టిల్ బీచ్‌న్యూస్, ఛార్ల్‌స్టన్‌న్యూస్, కూరియర్ అను పత్రికలవారు బాబాతో సంభాషణలు జరిపారు. ఫొటోలు తీసారు. తరువాత వారి వారి

పత్రికలలో వ్యాసాలు నివేదికలు రచించి ప్రచురించారు. ఒక పత్రికలో వెయ్యిమంది వచ్చి బాబా దర్శనం చేసుకున్నారని వ్రాయుటకింది. నిజంగా వచ్చినవారు 800 మంది మాత్రమే.

"మిర్టిల్ బీచ్‌సన్ విలేఖరి ఆదీ కె ఇరానీతో కూడా మాట్లాడిన సంగతి యిలా వ్రాసాడు —

"ఇంకా వివరిస్తూ ఇరానీ, బాబా వివిధ ప్రదేశాలకు వెళ్ళారంటే వారి రాకకు ఆధ్యాత్మిక విశిష్టత ఉంటుంది. అది ప్రపంచ సంఘటనలతో సంబంధం కలిగి ఉంటుంది. ఆయన రాజకీయాలలో లేరు. కానీ ఆధ్యాత్మికంగా పనిచేస్తూంటారు. ఆయన కొత్త చర్చి ఏదీ స్థాపించడానికి రాలేదు. ఒకే దైవము, ఒకే సోదరత్వము గురించి చెప్పడానికే వచ్చారు. అన్ని మతాలను పునరుజ్జీవింప చేయడానికి వచ్చారు. ఆయన యొక్క ఆశయాలు విశ్వం అంతటికీ చెందినవి. ఆయన ఏమతంలోను జోక్యం కలిగించుకోరు. కాని ఆయన అన్ని మతాలవారిని ప్రాపంచిక వ్యవహారాలకి అతీతు లవడానికి సహాయం చేస్తారు. ఆయనకి కావలసింది మానవుల హృదయం, భగవంతుడు."

ఇంకా ఆదీ యిలా చెప్పాడు–"మేము బ్రహ్మచర్య జీవితాన్ని గడుపుతున్నాము. నీతి యుక్తమయినది శిక్షణాయుతమయినదీ అయిన జీవితాన్ని బాబా మనుష్యులను అందరనూ పాటించేలా చూస్తారు."

బాబా లోపలికి వెళ్ళారు. వారు భోజనాలకి లేచేలోగా మరికొందరు వచ్చి దర్శనం చేసుకున్నారు. భోజనాలయిన తరువాత బాబా యింటి బయట తోటలో అందరూ సమావేశమయినారు. బాబా నీడలో కూర్చున్నారు. బెన్‌హేమన్ ఎక్కడున్నాడు అని బాబా అడిగారు. నేను పిలుచుకొని వస్తాను అని బాబా ప్రక్కనే ఉన్న మైక్ లాఫ్టస్ తన చేతిలోని టేప్‌రికార్డర్‌ను అక్కడపెట్టి డిక్‌తో చూస్తూండమని చెప్పి వెళ్తూంటే బాబా— "నా సంగతేమిటి ? నీవు చూస్తూండక పోతే దాన్ని నేనే కొట్టేస్తాను. నేను విశ్వతస్కరుడను. అందరి హృదయాలు దొంగిలిస్తాను నేను." అన్నారు.

అక్కడ ఉన్న ప్రేమికులందరు అది విని నవ్వుకుని "మన అందరి హృదయాలు యిదివరకే హరించేసారు;" అనుకున్నారు. బెన్ రాగానే ఎరచ్ "బెన్! యీ ఉదయం నిన్ను మూడుమాట్లు అడిగారు బాబా." అని చెప్పాడు.

బాబా—"నన్ను ప్రేమించే వారంతయూ వచ్చివాళ్ళయ్యారు. ఈ సూర్యుడు మెవడు మీద ఏదో పనిచేస్తున్నట్టుంది. మార్గరెట్ వచ్చిన ప్రతివారితోను "ప్రశ్నలడుగుతూ వృధా కాలయాపన చేయకండి." అని చెప్తోంది. 200, 300 మందికి చెప్పిన తరువాత ఏ గొంతుక నొప్పి పెడుతుంది. ఇంక గొంతుకనొప్పి తగ్గడానికి బిళ్ళలు దగ్గరపెట్టు కొని వేసుకుంటూ ఉండు అని హెచ్చరించాను. అది విని బి వి అనుకుంది ఓహో! బాబా కి ఆ బిళ్ళలు కావాలి కామోసు అనుకుని కిట్టీ తోను యింకొకరితోను చెప్పింది. ఎవరో బజారుకు వెళ్ళి తెచ్చారు.

భోజనాల సమయంలో కిట్టీ బాబాను అడిగింది – బాబా! గొంతుక ఎలా ఉంది? అని. దాంతో సంగతంతా బయటపడింది.

బాబా :—అంటే నాకు జలుబు చేయనూ లేదు. గొంతుక నొప్పి చేయదనీ కాదు. నాకు జలుబు చేస్తుంది. గొంతుక నొప్పి వస్తుంది. నాకు అన్ని జబ్బులూ చేయడానికి అవకాశం ఉంది. విశ్వమంతటి బాధ నా మీదకు తీసుకుంటాను. కానీ యీ క్షణంలో నేను బాధ పడటం లేదు.

ఈ ఉదయాన్ని ఐవీ డ్యూక్, డాన్‌స్టీవెన్స్ నాకు చెప్పారు. "బాబా! 12-30 గంటలకు సిద్ధంగా ఉండ డానికి ప్రయత్నించండి. టెలివిజన్ కార్యక్రమం ఏర్పాటు చేసాం. 12–30 కి మీరు అవసరం అవుతారు." బార్న్ వదలి నా యింటికి నడచివెళ్ళి గబగబా భోజనం చేసి వచ్చేసాను యిక్కడికి సరిగా 12-30 గంటలకి. డాన్ స్టీవెన్స్ లేడు. టెలివిజన్ వాళ్ళులేరు, ఐవీడ్యూక్ లేదు."

ఐవీడ్యూక్ అక్కడే ఉంది. ముందుకి వచ్చి "ఇక్కడున్నాను బాబా!" అంది

బాబా యింకా యిలా చెప్పారు. "2-30 గం॥ లకు నేను బార్న్‌లో ఉంటాను. అప్పుడు నాకోసం చాలా మంది వస్తారు. పత్రికలో 2-30 గంటలు మొదలుకుని బాబా దర్శనార్థులతో సంభాషణలు చేస్తారని ప్రకటించినట్లు ఎలిజబెత్ చెప్పింది. కిట్టీ అన్నది – "బాబా! దయచేసి అక్కడికి వెళ్ళకండి. టెలివిజన్ కార్యక్రమం యిక్కడే జరుగుతుందండి" అని "మీరంతా చెప్పండి మరి. నేను అక్కడికి వెళ్ళాలా ఇక్కడే ఉండాలా? ఎక్కడ ఉండాల్రి మీరు ఏదో ఒకటి సరిగా చెప్పాలి ఐవీడ్యూక్ నేను యిప్పుడేమి చేయాలి?" అని బాబా అడిగారు.

బెన్ హేమన్ అందుకుని – "మీరు వాళ్ళకి వదిలెయ్యండి బాబా! వాళ్ళే ఏదో ఏర్పాటు చేస్తారు కదా," అన్నాడు. అంతహూ నవ్వారు

ఇంతలోనే డ్యూస్ చెప్పింది—"బాబా! నాలోని మీ యిచ్ఛ ఏమి చెప్తుంది? .. ఇంకా రెండున్నర కాలేదు. అంతవరకు ఆగవచ్చు ఎలాగూను," అప్పుడు బాబా, ఎలిజబెత్, ఐవీ ముగ్గురు కొంతసేపు చర్చచేసారు. చివరికి ఐవీ అన్నది—"బాబా! రెండున్నర వరకు మీ యిష్టం. ఏమయినా పని ఉంటే చేసుకోండి. ఈలోపుగా ఏమవు తుందో చూద్దాం"

బాబా యిలా జవాబిచ్చారు—"నాయిష్టమొచ్చినట్లు నేను చేస్తాను. ఇంకొకరు చెప్పినట్లు నేను వినను. అది నా అలవాటు. పురాతనమైన నా అలవాటు. మీ అందరికీ ఏది ఉత్తమమని నాకు తెలుసునో అది చేస్తాను. ఎవరు ఏది చెప్పినా వినేదిలేదు. మీకు ఏది మంచిదో అదే చేస్తాను. నాకు తెలుసును గనుక.

"మీరు యిప్పుడు వెళ్ళి మీ పనులు చూసుకోండి. ఈత కొట్టడానికి మాత్రం వెళ్ళవద్దు. భోజనానికి ముందు ఎవరు వెళ్ళారు సముద్రపుటొడ్డుకి? ఎవరయినా ఈద డానికి వెళ్ళారా?" అని బాబా అడుగగా క్రిస్టైన్ వీస్ "నేను వెళ్ళా" నని చెప్పింది. బాబా ఎప్పుడూ చెప్తూంటారు. ఒక్కరూ వెళ్ళవద్దు నలుగురయిదుగురు కలిసి వెళ్ళా లని. కొంతమంది లేచి వెళ్ళిపోతుంటే బాబా వెనక్కి పిలిచారు "మధ్దాలవ్‌ని నేను యింటికి పంపించేసానని ఎవరో అన్నారట. బిలీ: నేను చెప్పి వ్రాయించిన వివరణ చదువు" అని బాబా చెప్పారు.

మధ్దాలవ్ జూలై 26 వ తేదీన ఫ్లోరిడా నుంచి బాబాను చూడడానికి వచ్చిందని, బాబా ఆమెను కౌగిలించుకుని ఆమెను ప్రేమిస్తున్నానని చెప్పారని ఆమెకు మంచిహృదయం ఉందని బాబా అన్నారని ఆ వివరణలో బాబా చెప్పారు ఆమె మొదట 1952 వ సం॥లో బాబా దర్శనం చేసుకున్నప్పటి నుంచి ఆమెకు బాబా చాలా సహాయం చేసారని మధ్దాలవ్ చెప్పింది. ఆమె యింకా సంత్ కృపాల్‌సింగ్ అనే సాధుపురుషుడు ఢిల్లీ నుంచి సతారాకు అంతదూరం మంచి ఎండాకాలంలో ప్రయాణం చేసి బాబా దర్శనం కోసం వచ్చాడని విని తాను ఎంతో సంతోషించాను అని చెప్పింది. కృపాల్‌సింగ్‌ను చాలా ప్రేమిస్తున్నానని బాబా చెప్పారు. బాబా తాము యీ విశ్వానికి ప్రభువునని సాధు పులందరూ ఆయన బిడ్డలని చెప్పారు. ఏవిధంగా బాబా దర్శనం చేసుకొని కృపాల్ సింగ్ తిన్నగా ఢిల్లీ మరలి వెళ్ళిపోయాడో అలాగే మధ్దా కూడా బాబా దర్శనం చేసు కొని . జార్జియాకి వెళ్ళిపోవాలని బాబా చెప్పగానే ఆమె అంగీకరించిందని బాబా

చెప్పారు. ఆమె బాబాను అడిగింది — బాబా! మీరు మిర్టిల్‌బీచ్‌కి తిరిగివెళ్తారా అని అందుకు "అదంతా నా యిష్టం మీద ఆధారపడి ఉంటుంది. నేను మళ్ళీ యిక్కడికి వచ్చి చాలా రోజులుండ వచ్చును" అన్నారు బాబా.

ఈ ప్రకారం వ్రాసినది బిల్ చదివింది దాని నకళ్ళు అందరికీ యిప్పించారు బాబా. "62 ఏళ్ళ ముసలివానితో యిదే చిక్కు. కృపాల్‌సింగ్‌ను ముసలివాడంటే మరి నన్నూ ముసలివాడనే అనాలి." అన్నారు బాబా.

"బాబా 63 ఏళ్ళ చిన్నవారు" అన్నారు ఎవరో. అందుకు బాబా "నేను చాలా సనాతనుడను. నేను పురాణ పురుషుడను." అన్నారు. బెన్‌హేమన్ వైపు తిరిగి— "బెన్ నీవూ నేను చిన్నవారిమే" అన్నారు బాబా.

ఇంకా టెలివిజన్ వాళ్ళెవరూ రాలేదు. అందుచేత అందరూ బాబాతో బార్న్‌లోకి వెళ్ళారు. ఆయన కారులో వెళ్ళారు. కొందరు రోడ్డుమీద నడచివెళ్ళారు. అందుచేత అక్కడికి ఆలస్యంగా చేరుకున్నారు. ఆకాశం చూస్తే వర్షంపడేలా ఉంది. బాబా అందరినీ బార్న్ లోపలికి రమ్మన్నారు.

కొంతసేపయిన తరువాత ప్రియతమ బాబా మరల అడీల్, డెరెల్‌లను వారు వ్రాసిన ఉత్తరం భాగాలు చదివి వినిపించమన్నారు. ఈ మాటు బాబా విని బాగుందని తృప్తిని వెలిబుచ్చారు.

ఆకాశంలోని మేఘాలు నల్లబడ్డాయి. టి. వి. వాళ్ళు యింకా రాకపోయేసరికి హార్మియానేను పిలిచి విమానాశ్రయానికి కారు తీసుకుని వెళ్ళి వారు వస్తే కారులో తీసుకొని రమ్మని బాబా పంపించారు. ఐలీమ్యాన్‌ని యింకొక కారులో సెంటర్ ద్వారం దగ్గర వేచియుండమని పంపించారు. అసలు వాళ్ళు బయలుదేరేరా ఎందుకు ఆలస్యమయిందో తెలుసుకుందామని డాన్‌స్టీవెన్స్ వాషింగ్టన్‌కు ఫోన్ చేసి అడుగుదా మని ఉదయంనుంచి ప్రయత్నిస్తున్నాడు. వాషింగ్టన్ విమానాశ్రయంలో విమానం ఇంజన్ చెడిపోయిందని చెప్పారు. ఆ విమానయానం రద్దయి పోయిందట. ఆ బృంద ములోని బెన్నీ కార్వల్‌హో అనే అతడు ప్రయివేటు కంపెనీలు 28 ఉంటే అన్నిటికీ ఫోన్ చేసి చిన్న విమానం అద్దెకి దొరుతుందేమో అడిగాడు. టి. వి. వారు వారి బరు వైన సామానులన్నీ వదిలేసి తుఫాన్‌గా ఉన్నా అలాగే విమానంలో బయలు దేరి మిర్టిల్ బీచ్‌కి బయలుదేరారు. బెన్నీకి విమానం నడపడం బాగా వచ్చును గనుక అతడే నడుపుతున్నాడు. ఆరోజు ఉదయం బాబా ఐలీమ్యాన్‌తో అన్నమాటలు నిజమయాయి. టి. వి. కార్యక్రమంలో సాఫీగా నడపకుండా అడ్డం పెడితే పెడతాను అన్నారు. బాబా

మెట్టూ కూర్చుంటే బాబా అందరితోను మాట్లాడుతున్నారు.— "మీరంతయూ చాలా జాగ్రత్తగా వినాలి. ఇది చాలా ముఖ్యమయిన సంగతి —పైకి చాలా సులభంగా కనిపిస్తుంది గాని నా ప్రేమికులకు యిది ప్రధానమయిన విషయం. నన్ను ప్రేమించ డానికి నీవు నిన్ను నాలో పోగొట్టుకోవాలి. నన్ను మీ ఆత్మగా కనుగొనాలంటే మీరు మీ సుఖాలను బాధలను అన్నిటిని నాకు వదిలెయ్యాలి. దీని అర్థం ఏమిటి?

ఒకామె చెప్పింది —"చాలా సులభం —అంతా బాబాకి వదిలిపెట్టడమే!"

[బాబాను ప్రేమించడానికి మనలోని కోరికలను మన అహంకారాన్ని అంతను అన్నింటిని పూర్తిగా మరచిపోవాలి. మన అసత్యపు అహానుకు అంటే మన కోరిక లకు మన సౌఖ్యాలు వగైరాలకు యింక తావుండకూడదు. సంపూర్ణమయిన నిస్వా ర్థత ఏర్పడాలి.]

బాబా నొక్కి పక్కాణిస్తూ – అన్నీ వదిలేసి సుఖంగా ఉండాలి. మీ సుఖాలన్నీ నాకు వదిలేయండి. మీ బాధలన్నీ నాకు వదిలేయండి. అప్పుడు మీరు స్వేచ్ఛగా ఉంటారు. కాని అది చాలా గొప్ప సంగతి. కష్టమయిన విషయం. మీకు ముగ్గురు పిల్లలున్నారనుకోండి, ఆ ముగ్గురూ ఒక్కమాటుగా పోయారనుకోండి. మీరు ఏమంటారు ? మీరు చెప్పడం కాదు. మీరు అనుభూతి చెందాలి—"ఇదంతా బాబాకి వదిలేద్దాము. అది ఆయన అభీష్టము. అది ఆయన ఇష్టము." అని అనుకోవాలి.

కబీర్ ఒక మంచి మాట చెప్పాడు. ఈ ఉదయం నేను యిక్కడ తిరుగు తూంటే ఎరచ్‌ని అది వ్రాయమన్నాను. ఎరచ్ తరువాత ఆదీ హిందీలో ఆ పద్యం తిరిగి చెప్పాడు. అప్పుడు ఎరచ్ అన్నాడు.— "కబీర్ సద్గురువు. భారతదేశంలో అతన్ని అందరూ గౌరవిస్తారు – ప్రేమిస్తారు. అతడు తన గురువుతో అన్నాడు. నేను ఇంగ్లీషు తర్జుమా చేస్తాను." అని యీ విధంగా బాబా తర్జుమా చేసారు.—

"నాకున్న దేదీ నాకు చెందదు.
నాకున్నదంతా నీదే
నీదయినది నీకే అర్పిస్తే
నాకేమి నష్టము కలుగుతుంది ?"

**బాబా యింకా యిలా చెప్పారు—"అదే నా ప్రేమికులతో అంటున్నాను. మీ బాధలు మీ సుఖాలు— అన్నీ నాకు వదిలేయండి." అని.**

వర్షం కురవడం ప్రారంభించింది. పెద్ద పెద్ద వడగళ్ళు పడుతున్నాయి. అందరినీ త్వరగా వెళ్ళి బసలు చేరుకోమన్నారు బాబా. అప్పుడు కొంతమంది వెళ్ళిపోయారు. ఆ తుఫాను సమయంలో బాబా కుర్చీమీదనుంచి లేచి అటూ యిటూ తిరగడం ప్రారంభించారు. వసారాలోకి వెళ్ళారు. ఆయన వ్రేళ్ళు వేగంగా కదలడం కనిపిస్తూనే ఉంది. మరల వచ్చి కుర్చీలో కూర్చున్నారు. అప్పుడు కిట్టీ వచ్చి టి. వి. వాళ్ల విమానాశ్రయంలో ఉన్నారని చెప్పింది. బాబా టి. వి. వాళ్ళు వారితో కూడా వర్షాన్ని తీసుకు వచ్చారు— మీరు యిక్కడ ఉండగా అప్రమత్తులై ఉండండి. కునికిపాట్లు తీస్తూఉండకండి. రేపు సాయంత్రం వచ్చినప్పుడు మీరు బాగా మెలకువతో ఉండాలి. రేపు చాలా ముఖ్యమయిన రోజు. ఈ బార్నులో మీకు నేను యిచ్చే అవకాశాన్ని అందరూ ఉపయోగించుకోండి.

"మీ స్థాయికి నేను దిగుతాను. మీ అందరితోనూ కలసి మెలిసి ఉంటున్నాను. ఆడుతూ పాడుతూ సంతోషంగా కులాసాగా ఉన్నట్లు మీకు కనిపిస్తాను. కాని మీకు నా దివ్యత్వం గురించి బొత్తిగా తెలియదు. నా సర్వవ్యాపకత్వ స్థితి మీకు ఏమీతెలియదు. నాకు ఎంతో హాస్యరసం ఉంది, కృష్ణుని వలె. ఆ హాస్యరసంవలన నేనెవరినో మీరు మరిచిపోకూడదు. మీలో ఒకనిని గానే నన్ను కూడా కలుపుకొని నా అసలు స్థితిని మరచిపోకండి సత్పురుషులకు, ఉన్నత మార్గంలో ఉన్నవారికి ఉత్తమ చైతన్య స్థితి కలిగిన సాధువులకు నన్ను కొంచెం తెలుసుకోవడం సాధ్యమవుతుంది. నా యొక్క నిజరూపాన్ని మీరు లేశమాత్రం చూడగలిగితే మీశారీరక చైతన్యం పూర్తిగా కోల్పోతారు.

"నేను ఆటలాడే పిల్లవానివలె ఉల్లాసంగా, స్వేచ్ఛగా ఉంటాను. మరి వృద్ధుని వలె కూడా ఉంటాను. ఒకే సమయంలో నవనీతంలా మృదువుగాను, ఉక్కులా గట్టిగాను ఉంటాను. నన్ను నిజంగా హృదయపూర్వకంగా ప్రేమిస్తున్న వారే నా గురించి కొంచెం తెలుసుకోగలరు. మనసు నన్ను తెలుసుకోలేదు. మనసు నన్ను అసలు స్పృశించలేదు. దానికి ఆవలనున్నాను. మనసుకు నేను అతీతుడను."

ఆ క్రితం రోజున బాబా యిలాగే అన్నారు — "నేను మీతో నడుస్తాను. మీతో మాట్లాడుతాను. మీతో ఆడతాను. కాని జ్ఞాపకం ఉంచుకోండి నేను సర్వోన్నతుడను. సర్వోత్తముడను."

బాబా యింకా చెప్తున్నారు - "ఇక్కడ మనం అందరం ఓర్పుతో టెలివిజన్ వారికోసం వేచియున్నాము. నాకు మాత్రం యిదంతా ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే.

కార్యక్రమాలతో గాని అలాటి వాటి వేటితోనూ నేను బంధింపబడడం నాకు యిష్టం లేదు. కాని మీ ప్రేమవలన నేను బంధింపబడతాను. నా ప్రేమికులు ప్రపంచమానవులు నన్ను గురించి తెలుసుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటారు. నేను తీసుకువచ్చిన సత్య సందేశం వారికి తెలియజేయాలని చూస్తారు. ఏదో ఒక విధంగా వారి శక్తికొలది ప్రయత్నిస్తారు....వారు యీ టి. వి. కార్యక్రమం పెట్టారు. నాకు యిష్టం లేకపోయినా నేను బంధింపబడడానికి అభ్యంతరం లేదు నాకు. అయితే మీరు ఓర్పుతో నాతో వేచిఉండాలి. వదిలిపెట్టి వెళ్ళిపోవడానికి వీలులేదు. మీకు దాహం వేస్తున్నాసరే సరిపెట్టుకోవాలి.

డాన్ ని యిక్కడికి పదినిమిషాలలో వచ్చి ఉండమన్నాను. ''అలాగే బాబా పదినిమిషాలలో వస్తాను'' అన్నాడు. ఇప్పుడు పదికాదు 30 నిమిషాలయిందేమో! ఎవరినయినా యీపని ఎంతసేపటిలో అవుతుంది అని అడిగితే బాబా! ఏముంది ఒక్క నిమిషం! అంటారు. అప్పే ఒక్క అయిదు నిమిషాలు అంటారు. నాకు తెలుసు. అయిదు గుణిస్తూ కూర్చోవాలి నేను.''

ఈ విధంగా ప్రియతమ బాబా వారంతా వేచియుంటూ ఉండగా కబుర్లతో కాలక్షేపం చేస్తున్నారు.

''నాకు ఇండియాలో టోకా అనేచోట— అహమద్ నగర్ కి 40 మైళ్ళ దూరంలో— ఒక సెంటరు ఉండేది. అందులో అనేకమంది పిల్లలుండేవారు. ఆ ఆశ్రమవాసం ఆ పిల్లలగురించి ఒక పుస్తకం కూడా ఉంది. (రంజూ వ్రాసిన ''సాబ్స్ అండ్ త్రాబ్స్'') బాలురకోసం ఒక ప్రత్యేక విభాగం ఉండేది. మండలివారు పెద్దవారు కూడా అక్కడ ఉండేవారు. స్త్రీ మండలి వేరే ఒక భాగంలో ఉండేవారు. అది ఒక పెద్ద ఆశ్రమం. మొత్తం 500 మంది ఉండేవారు అందులో. నేను పెద్ద బల్లగదిలో ఉండేవాడిని. బల్లకప్పు. దానిక్రింద గదిలా ఉండేది. ఆ గదిలో నేనుండేవాడిని. మీలో కొందరు ఆ బల్లను మెహెరాబాద్ లో చూసారు. అందులో అనేకరోజులు నేను ఉపవాసం ఉండేవాడిని. ఒక్కొక్కమారు మంచినీళ్ళతోటే ఉండేవాడిని. ఒక్కొక్కప్పుడు కాఫీ తీసుకునేవాడిని. అయితే నేను ఏకాంతంలో అప్పుడు లేను. ఆ సమయంలో నావద్దకు ప్రజలని రానిచ్చేవాడిని. ఊరికే నాదర్శనంకోసం వచ్చేవారు. నన్ను చూడడానికి, నన్ను కలవడానికి రావడం ఇండియాలో దర్శనం చేసుకోవడం అంటారు— అంటే నా ప్రేమను నా ఆశీస్సును పొందడానికన్నమాట. అప్పుడు నేను చురుకుగా ఏవో పనులు చేస్తూ ఉండేవాడిని— బల్లక్రింద గదిలో ఉంటూనే.

ఒకమారు ఒకతడు వచ్చాడు. అతడు పసుపుపచ్చని బట్టలు వేసుకున్నాడు. ఏవో పూసలపేర్లు మెడలో ఉన్నాయి. చేతిలో ఒక పెద్ద జపమాల ఉంది....గడ్డముంది. ఇండియాలో యిలాంటివారు చాలా మంది కనిపిస్తారు. వారిని కొందరు, మహాత్ములు అంటారు; సాధువులు అంటారు. వారికి ఆనవాలేమిటంటే పొడుగాటి గడ్డము. పొడుగాటి కాషాయరంగు బురఖా— కఫ్నీ— ఒక రుద్రాక్షమాల. అతడు వచ్చి "బాబా! నీకు సమర్పణ అయిపోతున్నాను అన్నాడు. నాకు సాష్టాంగ నమస్కారం చేసాడు. నేను సరే మంచిదే అన్నాను. తరువాత అతడు వెళ్ళి మరునాడు మళ్ళీ వచ్చాడు—భార్య, ఏడుగురు పిల్లలతో. "బాబా! వీరే నాకున్న ఆస్తి అంతా. వారిని నీకు సమర్పిస్తున్నాను." అన్నాడు. అందరూ నవ్వుతున్నారు.

బాబా యింకా యిలా చెప్పారు — "పాపం వాడు తిండిలేక మాడుతున్నాడు. భార్యాబిడ్డలని పోషించడానికి సంపాదన ఏమీలేదు. ఇండియాలో ఆధ్యాత్మికమార్గంలో ప్రవేశించిన వారు సమర్పణ చేయడానికి తను మన ధనాలను అర్పిస్తారు. వాడికి తెలుసు ఆధ్యాత్మిక గురువు వద్దకు వస్తే అన్నీ సమర్పణ చేయాలి అని. అలాగే సమర్పణ అవుతున్నానంటే నేను సరే అన్నాను. మరునాడు వాని ఆస్తినంతా వెంట బెట్టుకు చక్కావచ్చాడు!—"

బాబా —"నా వద్దనుంచి ప్రసాదం తీసుకోని ఆరుగురూ ఎవరు? ఇండియాలో ప్రసాదం చాలా గొప్ప గౌరవంతో తీసుకుంటారు. అది భగవంతుడు మానవునికి యిచ్చేది. — ఒక ప్రేమకానుక అని తెలుసు వారికి.

"ఎవరు పట్టుకుంటారు? అని బాబా పళ్ళు విసురుతున్నారు. ఎలాగయితేనేం టి. వి. వాళ్ళు వచ్చారు. పాపం వాళ్ళంతా పడిన అవస్థకి అలసిపోయినట్లు కనిపిస్తున్నారు. కానీ ఉత్సాహంగా వెంటనే కెమేరాలు వగైరా అన్నీ అమర్చి సిద్ధం చేసుకుంటున్నారు. బాబాతో ఉన్న బృందాన్ని ఫొటో తీయడానికి దీపాలు అమరుస్తున్నారు.

టి. వి. కార్యక్రమం పూర్తయేసరికి సాయంత్రం 6 గంటలయింది. బాబా ప్రధాన భవనానికి వడిగా నడుస్తూంటే అందరూ వెంబడించారు. వెళ్తూ వెళ్తూ ఆయన హఠాత్తుగా ఆగిపోయేవారు. అప్పుడు ఆయనమీద వాళ్ళు వాళ్ళలో ఒకరిమీద ఒకరు పడుతూండేవారు. మరల నడక ప్రారంభించి బాబాతో రావాలి. తమ కంటె ముందు పోకూడదు అనేవారు గాని అసలు ఆయనతో సరిగ్గా నడవలేక పోయేవాళ్ళు వాళ్ళు. వస్తున్నారా లేదా? ఎంతదూరంలో ఉన్నారు అని చూడడానికి ఆగి వెనక్కి తిరిగి చూసేవారు బాబా.

ఫ్రెడ్ వింటర్‌ఫెల్ట్ రోజంతా ఏవో పనులమీద కారులో తిరుగుతూనే ఉన్నాడు. బాబాతో ఒక్క గంటయినా సహవాసం చేయలేదే అని మనసులో బాధ పడుతున్నాడు. తిరిగి తిరిగి బాబా వద్దకు వచ్చేసరికి సాయంకాలం 6-30 గంట లయింది. అప్పుడు అతని అదృష్టము పండినట్లు అతని కారులో బాబాని వారి యింటికి తీసుకొని వెళ్ళమన్నారు. అతనికి కలిగిన సంతోషం యింతా అంతా కాదు. బాబా యింటికి కారులో వెళ్ళడానికి అతనికి దారి తెలుసునా అని అడిగారు. బాగా తెలుసు నన్నాడు. కానీ అతనికి అంత అలవాటులేదు కాబోలు. కొంచెం దారితప్పి వెళ్ళేసరికి రోడ్డు చివర చెట్లు అడ్డమొచ్చాయి. అంతే ఆ రోడ్డు అక్కడితో ఆగిపోయింది. అతడు బాబాతో అంటాడు — "బాబా కారు ముందు యీ చెట్లు అకస్మాత్‌గా లేచాయి" అన్నాడు. బాబా నవ్వు ఒక్కరవ్వ పైకి వినిపించిందేమో కూడాను. కారు త్రిప్పి బాబా ఇంటిగేటు దగ్గర ఆపాడు ఫ్రెడ్. ఈ విధంగా బాబా ఫ్రెడ్ మనోరథం తీర్చారు.

ఆరోజునే అతని భార్య ఎల్లాకి ఒక అనుభవం కలిగింది. ఆ ఉదయం బాబా అందరినీ బార్న్ వద్దకు రమ్మని చెప్పారు. టి. వి. వాళ్ళు రావడం ఆలస్యమయేసరికి ఎల్లా వంటయింటి వద్దకు వెళ్ళి కిట్టీకి ఏదయినా సహాయం కావాలా అని అడిగింది. అబ్బే యీ రొట్టె నేనే చేసేస్తానులే బాబాకి అంది కిట్టీ, అక్కడికి వచ్చిన ఎల్లాతో. ఆమెకు బాబా కనిపించి "రా" అని ఆమెను పిలుస్తున్నట్లు అనిపించింది ఆమెకు. ఆమె వెంటనే లాగూన్ కేబిన్‌కి పరిగెత్తింది. చూస్తే అక్కడ ఎవరూ లేరు. అందరూ వెళ్ళిపోయారు. ఆమె కొంత దూరం బార్న్ వైపు వెళ్ళింది. ఇంతలో బాబా మిగిలిన బృందమంతా ఎదురయారు. బాబా అమెను ప్రక్కకు పిలిచి "ఎక్కడికి వెళ్ళావు?" అని అడుగగా ఆమె జరిగిన సంగతి చెప్పింది. "ఇప్పుడు నా వెనుకనే నాతో దగ్గరగా ఉండు" అన్నారు. ఆమె అలాగే చేసింది. మధ్యాహ్నం మళ్ళీ బాబా ఆమె ఉన్న చోటునుంచి వెళ్తూంటే ఆమె ఆయన కడకు ఏడుస్తూ పరుగెత్తుకొని వెళ్ళి "బాబా! నేను మీరు చెప్పినపని చేయలేను." అన్నది. బాబా చేతులు జాపి ఆమెను ఆలింగనం చేసుకున్నారు. ఆమె కళ్ళలోకి బాబా చూసారు. ఆమెకు అది యొక ముఖ్యమయిన పాఠము.

అన్నివేళలా బాబాతో ఎలా ఉండాలో తెలియడం ఎల్లప్పుడు సులభం కాదు. ఒకసారి బాబా అందరూ వేచియుండండి అని చెప్పవచ్చు. వారిని బాబా ఏ క్షణా న్నయినా పిలువవచ్చు. వారితో వీలయినంత ఎక్కువకాలము వారిని ఉండమని చెప్పవచ్చు. లేక కొన్ని గంటలవరకు తెమలనిపని చెప్పి ఎవరినయినా పంపెయ్యవచ్చు.

ఇద్దరు ముగ్గురిని ఏవో పనులు చెప్పి ఊళ్ళోకి వెళ్ళి రమ్మనేవారు. వారికి కార్లు ఉండేవికావు. ఆయన దగ్గర ఉండడానికి వీలులేకుండా ఏవో పనులు చెప్తారని విసుగుకుంటే ఎలాగు ? కానీ అటువంటి భావన ఎవరిలోనో కలిగిందని బాబాకు ఎలాగో తెలిసింది. కార్యకర్తలందరిని పిలిచి బాబా — "మీకు నా పని చేయడం ఇష్టంలేదా?" ఎవరూ జవాబు చెప్పలేదు. అప్పుడు బాబా ఎవరెవరికి ఏయే పనులు చెప్పి బయటికి పంపించాలో ఏకరువు పెట్టారు. అయినా అటువంటి భావన కలగడానికి కారణం బాబా యందున్న ప్రేమచేతనే గనుక ఆయనతో ఉండకుండా యిలా వెళ్ళిపోవలసి వచ్చిందే అని అనుకోవడం సహజమే గనుక బాబా వారందరిని క్షమించారు.

బాబా అందరికీ శెలవు యిచ్చి సూర్యాస్తమయ సమయానికి వారి యింటికి వెళ్ళిపోయారు.

## జూలై 28, శనివారం :—

ఉదయం పెందరాళే అల్పాహారాలు చేసి అందరూ బాబా వద్దచేరి కూర్చున్నారు. ఎదురుగా ఉన్న చెరువులో నీళ్ళు సూర్యోదయ కాంతిలో మెరుస్తున్నాయి. టి. వి. వారు వారి పని పూర్తిచేసుకుందుకు రాత్రి ఆగిపోయారు. ఐ. వీ. డ్యూస్ బాబాతో సంభాషిస్తున్న దృశ్యం టి వి. ఫొటోలు తీస్తున్నారు. ఆమె బాబాను అడిగింది —

ఐ. వీ :—భగవంతుడు అనంతదయామయుడు కదా మరి ప్రపంచంలో యింత దుఃఖము యిన్ని బాధలు ఎందుకు కలుగుతున్నాయి ?

బాబా :—(అందరిలో శాశ్వతానందానికి మూలం ఆత్మయే. అలాగే శాశ్వత దుఃఖానికి కారణం మానవుల యొక్క స్వార్థపరత్వమే. స్వార్థానికి సంబంధించినవి సాధించుకోవడంలో తృప్తిపడుతున్నంతకాలమూ యిన్ని బాధలూ యింత దుఃఖమూ ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది.)

భగవంతుని యొక్క అనంతప్రేమ, కరుణవలననే మానవుడు యీ ప్రపంచంలో దుఃఖం వలన తాను నేర్చుకున్న పాఠాలవలన అతనిలోనే అనంతానందానికి మూలకారణం ఉన్నదని బాధలన్నీ కూడా తనలోని అనంతాత్మను ప్రదర్శించడానికి భగవంతుడే ఆయన ప్రేమవలన కావించే కృషియని తెలుసుకుంటాడు.

మైక్ లాఫ్టస్ తీస్తున్న టేప్ రికార్డ్ సరిగా వస్తోందా అని పరీక్ష చేయడానికి వెనక్కి చుట్టిపెట్టి చూసాడు. "ఏదోపప్పు నములుతున్న చప్పుడవుతోంది." అన్నాడు. బాబాతో సహితంగా అందరూ నవ్వారు.

కొంతమందితో రహస్య సంభాషణలు చేసారు బాబా. ఒక కార్యకర్తల సభ కూడా చేసారు. అది ఆతిథ్య సంఘానికి సంబంధించినది. బాబా యీ టెలివిజన్ ఫిలిం పూర్తిగా దవేగాలోనే కంపెనీవారి టెలివిజన్ ప్రదర్శన నిమిత్తమనీ అది మన కెవరికీ కాదని జ్ఞాపకం చేసారు. అది మత సంబంధమయిన కార్యక్రమంలో ప్రదర్శించడానికి మాత్రమే అన్నారు ఆతిథ్య సంఘానికి మిగిలిన డబ్బును మూడు విధాలుగా విభజించారు బాబా. మిర్టిల్‌బీచ్ సెంటరువారికి, సూఫిజమ్ రీ - ఓరియంటెడ్ వారికి, మన్‌డే నైట్ గ్రూప్ వారికి బాబా పనికోసం ఉపయోగించడానికి గాను బాబా యిచ్చారు.

బాబా అప్పుడు పశ్చాత్తాప ప్రార్థన, క్రిస్టియన్ ప్రార్థనల యొక్క నకళ్ళు కావాలన్నారు. కాని అవి ఎవరివద్దనూ లేకపోయాయి. సెంటర్‌లో ఒక గ్రంథాలయం ఉండేది. చాలామంది తీసుకోవడమే గాని పుస్తకాలు మళ్ళీ యివ్వనందున అసలు గ్రంథాలయం ఎత్తివేయవలసి వచ్చింది. ఈ ప్రార్థనల ప్రతి దొరుకుతుందేమో తేవడానికి కిట్టీ పరుగెత్తి వెళ్ళింది. బాబా కేబిన్ బయట ఇసుకలో నిలబడి యున్నారు. 'అవేకెనర్' ప్రత్యేక సంచికలో యీ రెండు ప్రార్థనలు ఉన్నాయని ఫిల్లిస్ కిట్టీకి జ్ఞాపకం చేసింది లేకపోతే ఫ్రాంక్ ఈటన్ వద్ద పుస్తకం దొరకవచ్చును అని చెప్పింది. ఫ్రాంక్ ఈటన్ సామానులో అదృష్టవశాత్తు పుస్తకం దొరకగా కిట్టీ తీసుకొని వచ్చింది.

కొద్దిసేపయాక బాబా ఫ్రెడ్ ఎల్లాలను ఫిల్లిస్‌ను పిలిచి మన్‌డే నైట్ గ్రూప్‌కి యిచ్చిన సొమ్ములో కొంతభాగం అవేకెనర్‌కి యివ్వాలని బాబా చెప్పారు. అవేకెనర్ పత్రిక ఆర్థికంగా అప్పుడు కష్టాలలో ఉంది. కానీ బాబాకు యీ సంగతి ఎవరూ చెప్పకపోయినా ఆయన గ్రహించి యీ ఏర్పాటు చేసారు. బాబా దయవలన తాత్కాలికంగా ఎవేకెనర్‌కి యిబ్బంది తీరింది.

ఉదయం 8-30 గంటలకి బార్న్‌లో అందరూ సమావేశమయినారు. టి. వి. కెమేరాల వారు, యింకా ఎంతమందో కెమేరాలతో సిద్ధంగా ఉన్నారు. బార్న్ పశ్చిమ దిక్కున బాబా చేతులు చాపి ఆశీర్వదిస్తూ ఒక చిన్న మొక్కను నాటారు. అదీ

పారతో ఆ మొక్క మొదట్లో మట్టిని వేసాడు. డాన్ స్టీవెన్స్ ఒక సందేశం చదివాడు. ఈ 500 ఎకరాల భూమి తమ ఆధ్యాత్మిక కార్యక్రమాలకి బాబాకి యిచ్చిన ఎలిజబెత్ పాటర్సన్ బాబా ప్రక్కన నిలబడి ఉంది. జూని కాట్జ్, యింకా యితర బాలికలు బాబా మెడలో పూలమాలలు వేసారు. ఒక చెట్టు క్రింద కూర్చుని ఉండగా బాబాను ఫోటో తీసారు.

చాలా రోజులుగా ఈదడం గురించి అక్కడి పాశ్చాత్య ప్రేమికులను బాబా ఏడిపిస్తున్నారు. వారికి దానియందు అభిమతం ఉందో లేదో చూద్దామని పరీక్షిస్తున్నట్లుగా ఉంది. ఒక చిన్న సమావేశానంతరం అందరను బాబా పంపించివేసారు. బిలికి మాత్రం పైపు చేసేవని ఏదో యిచ్చారు బిలి మరికొందరితో ఈదడానికి వెళ్దామను కున్నది. కాని బాబా యిచ్చిన పనివల్ల ఆఫీసు గదిలోకి వెళ్ళి ఒక గంటపైగా పైపు చేసుకుంది. ఆమె రాగానే మెహెర్‌జీ "ఎక్కడికి వెళ్ళావు? ఈదడానికి ఎందుకు వెళ్ళావు! బాబా గాబరా పడుతున్నారు. నీకోసం సముద్రం వద్దకు కారుకూడా పంపుదామనుకున్నారు. బాబా వద్దకి వెళ్ళి చెప్పు" అన్నాడు. ఆమె కోసం వెదుకుతున్న మండలివారిని మరికొందరిని కూడా బిలి కలిసింది. డా॥ నీలు చెప్పాడు — "నీకు ఈదడానికి వెళ్ళడమే గానీ నేనంటే అంత యిదిలేకపోతే నాతోకూడ కాలిఫోర్నియాకి వెళ్ళడానికి ఎవరిని తీసుకువెళ్ళను' అని బాబా అన్నారు.

ఇదంతా విని బిలీ ఏమీ గాబరాపడలేదు. కాని మిగిలినవారు మాత్రం కంగారు పడ్డారు. బిలీ తాను బాబా ఆజ్ఞ పాలించానని ధీమాగానే ఉంది. బిలీ గెస్ట్‌హౌస్‌కి వెళ్ళే సరికి ఏమీ తెలియనట్లు బాబా నెమ్మదిగా సోఫామీద కూర్చొని ఉన్నారు. ఆయన వద్ద కిట్టీ, ఎలిజబెత్, మార్గరెట్ క్రాస్కి యింకా యితరులెవరో ఉన్నారు. ఆమె యింతసేపూ ఏమిచేస్తోందో బాబాకు తెలుసునని ఆమెకు తెలుసును. ఆయన ప్రక్కనే బిలిని కూర్చోబెట్టుకున్నారు. ఒక పావుగంట అందరూ ఆనందంగా గడిపారు.

మధ్యాహ్నం అందరూ బాబాతో కలిసి బ్రూక్‌గ్రీన్ గార్డెన్స్‌కి వెళ్ళడం కోసం రెండు బస్సులు వచ్చాయి. అవి సమీపంలోనే ఉన్నాయి. అందులో శిల్పసౌందర్యం చూడడానికి బాగుంటుంది. ఒక కారులో ఫ్రెడ్ వింటర్‌ఫెల్ట్ నడుపుతూ ఉండగా బాబా, కిట్టీ, మండలి కూర్చుని వెళ్ళారు. మొదటి బస్సు కూడా వెళ్ళింది. రెండవ బస్సులో యీ బృందంలో వాడుగాక పైవారెవరో ఉంటే అతనిని దింపడానికి ఆగింది. అందుచేత అది బాగా వెనకబడింది. దానికోసం బాబా కారుని, మొదటి బస్సుని

ఆపేసారు. బాబా దిగి కొంచెంసేపు నిలబడి తరువాత ముందుసీటులో ఫ్రెడ్ ప్రక్కన కూర్చున్నారు. ఫ్రెడ్, బాబా తనకు చాలా దగ్గరగా కూర్చున్నారని సంతోషంతో ఏవో పాటలు పాడుతున్నాడు. అలాగే వెనుక కూర్చున్న మండలిలో ఒకరు ఒక భారతీయ భజనగీతం పాడుతున్నాడు. అది కృష్ణుడు ఆయన సారధి గురించి పాడిన పాట. ఆ పాట విని బాబా తల అడ్డంగా ఊపడం చూచి ఫ్రెడ్ పాడడం మాని వేసాడు. వెనక శిష్యుణ్ణి పాడమని బాబా సంజ్ఞచేసాడు.

రెండు బస్సులూ వచ్చేవరకూ మరల కారు ఆపి బ్రూక్‌గ్రీన్ గార్డెన్స్‌లోకి అందరూ ఒకమారే ప్రవేశించారు. కారు బస్సులు దిగి బాబా ముందు నడుస్తూంటే మిగతా ప్రేమికులు ఆయన వెనుక నడుస్తున్నారు. ప్రధాన భవనంలోని ఒకామె వీరికి అక్కడి విశేషాలు చెప్తోంది. గతవారంలోనే ఇండియా నుంచి కొందరు వచ్చి చూసారనీ, వారు ఇండియాలో తాజ్‌మహల్ కంటె యిది బాగుందన్నారని ఆమె చెప్పగానే అందరూ నవ్వారు.

శిల్పాలున్న హాలులోకి బాబా వెళ్ళి చూసారు. తరువాత ఏకాంతమయిన ఒక స్థలానికి వెళ్ళి ఒక ఫలవృక్షం క్రింద బాబా కూర్చున్నారు మిగిలినవారంతా ఆయన ఎదుట పచ్చగడ్డి మీద కూర్చున్నారు. వైట్‌సతి వారిలో కనబడనందున బాబా ఆమెను వెదకి తీసుకురమ్మని కిట్టీని పంపించారు. ఆమె యింత దూరం రాలేక అలసిపోయి వెనుక శిల్పమందిరం వద్దనే ఉండిపోయింది. బాబా తమ వ్రేళ్ళతో దేనిమీదో వాయించి పీటర్ ఫిబోడూను నీవు అలా చేయగలవా అని అడిగారు. పీటర్ ప్రయత్నించాడు కాని అంత జయం పొందలేదు. తరువాత బాబా స్పెక్స్‌హైటవర్ అనే కళాకారుని ప్రయత్నించమన్నారు. బాబా యిదివరలో తమ అక్షరఫలకం మీద వడిగా వ్రేళ్ళతో అక్షరాలు చూపిస్తూండేవారు. ఇలా మీరు చేయగలరా అని ఆ పలక గిరగిర త్రిప్పుతూ ఆ పలకను వారికి యిచ్చిన సంగతి వారికి జ్ఞాపకం వచ్చింది.

బాబా అప్పుడు అన్నారు – "పూర్వకాలంలో బుద్ధుడు చెట్టుక్రింద కూర్చున్నది నాకు జ్ఞాపకం వస్తోంది. అనేక వారాలు బుద్ధుడు ఉపవాసాలున్న తరువాత ఒక వృద్ధురాలు ఆయనకి బియ్యపు పిండితో రొట్టె చేసి పెట్టింది. ఆ రొట్టె తిని బుద్ధుడు చెట్టుక్రింద కూర్చున్నాడు. ఆ చెట్టుక్రిందనే ఆయనకి సుజ్ఞానం కలిగింది. అందుకే దానికి బోధివృక్షం అనిపేరు కలిగింది. నాకు బాబాజాన్ ఎలాగో ఆ వృద్ధురాలు బుద్ధునికి అలా అయింది. ఆమె బుద్ధుడికి జ్ఞానం రావడానికి సాయపడినట్లే నాకు కూడా బాబాజాన్ అతీత చైతన్యం రావడానికి సాయపడింది.

ఆ వృద్ధవనిత పేరు చెప్పమంటే బాబా జ్ఞాపకం లేదన్నారు. ఆ శనివారం సాయంకాలం ఏర్పాటయిన ముఖ్యమయిన సమావేశం గురించి బాబా యిలా చెప్పారు– ''సాయంకాలం 8, 8-30 గంటల మధ్య అంవయా బార్న్‌లో సమావేశం కావాలి. మీరు హాలులోకి వచ్చి కూర్చునేముందు మీ చేతులు ముఖము బాగా కడుక్కోండి. మీ చెప్పులు, జోళ్ళు తీసేసి లోపలికి ప్రవేశించాలి. కుర్చీలమీద కాకుండా మీరు నేలమీద కూర్చోండి. నేను చెప్పే మాటలు మీరంతా జాగ్రత్తగా విని అలా ఆచరించాలి.''

అప్పుడు ఎరచ్ - ''ఇండియాలో అక్కడి ప్రేమికులను చేతులు ముఖాలే కాకుండా బాబా వారి కాళ్ళు కూడా కడుగుకొని మరీ లోపలికి వెళ్ళి కూర్చోమంటారు. బాబా — ''నేను మీ స్థాయికి దిగి వచ్చాను. మీతో సరదాగా కలిసి మెలిసి తిరుగుతూ పరుగెత్తుతూ మీలో ఒకడ్నిగా కనిపిస్తున్నాను. అదే సమయంలో అన్ని భూమికల లోని వారితోను యిలాగే ఉంటున్నాను. మీరు మీతో భౌతికమైన యీ భూమికలోనే నన్ను చూస్తున్నారు. మీ స్థూల నేత్రాలతో అంతకన్న మీరు చూడలేరు. మీ దృష్టి పరిమితమయింది. ఈ భౌతిక ప్రపంచంలో నేను పని చేస్తూండడమే చూడగలుగు తున్నారు.

కూర్చున్నబాబా లేవడానికి తమ చేతిని ఫ్రెడ్‌వైపుకి చూపారు. ఫ్రెడ్ ఆ చేతిని పట్టుకొని లేవదీయబోతుండగా బాబా తమ బరువునంతటితోను అతనిమీద తమాషాగా పడ్డారు. అప్పుడు జాన్‌బాస్ వైపుకు రెండోచేతిని జాపారు — అతనితో కరచాలనం చేయబోతూ ఉన్నట్లు. అతడు ఆచేతిని పట్టుకోబోతూండగా బాబా అతని వీపుమీద తట్టారు. బాబా జాన్‌బాస్‌ని అందరికి సోడాలు తెమ్మని పంపించారు. ఆ తోటలో సోడాలు ఎక్కడా అమ్మటంలేదని అతడు అప్పుడే తిరిగివచ్చి కూర్చున్నాడు. టెక్స్ బాబా కోసం కొత్తచెప్పులు తయారు చేసాడు. అతనిని పిలిచి బాబా ఆ చెప్పులు తమ కాళ్ళకి సరిగా సరిపోతాయా అని చూద్దామని అవి యిమ్మన్నారు. అప్పుడు ఎరచ్ ఒక కాలికి, ఆదీ రెండవ కాలికి, ఆ చెప్పులు బాబాకి తొడిగారు. చెప్పులు సరిపోయాయి. బాబా ఎరచ్, ఆదీ తమ కాళ్ళకు చెప్పులు తొడిగినందుకు అవి బాగా ఉన్నందుకు సంతోషించారు. బాబా జాన్‌బాస్‌తో పాతవాటితోపాటు యివి కూడా ఉపయోగిస్తాను అని చెప్పారు.

బాబా లేచి తొందరగా నిలబడియున్న బస్సుల దగ్గరకు వెళ్ళారు. రాత్రి 8 గంటలకు సమావేశం ఉంది గనుక బయట ఊళ్ళో బసచేసిన ప్రేమికులను కూడా

భోజనానికి సెంటరుకు రమ్మంటారా అని కిట్టీ బాబాను అడిగింది. అందుకు బాబా, అవును వారిని కూడా మనతోనే వచ్చి భోజనం చెయ్యమను అని కిట్టీతో చెప్పారు. భోజనం యింతమందికి తయారుచేసారో లేదోనని కిట్టీ అనుకుంది. మిసెస్ డెలావిన్‌ని కావలసిన పదార్థాలు కొనమని కిట్టీ చెప్పింది. వీళ్ళ సంభాషణ విన్న జాన్ అందరి తోను భోజనాలకు రమ్మనిన ఆహ్వానం రద్దు అయినది అని అందరితోను గట్టిగా చెప్పేసాడు. అది విని కిట్టీ ఆశ్చర్యపోయి అదేమిటి బాబా అందరిని అక్కడికి భోజనానికి రమ్మంటేను అని బాధపడింది. బాబా ఆ మధ్యాహ్నం అంతా తోటలో వారందరితోను గడిపినందుకు చాలా సంతోషిస్తున్నానని చెప్పారు.

సెంటరుకి వెళ్ళి భోజనాలు చేసాక కొద్దిమందిని పిలిచి బాబా మాట్లాడారు. వారందరితోను — "మీకొక శుభవార్త చెప్తాను. చార్‌మియాన్ డ్యూవ్‌కి, జేం కారి నెట్‌కి వివాహం నిశ్చయం చేసాను. గతం, వర్తమానం, భవిష్యత్తు కూడా నాకు తెలుసును. వారి మంచికోసమే యీ నిశ్చయం జరిగింది. సెప్టెంబరులోనో అక్టోబరు లోనో వారి వివాహం జరగాలి. కొంతకాలం క్రితం చార్‌మియాన్ తన తల్లి ఐవీతో ఇండియాకు వచ్చి బాబా దర్శనం చేసుకున్నప్పుడే చార్‌మియాన్‌కి తగిన వరుని కుదర్చడంలో సహాయం చేస్తాను అని ఆమెకు మాట యిచ్చాను." అని బాబా చెప్పారు.

అమెరికాలో సూఫీ బృందానికి మన్‌డే నైట్ గ్రూప్‌కి అభిప్రాయభేదాలుంటే అవి సరిచేయడానికి యిరు బృందాలకి ఆ సాయంకాలం 7 గంటలకు బాబా ఒక సమావేశం ఏర్పాటు చేసారు. బాబా సమయానికి ముందుగానే అక్కడికి వచ్చి కూర్చొని అందరికీ ఆశ్చర్యం కలిగించారు. ఆయనతో కూడానే ఉండాలని తీర్మా నించుకొని తిరిగేవారు మాత్రం అదృష్టవంతులు. బాబాతో వచ్చి ఆయన సమీపాన కూర్చున్నారు. చీకటి యింకా బాగాపడలేదు. ఆ సంధ్యాసమయంలో తోటలోనుంచి చూస్తుంటే ఆ సరస్సు, పొడుగాటి ఆ చెట్లు అన్నీ ఒక దివ్యమైన సృష్టి అని తోచకమానదు. బాబా వారితో అన్నారు. — "హిమాలయ పర్వతాలలో తపోధ్యాన నిమగ్నులైయున్న ఋషులు మునులు నా దర్శనం కోసం తపిస్తారు. వారికి కూడా మీకు కలిగినటువంటి నాతో సహవాసముండే అవకాశం దొరకదు అందుచేత బాబాను తప్ప మీ మనసులలో దేని గురించీ ఆలోచించకండి." అన్నారు బాబా.

బయట ఊళ్ళోంచి రావలసిన వారింకా రాలేదు. ఇప్పుడింక సమయం లేదని మరునాడు ప్రొద్దున్న 9 గంటలకు సమావేశం వాయిదా వేసారు. అప్పుడు రెండు

విషయాలు చెప్తామన్నారు. "ఒకటి డాన్ ప్రశ్న అస్సిసీ సెయింట్ అయిన ఫ్రాన్సిస్ గురించిన్నీ, రెండవది బెన్‌హేమన్‌కి కావలసినది. ఇండియాలో వివిధ భాషలకు చెందినవి నూరు బృందాలున్నాయి. రేపు మీకు అందరూ కలిసి ఎలా పనిచేయాలో చెప్తాను. బార్న్‌లో జరిగే ధ్యాన సమావేశంలో ఏవిధంగా హృదయపూర్వకంగా చేయాలో చెప్తాను. అప్రమత్తులై వినండి" అని బాబా అన్నారు. అప్పుడు ప్రేమికు లను ప్రత్యేకంగా తమ ప్రేమ ప్రవాహంలో తడిపివేస్తామన్నారు. బాబా ఆ రాత్రి ప్రత్యేక సమావేశము తొందరగా ప్రారంభించాలని ఆతురతగా ఉన్నారు. అందరూ సమయానికి బాబాతో బార్న్‌కి వెళ్ళారు. అక్కడ లోపలికి ప్రవేశించే ముందు వారి కాలి జోళ్ళు విప్పేసి ముఖము చేతులు కడుగుకొని తుడుచుకొని వెళ్ళారు. బార్న్‌కి దక్షిణపు కొనని నీరు వచ్చే కుళాయిని అమర్చారు.

ఈ లోపల లోపలహాలులో బాబా నాలుగువైపులకు ఏదో ఆలోచిస్తూ పచార్లు చేస్తున్నారు. అంతటా నిశ్శబ్దంగా ఉంది. బయట చప్పుడుచేసే కీచురాళ్ళుకూడా ఊరుకున్నాయి. ఎవరో రహస్యంగా అంటున్నారు.—"ఆయన ఎంత అందంగా ఉన్నారు! ఆయనను చూస్తుంటే ఏదో బ్రహ్మాండమైన ఆధ్యాత్మికశక్తి పనిచేస్తోందని పిస్తోంది. దురవగాహమైన ఒక శాంతి ఆ వాతావరణంలో నిండి ఉంది—

అందరికీ సమావేశం 8 గంటలకి ముందే ఆరంభింపబడుతుందని తెలియ చేయబడింది. చాలా మంది ఊళ్ళోనుంచి వచ్చేవారు ఆలస్యంగా వచ్చారు. ఆల స్యంగా వచ్చిన వారిని వాసారాలో ఉండమన్నారు. దయామయుడయిన బాబా తరు వాత వారితో మీరు లోపల లేనందువల్ల ఏమీ పోగొట్టుకోలేదులెండి అని వారిని సమాధాన పరిచారు. మీరు సమయానికే వచ్చారని నాకు తెలుసును— ఆలస్యంగా రాలేదు. అసలు రాలేని వారు వాళ్ళ గదులలో ఉండేవారి మనస్సులను మాత్రం యీ సమావేశానికి హాజరయిన వారితో వుంచమని బాబా చెప్పారు.

ధ్యాన సమావేశం అయిపోయిన తరువాత ప్రేమికులు టార్చిలైట్లు వెలిగించి బాబాకు దారిచూపుతూ వారి యింటివరకు సాగనంపారు. దారిలో ఒక పొడుగాటి వృక్షాన్ని బాబా గట్టిగా చేతితో పట్టుకొని కొంతసేపు దానికి సమీపంగా నిలబడి యున్నారు. మిగిలిన వారంతా రోడ్డుమీద నిలబడి యున్నారు. ఆ సన్నని టార్చి వెలుతురులో (టార్చి ఆయన మీదకు వేయలేదు) బాబా యొక్క వదనము ఎంతో

బాధపడుతున్నట్లు కనిపించింది. ఆయన ఎంతో శక్తిని ఖర్చుపెట్టినట్లు కనిపించింది. బాబా తరువాత రోడ్డుమీదకు వచ్చి వడిగా నడక ప్రారంభించారు. అందరూ ఆయనతో ఉండడానికి పరుగెత్తవలసి వచ్చింది— మండలి కూడా.

ఆ రాత్రి పాశ్చాత్య ప్రేమికులు—లడ్‌డింఫిల్, ఎల్‌బెలోట్, స్పార్కీలూక్స్, చార్మియాన్—తారాజువ్వలు మొదలయిన బాణాసంచా వెలిగిస్తే అవి దూరాన సరస్సులోను అడవిలోను పడ్డాయి. వీరు సరస్సులోని పడవయింట్లో ఉండి వెలిగించారు. మిగిలినవారంతా ఒడ్డున ఉండి చూసారు. మొదట కొంతసేపటి వరకు బాబా కూడా వారితో నిలబడి చూసారు. తరువాత లాగూన్ వంతెనమీదనుంచి కొండపైకి నడచి వెళ్ళారు. అక్కడ తమ యింటిముందు ఉన్న కారు లైట్లు వెలుతురులో నిలబడి కిట్టీతోను, ఎలిజబెత్ తోను మాట్లాడుతూ కొంచెంసేపు నిలబడియున్నారు. తరువాత వెళ్ళిపోయారు. దూరాన తారాజువ్వలు చూసి పిల్లలు సంబరపడుతూ వేసిన కేకలు బాబా యింటి దగ్గరకు వినిపించాయి.

జూలై 29, ఆదివారం :—

ఉదయం అల్పాహారాలు అవగానే బాబాతో అందరూ కాలిదాటను సముద్ర తీరానికి వెళ్ళారు. బాబా వైఢూర్యంలా మెరిసేరంగు చొక్కా తొడుగుకొని ఉన్నారు. బాబా చెప్పులు తీసేసి నీటిలోకి దిగారు. బాబా సముద్రంలోకి ఒక రాయి విసిరారు. కొంచెంసేపు ఆయన వ్రేళ్ళు కదలడం కనిపించింది. తరువాత వచ్చి ఇసుకమీద కూర్చున్నారు. కూర్చొని చిన్నపిల్లలాగ కాళ్ళు ఇసుకతో కప్పుకున్నారు. మనిషి బొమ్మలా ఆ ఇసుకతో చేసి దానికి కళ్ళు నోరు పెట్టి దగ్గర నిలబడి చూసేవారితో ''ఇది అసలు ఆదిమానవుడు.'' అన్నారు. తరువాత దాన్ని పడగొట్టేసారు.

మండలివారు సమీపంలో నిలబడియున్నారు. పాశ్చాత్యులు మంచి గుల్లల కోసం తీరాన వెదకుతున్నారు. బాబా మెహెరాకి 7 సముద్రపు గుల్లలు తెచ్చి యిస్తానని చెప్పారు. ఒక్కొక్కరే వారికి దొరికినవి తీసుకువచ్చి బాబా ముందు పెట్టారు. కొన్నింటిని బాబా ఎన్నుకున్నారు. మిగిలినవి వదిలేసారు. వాటిని బాబా చేతులతో స్పృశించారని కొంతమంది తీసుకున్నారు. డాన్‌ఫీల్డ్‌కి పిల్లి కన్నులాంటి గవ్వ ఒకటి యిచ్చి బాబా అన్నారు.—''ఈ సముద్రానికి తీరం ఉంది. నేను అపార పారావారాన్ని. [తీరం లేని సముద్రాన్ని]

బాబా ఎన్నుకున్న గుల్లలను ఒక టోపీలోను చొక్కా జేబులోను వేసాడు లడ్. మిగిలిన వాటిని కారీ ఒక పర్సం కోటులో వేసింది. బాబా ఇసుక మీద తీరాన్ని నడుస్తూంటే ప్రేమికులు వెనకాల వెంబడించారు. నడుస్తూ బాబా ఏదో చేత్తో తీసారు ఇసుకలోనుంచి. అది ఒక ప్లాస్టిక్ గొట్టం. ఆ ప్రాతఃకాలపు ఎండలో సముద్ర కెరటాలు మెరిసిపోతున్నాయి. బాబాతో వారు ఎంతో ఆనందంగా తండ్రి వద్ద ఉన్న చిన్న పిల్లలలాగ ఏ బాధ్యతలు లేకుండా హాయిగా ఉన్నారు. ఫ్రెడ్ వింటర్‌ఫెల్ట్ వచ్చి "అన్ని విధాలా బాగా ఉన్న గుల్ల కనిపించలేదు. ఆధ్యాత్మిక సంపూర్ణత్వం లాగే అది కూడా అరుదయింది. ఈ శరీరపు గుల్లను వదిలేస్తేగాని అది కనబడదు" అన్నాడు బాబాతో. ఫ్రెడ్ రెండు గుల్లలు కలిసిన దానిని ఒకటి తీసి బాబాకి యిచ్చాడు. బాబా దానిని రెండుచేసి ఒకటి ఫ్రెడ్‌కి రెండోసగం ఎల్లాకి యిచ్చారు.

బాబా రెనీని పిలిచి ఆలిగేటర్ లేక్ (అది మరియొక సరస్సుపేరు) కి దారి చూపించమని నడిచి వెళ్ళారు. హారీ ఫ్లోర్‌షీమ్‌తో బాబా ఆరు ఆలిగేటర్ పక్షులను చూసానన్నారు. అతడు కళ్యాణ్‌లాగే నమ్ముతున్నాను అన్నాడు. అసలు అలాటి పక్షులే ఎక్కడా కనబడడం లేదే యీ చెరువుకి ఆ పేరెందుకొచ్చింది అని బాబా ఎలిజబెత్‌ను అడిగారు. అవి వాటికాలంలో వస్తాయని, వచ్చినపుడు యీ ఇసుక తిన్నెల మీద గ్రుడ్లు పెడతాయని యిప్పుడు వాటికి కాలం కాదని ఆమె చెప్పింది.

వచ్చిన బృందంలో ఒక తల్లి, పిల్లవాడు ఉంటే పిల్లవాడు చేతిని ఒక వైపున, తల్లిచేతిని ఒకవైపున పట్టుకొని, బాబా నెమ్మదిగా నడుస్తూంటే అందరూ ఆయన వెనుక నడుస్తున్నారు. అప్పుడు ఉదయం 8 గంటలయింది. మిర్టిల్‌బీచ్ పట్టణం నుంచి బస్సు అప్పుడే వచ్చింది. అందులో వచ్చినవారు అయ్యో బాబాతో ఉదయం నడవడానికి వెళ్ళలేక పోయామే అని విచారించారు. హిల్డాడిలాంగ్ అను ప్రేమికురాలు బాబాకు యిష్టమయిన ఒక గార్డెనియా పువ్వును కోసి ఆయన అల్పాహారపు బల్లమీద ఉంచింది. ఇప్పుడు అది ఆయన నీలి చొక్కాలో ధరిస్తున్నారు. త్వరగా కొంతసేపు నడిచి ఒక చెట్టుక్రింద బెత్తపు కుర్చీలో బాబా కూర్చున్నారు. ఆయనకు ఎదురుగా ప్రేమికులంతా కూర్చున్నారు. రాత్రి వాయిదా వేసిన బృంద సమావేశం యింక యిప్పుడు జరగాలి.

బాబా వచ్చే ఫిబ్రవరి 15 వ తేదీన తమ ఏకాంతవాసం ముగిస్తామని అందరికీ జ్ఞాపకం చేస్తూ యిలా చెప్పారు —

"నిన్న సాయంత్రం నేను జాన్‌బాగ్స్‌తోను ఇతరులతోను చెప్పాను. ఇండియాలో చాలా బృందాలున్నాయి. ప్రతిదానికి ఒక నాయకుడున్నాడు. అందరూ నేనంటే ఉన్న ప్రేమకోసం పనిచేస్తారు. అందరూ నన్ను ప్రేమిస్తారు. ఒక్కొక్క బృందం చేసేపనికి దాని నాయకుడు బాధ్యుడు. వివిధ బృందాలలోను భిన్న మతాల వారు, భిన్న కులాలవారు, భిన్నమైన ఆర్థిక అంతస్తులు కలవారు ఉన్నారు. సిక్కులు, ముస్లిములు, హిందువులు ఎంతోమంది ఉన్నారు. కాని అందరూ బాబాని ప్రేమిస్తారు. నా కోసం అందరూ పనిచేద్దామనుకుంటారు. నా సత్యప్రేమ సందేశాన్ని వ్యాప్తిచేయాలని చూస్తారు. ముస్లిములు వారి ప్రాంతాలలో ముస్లిములను తీసుకువచ్చి పనిచేస్తారు. పార్సీలు, క్రైస్తవులు అలాగే చేస్తారు. అమెరికాలో రెండు బృందాలున్నాయని చాలా కాలంనుంచి నేను వింటున్నాను. కానీ వాటి మధ్య ఏదో అభిప్రాయభేదం ఉంది. ఏమిటి అసలు పేచీకి కారణం ?

సన్‌డే నైట్ గ్రూప్‌కి నాయకుడు జాన్‌బాగ్స్. అతడు లేచి నిలబడి "ఒక్కొక్కప్పుడు ఒక బృందంలోని సభ్యులను యింకొకరు లాక్కుందామనే ప్రయత్నం జరుగుతూంటుంది." అన్నాడు.

బాబా ఐవీడ్యూక్స్‌వేపు చూసి యీమె సూఫిజమ్ రీ - ఒరియంటెడ్ సంస్థకు నాయకురాలు - "ఐవీ ! ఎలాగున్నావు ? సుఖంగా ఉన్నావా ?" ఆమె తల ఆడించింది. "బాగానే ఉన్నాను." అని. "బాగుంది. అయితే మంచి కజ్జాకి సిద్ధంగా ఉన్నావా ?" అన్నారు బాబా. అది విని అందరూ నవ్వారు.

జాన్‌బాగ్స్ యింకా యిలా చెప్పాడు. "1952 వ సం॥లో బాబాను దర్శించిన వాళ్ళకి "ఇజమ్"లు అక్కర్లేదు -- బాబా యొక్క పుస్తకాలు చదవడానికి ఆయన బోధనలు అర్థం చేసుకోవడానికి.

ఐవీ :—బాబాయే సూఫిజమ్ రీ-ఓరియంటెడ్ అనే సంస్థను సృష్టించారు. ఆయనే దానికి నిర్మాత. అసలు 'ఇజమ్' అక్కర్లేదనడం బాగాలేదు. బాబాయే యీ 'ఇజమ్' కావాలన్నారు.

బాబా :—మీరంతా ఒకటి తెలుసుకోవాలి. ఇండియాలో కూడా ఆంధ్రలో అందరినీ సమావేశపరచి యీ సంగతి చెప్పాను. ఇప్పుడు మళ్ళీ మీకు చెబుతున్నాను. నా కోసం సెంటర్లూ వద్దు. వివిధ స్థలాలలో వివిధ నామాలతో వివిధ బృందాలకి వివిధ నాయకులు - ఏమీ అక్కర్లేదు. ప్రతి ప్రేమికుని హృదయము

నా కేంద్రము ప్రేమించే హృదయం ఉన్న ప్రతి ప్రేమికుడు నా సెంటరు. ఎవరయితే నా సత్యప్రేమ సందేశాన్ని వ్యాప్తి చేయాలని చూస్తాడో అతనికి కొందరు కార్యకర్తలు, ప్రధానంగా ఒకచోట కార్యస్థానము అన్నీ ఉండాలి. ఒక బృందం ఉన్నప్పుడు దానికి ఒక కేంద్రస్థానం ఉండాలి. అలాటి కేంద్రాలు చాలా ఉండవచ్చు. మిర్టిల్ బీచ్ అటువంటి కేంద్రం. అది చాలా మైళ్ళ దూరం వరకు పనిచెయ్య వచ్చును.

"మీ అందరిలోనూ సహకారం ఉండాలి. సామరస్యం ఉండాలి. ఒకబృందంలో నుంచి సభ్యులను యింకో బృందానికి లాగుకోవాలని నాయకులు ప్రయత్నించకూడదు. ఎందుకు ? దేనికోసం ? అందరూ బాబా పనే చేస్తున్నారు కదా. అందరూ సహకరించి సమరసభావంతో పని చేయాలి. ఐవీ ఒక మారు నాతో చెప్పింది - "మీరు ఆజ్ఞాపిస్తే సూఫీ సంస్థను తీసివేస్తాను. లేదా దానితో నాకేమీ పనిలేకుండా చేసుకుంటాను." అని. కానీ నేనే వద్దన్నాను. ఆమెకు సభలు సమావేశాలు చేయడానికి, ఒక కార్యస్థానము పెట్టుకోడానికి వ్యవహారాలు చూసుకోడానికి నేను అనుమతి యిచ్చాను. ఆమె అన్నీ చేస్తోంది. భూత భవిష్యద్వర్తమాన కాలాలలో నేనే అందరికంటె గొప్ప సూఫీని. సూఫీలందరిని వారిపని కొనసాగించమని చెప్పాను. జాన్‌బాంక్‌ని వారానికి సోమవారాలలో రాత్రిపూట సమావేశాలు ఏర్పాటుచేసుకోమని చెప్పాను. డానా ఫీల్డ్‌తో కూడా వీలయినంతమందిని క్రొత్త ప్రేమికులను ప్రోగుచేయడానికి తన బృందం ఒకటి తయారుచేసుకోమని చెప్పాను.

"పోటీ ఉండకూడదు. ప్రతివాడు - ముఖ్యంగా బృంద నాయకులు—— ఇతరులకు ఆదర్శంగా ఉండాలి. ధూళిలా అణకువతో ఉండాలి. భగవంతుని పనిచేయడానికి ఎంతో అణకువ కలిగి ధూళిలా అయిపోవాలి. అహమును పెంపొందించేటట్టు చేయరాదు. పదవి, హోదా వీటినిగురించి అహాలను పెంచుకోరాదు. 'నేను నాయకుడను' అనే అహంభావం మంచిది కాదు. ఒక బృందంలో పనిచేసే కార్యకర్తలు ఆ బృందాన్ని వీడరాదు. కొన్నిపరిస్థితులలో ఎవరయినా తన బృందం మారవచ్చు. అందరూ నా పనే చేస్తున్నారు కదా. అలా అని చెప్పి ప్రతీ కార్యకర్త డోలుకి రెండువైపులా కొట్టకూడదు. ఒక బృందంలోని వారు యింకో బృందం వారితో సామరస్యంతో ఉండాలి. నా పనిచేయడానికి అవసరం కలిగినపుడల్లా అందరూ ఒకరి కొకరు సహకారం చేయాలి

"ఐవీ నన్ను ప్రేమిస్తోంది. ఆమె సూఫీ బృందానికి నన్ను ప్రేమించమని చెబుతుంది. జాన్‌బాౘస్ తన బృందానికి నన్ను ప్రేమించమని చెప్తాడు. ప్రతీదీ నావద్దకే వస్తుంది. ఒకరిగురించి మరియొకరు ఊరికే ఉన్నవీ లేనివీ మాట్లాడ కూడదు. అందరూ స్నేహితులుగా ఉండాలి. ఐవీ: నీవు జాన్ గురించి అద్భుత మయిన ఉత్తరాలు వ్రాసావు.

జాన్ :—ముఖ్యంగా 'గాడ్‌స్పీక్స్' ప్రచురణ తరువాత (జాన్ బాౘస్ యీ గ్రంథము అనేక ప్రతులు అమ్మిపెట్టాడు)

ఐవీ! ; చూసారా! అది చాలా అన్యాయం. 'ఇజమ్'ల ద్వారా ప్రజలు బాబా వద్దకు రావడంలో తప్పేమీలేదు. నీ నాయకునితో నీ యిష్టమొచ్చిన మార్గం నీవు చూసుకోవడంలో నీకు స్వేచ్ఛ ఉంది. కాని ఒక మారు వచ్చి మళ్ళీ వెనక్కిపోయి మళ్ళీవచ్చి— అది బాగా ఉండదు. అలా చేయకూడదు. సంయుక్తంగా బాబా పని ఏదయినా చేయాలంటే అందరూ కలిసి పనిచేయాలి.

మెహెర్ జీ :—అప్పుడప్పుడు సమావేశాలకి హాజరవడంలో తప్పేముంది? (అంటే ఒక బృందంవాడు యింకో బృంద సమావేశాలకి)

బాబా :—వెళ్ళవచ్చును. అయితే అది మామూలుగా కొంత అభిప్రాయ భేదం కలుగజేస్తుంది. నీ శరీరం అంతా నీది— చేతులు కాళ్ళు అన్నీను. కానీ నీవెంత ప్రయత్నించినా నీ చేతులతో నీ గొంతుక పిసికి నిన్ను నీవే చంపుకో గలవా? నీవు చేయలేవు. డాన్! నీవు వివరించి చెప్పు.

డాన్ లేచి యిలా చెప్పాడు— "బాబా చెప్తున్నారు. మనకి అందరికి రెండు చేతులున్నాయి. మన చేతులే మన మెడనులిమివేయగలవని మీరు ఎప్పుడయినా అను కున్నారా? ప్రయత్నించవచ్చు గాని అవి అలా చేయలేవు. ఆ చేతులు యింకొకరి గొంతుక పిసికి వెయ్యగలవు.

బాబా :—జాన్‌బాౘస్ నా ఎడమచెయ్యి. ఐవీ నా కుడిచెయ్యి. మీరందరూ నా గొంతుక. ఈ రెండు చేతులు ఎలా నా గొంతుక నొక్కివెయ్యగలవు? అది సాధ్యమా? ఒక ఎఱ్ఱచీమ ఉందనుకోండి. దాన్ని చంపడానికి కుడిచేయి ఎడమచేతి మీద కుట్టవచ్చు. [—ఆ ఎడమచేతిని ఆ చీమ కుడుతూ ఉంటే కుడిచెయ్యి ప్రతిరోజూ షడ్రసోపేతంగా భోజనం తీసి నోట్లో పెడుతుంది. ఎడమచేయి దానివలన ఈర్ష్య పొందుతుందా? ఆ భోజనం మొత్తం శరీరానికి — ఆ ఎడమచేయిని కూడా కలిపి — పుష్టి నిస్తుంది కదా!]

ఎలిజబెత్ సంగతేమిటి, ఆమె ఏ బృందానికి చెందినది? ఆమె ఏ బృందానికీ చెందకపోయినా ఏ బృంద నాయకునికంటే కూడా ఏ బృందానికి చెందిన ప్రేమికుని కంటే కూడా ఆమె ఎక్కువగా నన్ను ప్రేమించవచ్చును. బృంద నాయకుల కంటె గొప్ప ప్రేమికులుండవచ్చును. అది చెప్పడానికి వీలులేదు. అయినా ఏ బృందానికీ చెందని ప్రేమికుడు అందరికంటె గొప్ప ప్రేమికుడు కావచ్చును.

"నాకు కావలసింది ప్రేమ; ఇతరులకు ప్రేమ గురించి, సత్యము గురించి నా సందేశమును చెప్పడం ... అందుచేత సహజంగా, బృందాలు కార్యస్థానాలు ఉండాలి. పని అంతా సామరస్యంతో చేసుకోవాలి. ప్రతి బృందం మిగిలిన బృందాలతో సహకరించాలి. ఈ రోజున ఎవరయినా సూఫీ బృందంలో ఉంటే, రేపు అతడు జాన్‌బాస్ బృందంలో చేరాలనుకుంటే అతడు అలా చేరవచ్చును. కానీ జాన్‌తో అతని బృందం ఏమీ బాగాలేదని పట్టి పనికిమాలినదని గర్హించి మళ్ళీ సూఫీ బృందంలోకి వెళ్ళిపోయి జాన్ బృందం గురించి విమర్శిస్తూ ఉంటే అలాంటి వారిమీద నా అనుగ్రహం ఉండదు. నా ప్రేమ వారిపై ప్రసరించదు. పరోక్షంగా నిందించడం తప్పు. దానివలన భేదాభిప్రాయాలు ఎక్కువవుతాయి. గొడవలు బయలుదేరుతాయి. మీరు బృందం మార్చుకోవాలంటే మార్చుకోండి కానీ అది వదలి మరల వెనకటి దానిలో చేరడం అది వదలి మళ్ళీ యిందులో చేరడం కూడదు.

శామ్‌హోహాస్ :— ఎవరయినా తనంతట తాను కూర్చుని ధ్యానం చేసుకోవడమే సేవ అనుకుంటే? నేను ఎప్పుడైనా మన్‌డే నైట్ గ్రూప్‌కి వెళ్దామనుకుంటాను. ఎప్పుడూకాదు. ఎప్పుడైనా.

బాబా :—మీరందరూ ఏవో ఒక బృందానికి చేరి ఉండడం నా అభిమతం. ఎందుచేతంటే మీరంతా సహకరించి నన్ను గురించి ఇతరులకి చెప్పడానికి మీ అభిప్రాయాలు ఒకరికొకరు తెలుసుకోడానికి వీలుంటుంది. ఒక బృందంలో సభ్యులుగా ఉంటే ఉండనప్పటికంటే మీరు ఎక్కువగా తెలుసుకోవడానికి అవకాశం ఉంటుంది. మీరు ప్రసంగాలు వినేటప్పుడు, మాట్లాడుకొనేటప్పుడు, ప్రార్థనలు చేసేటప్పుడు నేను మీతో ఉంటాను. ఎక్కడయితే ఆయన పేరుతో అయిదుగురు కూడుతారో అక్కడ పరమేశ్వరుడుంటాడు. నేనుంటాను. మీరు నాగురించి మాట్లాడుతున్నప్పుడు, నా యెడల ప్రేమ కలిగి సహావేశమయినపుడు నేను అక్కడ మీతో ఉంటాను— తెలిసిందా?"

సభలు ఎలా నడపాలి? ఆ విధానమేమిటి? అనే ప్రశ్న బిఎ అడుగగా బాబా "నేను చెప్పినదానికి మీరు ఎందుకు కట్టుబడి ఉండాలి? మీరు స్వేచ్ఛగా ఉండండి.

బృందాలు సంవత్సరానికొకసారి అయినా కలుసుకోవాలి. బాబా జన్మదినం నాడు కలుసుకున్నా మంచిది ఐవీ! అది చాలదని కొందరన్నారు.

బాబా :—ఇండియాలో సభలలో అన్ని విషయాలు చర్చించుకొని సందేహ నివృత్తి చేసుకుంటారు. ఈ సభగురించి నేనేమీ చెప్పదలచుకోలేదు. ఇదివరకిలా జరుగలేదు. ఇప్పుడు మీరు చేస్తున్నట్టుగానే పని చేస్తూండండి మీ సమావేశం అయేవరకు. అప్పుడు అన్నీ పరిష్కారం చేసుకోవచ్చు. ఈ ఉదయం నేను చెప్పినట్లుగా పనిచేసుకుంటూ ఉండండి. పనిచేస్తూంటే మీ సమస్యలు తీరుతూ ఉంటాయి.

జాన్‌హాంస్ కి ఏదయినా మంచివార్త తెలిస్తే యితరులకి చెప్పడం అతని కర్తవ్యం. మిగిలినవారికి అది తెలియాలి. అలాగే వారికేదయినా తెలిస్తే వారు కూడా చెప్పాలి. అప్పుడు అందరూ నన్ను ప్రేమించగలరు. హృదయమును శిరమును సమంగా ఉంచుకోవడం నాపంతు.

బెన్ః నీ మనసులో ఏమనుకుంటున్నావు?

డా॥ హేమన్ లేచి—నేను ఒక గొప్ప వక్తనయినా నేను మీతో ఉండడం అనే అదృష్టం గురించి వర్ణించడానికి నాకు మాటలు చాలవు. మా హృదయాలు తెరచిన గ్రంథాలు. ఎలిజబెత్ పాటర్సన్, ఐవీ డ్యూక్, మేరియన్ ఫ్లోరెన్షిమ్ యీ మీ రాక సందర్భంలో ఎన్నో సదుపాయాలు కలుగజేయడానికి ఎంత బ్రహ్మాండమయిన పని చేసారో మీకు తెలుసును. తెర వెనుక ఎంతపని చేసారో అది నాకు లేశమాత్రమే తెలిసింది. మనం కనీసం చేయవలసింది వారికి ధన్యవాదాలు చెప్పాలి. మనం వారి కృషిని మెచ్చుకుంటున్నామని వారికి తెలియజేయాలి.

అప్పుడందరూ చప్పట్లు కొట్టారు. బాబా అప్పుడన్నారు— "ఎలిజబెత్, కిట్టీ, ఐవీ, మేరియన్, నోరీనా" వీరు నా కుడిచేతి అయిదువ్రేళ్ళూను.

తరువాత ఏంజెలా మిల్లర్, ఫ్లోరిడా నుంచి వచ్చిన ఒక అమ్మాయి, బాబాకు ఇష్టమయిన ఒక పాటను (గానోడ్ రచించిన ఆలీ మేరియా అనే పాట) తన పిల్లన గ్రోవిమీద పాడింది.

ఆ పాట వింటూ బాబా ఎక్కడో సుదూర ప్రదేశాలకి చూస్తూన్నట్లు దృష్టి నిగిడించారు. బాబా అంధుడయిన డా॥ కెన్మోర్‌ని తమ వద్దకు రమ్మన్నారు. ఆయన అతనికి తమ ముఖాన్ని చేతులతో నిమురనిస్తానని వాగ్దానం చేసారు. డాక్టరు దగ్గరకు రాగానే అతని రెండుచేతులను తీసుకొని అతని అరచేతులను తమ బుగ్గల మీద పెట్టారు. హరీ అప్పుడు వ్రేళ్ళతో బాబా ముఖము యొక్క ఆకారము మానసికంగా రూపకల్పన చేసుకుందుకు ముఖాన్ని నిమిరి తెలుసుకున్నాడు.

తరువాత హరోల్డ్ రడ్ పాడిన పాట యొక్క టేప్ రికార్డ్ వేయమని చెప్పారు. రడ్ ఆ పాట రచించి తానే పాడాడు. ఒక ఇటాలియన్ ఐస్‌క్రీమ్' వాడు బాబాలా కనిపిస్తున్నాడని ఆ పాటలో వ్రాసాడు. వసారాలో తెరల చాటున కూర్చొని హరోల్డ్ రడ్ టేప్‌రికార్డ్ వింటున్నాడు. బాబా అంతసేపూ హరోల్డ్ వైపే చూస్తున్నారు. ఆ పాట ఆయనకి బాగా ఉంది. మిసెస్. బాజేజియాన్ కూడా బాబా కి ఒకపాట వినిపించింది—— "నేను అందరికీ నమస్కరిస్తున్నాను. నిరంతరమూ మీ నామము చెప్పుతున్నాను—— 'బాబా ! బాబా !' అని."

విల్ పెరోట్ ఆశావాదిని గురించి నిరాశావాదిని గురించి తమాషాగా బాబాకి చెప్పాడు. బాబా కూడా అందరితో కలిసి నవ్వారు. ఆ రోజునే సెంటరు నుంచి వెళ్ళిపోయేవారు బాబాను ఆలింగనం చేసుకున్నారు. తరువాత ఎలిజబెత్ ఆయనను భోజనానికి గెస్టహౌసకి కారులో తీసుకొని వెళ్ళింది.

దారిలో కారు ఆపించి ప్రక్కనుంచి నడిచి వెళ్తున్న అడీల్‌ని పిలిచి బాబా "మెహెరా కోసం తెచ్చిన పిన్ ఎక్కడ ? అది ఎవరయినా ముట్టుకున్నారా ?" అని అడిగారు. న్యూయార్క్‌లో బాబా "మెహెరాను నేను అందరికంటె ఎక్కువగా ప్రేమిస్తున్నానని చెప్పగా స్త్రీలంతా వారు ఆమెకు ఏదయినా ప్రేమకానుక పంపవచ్చునా అని అడుగగా బాబా సరే అన్నారు. అప్పుడు వారు బంగారంతో చేసినది, ముత్యాలు పొదిగినది, చీరకు పెట్టుకునేది, ఒక పిన్ను పంపిస్తామన్నారు. ఇప్పుడు బాబా అడీల్‌ని ఆ పిన్ను గురించే అడిగారు. అది అందరికీ చూపించుదామనుకున్నారు. కానీ అది ఎవరూ స్పృశించరాదు. అడీల్ "బాబా! మరిచిపోయి నేను దానిని ముట్టుకున్నాను." అని చెప్పగా బాబా చిరునవ్వుతో మంచిపని చేసావు అన్నట్లు వేళ్ళతో సంజ్ఞ చేసారు.

ఆ రోజు మరల బాబా బయటకు రాలేదు. అందరూ సామానులు సర్దుకొని వెళ్ళడానికి సిద్ధంగా ఉండమన్నారు. ఆ సాయంకాలం కిట్టీ, ఫిల్లిస్ కలిసి అందరికీ

మరునాడు భోజనంలోకి శాండ్విచ్‌లు చేసారు. కిట్టీ బాబాతో ఇండియాకి వెళ్ళిపోవడం లేదు.

మధ్యాహ్నం నాలుగు గంటలకి ఆదీ పంటయింటి వరకు కారులో వచ్చి "పీటర్ ధిబోడూ ఉన్నాడా బాబాతో అతనిని పింగ్‌పాంగ్ ఆడమంటున్నారు" అని అడిగాడు. పీటర్ ధిబోడూ ఆ రోజున బాబా యింటిలోకి అందరితోను వెళ్ళినపుడు ఇంటిబయట పింగ్‌పాంగ్ బల్లచూసి "బాబా! నాతో పింగ్‌పాంగ్ ఆడతారా?" అని అడిగాడు. అప్పుడు బాబా నాకు సమయం లేదు అని చెప్పారు. ఇప్పుడు అతనికి అవకాశం వచ్చింది. బాబా, ధిబోడూ యిరువురూ పింగ్‌పాంగ్ ఆడారు. అన్ని ఆటలలోను బాబాయే గెలిచారు. అప్పుడు పీటర్ బాబాని "మళ్ళీ మీరు మిర్టిల్ బీచ్‌కి ఎప్పుడొస్తారు బాబా!" అని అడిగాడు. "విచారించకు మళ్ళీ రెండేళ్ళ తరువాత వస్తాను అన్నారు. సరే యీ లోపుగా బాగా ఆట అభ్యాసం చేసి బాగా నేర్చుకుని బాబాను ఓడించాలని పీటర్ ధిబోడూ అనుకున్నాడు. మిర్టిల్ బీచ్ లోని తన యింటిలో ఒక పింగ్‌పాంగ్ టేబిల్ పెట్టుకోవాలనుకున్నాడు పీటర్.

## జూలై 30, సోమవారం :—

సెంటర్‌లో బాబా ప్రేమికులకు బాబాతో గడపిన ఆఖరురోజు యిది. ప్రయాణాలు చేయడానికి విమానాలలో రిజర్వేషన్‌లతో హడావిడి పడుతున్నారు. ఎనిడ్ కార్ఫ్, ఆనీ జిన్స్‌బర్గ్ యిక్కడనుంచి బాబాతో కాలిఫోర్నియా వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు. హెరాల్డ్ రడ్ కడుపుతో ఉన్న తన భార్యతో యింటికి వెళ్తానని సెలవు తీసుకున్నాడు. కారీ బెన్ షమ్మాయ్‌ని ఇజ్రాయిల్ వెళ్ళి అక్కడ బాబా పని చేయమని బాబా చెప్పారు. వాషింగ్టన్ వెళ్ళనివారు బాబాని కౌగిలించుకున్నారు. బాబా జబ్బుగా ఉన్న తమ ప్రియమైన నూర్‌జెహాన్‌ను చూడడానికి వెళ్ళారు. నోరీనా మాచెబెల్లీని ప్రేమతో ఆ పేరుతో పిలిచేవారు బాబా. మౌనంగా ఒకరినొకరు చూసుకున్నారు. బాబా ఆమెను ఆలింగనం చేసుకున్నారు. అందమయిన ఒక చేరుమాలును ఆయన జేబులోనుంచి తీసి ఆ రుమాలును బాబా ఆయన హృదయానికి హత్తుకొని ఆమె జేబులో పెడుతూ "ఇది నీ తలగడక్రింద ప్రతిరాత్రిపెట్టుకో. నేను ఎల్లప్పుడు నీతో ఉన్నాను." అన్నారు. 10 గంటలకి బాబా సెంటరునుంచి వెళ్ళిపోతూ ఉండే బాబా ఆమె గదివైపు చూడగా ఆమె కిటికీలో నుంచి బాబాకి గుడ్‌బై చెప్పింది. అప్పుడు ఆయన ఒక వలయం చుట్టి సంజ్ఞ చేసారు. "ఈ ప్రపంచం అంతా పెద్దమాయ. నేనే సత్యమును." అని దాని అర్థము.

అందరూ బిచాణాలు కట్టుకుని 10-15 గంటలకు సిద్ధమయి బస్సు ఎక్కారు. బాబా కారు విల్మింగ్‌టన్‌కు నడపబడింది. అందరూ బయలుదేరబోతూ ఉంటే బాబా నుంచి ఒక సందేశమును మేరియన్ చెప్పింది. "మన్‌దే నైట్‌గ్రూప్ జాన్ బాక్స్ గ్రూపే కాదు. అది ఫ్రెడెల్లా గ్రూప్ కూడాను."

విమానాశ్రయంలో బాబా ఒక కర్ర బెంచీ మీద కూర్చున్నారు. అందరూ సామాను తూకెంచుకుంటూ ఉండగా కిట్టీ తెచ్చిపెట్టిన అన్నం కొంచెం తిన్నారు బాబా. న్యూయార్క్ వెళ్ళే వారు వచ్చి బాబా వద్ద సెలవు తీసుకున్నారు. ఎవరూ బాబాను ఏ ప్రశ్నలూ అడుగకూడదు. ప్రియతమునితో యీ వియోగం భరించలేక కొందరికి కళ్ళ నీళ్ళు వచ్చాయి.

అందరితోను బాబా కలిసి మెలిసి తిరిగారు. మౌనంతోనే ప్రతివారికి ఒక ప్రత్యేకతను చూపించారు.

ఫ్రెడ్ వింటర్ ఫెస్ట్ వింత దుస్తులను వేసుకుని రాగా అతడు డా॥ హేమన్‌తో నిలబడియుండగా బాబా వారి మధ్యకు వెళ్ళి కెమేరాలున్న వారిని ఫొటో తీయమని బాబా ఆహ్వానించారు.

బాబా పరివారంతో వాషింగ్టన్‌కి వెళ్ళే విమానం ఎక్కారు- బాబా విమానం గాలిలోకి పైకి లేచాక కొందరు దానితో కొంతదూరం పరిగెత్తారు. విమానంలో ఎరచ్ అందరూ చూస్తుండగా బాబా జుట్టు దువ్వి జడవేసాడు. కొన్ని వెంట్రుకలు దువ్వెనలో నుంచి తొంగి చూస్తున్నాయి అవి తీసి ఎరచ్ మిసెస్ వైట్‌కి యిచ్చాడు.

తరువాత బాబా తెల్లటి వారి తలగడ మీద జార్లబడి కూర్చున్నారు. ఆయన కళ్ళు మూసుకొని విశ్రాంతి తీసుకుంటున్నారు. అప్పుడు ఆ ముఖము చూసిన వారికి క్రీస్తు జ్ఞాపకం రాకుండా ఉండలేదు. ఆ ఫాలభాగం మీద గీతలు ఆ మోము మీద ఛాయలు ఆయన పడుతూ ఉన్న అనంతమైన బాధలు గుర్తుకు వస్తున్నాయి. అయినా కొన్ని క్షణాలలోనే తమ యెదుటనున్న ప్రేమికులను చిరునవ్వుతో నీవు సుఖంగా ఉన్నావా? అని పరామర్శ చేసి పలకరిస్తూనే ఉన్నారు. చాలా మారులు ఒక శాలువా వారి తలమీద ముసుగు వేసుకున్నారు, ఏ లోకాలలోనో ఆధ్యాత్మికంగా ఏదో పని చేయుటకు.

విమానం సమయానికి 50 నిమిషాలు ముందు వాషింగ్టన్ చేరుకుంది ఎందు చేతనో. అందుచేత కొంతసేపు పోటోమాక్, మౌంట్ వెర్నాన్ మీద ఎలయా

కారంగా చాలాసార్లు చుట్టింది ఆకాశంలో. విమానాశ్రయంలో చాలా మంది కెమేరాలతోను టెలివిజన్ కెమేరాలతోను వేచియున్నారు. కానీ బాబా వారినుంచి ఎలాగో తప్పించుకుని బయటకు వెళ్ళారు. బాబా ప్రేమికులు వారిని ఒక కారులో తిన్నగా ఐవీడ్యూస్ యింటికి తీసుకుని వెళ్ళారు.

మిగిలినవారినందరినీ నగరంలో దృశ్యాలు చూడడానికి వెళ్ళమన్నారు బాబా. సినిమాకి మాత్రం వెళ్ళవద్దన్నారు. ఒక బస్సు అద్దెకి తీసుకొని అందరూ అందులో తిరగడానికి బయలుదేరారు. వీళ్ళు ఒక ఆధ్యాత్మిక బృందం అని తెలుసుకుని ఆ బస్సు డ్రైవరు ఊళ్ళోవి నాలుగు విశేషాలూ చూపించి చెప్పడానికి బదులు తిరుగుతున్నంతసేపు వీళ్ళకి ఉపన్యాసం యివ్వడంతో కాలక్షేపం చేసాడు. ఆర్లింగ్టన్ సిమెటరీ లోపల చూసారు. అందులో కొత్తగా ఎవరో చనిపోయిన వారిని పాతిపెట్టారు. అది చూసి యీ బాబా ప్రేమికులు అనుకున్నారు — "అయ్యో! వీళ్ళు ఆయనను చూడకుండానే పోయారు పాపం!" అని. వారు తమకు కలిగిన అపూర్వ అదృష్టాన్ని జ్ఞాపకం చేసుకున్నారు. మూడే గొప్ప అదృష్టాలు అని వేదాంతంలో చెప్పబడి ఉంది — (1) మానవులై జన్మించడము; (2) భగవంతుడు కావాలని కోరుకోవడము; (3) ఒక సద్గురుని ఆశ్రయం దొరకడం" యీ మూడు కలిగాయికదా అని వారికి ఎంతో తృప్తి కలిగింది.

డ్రైవరుని తొందరపెట్టి విమానాశ్రయానికి మరల తీసుకువెళ్ళమన్నారు. అక్కడికి వెళ్ళినప్పుడే కెమేరావాళ్ళని టి. వి. వాళ్ళని బాబా ఎలా తప్పించుకున్నదీ తెలుసుకున్నారు. ఈ లోపుగా 3201, ఉడ్ లాండ్ డ్రైవ్‌లో ఐవీడ్యూస్ యింటవద్ద బాబాకు హార్దికంగా స్వాగతం యిచ్చారు, వాషింగ్టన్‌లోని సూఫీబృందంవారు. ఇంట్లోకి వెళ్ళేదారికి యిరుప్రక్కల తెల్లవి, బంగారు వర్ణమువి పుష్పాలు పూసాయి. బాబా యింటిలోపలికివెళ్ళి ప్రతిగదిలోను అడుగుపెట్టి ఆలోకించారు. వంటగదిలోకి కూడా వెళ్ళారు. ఆ యిల్లు బాబాకి నచ్చింది. బాబా ఐవీని "ఇక్కడనుంచి ఎందుకు వెళ్ళిపోతున్నావు?" అని అడిగారు. చార్మియాన్ డ్యూస్ తన పెళ్ళికి కుట్టించుకున్న దుస్తులు చూపించింది. బాబా వాటిని స్పృశించి ఆమెను దీవించారు. డరోతీ హట్ కొన్ని సముద్రపు చిప్పలు గుల్లలు యిచ్చింది. బాబా తాము ఏరుకొని తెచ్చిన వాటితో యివి కూడా ఇండియాకు తీసికొని వెళ్దామని స్వీకరించారు. ఒక చిన్న గదిలో బాబా కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్నారు. కొంచెం సేపయిన తరువాత ఆ గదిలోనే

బాబాను దర్శించుదామని వచ్చిన 200 మందితో సంభాషణలు జరిపారు. ఇండియన్ రాయబార కార్యాలయంలో పనిచేసే ఒక అధికారి కూడా వచ్చాడు. వాషింగ్టన్‌లో డా॥ ఖన్నా అనే సంత్‌కృపాల్‌సింగ్ శిష్యుడున్నాడు. అతని అనుచరులు కూడా వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. వారికి బాబా ప్రత్యేక దర్శనం యిచ్చారు. వారికి ఒక సందేశం కూడా యిచ్చారు.

బాబావి మండలివి అనేకమయిన ఫొటోలు తీసారు. బాబాను కొందరు పత్రికా విలేఖరులు—( ది న్యూస్, ది ఈవెనింగ్ స్టార్, ది వాషింగ్టన్ పోస్ట్ పత్రికలవారు) దర్శనం చేసుకుని ఆయనతో సంభాషించారు. మరునాడు (31-7-56) యీ సంభాషణల వివరాలు వారి వారి పత్రికలలో ప్రచురించారు.

## ది వాషింగ్టన్ ఈవినింగ్ స్టార్ :

ఈ పత్రికా విలేఖరి బాబాను "మీరు యీ నగరానికి రావడానికి కారణం ఏమిట"ని అడిగాడు. అందులకు బాబా చిరునవ్వుతో— 'నేను అనేకమారులు చెప్పాను. భగవంతుడొక్కడే సత్యమని. భగవంతుడు అందరిలోను ఉన్నాడు. ప్రతివారు భగవంతుని ప్రేమించాలి. భగవంతుని యెడల నీ ప్రేమ ప్రతివారిలోనూ అందరిలోనూ ఆయనను చూసే అంత ఎక్కువగా ఉండాలి. అని అందరికీ తెలిసేలా చెప్పడానికే నేను వచ్చాను'' అని బాబా చేసిన సంజ్ఞలను ఆయన కార్యదర్శి వ్యాఖ్యానించి చెప్పాడు.''

"ది వాషింగ్టన్ న్యూస్'' విలేఖరితో బాబా యిలా అన్నారు—

"స్వార్థపరత్వము యుద్ధాలకి మూలకారణము. అది నిర్మూలించి దాని స్థానే నిస్వార్థత నెలకొల్పాలి శాంతి స్థాపించాలంటే.''

మండలి, ప్రేమికులు కలిసి 18 గురుతో బాబా భోజనం చేసారు. ఇంకా ఊరిలోని సూఫీ బృందాన్ని ఆహ్వానించాలని అనుకున్నారు. కాని ఆ ఖర్చు ఐవీ భరించలేదని బాబా ఒప్పుకోలేదు. కానీ ఐవీ చెప్పిన ప్రకారం అక్కడ బాబా ఉన్న అయిదు గంటలవేళ ఆమె జీవితంలో మరపురాని ఉజ్జ్వలమయిన ఘడియలు. బాబా ప్రేమికులు వాషింగ్టన్ లోని దృశ్యాలు చూడడానికి తిరుగుతూ ఉండే ఆ సమయంలో బాబా వారి ద్వారా ఆధ్యాత్మికంగా పనిచేసానని తరువాత బాబా దానాఫీల్ తో చెప్పారు.

అందరూ ఊళ్ళో తిరిగి మరల బాబా వస్తారని విమానాశ్రయంవద్ద వేచియున్నారు. ఇలా వారు వేచియుండగా వారి ప్రియతముడు విమానాశ్రయానికి రావే

వచ్చారు. అప్పుడు రాత్రి 9-30 గంటలయింది బాబా కొంచెం అలసినట్లు కనిపిస్తున్నారు. ప్రేమికులంతా ఆయనను చుట్టు ముట్టారు. కొందరిని భోజనంలో ఏం తిన్నారని బాబా అడిగారు: బెరిల్ వంతు వచ్చేసరికి ఆమె "పాట్ రోస్ట్" అని చెప్పింది. అది కొందరికి "కాక్రోచ్" అని వినపడింది. బాబా కూడా వారితో నవ్వారు. ఆమె మరల అందరికీ తెలిసేలా చెప్పింది. ముఖ్యంగా మెహెర్జీ, జోసెఫ్ హార్బొలకు అలా వినిపించింది.

రాత్రి 10-30 గంటలకు బాబా విమానం బయలుదేరింది. మిర్టిల్ బీచ్ నుంచి విమానంలో క్రిస్టైన్ ఫీప్ ఆఖరు నిమిషంలో వచ్చింది. ఎనిడ్ కార్ఫ్, ఆడనీలు కూడా వారి సామానులు వగైరా తూపించుకుని వచ్చి చేరారు. పరివారం అందరూ 60 మంది ఉన్నారు. ఒకే లాస్ ఏంజిలెస్ ఏర్‌వేజ్ విమానంలో అంతా ఎక్కారు. చిట్టచివర తోక దగ్గర బాబా కూర్చున్నారు. పాపం కొందరు బాబాకు దగ్గరగా ఉందామని ముందు ఎక్కి కూర్చున్నారు. వారు ఆశాభంగం పొందారు. రాత్రంతా వారు చాలామంది కునికిపాట్లు తీసారు.

దారిలో డల్లాసలోను, టెక్సాసలోను విమానం ఆగింది. బాబా వారి పరివారము అందరూ ఒక అరగంట విరామం ఉండగా అక్కడ దిగారు. దిగి విమానాశ్రయంలో పచార్లు చేసారు బాబా. మళ్ళీ విమానం ఎక్కి కూర్చున్నారు. కిట్టీ వచ్చి మండలిని ఏమయినా తింటారా అని అడిగింది. వారు అక్కర్లేదన్నారు. ఆ రాత్రి మండలి ఎవరినీ బాబా నిద్రపోనివ్వలేదు. ఆదీ నిద్ర ఆపుకోలేకపోగా బాబా అతనిని ఏడిపించారు. బాబా ఆ రాత్రి తాము ఎంతో పనిచేసామని చెప్పారు. మేలుకొలిపే బాబా మెలకువగానే ఉన్నారు. ప్రపంచమంతా పడుండియుంది.

మిర్టిల్ బీచ్‌లో ఉన్నప్పుడు అనేకమంది పత్రికా విలేఖరులు వచ్చి బాబాతో సంభాషణ చేసారు. అందులో మిర్టిల్‌బీచ్ సన్ అనే పత్రిక యొక్క విలేఖరి ఒకడు. బాబా సోమవారమే మిర్టిల్ బీచ్ నుండి పశ్చిమతీరానికి వచ్చేసారు. బాబా ఆస్ట్రేలియా మీదుగా ఇండియాకి తిరిగి వెళ్ళామనే ఉద్దేశంతో ఉన్నారు. ఆస్ట్రేలియాలో సిడ్నీకి మెల్‌బోర్న్‌కి వెళ్తారని అనుకుంటున్నారు.

విలేఖరులు కొందరు 30 సంవత్సరాలనుంచి బాబా సేవలో ఉన్న ఆది. కె. ఇరానీతో మాట్లాడారు. అతడు బాబా గురించి వారితో యిట్లు చెప్పాడు—

"బాబా రాజకీయాలలో లేనేలేరు. ఆయన ఆధ్యాత్మికంగా పని చేస్తారు. ఆయన ఏపీ క్రొత్తమతము స్థాపించడానికి రాలేదు. దైవ మొక్కడే అని ఆ భగవంతుడే ఆయన రూపంలో యిప్పుడవతారమెత్తి వచ్చాడని మానవు లందరు ఒకే సోదరత్వము లోని వారని బాబా చెప్పారు. బాబా అన్ని మతాలను పునరుజ్జీవింప చేస్తారు. ఆయన యొక్క సూత్రాలు విశ్వవ్యాప్తమైనవి. ఆయన ఏ మతానుష్ఠానంలోను కలుగజేసు కోరు. పైగా ప్రపంచవ్యవహారాలకి అతీతులుగా ఉండడానికి ఎవరికయినా బాబా సహాయం చేస్తారు. ఆయనకు కావలసిందల్లా మానవుల హృదయాలు, భగవంతుడు. ఈ రెండింటితోనే వారిపని."

బాబా శిష్యులు బ్రహ్మచారులుగా ఉంటారనీ నైతికమయిన క్రమశిక్షణతో వారి జీవితాలుంటాయని అలా ఉండాలని బాబా పట్టుదల వహిస్తారనీ ఆదీ చెప్పాడు.

యువకుడయిన ఒక ఫ్లోరిడా దేశస్థుడు "ఆయన జీసస్ క్రైస్తు" అని చెప్పాడు. ఒక ఉత్తర నగరం నుంచి వచ్చిన వనిత ఒకామె "యుగయుగాలలోను క్రీస్తు మానవ దేహంలో అవతరిస్తున్నాడనీ యిప్పుడు మెహెర్ బాబా రూపంలో వచ్చినవాడు ఆయనే" అని చెప్పింది.

ఒక విలేఖరి బాబాను "మిర్టిల్‌బీచ్" అంటే మీకు యిష్టమేనా ?" అని అడుగగా "నేను చూసిన స్థలాలన్నిటికంటె నేను దీనిని ఎక్కువగా యిష్టపడతాను" అన్నారు బాబా.

## లాస్ ఏంజిలెస్‌లో నాలుగురోజులు

### మంగళవారం జూలై 31,1956 :—

లాస్ ఏంజిలెస్ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టులో 1956, జూలై 31 వ తేదీ ఉదయం 6 గంటలకి విమానం దిగింది. బాబా విమానంలోనుంచి దిగగానే లాస్ ఏంజిలెస్ ఆతిథ్యసంఘం వారు ముగ్గురు స్త్రీలు— మిసెస్ హిల్డా పుక్స్, (Phuks) మిసెస్ గ్లాడిస్‌కార్, మిస్ మార్గరెట్ పోలీలనువారలు. వారు బాబా మెడలో తెల్లటి ఎర్రటి కార్నేషన్సుతో తయారుచేసిన ఒక పూలదండవేసారు. బాబా ముందు కారులో హాలీవుడ్‌లోని మాజువెల్టు హోటలుకి వెళ్ళారు. వారి సామానులకోసం తరువాత అవి తీసికొని వెళ్దామని కొందరు శిష్యులు శిష్యురాండ్రు ఉండిపోయారు. బాబాతో ఆ విమానంలోనే ఎనిడ్ కార్ఫ్, ఆఁన్ గిన్స్‌బెర్గ్ అనే ప్రేమికులు కూడా వచ్చారు.

వారివి తెచ్చుకున్న సామానులేవో పోయాయి. బాబా సామానులలో కూడా ఒక సంచి కనబడకుండా పోయింది.

హాలీవుడ్‌లో బాబా బసచేసిన రూజ్‌వెల్ట్ హోటలులో బాబా గదిలోకి ఒక రొకరే వెళ్ళి పత్రికావిలేఖరులు బాబాను చూసారు. బాబాను ఫొటోకూడా తీసుకున్నారు. స్థానిక దినపత్రికలలో బాబా బొమ్మలు వారి గురించిన వ్రాతలు ప్రచురింప బడ్డాయి. ఏర్పాటుదార్లయిన నలుగురు స్త్రీలను బాబా పిలిచి వారితో వారి గదిలో మాట్లాడిన తరువాత బాబాకోసం వచ్చిన దర్శనార్థులను ఒకరొకరిగానో, బృందాలుగానో పిలిచి వారితో బాబా సంభాషించారు. ప్రతివారిని బాబా చిరునవ్వుతో పలకరించి నమస్కరించారు. వారికి ఒక్కొక్కరికి పండో, పటికిబెల్లమో బాబా ప్రసాదం యిచ్చారు. ఒక గ్రుడ్డి బాలుని (8 ఏళ్ళ వయసు) తీసికొని వచ్చిన తల్లిదండ్రులకు ప్రత్యేకంగా పటికిబెల్లం యిచ్చి ఆ రోజు నుంచి ఆ బాలునికి ఒక సంవత్సరంపాటు బాబాని తలుచుకుంటూ యిమ్మని చెప్పారు.

ఆ రోజున బాబా దర్శనం చేసుకున్నవారిలో చాలామంది క్రొత్తగా అంటే మొదటిసారిగా వచ్చినవారున్నారు. చాలామంది మాల్కొం స్క్లాస అనే ప్రేమికుడు, ప్రియశిష్యుడు ద్వారా బాబాకు పరిచయం కాబడినవారే. మాల్కొమ్ చనిపోయే ముందు చాలా సంవత్సరాలుగా లాస్ ఏంజిలెస్‌లో ఉండేవాడు. బాబాతో వచ్చిన పరివారం అనేక హోటళ్ళలో విడివిడిగా బస ఏర్పాటు చేసుకున్నారు. అడీల్‌కి మిసెస్ హిల్డాఫుక్స్ అనే ప్రేమికురాలు యింట్లో బస యిచ్చింది. ఆమె యొక్క స్నేహితులను కొందరిని ప్రత్యేకంగా కలుసుకుసేందుకు బాబా మధ్యాహ్నం 4 గంటలకు రావలసి ఉంది. ఆతిథ్యసంఘం వారు ఫిల్లిస్ మొదలయినవారు, బాబా రావడానికి కావలసిన ఏర్పాట్లు చేయడంలో సహాయం చేసారు.

ఆ సాయంకాలం "గార్డెన్ ఆఫ్ అల్లా" అనే పెద్ద హోటలులో విందు భోజనానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆతిథ్యసంఘంలో ఒకరయిన హిల్డా యింటికి సమీపంలోనే యీ హోటలు ఉంది. హిల్డా ఆస్ట్రియాలో ఉండేది. ఈమె భర్త యూదు అయినందువల్ల జర్మనీలో హిట్లర్ విజృంభించిన కాలంలో దేశం వదలి ఆమె భర్తతో కూడా అమెరికా వచ్చేసింది. ఈమె బాబాను అతిగాఢంగా ప్రేమించింది. ఆమె ఈయననే నమ్ముకుంది. బాబాను దర్శించాలని వచ్చిన 60 మంది బృందానికి 'డాన్‌స్టీవెన్స్ మొదట వచ్చి ఉపోద్ఘాతరూపంగా మాట్లాడాడు. బాబా 4-45 గంటలకు

వచ్చారు. రాగానే బాబా సంజ్ఞాపూర్వకంగా ఎరచ్ ద్వారా మాట్లాడుతూ "నేను మిమ్మల్ని కలుసుకోగలిగినందుకు చాలా సంతోషిస్తున్నా"నన్నారు. మిసెస్ ఫుక్స్ ఆమె స్నేహితులందరిని ఒక్కొక్కరినే బాబాకు పరిచయం చేసింది. వారంతా కరచాలనం చేసారు.

రూజ్‌వెల్ట్ హోటలులో జూలై 31 వ తేదీ (1956) మంగళవారం నాడు హెరల్డ్ ఎక్స్‌ప్రెస్ అనే పత్రికయొక్క విలేఖరి కూడా బాబాను దర్శించాడు. ("తన యొక్క ఉనికిని ఒప్పుకున్న ప్రతివాడూ భగవంతునియొక్క ఉనికిని అంగీకరించా డన్నమాటే. అతడు భగవంతునిలో నమ్మకం ఉన్నవాడే") అన్నారు బాబా. ఎరచ్ విలేఖరులకు బాబా యొక్క సంజ్ఞలను మాటలలో పెట్టి వివరించాడు. మీరు యెందుకు యింత కఠినమౌనం అవలంబించారు అని అడుగగా బాబా—"ఎవరూ చూడకుండా, ఎవరికీ వినిపించకుండా, దేవుడు అనాదిగా ఎప్పుడూ మౌనంలోనే పనిచేస్తున్నాడు; ఆయన యొక్క అనంత మౌనం అనుభవించిన వారికిగాని అది తెలియదు. నా మౌనమే మాట్లాడలేకపోతే నోటితో ఆడినమాటలవలన ప్రయోజనమేమిటి!" అన్నారు.

బాబాకి తన మౌనము విరమించాలనే ఉంది. అది ఎప్పుడు జరుగుతుందో ఎవరూ చెప్పలేరు. ప్రపంచ పరిస్థితులు యీ గందరగోళం ఒక పరాకాష్ఠ స్థితికి వచ్చి నపుడు మౌనవిరమణ చేస్తారని బాబా మండలి చెప్పారు. బాబా శిష్యులు యింకా యిలా చెప్పారు—బాబా అన్ని మతాలవారికోసం – క్రిస్టియనులు, యూదులు, హిందువులు, ముస్లిములు, బౌద్ధులు వగైరాల కోసం వచ్చారు. బాబా యిప్పుడు అమెరికాకు రావడం మూడవ ప్రపంచ పర్యటన చేస్తూ వచ్చారు. అనేకవేలమంది బాబా అనుయాయులు అమెరికాలో ఉన్నారు. ఇక్కడ (హాలీవుడ్‌లో) రేపు వుండి బాబా మెహెర్ మౌంట్ (ఓహై) కి వెళ్తారు. తరువాత శాన్‌ఫ్రాన్సిస్కోకి వెళ్ళి అక్కడనుంచి హూనోలూలూ (హవాయీ) కి వెళ్ళే వరకు అక్కడ ఉంటారు అంటే వచ్చే మంగళ వారం వరకు. అని బాబా శిష్యులు చెప్పారు. తరువాత 'ఆశ ఉంచుకో' అనే సందేశం డాన్‌స్టీవెన్స్ చేత బాబా చదివించారు.

## "ఆశ ఉంచుకో"— బాబా సందేశం (31-7-56)

"ఆధునిక యుగంలో మానవుడు ఆదర్శాల సంఘర్షణలో అటూ యిటూ గెంట బడి ఏమీ తోచకుండా కొట్టుమిట్టాడి పోతున్నాడు. ఆత్మ యొక్క అవసరాలను తీర్చ

దానికి అవసరమయినట్లుగా హృదయం లోని భావాలు వ్యక్తపరచడానికి అవకాశం లేకుండా బుద్ధికి కావలసిన విజ్ఞానం ఎడారిలోని ఇసుకదిబ్బలవలె పెరిగిపోతోంది. ఇదిలేకపోబట్టే విజ్ఞానంలో మానవుడు ఎంత పురోగమించినా తాను సాధించినవాటికి అడ్డంకులు కలిగాయి. చిత్తవికారపూరితముగాను యితరవిధముగాను సుఖం లేకపోవడము, రక్షణలేకపోవడము యీ యుగమునకు ప్రధాన లక్షణము. మానవాళి యుద్ధములు, ద్వేషము, భయము యొక్క అంధకారము చేత ఆవరింపబడి యున్నది.

అయినా నేను 'ఆశ ఉంచుకో' అంటున్నాను. తాను ఎప్పటినుంచో పరిణామం చెందుతూ తన జన్మ పరంపరల నుండి తన అన్వేషణ తప్పుదారిని బడుటచే సంపాదించుకున్నది అయిన స్వార్థం అధికారం కోసం వాంఛ మానవుని పశుత్వం వైపుకి ఈడ్చుకొని పోతోంది. కానీ మానవునిలో సత్యము యొక్క ఆర్పరానటువంటి వెలుగు ఉన్నది ఎందుచేతంటే అతడు అసలు ఆదిలో దివ్యమైనవాడు – అట్టివే ఉనికి కలిగినవాడు.

ఎవరు తమ హృదయమునందలి దుఃఖకారణమయిన స్వార్థపరత్వమనే విషము, ద్వేషము, దురాశ లేకుండా హృదయాన్ని పరిశుద్ధపరచుకుంటారో వారు భగవంతుని తమ నిజమైన ఆత్మగా కనుగొంటారు. భగవత్సాక్షాత్కారం అయినపుడు స్వార్థము యొక్క సమస్య దాని తాలుకు అనేకమయిన రూపాలు సూర్యునిముందు మంచువలె కరిగిపోతాయి.

భగవంతునిలో జీవితమంతా భగవంతుని వలె ఒకటే అని అవిభాజ్యమని అనిపిస్తుంది. మానవ రూపాలలోను యింకా అంతకు తక్కువగా ఉన్న జీవ రూపాలలోను అవి తానే అని పోల్చుకోవడముచేత కలిగిన వేర్పాటు భావం మాయాన్వితము.

దివ్యజీవనము యొక్క సత్యము తీరనటువంటి ఒక ఆశకాదు—— అది యదార్థము. అదొక్కటే వాస్తవమైనది. మిగిలినదంతా మాయయే. నీవు నమ్మకము కలిగియుండాలి. నీకు మోక్షము లభిస్తుంది. నీవు ప్రేమ కలిగిఉండాలి. నీవు భగవంతుడుగా ఉన్న నీ నిజరూపాన్ని కప్పివుచ్చునట్టి నీచమయిన పరిమితమయిన కోరికలను జయించగలవు. నిరాశతో తనకే కావలసే భావం ద్వారా కాకుండా నిరంతరము నీ వస్తువులను యింకొకరికి యివ్వడం ద్వారా ఆత్మలకు ఆత్మయైన దానిని కనుగొనుట సాధ్య మవుతుంది.''

తరువాత "ప్రత్యేక జీవుని ('అహం') యొక్క అజ్ఞానం" అనే సందేశాన్ని కూనా డాన్ చేత బాబా చదివించారు.

## "ప్రత్యేక అహము యొక్క అజ్ఞానం" :—బాబా సందేశం :—

నేను వేరు అనే భావాన్ని కలిగించే ఏ ఆలోచన, ఏ భావము, ఏ ఆచరణ అయినా తగని అజ్ఞానం వల్లనే ఉత్పన్నం అవుతుంది. అది ఒక కోటువలె ధరించటానికి ధరించకపోవడానికి అజ్ఞానం ఒక రూపం ఉన్న పదార్థం కాదు. అది బంధించేటటువంటి అజ్ఞానం శరీరాన్ని కాకపోయినా తప్పకుండా జీవాత్మను ఉపశమనము కానటువంటిన్ని అవమానపరచునటువంటిన్ని అయిన బాధకు గురియగునట్లు చేస్తుంది. అది సత్యమును వంచన చేసేటటువంటి అజ్ఞానము. అందుచేత అది ఆత్మవంచన చేసే ఒక రూపము.

దానికి తాత్కాలికమయినది బాహ్యమైనది అయిన మందులేదు. దానికి రాజీ మార్గాలు లేవు. ఆత్మను, ప్రేమ, సౌందర్యము నుంచి, ఆనందము నుంచి, స్వేచ్ఛ నుంచి, చైతన్యముతో కూడిన దివ్యత్వము నుంచి నిజమైన ఆత్మసాఫల్యత నుంచి ఆత్మను దూరంచేసేది అజ్ఞానము. అది ఒక ముల్లువలె గుచ్చుకుని బాధపెడుతుంది – సత్యమును పూర్తిగా అంగీకరింపక పోతే ఆ అజ్ఞానము చివరివరకు బాధ పెడుతూనే ఉంటుంది."

డానాఫీల్డ్ ఏదో వ్రాస్తూంటే ఏమిటి వ్రాస్తున్నావని బాబా అడుగగా "క్రానికల్" కోసం నోట్సు వ్రాస్తున్నానన్నాడు. బాబా తరువాత ఐవీడ్యూక్‌వేపు చూసి "ఏమిటి ఆలోచిస్తున్నావు" అని అడిగారు. ఆమె అందులకు జవాబు "మీరేమి ఆలోచిస్తున్నారో అని ఆశ్చర్యపోతున్నాను, బాబా!" అలాగే యితరులు కూడా అనుకున్నారు. ఆ మాటకి బాబా యిలా అన్నారు :—

"నేను అనుకుంటున్నాను. మీ అందరిలోను భగవంతుడు స్వేచ్ఛగాను, అనంతుడుగాను ఉన్నాడు. అయినా ఆయన మీలో ప్రతి యొక్కరిలోను బంధితుడై యున్నట్లు భావిస్తున్నాడు. కనుక ఆయన బాధపడుతున్నాడు. నేను అనంతంగా సుఖిస్తున్నాను. నిరంతరము ఆనందిస్తున్నాను. అయినా మీ ద్వారా ప్రతిక్షణం నేను బాధపడుతున్నాను. – మీ అందరిలోను నేనున్నాను గనుక."

ఐవీ అడిగింది–"ఎందుకు బాబా యీ బాధ!"

బాబా చెప్పారు :—"నేను మీలో శాశ్వతంగా బంధితుడయిఉన్నట్లు అనుభవిస్తున్నాను. ఉదాహరణకి —డార్విన్ అతని చేతులు, కళ్ళు, వ్రేళ్ళు కలిగి ఉన్నాడు. అతడు ఒక వేలుమీద పుండు వస్తే అతనికి బాధ తెలుస్తుంది, పుండు వచ్చి నది అతని వేలుకిగాని అతనికి కాకపోయినా, అలాగే నేను మీ అందరి బాధను అనుభవిస్తున్నాను. ఎందుచేతంటే మీరందరూ నాలో ఉన్నారు.

జీసస్ క్రైస్తు శిలువ వేయించుకున్నాడు. నిస్సహాయుడై అతడు మానవుల కోసం అలా చేసాడు. అతనికి అనంతమయిన ఆనందం కలిగింది. కాని అతనికి మానవ సహజమైన బాధకూడా కలిగింది. మొత్తం ప్రపంచం యొక్క బాధనంతను అతడు అనుభవించాడు. నేను ఎడతెరిపిలేకుండా అనంత ఆనందమును, మానవ బాధను పొందుతున్నాను."

బాబా ఫుక్స్ సతి వంక తిరిగి "ఆ గది యెక్కడవుంది?" అని అడిగారు. ఆమె భోజనాత్పూర్వము కొంత తడవు బాబా విశ్రాంతి తీసుకోవడానికి ఒక గది ఉందని చెప్పింది. దాని సంగతే బాబా అడుగుతున్నారు. ప్రసాదం అంటే యేమిటో బాబా చెప్తున్నారు. "ఇండియాలో అది భగవంతుని వద్దనుంచి వచ్చిన కానుక అని తెలుసుకొని అది అంటే గొప్ప గౌరవంతో స్వీకరిస్తారు." అని బాబా చెప్పారు.

మండలి తప్ప అందరూ బాబా యిచ్చిన ప్రసాదము తీసుకుందుకు ముందుకు వచ్చారు. ముందు వచ్చిన వారికి బాబా ఒక ద్రాక్షపండు "తీసుకు తిను" అని యిచ్చారు. వైట్ సతితో మాట్లాడిన తరువాత, ఒక పడక గదిలో విశ్రాంతి తీసుకున్న తరువాత, బాబా "గార్డెన్ ఆఫ్ అల్లా" కు వెళ్ళారు. మిగిలినవారంతా యిక్కడ చేరి బాబా కోసం వేచియున్నారు.

ఎవరు ఎక్కడ కుర్చోవాలో చీటీముక్కల మీద పేర్లువ్రాసి పెట్టబడి ఉన్నాయి. అందుచేత వచ్చినవారు వారి పేర్లుకనుక్కొని కుర్చీలలో కూర్చోడానికి కొంతతికమక పడ్డారు. అందరూ బాబా రాగానే లేచి నిలబడి వారు కూర్చునేవరకు నిలబడే ఉన్నారు.

డాన్ స్టీవెన్స్ బాబాకి స్వాగతం పలికాడు. రుత్ వైట్ ఆమె రచించిన పద్యం యిలా చదివింది.

"ఎవరు, నీవు మెహెరు బాబా?
నీ రహస్యము ఎవరి కెరుక?
మౌనమనెడి ముసుగులోన

శాశ్వతుడవు దాగియుంటివి
ఎవరు నీవు మెహెరు బాబా?

కొందరు కూర్చొనుటకు స్థలము లేక నిలబడి యుండుటచే మండలిని లేచి నిలబడి వారి కుర్చీలమీద కూర్చొనుటకు వారికి చోటు యివ్వమన్నారు బాబా.

బాబా "నేను యిక్కడకు వచ్చినందుకు చాలా సంతోషిస్తున్నాను. నేను మీ అందరిని ఆశీర్వదిస్తున్నాను. నేను కొద్ది సేపటిలోనే వెళ్ళిపోతాను. అయినా మీరందరూ ఉండి యీ రాత్రి భోజనము చేయండి. బాగా తినండి."

కొద్ది నిమిషాలతరువాత బాబా హోటలుకు వెళ్ళిపోయారు. అందరూ ఆయన వెళ్తూంటే తల్లడపాటుతో చూసారు. విందు కొనసాగింది. కాని అందులోని హృదయమే వెళ్ళిపోయింది. అందువలన అది పసందుగా లేకపోయింది. ప్రియతమ బాబాకు స్వాగతము సరిగా ఏర్పాటు చేయలేకపోయామని ఆతిథ్యసంఘం వారు, వారి స్నేహితులు భావించారు. ఆయన భగవంతుని పనిలో నిమగ్నమై యుండుటవలన వెళ్ళియుండవచ్చునని సరిపెట్టుకున్నారు. బాబా పేరుతో తయారు కాబడిన కేక్ మాత్రం ఆయనలేని లోటు ఎలా తీర్చగలదు? భోజనాలయిన తరువాత హాలీవుడ్ నగరం అంతా మిరుమిట్లు గొలుపుతూ కనిపించే ఒక ఎత్తయిన ప్రదేశానికి కొందరు వెళ్ళి చూసారు. అక్కడ నుంచి చూస్తే హాలివుడ్డే గాక లాస్‌ఏంజిలెస్ పట్నం యావత్తూ, బివర్లీహిల్స్ అన్నీ బాగా కనిపిస్తున్నాయి.

## ఆగస్టు 1 వ తేదీ, బుధవారం :—

ఉదయాన్నే బాబా దిగిన హోటలుకి వచ్చి యీ అమెరికన్ ప్రేమికులు అందరూ ఆయనను చూసారు. ఆయనతో కొంత అమూల్యమయిన సమయం గడిపారు. బాబా హాయిగా విశ్రాంతితీసుకున్నారు. అందుకని నవ్యతేజంతో కనిపిస్తున్నారు. వారందరినీ బాబా మామూలు ప్రకారంగా రాత్రి బాగా భోజనం చేసారా? బాగా నిద్ర పోయారా? అని కుశలప్రశ్నలు అడిగారు. బాబాతో యిదివరకు ఏర్పరచుకున్న ప్రకారం ఎవరో వచ్చి మాట్లాడుతున్నందున, యీ వచ్చిన ప్రేమికులతో ఎక్కువసేపు గడపలేకపోయానన్నారు బాబా. పెద్ద పీచ్ పళ్ళు తలొకటి వారివైపుకి విసిరారు బాబా. కొద్ది నిమిషాలయిన తరువాత బాబా అందరినీ లోనికి రమ్మని పిలిచారు. కొంతమంది అంతపెందరాళే యింకా అక్కడ చేరుకోలేదు. కొందరు లేవలేదు. కొందరు మెలకువ

వచ్చినా యింకా పడకలమీద అటుయిటు దొర్లుతున్నారు. మరి కొందరపుడు ఉదయపు అల్పాహారం తీసుకుంటూ ఉండవచ్చును.

ఇంక రెండు రోజులలో హాలీవుడ్ నుంచి శాన్‌ఫ్రాన్ సిస్కోకి వెళ్ళవలసి ఉంది. ఇదివరకు అనుకున్నప్రకారం కాక కార్యక్రమం రెండు రోజులు ముందుకి వచ్చింది. బాబా శాన్‌ఫ్రాన్‌సిస్కోలో కార్యక్రమం ఏమిటని లడ్వింగ్ డింపిల్‌ని అడిగారు. ఎవ రెవరితో ఇంటర్వ్యూలు ఏర్పాటుచేసారో – అంటే బాబాతో సంభాషించుటకు ఎప్పు డెప్పుడు ఎవరు వస్తారో ఆ ఏర్పాట్లు వివరించాడు. అప్పుడు బాబా యివన్నీ తారీఖులు మళ్ళీ సవరించి తెలియజేయమన్నారు – ఎందుచేతంటే రెండురోజులు ముందు వెళ్తు న్నారు గనుక. సరే అలాగే చేస్తానన్నాడు. ఎలాచేస్తే బాగుంటుందా అని యీ విషయం గురించి అతడు ఆలోచిస్తూనే ఉన్నాడు. మూర్షిదా డ్యూస్ గదికి వెళ్ళి అక్కడనుంచి శాన్‌ఫ్రాన్‌సిస్కోకి టెలిఫోనులో మార్పుల సంగతి మాట్లాడతానన్నాడు లడ్. బాబా అంగీకరించారు.

లడ్ ఐవీడ్యూస్ గదికి వెళ్ళాడు. ఆమెతో యీ క్రింది సంభాషణ జరిగింది.

"మూర్షిదా: మీ టెలిఫోన్ ఉపయోగించవచ్చునా? శాన్‌ఫ్రాన్‌సిస్కోతో మాట్లా డాలి."

"ఏం మాట్లాడతావు వాళ్ళతో?"

లడ్ ఆమెకు తన మనసులో ఉన్న మార్పుల సంగతి వివరించి చెప్పాడు.

"అలా చెప్పవద్దు. ఆ విధంగా మార్పుచేసిన ఏర్పాట్లు బాబా ఒప్పుకోరు."

"నేను బాబా దగ్గరనుంచే వస్తున్నాను! అలాగే ఆయన నన్ను చేయమన్నారు"

"లడ్! అది సరిగా లేదు బాబా అలా చెప్పి ఉండరు." అని ఆమె ఎలా మార్పు చేయాలో మరో విధంగా లడ్‌కి వివరించి చెప్పింది.

"ఏమో! బాబా నాతో అలా చెప్పారు. నేను విన్నది అది. నేను బాబా చెప్పినట్లు చేయాలి."

"సరే అలాగయితే. నీవు అలాగే చేయాలంటే చేయి."

లడ్ శాన్‌ఫ్రాన్‌సిస్కోకి ఫోన్‌చేసి 20 నిమిషాలు మాట్లాడేడు. ఫోన్‌పెట్టేసాడు. ఇంతలో తలుపు చప్పుడయింది. బాబా శిష్యుడయిన మెహెర్జీ వచ్చి మూర్షిదాను లడ్‌ను యిరువురను బాబా పిలుస్తున్నారని చెప్పాడు. ఇద్దరూ బాబా వద్దకు వెళ్ళారు.

"లడ్ ! శాన్‌ఫ్రాన్‌సిస్కో వారితో చెప్పావా ?" "చెప్పాను బాబా."

"ఏమని చెప్పావు ?"

ఇప్పుడు ఆ 20 నిమిషాల టెలిఫోన్ సంభాషణ అంతా వివరించి చెప్పాడు. బాబా ముఖం వాల్చారు. ఆయన యిలా అన్నారు.

"నేను నీతో చెప్పింది అదికాదు. నీవు సరిగా అర్థం చేసుకోలేదు. నేను చెప్పింది ఏమిటంటే ...." అని మూర్షిదా లడ్‌తో చెప్పిన విధంగా బాబా చెప్పారు.

అప్పుడు లడ్‌కి బాగా అర్థం అయింది. అంతవరకు తన పథకం బాగా ఉందని అది బాగా శాన్‌ఫ్రాన్‌సిస్కోవారికి సకాలంలో చెప్పగలిగానని ఎంతో సంతోషిస్తున్నాడు. కానీ తాను సరిగా వినిపించుకోలేదని అప్పుడు తెలుసుకున్నాడు. బాబా అనుకున్నదానికి మూర్షిదా అనుకున్నదానికి సాధారణంగా తేడా రాదు. వచ్చిందంటే అది ఏ శిష్యుడి వనో అయివుండాలి. లడ్ చేత మళ్ళీ ఫోన్ చేయించి సరిగా చెప్పించారు. బాబా గది బయటఉన్న హాలు చాలా మటుకు నిండింది. బాబా వారితో ___

"మీ అందరికి నేనొక సందేశం యిద్దామనుకున్నాను. కానీ మీరు అందరూ యిక్కడలేరు. ఇక్కడ లేనివారు మరల నన్ను 700 సంవత్సరాల తరువాత చూడ వచ్చును." అన్నారు. వెంటనే మిగిలినవారిని కూడా రమ్మని పిలుద్దామని హడావిడిగా కొందరు వెళ్ళారు. బెరిల్ వచ్చింది. ఆమె రాగానే బాబా "వచ్చావా ! నీవు యింకా చచ్చిపోయావనుకున్నాను." అన్నారు. అందరూ నవ్వారు. జాన్‌బాస్, డా॥ బెన్ వచ్చారు. వారు ఆలస్యంగా వచ్చినందుకు మేము నేరస్థులమే అన్నట్లున్నాయి వారి ముఖాలు. లేచిన తరువాత కాస్తదూరం నడిచివచ్చారు వాళ్ళు.

బాబా వారివైపు చూసి _ "నువ్వు చచ్చిపోయావేమో అనుకున్నాను _ నీవు జాన్ ! బెన్ ! నీవుకాదు. నీవే ముందు పోతావు. బెన్‌కంటె నీవు పెద్దవాడవుకదా." అన్నారు. అందరికీ మళ్ళీ నవ్వు వచ్చింది.

బాబా యిలా చెప్పారు___

"మీరంతా యిక్కడికి వచ్చి నాతో ఉండడానికి చాలా సొమ్ము ఖర్చుపెట్టారు. కానీ ముందుగా కొందరితో సంభాషించడానికి సమయాలు నిర్దేశింపబడినందువలన యిప్పుడు సమయం చాలదు. కానీ రేపు ఓజైలో నేను మీతోనే గడుపుదామను కుంటున్నాను. మీతోటే తిని, మీతోటే ఆటలాడి, మీతోటే పోట్లాడతాను."

అలా అని వారందరిసీ వెళ్ళిపొమ్మన్నారు. అందరూ రేపటి సహవాస్ గురించి ఊహించుకుంటూ కదలిపోయారు.

ఆ ఉదయం బాబాతో సంభాషించడానికి చాలామంది వచ్చారు. హాలు నిండి పోయింది. వారందరిని బాబా ఉన్న గదికి దూరంగా యింకో చోటుకి వెళ్ళి అక్కడ ఉండమని హోటలు మానేజరు నిర్దాక్షిణ్యంగా వారందరితోను చెప్పాడు. ఫిల్లిస్ ఫ్రెడెరిక్ తన తల్లిని బాబాకు పరిచయం చేసింది. ఆ వృద్ధురాలు ఎప్పటినుంచో యీ సమయం కోసం నిరీక్షించింది. ఆమెకు సంతోషమయింది. కొంచెంసేపట్లో బాబా అమెరికన్ ప్రేమికులను పిలిచారు. అందరూ (ఆతిథ్య సంఘంవారు వగైరా) బాబా చుట్టూ చేరారు. అప్పుడు డాన్‌స్టీవెన్స్ బాబాయొక్క సందేశము— దేవుడు, మానవుడు, దైవ మానవుడు— అను దానిని చదివి వినిపించాడు. బాబా డాన్‌ని "నీకు అర్థమయిందా ?" అని అడిగారు. డాన్ కొద్ది మాటలలో దాని సారాంశమును స్వంతమాటలలో చెప్పాడు.

బాబా యిలా చెప్పారు యీ సందేశంలో—

"భగవన్మానవునిలో భగవంతుడు, తండ్రివలెను, తనయుని వలెను, మానవుని వలెను, అంతా ఒక్కటేగా ప్రవర్తిస్తాడు. భగవంతుడు అనంతుడు – అర్థం చేసుకో లేని అతీతుడు. తనయుడు అనంతమయిన మనసు కలవాడు. మానవుడు మానవత్వం కలిగినవాడు. దైవమానవుడు యీ మూడు స్థితులను ఏకకాలము నందు కలిగి యున్నాడు, అనుభవిస్తూ ఉంటాడు. ఆయనలో తండ్రి, తనయుడు, మానవుడు ఒకటిగా ఉన్నారు. జీసస్ అలాగే తండ్రి, తనయుడు, మానవుడుగా ఉండెను. బాబా యొక్క క్రీస్తు చైతన్య స్థితిలో ఆయన యీ మూడు స్థితులను ఒక్క సమయమునందే అనుభ విస్తున్నాడు. తండ్రిలా ఆయన అనంతుడు. ఊహాతీతుడు. తనయునిలా ఆయన అనం తుడే కాని మనస్థాయికి దిగుతాడు. మానవుడులా ఆయన మానవుని వలెనే అనుభూతి చెందుతాడు" అని వివరించారు బాబా.

భోజనాల సమయం అయింది. అందరూ ఎవరి హోటలుకు వారు వెళ్ళారు. ఒక గంటలో భోజనాలయిన తరువాత బాబా గది వెనుక యింతకంటె పెద్దహాలు యింకొకటి ఉంటే అది తెరిచారు. లాస్ ఏంజిలెస్ నగరం నుంచి బాబా దర్శనం కోసం 200 మంది వరకు ఆ మధ్యాహ్నం వచ్చారు. ఒక చక్కని పిల్ల వచ్చి తాను బాబాను చూడవచ్చునా? అని అడిగింది. ఆమె బయట నుంచి యింతమంది జనం

యిక్కడ ఉండగా చూచి "ఇక్కడ ఏమి జరుగుతోంది?" అని అడుగగా "ఇక్కడికి మెస్సయ్యా వచ్చారు" అని ఎవరో చెప్పగా ఆమె తిన్నగా లోపలికి వచ్చింది — చూడవచ్చు, లోపలికి వెళ్ళు అనగానే లోపలికి వెళ్ళి ఆ అదృష్టవంతురాలు ఘనమైన మోహన స్వరూపుడయిన బాబాను దర్శించింది. తృప్తినిండిన హృదయంతో తళతళ మెరుస్తున్న కళ్ళతో ఆమె బయటకు వచ్చింది.

ప్రకృతి చికిత్సచేసే ఒక భారతీయుడు బాబాను దర్శించి వదిలి వెళ్ళలేక ఆయనతో తాను ఫొటోలో దిగాలని తంటాలుపడుతున్నాడు. చౌదరి యను యింకొక భారతీయుడు కూడా బాబాను దర్శనం చేసుకున్నాడు. ఇంతకు ముందు అతని మొదటి దర్శనానుభవాన్ని గురించి చౌదరి ఏమంటున్నాడో చూడండి—

"దిన పత్రికలో బాబా బొమ్మను చూసాను. వెంటనే ఆయన దర్శనం చేసుకుందుకు టెలిఫోన్ ద్వారా మాట్లాడి ఉదయం 9 గంటలకు అని సమయం నిర్ణయించుకొని వెళ్ళాను. 9 గంటలయింది. బాబా దర్శనం కోసం యింక వచ్చినవారందరిని ఒకరొకరిగా పిలుస్తారు. వరుసలో ఆఖరున ఉన్నాను నేను. అయినా నన్నే బాబా ముందుపిలిచారు. ఆ దివ్యపురుషుని సన్నిధిలో ప్రవేశించి సాష్టాంగ నమస్కారం చేసాను. ఆయన పాదాలమీద నా శిరసును ఒత్తాను. నా అశ్రు జలాలతో బాబా పాద కమలాలను అభిషేకం చేసాను. ఒక్క క్షణంలో నాకు కావలసిందేమిటో నా జీవితానికి సరిపడ్డది నాకు ఆయన కలుగజేసారు. బాబా అది ఆ క్షణంలో గుర్తించారని నేను తెలుసుకున్నాను. నేను అనేకమంది మహాత్ములను ఎరుగుదును. కానీ నేను కలుసుకున్న వారందరి కంటె యీయన గొప్పవాడు. ఆయన అటువంటి దివ్యమైన మంద హాసం కలిగి ఉన్నాడు .. మనకి కనిపించే ఆయన రూపంలో ఆయన ప్రేమ ప్రతిబింబిస్తుంది. ముఖాముఖిగా ఆయన వద్దకు వచ్చిన వాడు ఆశ్చర్యానందాలతో విభ్రాంత చేతస్కుడౌతాడు. అకస్మాత్తుగా అతనికి కలిగిన ఆ సౌందర్యరాశియొక్క దర్శనము తనలో ఇముడ్చుకోలేక తికమకపడతాడు. ఆయన చూడండి .... అందులో ప్రపంచం నిండి ఉంది. అందులో ఆప్యాయత, వినయము, సౌశీల్యము, జ్ఞానము నిండిపోయింది. నేను ఆయనను కలుసుకోవడము ఒక నది ప్రేమసాగరంలో సంగమమయినట్లే. ఒక బిడ్డ తప్పటడుగులు వేసుకుంటూ తల్లి వద్దకు వెళ్ళినట్లు నేను ఆయన వద్దకు వెళ్ళాను .... మనకు ఆయన యిచ్చిన సందేశమేమిటి? ఆయన మాట్లాడకుండానే ఆయన వద్దకు వెళ్ళినవారు ఆయన యొక్క అపేక్ష, ప్రేమ పొందుతారు.

ఆయన తిన్నగా మన హృదయంతోనే మాట్లాడతారు. గనుక ఆయన 'మౌన వచనా లను' యింకా బాగా వింటాము. అంత ప్రేమతో ఆయన మృదువుగా స్పృశిస్తారు. ఆ కరుణాభరితమైన చూపుతో చూస్తారు. ఆయన ముఖంలో కనిపించే హావభావాలు మనలను యింకోలోకానికి తీసుకుపోతాయి. ఎవరయినా ఆయన నజర్‌లోకి (దృష్టిలోకి) వచ్చారంటే వెంటనే స్వర్గసుఖాలను అనుభవిస్తారు. ఆయన ప్రేమ సముద్రంలా అనంతమైనవారు. నోటితో మాట్లాడడం కంటె ఆ భావాలే మనకి ఎంతో బోధిస్తాయి. అంతగా సాక్షాత్తు పవిత్రులలోకెల్ల పవిత్రుడయిన వానికిగాని చెల్లదు. బాబా దర్శనంలో విశిష్టత ఉంది; ఎన్నో తెలియజేస్తుంది. అది విశ్వంలో అందరికి కావలసింది. ఆగ్రా నుంచి వారణాసి నుంచి వచ్చిన వాకు — ఎంతోమంది మహాత్ములకు ఆవాసమయిన అక్కడనుంచి వచ్చిన నాకు — ఇక్కడ యీ పాశ్చాత్యదేశంలో బాబా యొక్క దర్శనం పొందడం ఎంతగా లేదూ? బాబా గొప్ప ఆధ్యాత్మికవ్యక్తి. బాబా ఎవరో మీకు తెలియదు" అని అంటాడు చౌదరి. సాయంత్రం 4 గంటలకు ప్రేమికులందరిని పిలిచి బాబా "బాబా కోసం పనిచేయడం ఎలాగ?" అనే సందేశాన్ని వినిపింప జేసారు.

## బాబా సందేశం - 1-8-1956

### బాబా కోసం పనిచేయడం ఎలాగ? :—

"నిజాయితీగల ఉద్దేశముతోను భగవంతుని యెడల ప్రేమతోను చేయదలచు కున్న పని అది బాబా పనియే. ఆ పని చేసేవారు ఎప్పుడూ ఆయనవారే. కాని బాబా కోసం కావింపగలిగిన అన్నిటికంటె గొప్పపని ఏదియనగా ప్రేమతోను, వినయము తోను, మనఃపూర్వకంగాను, నిస్స్వార్థతతోను కూడుకొన్నదీ, ఎంతమాత్రము కాపట్యము లేనిదీ అయిన జీవితమును జీవించుటయే.) బాబా ప్రేమ అందరికీ కలదు. ఆయన ప్రతియొక్క ప్రేమికునికి యితరులకు తెలియునట్లు జేయుటకు అతని యొక్క గాని ఆమె యొక్క గాని జీవితము ప్రకాశవంతమయిన ఒక ఆదర్శముగా నుండవలెను. అందువలన బాబా ప్రేమను సత్యము యొక్క యదార్థమును వ్యాపింప జేయుటకు ఆ జీవితమొక సాధనముగా నుండగలదు. అటువంటి జీవితము అటువంటి ప్రేమ చాలా ముఖ్యమయినది. ఉన్నతమయిన బాధ్యతతో కూడుకొన్నది. ప్రతి తలంపునకు, ప్రతి మాటకు, ప్రతి చేతకు వెనుక సర్వవ్యాపకమయిన సత్యము యొక్క శక్తి ఉన్నది.

"తెలిసియుండి ప్రేమ మార్గమును తొక్కాలంటే, ఒకరిలో క్రమశిక్షణ రావాలంటే ఆత్మనిశ్చయము నిజాయితీ గలిగిన ప్రయత్నము కావాలి. క్రమశిక్షణ అనే లత మొదట్లో ఎండిపోయిన గడ్డిలా కనబడవచ్చు. కాని పట్టుదల గనుక ఉంటే దానంతట అదే చిగిర్చి పుష్పించి ప్రేమికుని జీవితంలోకి అల్లుకుపోతుంది. తన స్వంత దృష్టాంతము ద్వారా యితరులకు సహాయము చేయాలంటే ప్రేమలో పూర్తిగా తడిసిపోవడమే కాకుండా అందులో మునిగిపోవాలి. మొదట మనసులోని ఆలోచనలకు హృదయంలోని భావాలకు సమానత్వం కలుగజేసుకోవాలి. కానీ మనసు చాలా తొందరగా పనిజేస్తుంది. ఆలోచనలు మెరుపుల్లాంటివి. మొదట మెరుపు కనిపిస్తుంది. తరువాత ఉరుము యొక్క ధ్వని వినిపిస్తుంది. సమానత్వం కలగాలంటే కోరికల యొక్క స్థానమయిన మనసును యింకా నిదానంగా పనిచేసేలా చేసి హృదయంతో సమాన స్థాయికి వచ్చేలా చేయాలి. ఎంత మౌనం వహించినా ఎన్ని ఉపవాసాలు చేసినా యీ పని చేయలేరు.

"సరియయిన మార్గంలో ఏవ్యక్తి అయినా రెండిటికీ సమానత్వం కలిగించుకోవాలంటే భావాలను వేగపరచ గలగాలి. అప్పుడు ఆలోచనలకంటె వేగంగా భావాలు పరుగెత్తుతాయి. ఇది చెయ్యాలంటే ప్రేమద్వారానే చెయ్యాలి. నిర్మలమయిన ప్రేమ. సరియయిన విధంలో ప్రేమించడం నేర్చుకుంటే తప్ప ఎవరూ మనసును అధిగమించలేరు. ప్రేమను సరిగా అర్థం చేసుకోవాలంటే ఒక్కటే మార్గం ఉంది – ప్రేమ ప్రభువుకి అంకితం అవడమే. ఎట్టి పరిస్థితిలోను సద్గురు చరణాలు వదలకుండా ఉండాలి. దీనికి ఏదయినా అతిక్రమం కలిగిందంటే ఆవ్యక్తి దివ్యప్రేమ మార్గంలో నుంచి తొలగిపోతాడు.

"నిత్యజీవితంలో క్రమశిక్షణ చర్యగా ఉపవాసం చేయడమూ మౌనం పాటించడమూ మంచిదే. కాని తాను సద్గురువుకు అన్నివిధాలా విధేయుడుగా ఉండడం ద్వారా మనసును ఊరుకోపెట్టడానికి మనసును శోషింపజేయడానికి నిశ్చయించుకుంటే క్రమశిక్షణ యొక్క విశిష్టత పోతుంది. బాబా యొక్క ప్రేమ ఆయన ప్రేమికులకు సహాయం చేస్తూ వారికి మార్గదర్శిగా ఉంటూ ఎప్పుడూ వారితో ఉంటుంది. ఇంక వారో ? బాబా యెడల వారికి ఉన్న ప్రేమను సజీవంగా ప్రకాశించేలా ఉంచుకోవాలి. ఎలాగ ? వాస్తవంగా సత్యరాజ్యంలో వాటికి స్థానం ఆధారం లేకపోయినా తన బాధ్యతలను తనమీద పెట్టుకున్న పనులను నిర్వర్తిస్తూనే తమ తలపులలోను,

మాటలలోను, పనులలోను బాబాను నిరంతర సఖునిగా చేసుకోవడం ద్వారా అది సాధ్యం అవుతుంది.

తరువాత బాబా ప్రేమికులంతా పెద్ద గదిలోకి వెళ్ళారు. వారి వెనకాలే బాబా కూడా వచ్చి గదిలో ఒక వైపునుంచి రెండోవైపుకి పచారు చేసారు. బహుశా కాస్త దేహానికి పరిశ్రమకోసమే యిలా నడుస్తున్నారని ఫిల్లిస్ వగైరాలు భావించి "అయ్యో బాబాను ఒక హోటల్లో బంధించాము." అని అనుకున్నారు. బాబా గదిలోనికి అందరూ మళ్ళీ వెళ్ళారు. అప్పుడు "నిజంగా ఆయనతో తాదాత్మ్యం ఐక్యం ఎలా పొందగలం?" అనే విషయం మీద యింకొక సందేశం యిచ్చారు బాబా. తరువాత ఒక చిన్న రహస్య సమావేశం జరిగింది అందులో టిబెట్ యోగి మిలరెపా మహాత్ముని గురించి మాట్లాడుకున్నారు. ఈ మహాత్ముని జీవితము యింకా యితర గ్రంధాలు రచించిన డా॥ ఎవాన్స్ వెంట్జ్ అనే గ్రంథకర్త, పండితుడు వచ్చి బాబాను కలుసుకున్నాడు. అప్పుడు అతని కార్యదర్శి కూడా అతనితో ఉన్నాడు. అతడు తరువాత భగవద్వచనం గురించి ఒక మంచి సమీక్ష వ్రాసాడు. (ఎవాన్ వెంట్జ్). బాబా యీ సంవత్సరంలో (1956) అమెరికా పర్యటనలో యిచ్చిన 58 సందేశాలను ఒక పుస్తకరూపంగా ప్రచురణ చేయబోతున్నారు గనుక ఆ పుస్తకానికి పీఠిక వ్రాస్తావా అని డా॥ ఎవాన్స్ వెంట్జ్‌ని బాబా అడిగారు. అందుకతడు సరే అని అంగీకరించాడు. 'లైఫ్ ఎట్ యిట్స్ బెస్ట్' అనే పేరుతో పీటర్ పాపర్ ప్రెస్‌లో ముద్రణ అయి సూఫిజమ్-రీ-ఓరియంటెడ్ అనే సంస్థ చేత మూర్షిదా ఐవీ డ్యూస్ సంపాదకత్వంలో 1957 వ సం॥లో ప్రచురణ అయిన యీ పుస్తకమునకు డా॥ వెంట్జ్ తాను బాబాకు యిచ్చిన మాట ప్రకారం ఒక చక్కని పీఠిక వ్రాసాడు. తెలుగులో ఉత్తమోత్తమ జీవితం అనే పేరుతో యీ పుస్తకానువాదం ప్రచురణ అయింది. కొంతసేపయిన తరువాత తమ గదిలోనుంచి బాబా బయట హాలులోకి వచ్చి ఎవరూ చూడకుండా కొంతసేపు ఆ రణగొణ ధ్వనులలో నిలబడి తరువాత మెల్లగా మేడమీద వారి గదిలోనికి వెళ్ళిపోయారు.

సిటిజన్‌న్యూస్, లాస్ ఏంజిలెస్ ఆగష్టు 1, 1956 రూజ్‌వెల్ట్ హోటలులో వారి గదిలో పత్రికా విలేఖరులను కలుసుకున్నప్పుడు సిటిజన్ న్యూస్ ఛాయాచిత్ర గ్రాహకుడు బాబా చిత్రాన్ని తీసాడు. బాబా వొదులయిన భారతీయ దుస్తులను ధరించి యున్నారు. ఆయన సంజ్ఞలతో "భగవంతుడు మాటలను వినడు, కర్మకాండలను చూడడు. ఆయన హృదయము యొక్క భాషనే శ్రద్ధగా వింటాడు." అని చెప్పారు.

లాస్ ఏంజిలెస్ టైమ్స్ అను పత్రిక యొక్క విలేఖరితో సంభాషిస్తూ ఆగస్టు 1, (1956) వ తేదీన బాబా యిట్లు చెప్పారు—

ప్రశ్న :—ప్రస్తుతకాలము నందు ప్రపంచమునకు మీ సందేశ మేమిటి?

బాబా :—వేదాంతులు, నిరీశ్వరవాదులు యితరులు భగవంతుడున్నాడని గాని లేడని గాని అంటారు. కానీ తమ యొక్క ఉనికిని వారు అంగీకరించినంతవరకు భగవంతునిలోని నమ్మకమును తెలుపుతూనే యున్నారు. భగవంతుడే శాశ్వతము అనంతము అయిన ఉనికియై ఉన్నాడు. ఆయన సర్వము. మానవజీవిత మందలి ఒకే ఒక లక్ష్యము భగవంతునితో ఐక్యము పొందుటే. ఒక అరగంట అయిన తరువాత ఆతిథ్య సంఘము వారందరిని (అయిదుగురిని) పైకి రమ్మని బాబా పిలిచారు. కాని ఫిల్లిస్ ఏదో ఒక గదిలో నిద్రపోతోంది. అయిదుగురిలో కొందరే వెళ్ళారు.

ఆ సాయంకాలం డాంటి కార్డెల్లా బృందము వారి వద్దకు వెళ్ళాలని అన్నారు బాబా. బాబా వస్తున్నారని కొన్ని నెలలు ముందుగానే వారు తెలుసుకున్నారు. డాంటీ యొక్క స్టూడియో చాలా చిన్నది గనుక చాలామంది బాబాతో వెళ్ళలేకపోయారు.

ఆనాడు సాయంకాలం 7 గంటలకు హాలీవుడ్‌లో ఒక గదిలో 60 మంది సమావేశమయినారు. ఆ వచ్చిన వారిలో కొద్దిమంది మాత్రమే ఆ సమావేశము వారి జీవితములలో ఒక ప్రధాన సంఘటన అని అందులో వ్యయం చేసిన కాలము వారి జీవితకాలంలో మిక్కిలి విశిష్టత కలది అని గ్రహించగలిగారు. బాబా వస్తారని అందరూ నిశ్శబ్దంగా కూర్చుని ఉన్నారు. సరిగ్గా 7–15 గంటలకు ఒక మామూలు వారులో మండలితో బాబా అక్కడికివచ్చారు. అందరివైపు చిరునవ్వుతో చూస్తూ బాబా వడిగా నడచివచ్చారు. ఒక్క మాటయినా పలుకకుండా అందరి దృష్టిని ఆకట్టి వారి ప్రేమను చూరగొనిన ఒక మహావ్యక్తితో కొంతసేపు గడపడం అంటే అది అసాధారణ విషయమే. బాబాలో వినయం ఉట్టిపడుతోంది. ఎక్కడా ఆడంబరం లేదు. హడావిడి లేదు. ఆయన ప్రసరించే ప్రేమ ఉజ్వలంగా ఉంది.

ఆ గదిలోపల ఎంత చోటు ఉందో అంతా నిండిపోయింది. బల్లల మీద నేల మీద ఎక్కడా ఖాళీ లేదు. మామూలుగా డజనుమంది ఉంటే సరిపోయే గదిలో 60 మంది క్రిక్కిరిసి కూర్చున్నారు. ఆధ్యాత్మిక వికాసం కోసం అందులో చాలామంది క్రొత్తగా వచ్చినవారే.

డాంటీ స్వాగత వచనాలు చెప్తూ బాబా దివ్యావతారుడని వారి దర్శనం పొందడం వారందరి మహద్భాగ్యమని, బాబాను బుద్ధిచేత, మేధస్సుచేత కొలవలేరని, బాబా యిచ్చేది స్వీకరించడానికి తమయొక్క ప్రేమను బాబాకి యివ్వాలని, బాబా బోధించడానికి గాక మేలుకొలుపడానికి వచ్చారని చెప్పాడు.

బాబా రచించిన "ప్రేమ – దైవప్రేమ" అనునది తరువాత డాంటి చదివాడు. సద్గురువులే నిజమయిన ప్రేమను యివ్వగలవారని అందులో తెలుపబడింది. బాబా అందులో చివరన మేలుకొలుపబడిన హృదయం కంటె గొప్పదయిన అద్భుతం యింకొకటి లేదని చెప్పారు.

అందరూ అయిదు నిమిషాలు నిశ్శబ్దంగా ఉన్న తరువాత బాబా ఎరచ్ ద్వారా సంజ్ఞలుచేస్తూ మాట్లాడారు. బాబా అక్కడికివెళ్ళి వారందరిని కలుసుకొనగలిగినందుకు వారి సంతోషాన్ని వెలిబుచ్చారు. బాబా ప్రేమను గురించి చక్కని సందేశాన్నిచ్చారు. ఈ జీవితం గురించి చెప్తూ బాబా—

"ఇదంతా ఒక కలగాని అంతకంటె ఏమీలేదు. మీరు నిద్రపోతుంటే అందులో మీరు మాట్లాడతారు, ఆనందిస్తారు, అనుభవిస్తారు; కొన్ని సమయాలలో విలపిస్తారు; కొన్ని సమయాలలో సంతోషంగా ఉంటారు. కానీ మీకు మెలకువ వస్తే అదంతా వట్టి కలే అని, నిజం కాదని, తెలుసుకుంటారు."

"అలాగే యిది కూడా కలే. మీరు నాతో కూర్చోవడం, వీధిన వెళ్ళే బస్సులు బస్సు వాటియొక్క ధ్వని, యీ నగరం, యీ ప్రపంచం మొత్తం అంతా ఒక స్వప్నమే ...

"ఈ రాత్రి మీరు కలలో బాబా మీ ప్రక్కగా కూర్చునియున్నట్లు – 'ఇందులో మీరు చిక్కుకోకండి. ఇదంతా కల మాత్రమే" అని బోధిస్తున్నట్లు, మీరు నన్ను "బాబా! ఇది కల ఎలా అవుతుంది. నాకు ఎన్నో రకాల అనుభవాలు కలిగాయి, సంతోషము దుఃఖము వగైరా. నేను ఎంతో మందిని చూస్తున్నాను. మిమ్మల్ని చూస్తున్నాను. ఇది కల అంటారేమిటి?' అని అంటారు. ప్రొద్దున్నే మీరు మేలుకుంటారు. బాబా మీకు కలలో కనిపించారని తెలుసుకుంటారు. అంతా స్వప్నమే. నిజం కాదు అని తెలుసుకుంటారు.

ఇప్పుడు కూడా యీ క్షణంలో కూడా మీరు కలగంటున్నారని నేను చెప్తున్నాను. కానీ అందుకు మీ మనస్సు ఏమంటుంది ? మీరంటారు— 'బాబా మాతో ఉన్నారు.

ఇది అంతా కల ఎలా అవుతుంది ?' అని. అప్పుడు నేనంటాను — "మీరు వాస్తవం గ్రహించినట్లయితే, మీరు బాగా మేలుకుంటే నేను చెప్పినదంతా నిజం అని యిది కలేగాని నిజం కాదని మీకు తెలుస్తుంది.' అని.

"మీరు నాతో చేసిన యీ సాంగత్య ఫలితంగా నన్ను ఎక్కువగాను యింకా ఎక్కువగాను ప్రేమించండి" అని బాబా చెప్పారు.

అప్పుడు బాబా డాన్‌స్టీవెన్స్ చేత మూడు సందేశాలు చదివించారు. మొదటి సందేశం చదువుతూంటే బాబా ఆ గదిలో ఉన్న ఒక యువకుని చూసారు. బాబా ఏదో తమాషా చేసినందువలన దగ్గిరవారంతా నవ్వు ఆపుకోలేకపోయారు. డాంటే భార్య గడియారం చూస్తూ కూర్చుంది. బాబా అక్కడ 40 నిమిషాలకంటె ఉండడానికి వీలులేదు. బాబా గడియారం లేని తన చేతిని చూసి "ఇంకా టైం ఉందిలే. గాబరా పడకు" అన్నారు ఆమెతో.

"నేను అనంతమహా సముద్రుడను. ఎవరు నాలో మునిగిపోతారో వారికే అమూల్యమయిన ఆణిముత్యం దొరుకుతుంది." అన్నారు.

ఒకరొకరే బాబా వద్దకు వచ్చి ఆయన ఆశీర్వాదమును గైకొన్నారు. ప్రేమ కానుకగా వారు తీసుకువచ్చిన పుష్పాన్ని ప్రతియొక్కరు బాబాకి యిచ్చారు. పుష్పం అందుకుని బాబా ప్రక్కనయినా ఉంచారు; లేక క్రింద ఆయన పాదాలవద్ద ఉన్న పళ్ళెరములోనయినా వేసారు. లేక కొంతసేపు చేతితోపట్టుకుని ఉన్నారు. ఒకరు యిచ్చిన పువ్వును గట్టిగా పళ్ళెంలో వేసి కొట్టారు. మరి అతడు తన హృదయంలో బొత్తిగా ప్రేమ, గౌరవం, భక్తి, యివేమీ లేకుండా అందరూ యిస్తున్నారు కదా అని తను కూడా ఒక యంత్రంలా తీసుకువచ్చాడేమో. ఒక అందమయిన ఎఱ్ఱగులాబీ బాబా చేతితో చాలాసేపు పట్టు కున్నారు. యింకొక పుష్పంలో నుంచి ఒక రేక తీసి ఒక యువకునికి యిచ్చి బాబా ప్రసాదంగా తినమన్నారు.

బాబా ఒక్కొక్కరిని వేరు విధంగా కలుసుకున్నారు. ఆ వ్యక్తికి ఏమికావాలో దానిని అతనికి యిచ్చారు. ఒకరికీ ఆశాభంగం కలిగించలేదు.

ఒకవారం ముందు డాంటే బృందంలో ఒకామెకు వినయం గురించి అతడు చెప్పాడు. గురువు యొక్క చిత్రానికి ముందు మోకరించి ప్రతిరోజు ప్రణామం చేయమని చెప్పాడు. ఇప్పుడు బాబా ఆమెను ఆలింగనం చేసుకున్నారు. ఆమె వెళ్ళ

పోతూంటే ఆమె జబ్బలు పట్టుకుని ఆమెను మోకాళ్ళమీద ఆయన ముందు-కూర్చునేలా చేసారు. ఇది వినయపూర్వక నమస్కారానికి చిహ్నము. ఒకరు ఎంత ప్రేమ యిస్తారో అంతకంటె ఎక్కువగానే వారికి ప్రేమ లభిస్తుంది. ప్రేమ యిచ్చినకొద్దీ దొరుకుతుంది. ఎవరయినా కొద్దిగానే తెలుసుకుని కొద్దిగానే యివ్వగలిగితే వారికి అంతే లభ్యమవుతుంది. తరువాత బాబా యీ బృందము నందలి సభ్యులలో సగం మందికి పైగా బాబాను ప్రేమిస్తున్నారని అందుకు బాబా సంతసిస్తున్నానని చెప్పారు.

అందరినీ దీవించిన తరువాత బాబా ఆ డాంటే యొక్క యింటి లోపల అంతా తిరిగి చూసారు. బాబాను ఎక్కించుకొని, వారి హోటలుకి తీసికొనివెళ్ళి దింపవలసిన కారు ఆలస్యంగా వచ్చింది. "మేము తీసుకువెళ్ళి దింపుతాము బాబా అని చాలామంది ముందుకి వచ్చారు. కానీ బాబా ఆ కొంచెం దూరం నడుద్దామని అనుకున్నారు. ఆయన ఆ విధంగా నడచి వెళ్ళి ఉంటే హాలీవుడ్‌లో చాలామంది ఆబూల్‌వార్డ్‌లో వారు ఆశ్చర్యపోయి యుందురు. ఇంతలోకే కారు వచ్చింది. బాబా అందరికీ వీడ్కోలు చెప్పి కారు ఎక్కి హోటలుకి వెళ్ళారు.

## ఆగస్టు 2 వ తేదీ లక్ష్మీవారం :—

తెల్లవారుఝామున 4 గంటలకు బాబా దుస్తులు – సద్రా, పైజమా, కొద్దిగా చేతిరుమాళ్ళు, ఇస్త్రీ చేసి సిద్ధంగా ఉంచారు. ఆ హోటలుకి లిఫ్టు ఉండడం చేత క్రిందకి పైకి వెళ్ళడానికి కష్టంలేకుండా ఉంది. కానీ ఎక్కడికయినా వెళ్ళాలంటే టాక్సీ వాళ్ళ సమ్మె చేస్తున్నందు వలన కష్టమవుతోంది. ఎవరి కారులోనయినా వెళ్ళవలసిందే. బాబా పిలిస్తే బాగుండును అని హృదయంలో ఎవరు అనుకుంటున్నారో వారిని విడివిడిగా బాబా పిలిచి వారి కోరికతీర్చారు. అందరకి తృప్తి కలిగింది. ఎవరితోనయినామాట్లాడి సంభాషణ ముగించాక చూపుడు వేళ్ళు రెండూ ఒకదానిమీద ఒకటి అడ్డంగా పెట్టి "నేను క్రీస్తును" అని బాబా చెప్పేవారు.

## మెహెర్ మౌంట్ సహవాస్ :—

మెహెర్ మౌంట్ అనే మనోహరమయిన కొండమీద బాబా కోసం యిదివరలో వారు దిగిన స్థలము అలాగే ఆయనకోసం ఉంచి జాగ్రత్తగా చూస్తున్నారు ఆగ్నిస్ బార్న్, జాన్‌తుక్‌లు. అక్కడికి బాబా మండలితో ప్రయాణం కానున్నారు. బాబా వెళ్తున్నారు గనుక మెహెర్‌మౌంట్‌కి వెళ్ళదలచుకున్నవారు అందరు సిద్ధంగా

బస్సుకోసం వేచియున్నారు. చౌదరి కూడా బాబాను యింకొకమారు దర్శనం చేసుకో వచ్చునని వచ్చాడు. అక్కడ ఉన్నవారితో బాబాను గురించి చౌదరి అంటాడు___

"బాబా నిజంగా ఆయన ఎలా ఉన్నారో మనం చూడలేము. ఆయన అనుగ్రహం కొంచెమే కలుగుతుంది." అనగానే ఫిల్లిస్‌లాంటి భగవద్గీత చదువుకున్న వారికి అందులో శ్రీ కృష్ణభగవానుడు "నేనీ జగత్తును నాయొక్క ఒక్క అంశతో నిలబెడుతున్నాను." అని అన్నమాటలు (విష్ట భ్యాహ మిదం కృత్స్న మే కాం శేన స్థితో జగత్) జ్ఞాపకానికి తెచ్చుకున్నారు.

బస్సు నడిపేవాడు చదువుకున్నవాడు. అతడు వృక్షశాస్త్రం (బాటనీ) చదివిన వాడు. బస్సు నడుస్తూంటే దారిప్రక్కన కాలిఫోర్నియా చెట్లు, మొక్కలు చూపిస్తు న్నాడు. బాబాను ఆగ్నిస్ బార్న్, ఆమె స్టేషన్‌వాగన్‌లో ముందు మెహెర్ మౌంట్‌కి తీసికొని వెళ్ళింది. అక్కడ దిగగానే బాబా ఆగ్నిస్‌తో మెహెర్‌మౌంట్ అంటే బాబాకు చాలా యిష్టమని యిక్కడ ఆయనకు సుఖంగా ఉంటుందని అన్నారని ఆగ్నిస్ చెప్పింది.

మెహెర్‌మౌంట్ శిఖరం పొగమంచులో కనబడటం లేదు. పైకి వెళ్ళేసరికి ఓజైలోయ అంతా కూడా మంచుతో నిండి ఉంది. ఈ పొగమంచు వలన లోయ యిదివరకు రమణీయంగా కనిపించేది యిప్పుడేమీ వివరాలు కనబడటమే లేదు. బస్సు చేరుకుంది. ప్రేమికులు కూడా దిగారు. బాబా మండలి బాబా తోటే స్టేషన్ వాగన్‌లో వచ్చారు. అందరూ దిగిన తరువాత బాబా ప్రేమికులందరినీ బాబా గదిలోకి రమ్మని పిలిచారు. బాబా గది అందంగా అలంకరించారు. సామానులు చక్కగా అమర్చ బడినాయి. మిర్టిల్‌బీచ్ తరువాత బాబా యీ స్థలాన్ని ఎంతో మెచ్చుకుంటారు. మెహెర్ మౌంట్ అంటే వారి యిష్టాన్ని తెలిపారు. మీకు ఎలా ఉంది. నచ్చిందా? అని ప్రేమికులను బాబా అడిగారు. ఒకడు అక్కడ ఆధ్యాత్మిక వాతావరణం ఉందన్నాడు. ఇంకొకడు మెహెరాబాద్ కొండలా ఉంది అన్నాడు. ఇంకొకడు అక్కడి వాతావరణం లోని సుగంధాన్ని మెచ్చుకున్నాడు. మరియొకడు అక్కడికి వచ్చి చూడగానే నచ్చుతుందన్నాడు. ఫిల్లిస్ అది అస్సిసీలోని ఒక కొండలా ఉందని చెప్పింది. బాబా అన్నిటికి ఔనని తలఊపి యీ ప్రదేశం పురాతనమైనదని తాము యిదివరలో యిక్కడికి వచ్చామని బాబా చెప్పారు. రాత్రి యిక్కడే గడుపు

దామని ఉందనీ కానీ సమయం చాలదని బాబా అన్నారు. ఒక్కొక్కరే బయటకు నడిచారు. ఆఖరున మిగిలిన డా॥ బెన్ని మార్గరెట్ క్రాస్కని వీపు మీద చేతులుపెట్టి బయటకు తోసారు. బయటకు వెళ్ళి వారంతా వచ్చేసరికి సూర్యరశ్మి ప్రకాశిస్తోంది. అన్నీ బాగా కనిపిస్తున్నాయి గనుక అక్కడ ఉన్న గులాబీతోట, ఓషధులున్న తోట, గంధకపు నీటితో నిండిన ఈతాలాడే చెరువు, బ్రహ్మాండమయిన ఓక్ వృక్షాలు, దూరాన ఉన్న బంగారపు ఎండలో నిగనిగలాడుతున్న కొండలు అన్నీ చూస్తున్నారు. ఇంతలో బాబా ద్రాక్ష తీగతో కప్పబడిన ముందటి వసారాలోకి వచ్చారు. బాబా ఎలిజబెత్ యొక్క ఎర్రటి స్కార్ఫ్ తలకి ఒక సిక్కు తలపాగాలా చెవుల మీద చుట్టుకున్నారు. బాబా హాయిగా ఉన్నట్టు కనిపించారు. ప్రేమికులందరు ఆయన సంతోషాన్ని చూసి ఆనందం పొందారు. బాబా లోపలికి వెళ్ళి ఒక్కొక్కరే బాబాను దర్శించుకోవాలని అభిలాష కనపరచిన వారికి ఒక్కొక్కరినే పిలవడం ప్రారంభించారు. బాబా వారితో మాట్లాడుతూ "మీరు యీ విధంగా నాతో యింత సన్నిహితంగా ఉండే అవకాశం కలిగినందుకు మీరు చాలా అదృష్టవంతులు. ఇండియాలో నాకోసం ప్రాణాలనైనా ధారపోయ గలవారు కూడా వరుసలో వచ్చి నా ముందు నుంచి రెండు క్షణాలలో సాగిపోవలసిందే. ఒక్కొక్కప్పుడు ప్రజాసమూహాలు వచ్చినప్పుడు నన్ను ఊరికే చూడడానికే వారికి సమయం ఉంటుంది; ఇంతలో ఎవరో వారిని ముందుకి వెళ్ళమని తోసేస్తూ ఉంటారు. కొంతమందిని బాబా ఆలింగనం చేసుకొని "ఇది ఆఖరిసారిగా నా ఆలింగనము" అన్నారు. కొందరు "మళ్ళీ 700 సంవత్సరాలకే కాబోలు బాబా వచ్చేది. ఈ అవతారంలో యిదే ఆఖరుసారి కాబోలు యిక్కడికి రావడం." అనుకున్నారు.

హెలెన్ వైట్ తయారుచేసిన భోజనం బయట చెట్లక్రింద ఎవరికి వారు వడ్డించుకుని తిన్నారు. ఆ భోజనం లోని రొట్టెలు చార్లెస్ రీడ్ కాల్చాడు. తరువాత యింకా ఎవరో క్రొత్తవారు వచ్చారు. కాని పత్రికలవారెవరూ రాలేదు. అందుకు బాబా సంతోషించారు, సమయం అంతా తమ సహవాసం కావలసిన భక్తులతో గడపవచ్చుకదా అని.

బాబా మరల అందరిని లోపలకు పిలిచారు. బాబా ఒకపెద్ద కుర్చీలో జేరబడి కూర్చున్నారు. ఆయన చాలా ఉల్లాసంగా ఉన్నారు. బాబా దానాఫీల్డ్ని రమ్మని కబురంపుతూ "అతడు నన్ను ఎంతగా ప్రేమిస్తున్నాడంటే యిక్కడికి వచ్చి ఉండడానికి యీ ఒక్కరోజుకి అతడు తన పథ్య భోజనాన్ని పూర్తిగా మానివేసాడు" అన్నారు. ఇంతలో అక్కడకు వచ్చిన దానా ఫీల్డ్ లేచి నిలబడి "బాబా నేను యిప్పుడే తిన్న రుచికరమయిన భోజనం మీ ప్రసాదమే" అన్నాడు.

బాబా :—నీవేమి తిన్నావు? ఎండిన పండ్లా? [అంగూర్, అక్రోట్ వగైరా]

దానా :—ఏవేవో తిన్నాను బాబా. పళ్ళు యిక్కడే కాసేయి కాబోలు. రొట్టె మీకోసం ప్రత్యేకంగా తయారుచేయబడినది అనుకుంటాను.

బాబా :—నీవు ఎప్పుడూ కావాలనే ఎండు (గట్టి) పండ్ల సంగతేమిటి? (బాదం వగైరా) దానా ఫీల్డ్ తన ఆరోగ్యం కోసం అనేక రకాల పళ్ళు మొదలయినవి తింటూ ఉంటాడు. అది తలచుకొని మిగిలినవారు చిరునవ్వు నవ్వారు.

దానా ;—అద్భుతం!

బాబా ;—పళ్ళా! నా చిన్నతనం నుంచి కూడా పళ్ళంటే నాకు అంత యిష్టం లేదు' పాలన్నా అంతే. నేను ఉపవాసం ఉండాలనుకుంటే మంచినీళ్ళు త్రాగుతూనే ఉంటాను. పాలు త్రాగను. మస్త్ కార్యంకోసం పర్యటన చేసినపుడు నాకు యిష్టమున్న భోజనం ఒక్కొక్కమారు మూడు రోజులవరకు దొరకదు. అప్పుడు మండలి నన్ను పాలు పళ్ళు తీసుకోమంటారు. నేను పస్తు అయినా ఉంటాను గాని అవి తీసుకోను. నీరు త్రాగుతాను అంతే. (బాబా అక్కడ ద్రాక్షపళ్ళు ఉన్న పళ్ళెం వైపు చూపి) దానా నాతో అంటాడు – 'బాబా! మీరు ద్రాక్షపళ్ళు తీసుకోవాలి. అది మీ ఆరోగ్యానికి మంచిది' అని. ఈరోజు నేను యిక్కడికి రాగానే యీ పళ్ళు కనిపించాయి. (వారి కుర్చీప్రక్కన ఉన్న పళ్ళ వైపు చూపుతూ) ఒక గుత్తి గుత్తి అంతా తినేసాను. ఇంకా యిక్కడ ప్లమ్‌లు (ఎర్రటి రేగుపళ్ళు) కూడా ఉన్నాయి. ఇదిగో వినండి (బాబా ఆయన కడుపు రాచుకుంటూండగా కడుపులో గురగుర శబ్దం విన వచ్చింది) అందరూ ఆయనతో పాటు నవ్వారు. బాబా యింకా తమ తలవైపు చూపుతూ—"ఈ మొత్తం విశ్వము యొక్క భారాన్ని నా తలమీద మోస్తున్నాను. (అది యొక శిలువ వేత) ఇది – ఈ తిండి – నాకు పడదు గనుక— ఇంకొక శిలువ వేతలాంటిది.

దానా ;—ఒకరికి ఒకటి ఔషధం అయితే అదే యింకొకరికి విషం అవుతుంది.

బాబా :—మీరందరు ఒక్క అయిదు నిమిషాలపాటు ఏమీ ఆలోచించకుండా బాబాను తలచుకుంటూ కళ్ళుమూసుకొని కూర్చోండి.

అందరూ బాబా చెప్పినట్లు కళ్ళుమూసుకొని ధ్యానం చేస్తున్నట్లు కూర్చున్నారు. అప్పుడు బాబా కడుపులో మరల గుడ గుడ శబ్దం గట్టిగా అందరికీ వినిపించేసరికి అంతా నవ్వారు.

దానా :—అవి నేనుకూడా తినడం మానేస్తాను బాబా. అందరూ దానా మాటలు విని యింకా గట్టిగా నవ్వారు.

బాబా :—ఈ మధ్యాహ్నం మీరందరూ నవ్వడానికి అవకాశం దక్కింది. బాబా కూడా అయిదు నిమిషాలు విశ్రాంతి తీసుకోవడానికి వీలయింది. న్యూయార్క్‌లో మీరు నవ్వడానికి అవకాశం కలుగలేదు. లాస్ ఏంజిలెస్‌లో అసలే వీలు కాలేదు. కానీ యీ రోజున యిక్కడ మనమంతా హాయిగా విశ్రాంతిగా ఉన్నాము. మీ అందరితోను నవ్వుతూ మనం అందరం స్వేచ్ఛగా ఉండడానికి నేను మీ స్థాయికి దిగి వచ్చి యున్నాను. కాని నేను ఉత్తమోత్తముడనను మాట మరచిపోకండి. ఏం దానా?

దానా :—ద్రాక్షపళ్ళు తినమని యింక చెప్పను బాబా!

బాబా :—దానా నన్ను చాలా ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. అతడు కష్టపడి పనిచేస్తాడు యితరులు నన్ను ప్రేమించాలని. కానీ అతడు మాత్రం ఎండు పళ్ళు తిని ఉంటాడు....

(ఫ్రెడ్ వింటర్ ఫెల్ట్ వైపు తిరిగి) నీ జ్యోతిషం మాటేమిటి? మంచు పోతుందన్నావు.

ఫ్రెడ్ :—మీ సహాయం కావాలి బాబా!

బాబా :—(అందరితోను) సరే అయితే యిప్పుడు బయటకు వెళ్ళి యిక్కడ నుంచి ప్రకృతి దృశ్యం చూడండి. ప్రకృతి ద్వారా బాబాను ప్రేమించాలని ప్రయత్నించండి. ఇదంతా నా ప్రేమ వల్లనే.... ఈ సృష్టి అంతా, ఈ ప్రకృతి, ఈ అందమంతా నాలోనుంచే వచ్చింది....

అందరూ బయటకు వెళ్ళారు. పొగమంచు— అంతా పోయింది. ఎంత దూరమయినా చూడడానికి వీలుగా ఉంది. వందలమైళ్ళ దూరంలోని కొండలు కూడా కనిపిస్తున్నాయి. బాబా మాటలు తలుచుకొని అందరూ ఆ దృశ్యాలు చూస్తున్నారు.

కొంచెం సేపయిన తరువాత బాబా కొద్దిమందిని గదిలోపలికి పిలిచారు. బాబా అటూ యిటూ తిరుగుతూ గదిలో అన్నారు—("నేను ఒక నిర్ణయానికి వచ్చాను. నేను 700 సంవత్సరాల తరువాత మరల వచ్చాక భూమి మీద యింక ద్రాక్షపండ్లు ఉండవు. దానితోపాటు సారాయి సమస్య కూడా తేలిపోతుంది.")

అప్పుడు మేరియన్ ఫ్లోర్‌షీమ్ ఒక పెద్ద గుండ్రని రాయి బాబాకి యిచ్చింది. 'ఇది మొసలి గుడ్డని నాకు నా భర్త మిక్కీ యిచ్చాడు.'' అన్నది. మిర్టిల్ బీచ్ చెరువులో మొసళ్ళు ఉన్నాయన్నట్లు. బాబా ఆ రాయి తీసికొని కడుపుమీద రాచుకున్నారు. ద్రాక్షపళ్ళు తిన్నందుకు కడుపులో కలిగిన గాభరాకి అదేదో ప్రక్రియ అన్నట్లుగా. బాబా దానాను పిలిచి - ''క్రానికల్‌లో వేయించు - 700 సంవత్సరాల తరువాత ద్రాక్షపళ్ళుండవని'' అన్నారు. ''మళ్ళీ ఆలోచిస్తే వద్దనిపిస్తోంది. క్రానికల్‌లో వెయ్యవద్దు. వాళ్ళు ఎందుకు ద్రాక్షపళ్ళు లేవో కనుక్కోవాలి!'' అన్నారు. అందరూ నవ్వి ఆగాక, దానా అడిగాడు_

''అవతారుడికి కడుపునొప్పి వచ్చినందువలన ద్రాక్షపళ్ళు లేకుండా పోయాయంటే వాళ్ళు ఏమంటారో.''

తరువాత ఆగ్నిస్ వచ్చి మెహెర్ మౌంట్ మీద నాలుగు వైపులా బాబాకి చూపించుదామని బాబాని తీసికొని వెళ్ళింది. అందరూ ఆయనతో బయలుదేరారు. గంధకపు నీరు ఉన్న ఈత కొట్టే చెరువు వద్ద లతాకుంజములను చూసి బాబా నవ్వుతూ మళ్ళీ ద్రాక్షపళ్ళు కనిపిస్తున్నాయి అన్నారు. మెహెర్ మౌంట్ ద్రాక్షపళ్ళు అందరి మనసులలోను నాటుకుపోయాయి.

మెహెర్‌మౌంట్‌మీద ఒకచోట ఒకపెద్ద ఓక్ వృక్షమున్నది. దానిని 'బాబా వృక్షము' అని పిలుస్తున్నారు. ఆకులతో కప్పబడిన ఒక నికుంజములో ప్రవేశించి బాబా క్రింద రాలిన ఆకులమీద కూర్చున్నారు. ఎవరినీ కూర్చోవద్దని బాబా సైగ చేసారు. ఆ నీడలో బాబా కళ్ళు ప్రకాశమానంగా కనిపిస్తున్నాయి. బాబా 'నాకు సంతోషంగా ఉంది' అని సంజ్ఞచేసారు. ఆగ్నిస్ యొక్క కుక్క కాళీ బాబా వెనుకనే వచ్చింది. ఆ కుక్క తల నిమురుతూ బాబా కారు ఎక్కుతూ ''ఇది తరువాత జన్మలో మనిషి అయి పుడుతుంది'' అన్నారు బాబా.

బాబా దర్శనార్థం అందరూ మళ్ళీ సమావేశమయారు. బాబా సంజ్ఞలు చేస్తూ ''ఈ రోజున నేను ప్రసంగం చేస్తానని ఆశించవద్దు సుమా!'' అన్నారు. ఒక క్రొత్త వాడు దర్శనార్థం వచ్చి బాబాను ఆలింగనం చేసుకున్నాడు. ''నిన్న మీకు చెప్పానుకదా. యీ రోజున హాయిగా ఆడుకుంటారని. మీరు ఒక్క సంగతి తెలుసుకోవాలి. నేను మిమ్ములనందరను ఆలింగనం చేసుకొనుటకు మీరు ఎంత అదృష్టవంతులో మీకు తెలియకుండా ఉంది. ఇండియాలో దక్షిణాన. ఆంధ్రరాష్ట్రంలో నేను పర్యటిస్తే నా దర్శనం కోసం వేలమంది వస్తారు. వారు నన్ను ఎంతగానో ప్రేమిస్తారు కొందరు

నేను చెప్తేచాలు వారి ప్రాణాలు నాకోసం యిచ్చేస్తారు. అయినా వారికి నా ఆలింగనం పొందే అవకాశం లేదు, నా సన్నిహిత సహవాసానికి వారు నోచుకోలేదు. ఎందుకంటే వెళ్తే చాలామంది ప్రజలు వస్తారు. నా దగ్గరకు రావాలని తోసుకుంటూ వస్తారు. ఒక్క క్షణంపాటు నా సాంగత్యం వారికి కలుగుతుంది. అంతే. నా దగ్గర కూర్చోడానికి గాని నన్ను కౌగిలించుకునేందుకుగాని నన్ను వారు ఎంత ప్రేమిస్తున్నా వారికి అవకాశం లేదు.

లాస్ ఏంజిలెస్‌లో మీరు నా దగ్గరకు రావడానికి గాని నా వద్ద కూర్చోడానికి గాని సమయం లేకపోయింది. నన్ను చూడడానికి వచ్చిన ప్రజలతో సరిపోయింది నాకు. అందుకోసమే ఒక్కరోజు యిక్కడ స్వేచ్ఛగా మీతో గడుపుదామనుకున్నాను. నా వైఖరి మారుతూ ఉండడం — లండన్‌లో లాగ — మీరు చూసారా ?"

ఎరచ్ యిలా వివరించాడు — "కొన్ని సమయాలలో బాబా చాలా ఆహ్లాదంగా కనిపిస్తారు. చాలా సంతోషంగా ఉంటారు. అప్పుడు మనల్ని కూడా చాలా ఆనంద పరుస్తారు. చిన్నపిల్లలతో కలిసి ఆటలాడతారు. చిన్నపిల్లవానిలా పరుగెడతారు. ఆయన ఎంతో ఆనందంగా ఉన్నట్టు కనబడ్తారు. అకస్మాత్తుగా బాబా వైఖరిలో మార్పు వస్తుంది. ఆయన ఎంతో అలిసిపోయినట్లు కనిపిస్తారు. ఎంతో జబ్బుగా ఉన్నట్లు అగుపడతారు. ఆయనకు ఏదో అయిందేమో అనిపిస్తుంది. కాని కారణం మనకు ఏమీ కనిపించదు. ఒక్కొక్కప్పుడు బాబా ఎంతో ప్రేమిస్తున్నట్లు ఉంటారు. ప్రేమతో నిండిపోయినట్లు, ప్రేమ పొంగిపొర్లిపోతున్నట్లుంటుంది. ఆయనని ప్రేమిస్తేచాలు మనము యింకేమీ చెయ్యనక్కరలేదు అనిపిస్తుంది. మళ్ళీ ఆయనలో మార్పు వచ్చేస్తుంది. ఆయన ఎంతో నిక్కచ్చిగా ఉన్నట్లు, కోపంగా ఉన్నట్లు, నిప్పులు కక్కుతూ ఉన్నట్లు కనిపిస్తారు. అది చూచినప్పుడు మనం ఆయనను ప్రేమించలేము. కానీ ఆయనంటే గౌరవిస్తే చాలనిపిస్తుంది. ఆయన ఆజ్ఞలకోసం వేచి ఉండాలనిపిస్తుంది."

బాబా ;— నా విధానాలు ఎవరికీ అర్థంకావు. మీ అవగాహనకు అతీతుణ్ణి నేను. సద్గురువులు మాత్రం నన్ను నా విధానాలను అర్థం చేసుకోగలరు. ఇంకో సంగతి — మీరు అందరు నాతో చనువుగా ఉన్నందువలన, నాతో సన్నిహితంగా ఉండడానికి అవకాశాలు కలిగి ఉన్నందువలన — మీలోని మంచి మీలోని చెడ్డ బయటకి మెరుపులా వచ్చేస్తుంది. గత సంస్కారాలన్నీ, వాటి సంచితం అంతా, మాయామయమయిన ఆ సంస్కారాలు బయటకు వచ్చేస్తాయి.

నాతో ఉన్నందువల్ల నాతో సాహచర్యం వలన ఆ సంస్కారాల రాశి అంతా మారిపోతుంది; మీలోంచి బయటకు పోతున్నట్లు మీకు కనిపిస్తుంది.''

బాబాకు సాయంకాలం ఆరు గంటలకు తిరిగి వెళ్ళిపోవాలని ;ఉంది. తరువాత ఆయనను ఎవరూ పలకరించకూడదు. ఆయన వద్దకు ఎవరూ వెళ్ళరాదు అని చెప్పారు. ''మీరు సామాను సర్దుకోండి. ఏమయినా చేసుకోండి.'' అన్నారు బాబా. గతరాత్రి వచ్చి తలుపు కొట్టినందుకు బాబా డాన్‌ని మందలించారు. బాబా ప్రత్యేకంగా డాన్‌తో చెప్పారు. 9 గంటల తరువాత ఎవరూ వచ్చి ఆయన శాంతికి భంగం చేయకూడదని. అలా చెప్పిన అయిదునిమిషాలకి వచ్చి తలుపు కొట్టాడు.

మరికొందరిని వేరేగా పిలిచి బాబా సంభాషించారు. బాబా వారి మండలి టీ తీసుకున్నారు. మెహెర్ మౌంట్ కొండలమాటుకి సూర్యుడు అస్తమిస్తూంటే బాబా స్టేషన్‌వాగన్‌లో కూర్చున్నారు. వెళ్ళేటప్పుడు తీరాన ఉన్నరోడ్డుమీద నుంచి – అది కొంచెం దీర్ఘమయినా – వెళ్ళమని బాబా చెప్పారు. వెళ్ళేటప్పుడు పసిఫిక్ మహా సముద్రం నీలంగా తళతళా మెరుస్తున్నట్లు కనిపించింది. అది చూసి బాబా చాలా బాగుందన్నారు. బస్సు దగ్గిర దారిన వెళ్ళినందున హోటలుకి అది ముందు వెళ్ళింది. బాబా వచ్చేవరకు ప్రేమికులంతా వేచియున్నారు. బాబా వారిని చూసి ప్రేమతో చిరునవ్వులు చిందించారు. తరువాత లిఫ్టులో ఎక్కి పైకి వారి గదిలోకి వెళ్ళిపోయారు.

## శుక్రవారం, ఆగస్టు 3 వ తేదీ :—

బాబా శాన్‌ఫ్రాన్‌సిస్కో వెళ్ళడానికి విమానంలో ప్రయాణం చేస్తున్నారు. లాస్ ఏంజిలెస్ విమానాశ్రయంలో విమానం బయలుదేరింది. చాలా మంది ప్రయాణీకులు బాబా వైపు ఎవరా అని విచిత్రంగా చూసారు. ఆరోజు ఎండ బాగా కాస్తోంది. బాబా ఎక్కిన విమానం మేఘాల మీద నుంచి వెళ్తోంది. కిటికీ నుంచి క్రిందకు చూస్తే దూది పింజల మీదనుంచి వెళ్తున్నట్లు కనిపించింది. బాబాతో కూడా అనేకమంది ప్రేమికులు ప్రయాణం చేస్తున్నారు. విమానం ఆకాశం మీదకి ఎగిరి వెళ్తూంటే అందరివద్దకు వెళ్ళి బాబా పలకరించారు. వారిని కులాసాగా ఉన్నారా అని అడిగి కొందరి వైపు చూసి చిరునవ్వు ప్రసరించి కొందరిని స్పృశించి అందరినీ అలరించారు. ఆయన, ఆయన స్థానంలోకివెళ్ళి కూర్చున్నాక కొందరు ఆయన పిలువగా వెళ్ళి సంభాషించారు. కెమేరాలతో ఫొటోలు తీసారు.

ఫిల్లిప్ ఫ్రెడెరిక్ పెద్దగా తుమ్మింది. బాబా ఆమెతో 'నీవు విమానాన్ని తూల్చేసేలా ఉన్నావు' అన్నారు.

శాన్‌ఫ్రాన్‌సిస్కో విమానాశ్రయంలో దిగగానే యువకులు బాబాను చుట్టుముట్టి ఆయనకు పుష్పమాలలతో స్వాగతం చెప్పారు. అవి పసుపు పచ్చని పూలతో కట్టిన దండలు. ఆయన నీలిరంగు కోటు ధరించి ఉన్నారు. దానిమీద పసుపు రంగు పూలదండలు బాగా కనిపిస్తున్నాయి. పిల్లల జుట్టు కూడా పసుపురంగులోనే ఉంది. వాతావరణం చాలా చలిగా ఉంది. బిలి ఈటన్ బాబా కప్పుకోవడానికి ఆమె యొక్క పెద్దకోటు యిచ్చింది. ఇచ్చింది కదా అని మర్యాదకి కాస్సేపు వేసుకొని మెల్లగా అది తీసేసి ఆ కోటు ఆమెకి తిరిగి యిచ్చేసారు. శాన్‌ఫ్రాన్‌సిస్కో నగరంలో 119 వాన్‌నెస్ ఎవిన్యూ అనే విలాసం వద్ద హాలిడే లాడ్జి అనే వసతి గృహానికి వెళ్ళారు బాబా, వారి పరివారంతో. ఎవేకెనర్ పత్రిక ప్రకాశకుడగు వారన్ హీలీ ఆగ్నిస్ బార్న్ యొక్క స్టేషన్ వాగన్‌లో కొందరు ప్రేమికులను తీసుకు వెళ్ళాడు. హాలీడే లాడ్జి నగరంలో ఒక అందమయిన స్థలంలో నిర్మించిన అందమయిన భవనం. అందులో చాలా గదులున్నాయి. వాటికి బయటకు వసారాలు (బాల్కనీలు) ఉన్నాయి. చుట్టూ చెట్లు ఉన్నాయి. ఆవరణలో చిన్న చెరువు కూడా ఉంది.

బాబా వద్దకు పత్రికా విలేఖరులు రాగా వారితో సంభాషించడానికి బాబా నిరాకరించారు. బాబా ఏకాంతంగా కూర్చున్నారు. వారితో హాలీడే లాడ్జి ఆవరణలోని చెరువు వద్ద ఆ పాత్రికేయులు బాబా మండలితో మాట్లాడారు. వారిలో న్యూయార్క్‌లోని బెలూలీ ఆస్పత్రిలో నర్సుగా పనిచేస్తూ ఉన్న ఒకామె "మీరు బాబా వద్దకు వచ్చారంటే ప్రపంచంలోకెల్లా గొప్ప వ్యక్తి వద్దకు మీరు వచ్చారన్నమాట." అని చెప్పింది. "ఆయన దివ్య ప్రేమ మూర్తీభవించిన క్రీస్తువంటి మహాపురుషుడు" అని స్కెనెక్టడీ నుంచి వచ్చిన డార్విన్‌షా అన్నాడు. "ఆయన ప్రతిదానితోను ప్రతి యొకరితోను ఏకత్వం పొందియున్నారు." అని ఐవీడ్యూక్ అంది. హాలీడే లాడ్జిలో బాబాకోసం ఏర్పాటుచేసిన గదులు ఆయనకు నచ్చలేదు. అవి వారి ప్రేమికులు బస చేసిన గదులకు చాలా దూరంలోఉన్నాయి. ఆ గదులయినా ఒకదాని కొకటి సంబంధం లేకుండా ఉన్నాయి మరునాటికి గాని వేరే గదులు కుదర్చడానికి వీలులేదు. ఖాళీలు లేవు. ఇతర హోటళ్ళకి వేటికయినా వెళ్దాం అన్నారు. కొన్ని గృహాలున్నాయి అందులో ఉండవచ్చు అన్నారు ఈ ఏర్పాట్లు చేసినవారికి ఏమీ తోచడం లేదు. బాబా

వారి ఓర్పును పరీక్షిస్తున్నారు. ఐవీతో అన్నారు బాబా "అవును. నేను పనిచేసే విధానమే యిది."

బాబా లడ్‌తో అన్నారు — "మిగిలిన చోట్లలో ఏర్పాట్లు ఎంతో బాగున్నాయి. నాకు కావలసినదల్లా ఒకదానిలో నుంచి ఒకదానికి వెళ్ళడానికి వీలుగా ఉన్న రెండు గదులే. అసలు గదుల సంగతి అలా ఉంచి యీ స్థలమే నాకు నచ్చలేదు. అందుచేత ఆదివారం ఉదయాన్నే యీ నగరం వదలి వెళ్ళిపోతాను అంటే రెండు రోజులు ముందుగా. "ఈమాటఅనగానే లడ్, మిగిలిన ప్రేమికులు చాలా దుఃఖాక్రాంతులయారు. ఏమి చేయాలో వారికి తోచలేదు. బాబా లాస్‌ఏంజిలెస్‌లో లడ్‌తో చెప్పారు – ప్రకటనలు, పత్రికా విలేఖరులు ఏమీవద్దని. బాబాకి కావలసింది వారి ప్రేమికులతో ఎక్కువ కాలం గడపాలని. బాబాతో కొందరికి ఇంటర్‌వ్యూలు (సంభాషణలు) ఏర్పాటుచేసారు. అవన్నీ తిరిగి మార్పు చేయాల్సి వచ్చిందికదా.

అకస్మాత్‌గా బాబా మిసెస్ గ్రే వైపు తిరిగి "రెండు పరస్పర సంబంధం ఉన్న గదులలో వారు రేపు మధ్యాహ్నం ఒంటిగంట కల్లా ఖాళీచేసినట్లయితే, యిక్కడి భోజనం బాగుంటే నేను యిక్కడే ఉంటాను." అన్నారు. ఈ మాట అందరికీ తెలిసింది. బాబా ఆ నగరంలోని ప్రేమికులని పైకి రమ్మన్నారు. బాబా చుట్టూ ఒక డజను మంది పిల్లలు గుమిగూడి ఉన్నారు. ఆయన కూడా వారిలో ఒకరుగా అమాయకంగా ఉన్న బాలునిలాగే ఉన్నారు.

బాబా చిరునవ్వుతో —"ఇప్పుడు పిల్లలు నన్ను తీసుకున్నారు. మీకు యింక అవకాశం లేదు. నేను పిల్లవాడినే."

బాబా—"నాకు సంతోషంగా ఉంది. భోజనం నాకు నచ్చింది. ఇక్కడే ఉంటాను" అన్నారు. అలా అనగానే వారి సంతోషం మిన్ను ముట్టింది. శాన్‌ఫ్రాన్‌సిస్కో ప్రేమికుల కొందరిని వారితో ప్రయాణం చెయ్యనివారిని రమ్మని బాబా వారిని చూసారు. మిగిలిన వారందరినీ త్వరగా ఆలింగనం చేసుకున్నారు. ఎనిడ్ కార్ప్‌ని ఏమిటి ఆలోచిస్తున్నావు? అని అడిగారు.

"మీరు ENID లో 'I' (ఆమెపేరే ఎనిడ్. 'I' అంటే ఆమెలోని అహం) తీసివేస్తే అదే END (అంతము) అంటే అహంకారం నిర్మూలనం అయితే ముక్తి కలుగుతుంది అన్న అర్థంలో బాగా చెప్పిందని బాబా ఎనిడ్‌ని మెచ్చుకున్నారు.

మధ్యాహ్నం 2-30 గంటలకు అంపయా బస్సులో నగర దృశ్యాలు చూడవాని కని యిదివరకు ఏర్పాటు చేసుకున్నట్లు బయలుదేరారు. బాబా, డా॥ నీలు, ఐవీడ్యూ్యాస్. ఆదీ కె. ఇరానీ యింకా అనేకమంది పిల్లలతోను ఒకస్టేషన్ వాగన్‌లో కూర్చున్నారు. లడ్ ఆ కారుని నడుపుతున్నాడు. అందులో వెళ్తున్నంతసేపు బాబా పిల్లలను అటూ యిటూ లాగుతూనే ఉన్నారు. వారికి బాబాతో కూర్చుని వెళ్ళే అవకాశం దొరికింది. డా॥ నీలు సాధారణంగా బుద్ధుడులా శాంతంగా ఉంటాడు. ఒక చోట కారు మరీ ఏట వాలుగా ఉన్న వీధిలోకి దిగుతూంటే అతని శాంత గంభీరమైన స్థితి ఏమయి పోయిందో ?

చైనా టౌన్, ఫిషర్‌మెన్స్ వార్ఫ్, టెలిగ్రాఫ్ హిల్, యివన్నీ చూసారు. తరువాత కోయిట్ టవర్ ఎక్కారు. అక్కడ నుంచి హార్బర్ ఎంతో బాగా కనిపిస్తుంది. తరువాత ప్రెసిడియో గార్డెన్స్‌కి వెళ్ళారు. అకస్మాత్తుగా బాబా లడ్ వైపు తిరిగి మనం హోటలుకి 4 గంటలకల్లా చేరుకోవాలి అన్నారు. అప్పటికే మూడు ముప్పావు అయింది. ఇంక పావుగంటే వ్యవధి ఉంది. ఈ సంగతి మిగిలిన వాళ్ళకి అంటే బస్సుకి హార్ఫ్ నడుపుతున్న కారుకి ఎలా తెలియజేయడమా అని ఆలోచిస్తున్నాడు. వారిద్దరు ప్రెసిడియో దగ్గర లడ్ వాగన్ ని కలుస్తామన్నారు. బాబా లడ్ తో బస్ ఎక్కడుందో కనుక్కోమ న్నారు. బాబా ఆజ్ఞలు ఎలా పాలించడమా అని లడ్ ఆలోచిస్తున్నాడు. వేగం ఎక్కువ చేసి నడుపుతున్నాడు. హార్ఫ్ నడిపే కారుని బస్సును కలిసే వరకూ లడ్ ఉండమ న్నాడు. బాబా యిచ్చిన రెండు ఆజ్ఞలు పరిపాలించాలని బాబా చెప్పారు. (1) బస్ కను క్కోవడము, (2) 4 గంటలకల్లా హోటలు చేరుకోవడము. కాని బస్ కనుచూపు మేరలో ఎక్కడా కనబడటం లేదు. హార్ఫ్ ఉన్న చోటికి వెంటనే లడ్ వెళ్ళాడు. అక్కడే బస్ కూడా ఉంది. వెంటనే హోటలుకి వెళ్ళిపోతున్నాం రండి అని వారిని కేక వేసి చెప్పాడు. లడ్ హోటలు చేరుకునేసరికి సరిగ్గా 4 అయింది. ఆ సమయానికి అక్కడికి ఎలా వెళ్ళగలిగాడో లడ్‌కే తెలియదు. బాబా వారందరిని తమ గదిలోకి రమ్మని పిలిచారు. బాబా గంభీరంగా ఉన్నారు. టోరీ ఆన్ అనే బాలిక రాలేదు. ఎక్కడ ఉండిపోయిందో. ఎవరూ యీ సంగతి గమనించలేదు. అందరూ ఎక్కడ ఉందో అని వెతకడం ప్రారంభించారు. తరువాత తెలిసింది స్పార్కీ లూక్స్, టోరీ ఆన్ తో కలిసి యిద్దరూ కోయిట్ టవర్ ఎక్కారని. వారిద్దరూ కూడా వెనక ఉండిపోయారు. వారిని ఎక్కించుకోకుండా కార్లు బయలుదేరాయి. ముందు యితరుల గురించి ఆలోచించాలని బాబా వారందరికి పాఠం నేర్పారు.

ఇళ్ళల్లో అలంకారాలు చేసి అందాలు తీర్చే వృత్తిలో ఉన్న ఫ్రెడ్ ఫ్రే సమావేశపు గదిలోపల కొన్ని గంటలు పనిచేసి అది సుందరంగా తయారుచేసాడు. అతడు తన యింటివద్ద నుంచి మొక్కలూ అవీ పట్టుకొచ్చాడు. ఆ రాత్రికి ఎవరో కాని ఆ మొక్కలన్నీ తీసి చల్లగా ఉండే రెఫ్రిజిరేటర్‌లో పెట్టేసారు. అతడు చేసినపని అంతా చెయ్యనట్టే అయింది. ఫ్రెడ్ ఫ్రే మళ్ళీ తన యింటికి వెళ్ళి మొక్కలు పట్టుకొచ్చి అందంగా మళ్ళీ అమర్చాడు. ఆ కంగారులో తన కాలుకి దెబ్బకూడా తగుల్చుకున్నాడు. బాబా సమావేశపు గది ఎక్కడుంది? అని బాబా అడిగేసరికి ఫ్రెడ్ పాపం ఏమీ అర్థం కానట్లు ఊరుకున్నాడు. అతనికి కాలు బాధగా ఉంది. బాబా అన్నారు.— ఫ్రెడ్ నా పిచ్చి శిష్యులలో ఒకడు. "బాబా గదిలోకి వెళ్ళి కూర్చున్నారు. ఆయన కూర్చున్న చోట, మంచి పుష్పాలు ఆకులు, అందంగా అమర్చబడి ఉన్నాయి. అదంతా ఫ్రెడ్ పనే. "నీవు నిజంగా నాకోసం పిచ్చివాడవుతే నన్ను నిజంగా కనుగొంటావు" అన్నారు బాబా.

"ఎవరయితే నా యెడల ప్రేమతో పిచ్చివారవుతారో వారునన్ను కనుగొంటారు" అన్నారు బాబా. "ఆసాయంకాలం జరుగబోయే మంచుగడ్డ ప్రదర్శనానికి అందరూ హాజరుకావాలి నేను వెళ్ళిపోయినాసరే" అని అందరినీ ఆదేశించారు బాబా.

ఆ సాయంత్రం బాబా ఎట్టిటి ఉన్నికోటు తొడుగుకున్నారు. అంతటా పొగ మంచు అలుముకుంది. ఆయనకు ఇష్టమయిన పైస్లీ స్కార్ఫ్ తలకి చుట్టుకున్నారు. బాబా చార్మియాన్ డ్యూక్స్ యొక్క తెల్ల బొచ్చు టోపీ తమ తలకు పడుతుందేమో అని పెట్టుకొని చూసారు. అందరూ కార్లకోసం వేచియున్నారు.

బాబా పరివారంతో కౌపాలెస్ వద్దకు చేరుకున్నారు. ఆ మేడమీదనుంచి చూస్తూంటే క్రింద మంచు మీద గిరగిర తిరుగుతున్న వాళ్ళు బాగా కనిపిస్తున్నారు. ఇంకా పై అంతస్తులోకి ఎక్కిన వాళ్ళకి బాబా తలమీద కుడిపైపున బట్టతలగా ఉన్న మచ్చ కనిపిస్తోంది వాళ్ళకి. కౌపాలెస్ థియేటర్ వద్దకు రాగానే బాబా రుత్ వైట్ కోసం అడిగారు. ఆమె వచ్చినట్టులేదు. కిట్టీని హోటలుకు ఆమెకోసం టెలిఫోన్ చెయ్యమన్నారు బాబా. ఇంతమందిలో రానివారిని బాబా యిట్టే కనిపెట్టేసి వారిని రప్పించడానికి అన్నిప్రయత్నాలు చేస్తారు. యింకో సంగతి. బాబాతో కలిసివచ్చినపుడు ఎవరయినా ఎక్కడికయినా వెళ్ళాలంటే వారు బాబాని అడిగి వారి అనుమతి తీసుకుని వెళ్తే బాబా చాలా సంతోషిస్తారు. లేకపోతే చెప్పకుండా వెళ్ళినవారికోసం చూచి ఫలానా వారు ఏరి? ఎక్కడికివెళ్ళారు పిలవండి అని బాబా వారిని రప్పించడానికి ప్రయత్నిస్తారు.

ఎన్నో కార్లు ఉండడం వల్ల బాబా హోటలుకి వెళ్దాం అని లడ్‌తో చెప్పగా బాబా కారు బయటకు తీయడానికి లడ్ చాలా కష్టపడవలసి వచ్చింది. చాలా అవస్థపడి హోటలు చేరేసరికి లడ్‌కి జ్వరం వచ్చింది. లడ్ ముఖంచూసి బాబా అతని బుగ్గలమీద చేయిపెట్టి చూసారు. వెంటనే రెండు అనాసిన్ మాత్రలు వేసుకొని పడుకోమని లడ్‌తో చెప్పారు. ఉదయాన్నే డాక్టరుని పిలవమన్నారు. లడ్‌కి వచ్చిన జ్వరం న్యుమోనియా అని తేలింది. మరునాడు తెల్లవారిన తరువాత లడ్ గదికి వెళ్ళి బాబా అతనిని చూసారు. చూసి "నీకు జ్వరం వచ్చినందుకు సంతోషంగా లేదూ, బాబా అంతకేనా స్వయంగా నిన్ను చూడడానికి వస్తే!" అన్నారు బాబా. (అతనికి జ్వరం రాకపోతే బాబా అతని వద్దకు వెళ్ళి ఉండేవారు కారుకదా!) ఆ మాటవిని లడ్ నవ్వుకున్నాడు అతనికి ఉపచారాలగురించి చెప్పి రెండు రోజుల్లో తగ్గిపోతుందిలే అని చెప్పారు బాబా. తరువాత డాక్టర్లు చాలా ఆశ్చర్యపోయారు నిజంగా రెండు రోజుల్లో న్యూమోనియా తగ్గిపోయినందుకు.

**శనివారం, ఆగస్టు 4 :—**

ఉదయాన్నే ప్రియతముడు ఆయన ప్రేమికులను అందరిని ఆలింగనం చేసుకున్నారు. సరిగా 9–30 గంటలకు సమావేశపుగదిలో అందరూ వచ్చి కూర్చున్నారు. ఆ గదిలో తళతళా మెరసే పొడుగయిన బల్ల ఉంది. అందరూ దానిచుట్టూ కుర్చీలలో కూర్చున్నారు. బాబా ఒక తెరవెనుక కూర్చున్నారు. ఒక్కొక్కరినే పిలిచి వారితో బాబా సంభాషణలు చేస్తున్నారు. బాబాను చూసేవారిలో చాలామంది శాన్‌ఫ్రాన్‌సిస్కో లోని ప్రేమికులయిన సూఫీలు. సూఫీజమ్ రీ-ఓరియంటెడ్ అనే ఐవిడ్యూక్స్ యాజమాన్యంలో నడుస్తున్న సంస్థకు చెందినవారు. వారుగాక యింకా చాలామంది వచ్చారు. ఒకడు మెక్సికో నుంచి ఎంతో దూరం ప్రయాణం చేసివచ్చాడు. డా॥ తింద్ అనే ఉపాధ్యాయుడు కూడా వచ్చినవారిలో ఉన్నాడు. ఇంటర్వ్యూ లయిన తరువాత తెరలు ప్రక్కకి లాగేసారు. బాబా అందరికీ నమస్కరించారు. అప్పుడు 'గాడ్స్ డివైన్ బిజినెస్' (భగవంతుని దివ్య వ్యాపారం) అను సందేశం బాబా డాన్‌స్టివెన్స్ చేత చదివించారు—

"శాశ్వతుడు అవిభాజ్యుడు అయిన భగవంతుడు నిరంతరం ఒకే సమయంలో విరుద్ధపాత్రలు వహించి విశ్వవ్యాప్తమైన ద్వంద్వ వ్యాపారాన్ని చేస్తూంటాడు. సంతులు, స[illegible]వంతుని యొక్క ఆస్తులు. పాపాత్ములు దుర్మార్గులు ఆయన యొక్క అప్పులు. జ్ఞానానికి న్యాయానికి అనంతమూలమయిన భగవంతుడు తన అప్పులను ఆస్తులుగా మారుస్తూనే నిరంతరము తన వ్యాపారం

చేస్తూంటాడు.'' భోజనాలయాయి బాబా ఆ హోటలులో .ఖాళీ అయిన క్రొత్త గదులలోకి మారారు. ఒక దానిలో నుంచి మరియొకదానికి ద్వారం ఉన్న రెండు గదులు అవి. అందులో ఉన్నవారు ఒంటిగంట కాకుండానే ఖాళీచేసి వెళ్ళిపోయారు. ''అవేకెనెర్'' పత్రికకు సంబంధించిన వారంతా బాబాను కలుసుకొని సంప్రదించారు. బాబాకు చెప్పకుండానే ఆ పత్రిక ప్రచురణకు పడే ఆర్థిక యిబ్బందులు బాబా తెలుసుకున్నారు. ఈ పత్రిక పూర్తిగా బాబాకే అంకితం చేసి కొనసాగించడానికి వారు నిశ్చయించి నందున బాబా చాలా సంతోషించారు. బాబా శరీరం వదలిన తరువాత వారివద్దకు ఎంతోమంది వస్తారు అని బాబా అన్నమాట విని ప్రేమికులు ఆయన ఉండగానే అందరూ ఎందుకు రారో అని విచారించి అది బాబా ఇచ్ఛ కాబోలు అని సమాధాన పడ్డారు.

మధ్యాహ్నం మళ్ళీ సంభాషణలు కొనసాగాయి. తరువాత డాన్‌స్టీవెన్సు బావ యొక్క చిన్న చిన్న సందేశాలు కొన్ని చదివాడు. సాయంకాలం 4 గంటలకు 406 వ నెంబరు సట్టర్ స్ట్రీట్‌లో ఉన్న సూఫిజమ్ రీ - ఓరియంటెడ్ వారి కార్యాలయానికి వెళ్ళారు బాబా. సూఫీలు వారి సెంటరు తెరచి ఉంచారు. అందులో గది సాధారణంగా ఉంది. గోడలకు పసుపు రంగు వేయబడి ఉంది. అది సూఫీల రంగు. ఇనాయిత్‌ఖాన్ యొక్క బొమ్మ- బాబా యొక్క చిత్రము గోడలమీద ఉన్నాయి. లోపలికి వెళ్ళి పెద్ద కుర్చీలో కూర్చున్నారు బాబా. అందులో కూర్చుని ''నేనే అందరికంటే గొప్ప సూఫీని'' అన్నారు బాబా. బాబా సంజ్ఞలు చేస్తున్నారు - ఆదీ మాటలలో చెప్తున్నాడు. ''నేను క్రీస్తును.... అందులో సందేహం లేదు. నా మౌనం నేను విరమించినపుడు ఆ సంగతి ప్రపంచం అంతా తెలుసుకుంటుంది.''

మూర్షిదా డ్యూక్ కళ్ళవెంట నీరు పెట్టుకుంటూ దుఃఖిస్తూంటే బాబా ఆమెను రమ్మని తమ ప్రక్కన కూర్చోపెట్టుకున్నారు. ఆమె తలమీద చేయి వేసి ఆమెకు బలం కలగాలని బాబా ఆశీర్వదించారు. ఇప్పుడు ఆయన వారి సెంటరుకు వచ్చి దీవించారు గనుక వారిపని యింక నిర్విఘ్నంగా చేసుకోమని బాబా అన్నారు. ఈ సంస్థ జయప్రదంగా నడవడానికి కారకుడయిన వానిపేరు ఆమె బాబాకి చెప్పగా బాబా తల ఊపారు, అలాగా అని.

బాబా వెనుకటి సంగతులు జ్ఞాపకం చేసుకుంటూ 1923 వ సం॥లో ఆయన ఒక పెట్టెలో ఒక సంవత్సరం పాటు ఉపవాసంతో గడిపి ఆ పెట్టెలో ఏకాంతవాసం పూర్తిచేసి బయటకు వచ్చినపుడు జరిగిన ఒక సంఘటన గురించి బాబా చెప్పారు.

సంవత్సరం అన్నం తినని మనిషికి అసలు ఏం బలం ఉంటుంది ? అప్పుడు మండలిని పిలిచి బాబాను ఉన్నచోటినుంచి ప్రయత్నించి త్రొయ్యమని చెప్పారు. బాబా సంవత్సరంపాటు ఏకాంతంలో ఉపవాసాలతో కృశించి యున్నారు. 20 మంది మండలి వారు చేరి ఆయనను ఒక అంగుళమయినా కదపలేకపోయారు. 6 నెలలకు పైగా బాబా కాఫీ తప్ప ఏమీ తీసుకోలేదు ఆ సంవత్సరంలో. ఆదీ ఆ రోజులు జ్ఞాపకం చేసుకుంటూ — "అప్పుడు బాబా చాలా పెందలకడనే లేచేవారు. ఆయన అప్పుడు పాట పాడేవారు. (1925 లో మౌనం ప్రారంభించడానికి ముందు రోజుల్లో). ఆయనకి బహు శ్రావ్యమైన కంఠం ఉండేది." అన్నాడు.

బాబా సూఫీ కార్యస్థానం అంతా చూసి అక్కడినుంచి వెళ్ళిపోయారు. బయటకు వస్తూంటే ఆ భవనంనుంచి యింకో చోటనుంచి త్వరగా ఒక స్త్రీ వారందరినీ రాచుకుంటూ బాబాను దాటి ముందుకు పోయింది. ఆమె ఆయన బొటన వ్రేళ్ళను తొక్కేది కూడాను. బొత్తిగా ఎంత అనాలోచనగా ప్రవర్తిస్తారో కొందరు మనుష్యులు! తిరిగి వెళ్ళేటప్పుడు బాబా లడ్ ఎలా ఉన్నాడో చూద్దామని అతని యింటికి వెళ్ళారు. బాబా లడ్ ని చూసి క్రిందకు వచ్చేసరికి లడ్ డింఫిల్ యొక్క అందమయిన కూతురు 14 ఏళ్ళ డయానా డింఫిల్‌ను చూసి "ఈ మాటు నేను వచ్చినపుడు నిన్ను ఇండియాకు పిలుస్తాను" అన్నారు ఆమె బుగ్గని పుణుకుతూ. ఆమెకు బాబా బి- బి- బి అని పేరు పెట్టారు— (బాబా'స్ బిలవెడ్ బేబీ) బాబా యొక్క ప్రియతమ బిడ్డ అన్నమాట.

## ఆదివారం, ఆగస్టు 5 వ తేదీ :—

అందరూ నిద్రపోతుండగా ఆదివారం రాత్రి హోటలు ఆఫీసులో దొంగలు పడ్డారు. మరునాడు ఉదయాన్నే హోటలు మానేజరు బాబా దర్శనం చేసుకుని యీ సంగతి చెప్పి "మీ దయవల్ల ఏమీ అపాయం కలుగలేదు బాబా, ఏ వీ పోలేదు" అని విన్నవించుకున్నాడు.

ఉదయాన్నే అయిదుగురు లోను నలుగురు స్త్రీలు మాత్రమే బాబాను ప్రాతఃకాల దర్శనం చేసుకున్నారు. ఆదివారం బాబా 'అయిదు వేళ్ళలోను ఒక వేలు కనిపించటం లేదే' అన్నారు. వారిని వారి జీవితం గురించి పని గురించి ప్రశ్నలు వేసారు. బాబా తరువాత డాన్‌స్టీవెన్స్ ని పిలిచి యీ పర్యటనలో బాబా యిచ్చిన సందేశాలన్నీ ఒక పుస్తక రూపంలో ప్రచురించమని బాబా వారి అభీష్టం తెలిపారు. అయిదు నెలలలో

పుస్తకం తయారు కావాలన్నారు. 'లైఫ్ ఎట్ ఇట్స్ బెస్ట్' అనే పుస్తకం (ఉత్తమో త్తమ జీవితం) ప్రచురణ అయేసరికి ఒక సంవత్సరం పట్టింది.

ఉదయాన్నే శాన్‌ఫ్రాన్సిస్కోలో బాబా శిష్యులతో కూడా ఉన్నప్పుడు ఉన్నత తరగతికి చెందిన అల్పాహారాన్ని కావాలని తెప్పించగా బాబా అది చూసి ఎందుకీ విధంగా డబ్బు పాడుచేస్తున్నారని మందలించారు. తమ ప్రేమికులు కష్టపడి యిచ్చిన సొమ్మును యిలా అనవసరపు ఆడంబరయుతమయిన భోజనాలకి ఖర్చు పెట్టడం బాబాకి బొత్తిగా యిష్టం లేదు. ప్రపంచంలో అనేకమంది ప్రజలు రోజు కొక్కపూటే భోజనం చేయగలుగుతున్నారన్నది జ్ఞాపకం ఉంచుకోవాలని కొంతమందికి అదికూడా దొరకడం లేదని బాబా అన్నారు.

తరువాత ఆతిధ్య సంఘం సమావేశమయింది. ఆ సమావేశానికి బాబా అధ్యక్షత వహించారు. కొందరు చేసిన తప్పులు, కొందరి మధ్య కలిగిన భేదాభి ప్రాయాలు యివన్నీ చర్చించారు. కొంతమంది మనసుకు కష్టం కలిగింది. కొంత మంది కొందరిని నిందించడం వారు మూతి ముడుచుకోవడం జరిగింది. మొత్తానికి బాబా అందరికీ సామరస్యం కలిగించారు. ఈ సందర్భంలో బాబా వారు యిచ్చిన పశ్చాత్తాప ప్రార్థన చదవమన్నారు. ఆ ప్రార్థన ఎవరికీ కంఠతః రాదు. మొత్తం బాబా శిష్యులు అక్కడ ఉన్నకారు 40 మంది ఉన్నా ప్రార్థన ఎవరూ చదవలేక పోయారు సరికదా ఆ ప్రార్థన అచ్చువేసిన ప్రతి అయినా ఎవరి వద్దా లేకపోయింది. అందరూ బాబా అంటే అమిత భక్తి గౌరవాలున్నవారే అయినా ఎవరివద్దనూ బాబా చెప్పిన ప్రార్థన లేకపోయింది.

బాబా అప్పుడు చేసిన ప్రసంగం ఎరచ్ యీ విధంగా భాషాకరణం చేసాడు_

''నేను క్రీస్తును. మండలి బాబా వద్ద ఉన్నారు. వారికి నేను క్రీస్తునే అన్న సంగతి తెలుసును. అది తెలిసి ఉండీ కూడా యిలాంటి ఆహారమును తెప్పించి ఉండ కూడదు. ప్రపంచంలో ఉన్న ఎక్కువమంది ప్రజలకు రోజుకి ఒక్కపూట మాత్రమే సరియయిన తిండి ఉంటోంది. ఇండియాలో చాలామందికి అది కూడాలేదు. మీరు నన్ను అంటిపెట్టుకొని ఉండాలంటే మీరు పరిశుద్ధమయిన హృదయం కలిగియుండాలి. ఒక్కొక్కప్పుడు నమ్మకం ఉండి ఒక్కొక్కప్పుడు సందేహం కలిగి ఉండడం వలన ఏమీ ప్రయోజనం లేదు. అటువంటప్పుడు నన్ను వదిలివేస్తే ఉత్తమం. మీరు ప్రపంచంలో మీకు ఇచ్ఛ వచ్చినట్లు జీవితం గడపవచ్చు _ స్వేచ్ఛగా ఉండవచ్చు. మీరు నన్ను ప్రేమించాలని కోరితే మీలో మీరు గందరగోళం సృష్టించడానికి

ప్రయత్నించకూడదు. మీరందరు నన్ను ప్రేమిస్తున్నారు. కానీ మీరు ఒండొరులను ప్రేమించుకున్నందున నన్ను మీరు ఉత్తమంగా ప్రేమిస్తున్నవారవుతారు. అన్నిటికంటె మీరు ఒకరినొకరు ప్రేమించుకోవడం మంచిది. ఎవరయినా ఒకరి పరోక్షంగా ఏదయినా చెప్పవలసి ఉంటే, వారి అహంకారాన్ని బలపరచాలని ఉంటే, యింక నా ప్రేమ గురించి ప్రపంచానికి మీరు ఎలా చెప్పగలరు? ఇతరులకు ఆదర్శాన్ని ఎలా చూపగలరు? నేను మిమ్ములను అందరను కోరుతున్నట్లు మీరందరు నన్ను ప్రేమించలేకపోతే నన్నుగురించి ప్రపంచ ప్రజలతో మాట్లాడకుండా ఉండడం మంచిది.

మనం కపటానికి స్వస్తి చెప్పెదము గాక. మనం అందరం ఒకటే అని నేను చెప్తున్నాను. అందరూ ఒక పెద్ద ప్రేమిక కుటుంబం. మనం అందరం ఒకటే హృదయం కలిగి ఉండాలి — పరిశుద్ధమయిన హృదయం. మన భేదాభిప్రాయాలకి అనవసరంగా యింకొకరి మనసుకు నొప్పి కలిగినందువలన మన తప్పులను క్షమించమని భగవంతుని కోరుదాము. భగవంతుని క్షమార్పణ కోరుకోవాలి మనం. బాబాకి ఉన్నటువంటి అనంతమయిన ఓర్పులో నూరవవంతయినా మనకు భగవంతుడు ప్రసాదించుగాక!

"ఇప్పుడు ఒక్కొక్కరే వచ్చి నన్ను ఆలింగనం చేసుకోండి."

ఇలా ఎరచ్ ద్వారా బాబా చెప్పిన మాటలు వినిపిస్తూంటేనే "ఛీ! ఈ జన్మ ఎందుకు? బాబా చెప్పినట్లు మనం చేయలేకపోతే—" అని చాలామంది భావించి సిగ్గుతో కుంచించుకు పోయారు. కొందరి స్త్రీల నేత్రాలనుండి బాష్పధార కురిసింది. ఒకామె గోడకు జేర్లబడి వలవల ఏడుస్తూ లేవలేక పోయింది. అందరూ బాబా వద్దకు వరుసలో వెళ్ళడంలో వారి కాళ్ళను మాత్రం చూడగలిగింది. తరువాత ఆమె యితరుల ముఖాలవైపు చూసి వాళ్ళుకూడా తనవలెనే దుఃఖిస్తున్నారని తెలుసుకుంది. తరువాత ఆమె కూడా లేచివెళ్ళి బాబాను ఆలింగనం చేసుకోడానికి కూడా ప్రయత్నించలేకపోయింది. ఎట్టకేలకు వెళ్ళి బాబా కౌగిలింతలో ఆమె యిమిడిపోయింది. కానీ ఆమెకు మాత్రం అపరిమితమయిన నెమ్మది ఓర్పు కలిగింది.

తరువాత మిగిలినవారిని పిలిచారు. ఇప్పుడు అందరికీ పెద్దగదులు బాబా ఎందుకు కావాలన్నారో తెలిసింది. 40 మంది ప్రేమికులు బాబా పిలువగానే గదిలోకి వచ్చారు బాబా సంజ్ఞలు ఎరచ్ తర్జుమా చేస్తున్నాడు. ఇండియాలో జరుగబోయే పెద్ద సమావేశానికి అందరిని రమ్మని బాబా ఆహ్వానించారు.

రాత్రి నేను చాలా ఆలోచించాను. చాలాసేపు నేను విశ్వకార్యం చేస్తూ గడిపాను. సమావేశం గురించి నేను నిశ్చయించాను. నా ఏకాంతవాసం తరువాత నవంబరు 7 వ తేదీ నుంచి అది జరుగుతుంది. నేను పశ్చిమదేశాలనుంచి ఎవరెవరిని పిలుస్తున్నానో అన్నీ మీకు వ్రాస్తాను. పాశ్చాత్యులు ఎప్పుడు రావాలో వారు ఎన్నాళ్ళుండాలో, ఒక నెలో ఎంతో, వివరాలన్నీ తెలియపరుస్తాను. ఈ సంగతులు మీకు 1957 వ సం॥ మార్చిలో తెలియజేస్తాను. నాకు త్వరగా జవాబులు వ్రాయాలి. ఎందుకంటే వసతి భోజన సౌకర్యాలు కలుగజేయాలి గనుక. ప్రపంచం వివిధ దేశాల నుంచి వచ్చే ప్రేమికులు ఒక నెల ఉండవలసి వస్తుంది. దానా! నే చెప్పినదంతా మళ్ళీ చెప్పు. గట్టిగా కుజగ్రహంలోకి వినిపించేలా చెప్పు.

దానాఫీల్డ్ ప్రయత్నం చేసాడు. ఎలిజబెత్ పాటర్సన్ అడిగింది "మేము యిప్పుడే జవాబు యివ్వవచ్చునా?" అని.

బాబా యింకాయిలా చెప్పారు—"నాకు ఆరునెలలయినా ఏర్పాట్లన్నీ చేయించడానికి వ్యవధి కావాలి. ఇండియా నలుమూలల నుంచి వచ్చేవాళ్ళు చాలా మంది ఉంటారు– అన్ని భారతీయ బృందాల వాళ్ళు. వాళ్ళందరికీ ఏర్పాట్లు చేయడానికి కొంత కాలం పడుతుంది. డాన్! ఇందంతా గట్టిగా చెప్పు-సముద్రంలోని చేపలకు వినిపించేలా చెప్పాలి. మొదటి నుంచి చెప్పు. బాబా వినలేరు....బొగ మంచు మూలాన!" అందరూ తెగ నవ్వారు. బాబా నేత్రాలలో అంతర్జ్యోతి వెలుగుతోంది. ప్రియతమ బాబా ఇండియాకు రమ్మంటున్నారని అందరూ ఉద్రేకపూరితులయారు. బాబా ఎవరి ప్రయాణపు ఖర్చులు వారు భరించాలన్నారు. ఇవ్వగలిగినవారు విరాళాలివ్వ వచ్చును. ఫిబ్రవరి 15 వ తారీఖు తరువాత యివ్వవచ్చును. ఒక నెల రోజులుండడానికి ఏర్పాట్లు చెయ్యడానికి చాలా డబ్బు అవుతుంది. బెన్ హేమన్ సమావేశం మగవారికే ఉంటుందా అని అడిగాడు. దానికి చాలా మంది ఆక్షేపణ చెప్పారు. ఇండియాలో స్త్రీలకి నామీద కోపం వచ్చింది. ఎందుచేతంటే వారికోసం నా సహవాస్ పెట్టడానికి వీలులేకపోయింది. ఇలాంటి సమావేశం యిదివరకు జరిగియుండలేదు. నేను సాధువులను కూడా పిలుస్తాను. నాకిష్టమయిన వారు ఏడుగురిని. ఆడవాళ్ళు నూటికి 90 మంది వస్తారు. పురుషులు నూటికి 10 మంది. అని బాబా తమాషాగా అన్నారు. మేరియన్ ఫ్లోర్‌షీమ్ డబ్బు వసూలు చెయ్యడం గురించి అడిగింది. బాబా చిరునవ్వుతో అన్నారు "అవును వసూలుచెయ్యాలి 20,000 మిలియన్ల డాలర్లు!" అందరూ నవ్వారు.

అల్పాహారం తీసుకోవడానికి అందరూ వెళ్ళారు. భోజనశాలలో బాబా ఒకస్త్రీని చూసారు. ఆమెసమావేశం గురించి వినగానే ఆమెను ఆ సమావేశానికి బాబా రమ్మన లేదని ఆమెకు దిగులుగాఉంది బాబా స్పష్టంగా ఆజ్ఞాపించారు. "నాతోప్రయాణం చేసిన వారే రావాలి." ఆ రోజు ఉదయం బాబా ఐవీడ్యూస్. డాన్‌స్టీవెన్స్, ఫ్రెడ్‌ఫ్రేల యిండ్లకు, శాన్‌ఫ్రాన్‌సిస్కోలోని సూఫీల యిండ్లకు వెళ్ళారు. ముందు సూఫీ సెంటరు అయిన తరువాత, ఐవీడ్యూస్ యింటికి మొదట వెళ్ళారు ఐవీ యింటి డాబా మీదకు వచ్చి, బాబా ఏదో ఆంతరిక కార్యం చేస్తున్నట్లు కనిపించారు. ఆయన వ్రేళ్ళు వడివడిగా కదులుతున్నాయి.

బాబా డాన్‌స్టీవెన్స్ క్రొత్త యింటికి వెళ్ళి అతనికి ఆ యిల్లు అమ్మెయ్యమని సలహా యిచ్చారు. ఫ్రే యింటిలో అందరూ ఆరుబయట చల్లగా ఉందని భోజనాలు చేసారు. అతని యింటిలో అలంకారాలు చాలా బాగున్నాయి. జావా నుంచి వచ్చిన రాబర్ట్ అనే సేవకుడొకడు ఉన్నాడు. వానికి బాబా తెలుసునని ఫ్రే దంపతులు ఆశ్చర్య పోయారు. రాబర్ట్ కుటుంబం అందరికి బాబా సంగతి తెలుసునట. రాబర్ట్‌కి బాబాను చూడగానే ఏడవ స్వర్గానికి వెళ్ళినంత ఆనందం కలిగింది. ఆయనకు ఏమి కావాలో చూసి ఆయన పరిచర్య చేయడానికి ఆయనకు కావలసిన పదార్థాలు చేసి ఆయనకు పెట్టడానికి, ఆయనకి అన్నం దగ్గిరా పండి పెట్టడానికి ఎంతో ఆనందించాడు. బాబాకి కూడా సంతోషం కలిగింది.

లాడ్జికి చేరుకోగానే మార్గరెట్ యొక్క నాట్య బృందం ఎప్పటినుంచో బాబా యెదుట నాట్యం చేయాలని కనిపెట్టుకున్నా యింతకాలానికి యిప్పుడు అవకాశం కలిగింది. మొదట బాబా కొద్దిమందికి నాట్యప్రదర్శన యివ్వాలనుకున్నారు. ఇప్పుడు అది చూడడానికి చాలామంది వచ్చేసారు. బాబాకు ఏదో టెలిగ్రాం వస్తే అది ఆయనకు యివ్వాలనే మిషతో ఒకడు లోపలికి వచ్చి నాట్యం చూసాడు. 'ది బ్లాక్ బాటమ్' అనే నృత్యం బాబాకి బాగా నచ్చింది. తరువాత టెక్స్ హైటవర్, బంటీకెల్లీ చేసిన నృత్యాలు, మేఅదేర్ ఒక్కతే చేసిన 'డాన్స్ ఆఫ్ ది సన్ మెయిడెన్' బాగున్నాయని బాబా మెచ్చుకున్నారు. తరువాత నీవేమి చేస్తావని పీటర్ సాల్‌ని అడిగారు బాబా. నేను ఒక్కడిని ఏమీ చెయ్యనన్నాడు. అయినా బాబా అడిగారని జోళ్ళు తొడుగుకొని బాబా కోసం అతడు ఒక్కడూ నాట్యం చేసాడు. బాబా అతనికి ముందు నాట్యం చేసిన వారందరికి తరువాత పీటర్‌సాల్‌ని బాబా ఆలింగనంతో బహూకరించారు. బాబా చాలా సంతోషంగా ఉన్నారు. ఇలా నాట్యం చూస్తూ ఉండాలని ఉందన్నారు బాబా. మార్గరెట్

నాల్య బృదంతో బాబా ఫొటోకి కూర్చున్నారు. చార్మియాన్ తన కెమెరాతో ఫొటో తీసింది. తరువాత మార్గరెట్ బృందంవారు బాబాతో కొంత సమయం గడిపారు, ఆయన గదిలో ప్రత్యేకంగా. అనేక మారులు బాబా ఒకరికో, ఇద్దరికో, కొద్దిమందికో సన్నిహితంగా ఆయనతో ఉండాలని ఉన్నవారికి బాబాతో మాట్లాడటానికి అవకాశాలిచ్చి వారికి ప్రత్యేకమయిన సందేశాలు, సలహాలు కూడా యిచ్చారు. ఒక యువకునితో "నన్ను యింకా ఎక్కువగాను, ఎంతో ఎక్కువగాను ప్రేమించు" అన్నారు. అతడన్నాడు – "నాకు నిజమైన ప్రేమ ఉంటే నేను ఎంత బాధనయినా సహిస్తాను"–అని.

బాబా యింకొకనితో – "నేను అమాయక బాలుణ్ణి నిన్నుకూడా అమాయకునిగా చేస్తాను" అన్నారు.

క్రొత్తగా దర్శనానికి వచ్చిన ఒకనితో "నేను అందరిలోను ప్రతి యొక్కరిలోను ఉన్నానని బాగా తెలుసుకో. నేను యీ శరీరం మాత్రమే కాదు. నేను మహా సముద్రమును. నీవు నన్ను తీవ్రంగా ప్రేమిస్తే నన్ను నీవు అన్నిచోట్లా చూడగలవు." అన్నారు.

సంసారబంధాలు లేని ఒకనితో బాబా – "నీవుయిలానిస్సంగువై యుండడంలో నీవెంత అదృష్టవంతుడవో నీకు తెలియదు." అన్నారు.

బాబా దర్శనార్థం ముగ్గురు అక్కచెల్లెళ్ళు వచ్చారు. వారితో బాబా "మీహృదయం పరిశుద్ధంగా ఉంచుకోండి" అన్నారు.

ఒక బాలిక "బాబా నీకు గురువు కాదు" అని ఎవరో అన్నారని బాబాతో చెప్పింది. "గురువులు! గురువులు! గురువులకేం ప్రమేయముంది? నేను నీ దేవుడను."

శాన్‌ఫ్రాన్సిస్కోలో అనుకోని సమావేశాలు చాలా జరిగాయి. ఒక నిప్పు ఆర్పే పనివాడు బాబాకి ఒక పండు తీసుకువచ్చాడు. అతడు అది బాబాకు సమర్పించి యిలా అడిగాడు — "బాబా! నా హృదయం ఎక్కువగా ఎలా తెరవాలి? నేను ఎక్కువగా ఎలా ప్రేమించగలను?" అతనిని బాబా అర్ధరాత్రివేళ బాబాపేరు నూరుమార్లు జపించమని చెప్పారు. అతడు చాలా కృతజ్ఞత తెలియపరచాడు. తన పని చేసేటప్పుడు తాను భగవంతుని తలచుకుంటున్నానని అన్నాడు.

ఒకామె బాబా యెడల ఎన్నో తప్పుడు భావాలు కలిగి వచ్చింది. ఆయన దర్శనం చేసుకున్న తరువాత – "ఆహా! ఆయన ఎంత మంచివారు! ఎంత

అందమయినవారు ! ఆయన తప్ప నా మనసులో ఏమీలేదు. ఇదివరకు నేను ఆయనగురించి తలచినదానికి భగవంతుని నన్ను క్షమించమని ప్రార్థిస్తున్నాను.'' అంది.

ఒక చిన్న బాలికతో బాబా అన్నారు — ''నీవు నన్ను ప్రేమిస్తున్నావా ?'' అలా బాబా అడగగానే ''మా అమ్మని నీవు ప్రేమిస్తూంటే నిన్ను నేను ప్రేమిస్తాను.'' అంది. బాబా అమూల్యమయిన చిరునవ్వు చిందించారు.

మధ్యాహ్నం 2–30 గంటలకు మెహెర్ బాబా ఆతిథ్యసంఘం వారు బాబా యెదుట సమావేశమయినారు. మేరియన్ ఫ్లోరెషీమ్ ఆర్థిక నివేదికను చదివింది. చివరికి ఎంత డబ్బు మిగిలిందో చెప్పింది. బాబా — ''మిమ్మ అందరు నమ్మ తున్నారు. నేను మిమ్మ నమ్మతున్నాను. అందుచేత అన్నీ బాగానే ఉన్నాయి'' అన్నారు. ఐవీ మేరియన్‌కి ధన్యవాదాలు చెప్పింది. తరువాత ఎలిజబెత్ పాటర్సన్ లేచి బాబా వచ్చినందుకు వారందరి తరఫున కృతజ్ఞత తెలిపింది.

బాబా — ''నా కోసం మీలో ఉన్న సముద్రమంత ప్రేమను చూస్తూంటే అపారమయిన ప్రేమ మహాసాగరం నా ప్రేమికుల ప్రేమతో కలచివేయబడింది. మీ ప్రేమ ఆ సాగరంలో కెరటాలను ఉత్పన్నం చేసింది — ఎన్ని కెరటాలో మీకు తెలియదు .. ఈ గడచిన రోజులు నా దివ్య నిర్ణయం ప్రకారం జరిగాయి. నాకు యిచ్చిన మీ ప్రేమతో నేనెంతో ఆనందించాను.

తరువాత ''అనుల్లంఘనీయమైన జీవన సమైక్యత'' అనే సందేశం బాబా చదివించారు.

## బాబా సందేశం :—

సకల జీవనము యొక్క అనుల్లంఘనీయమైన ఐక్యతను, పరాధీనము చేయరాని దివ్యత్వమును మానవకోటిని తెలుసుకొనునట్లు చేయుట భగవంతుడు నాకు ఆదేశించిన పని. అసలు మీరు శాశ్వతులును, అనంత జ్ఞానమునకు, ఆనందమునకు శక్తికిని వారసులు. మీ యొక్క అపారస్థితిని అనుభవించడం కోసం, నీవు మిగతా జీవనము కంటే వేరుగా ఉన్నావని నిన్ను భావింపజేసే నీ అజ్ఞానమును వదిలివేయుట అవసరము. వేరేగా ఉన్నావని నీకు స్ఫురింపజేసే నీ 'అహం' దివ్య ప్రేమ ద్వారా అదృశ్యం కావాలి. అదే మానవులకు నేను యివ్వబోవు కానుక.

నా పిలుపు వినేవారు మానవకోటికి నిజమైన సేవ చేయుటకు సిద్ధము కావలయును. పైకి కనిపించే విభాగాలు, జాతి వర్ణ మత భేదాలు ఎన్నివున్నా

మానవులందరూ ఒకటే అని వారికి తెలియజెప్పాలి. నమ్మకాలకి మూర్ఖవాదాలకి నేను ప్రాధాన్యత యివ్వను. చివరకి గణనకి వచ్చేది మీరు నమ్మేదికాదు, మీరు ఏదిగా అయిఉన్నారో అది. దేనికి విరుద్ధము లేకుండా ఉంటుందో, ఏది యీ ప్రపంచంలో కావాలని ఆశించడానికి యోగ్యమైనదేదీ లేదని తెలియజేస్తుందో, ద్వేషము, అసూయ, భయము ఉండనక్కర లేదని దేనివల్ల తెలుస్తుందో దేనివల్ల అట్టి అపరోక్షానుభూతి కలుగుతుందో దానివల్ల కాని, నాతో పంచుకొనమని నేను చెప్పే సత్యము. అభిప్రాయ మును, నమ్మకమును బట్టి కాదు. అప్పుడే, అప్పుడు మాత్రమే, అంతము లేనటువంటి సృజనాత్మక కార్యములతోను, మాసిపోని సుఖములతోను— అవి క్షయము కావు, భయమును కలిగించవు— మానవుడు తన యాత్ర ప్రారంభిస్తాడు. అతడు నేను, నీవు, నాది, నీది అనే ద్వంద్వభావమును అధిగమిస్తాడు.''

''అంతా లోపలే ఉంది'' అను సందేశము కూడా బాబా చదివించారు—

''సాధించినవన్నీ విజ్ఞానశాస్త్రమునందు ప్రగతివలన కలిగినవి. అవి బాహ్యంగా ఉన్న దానిని విశేషంగా పరిశోధించుట వలననూ కలిగినవి. లోపల ఉన్నది తెలుసుకొనగలిగితే బయటవున్న దానియొక్క మూలము బట్టబయలు అవుతుంది. తన అనంతాత్మకు ఛాయామాత్రంగా లోపలనుంచి ప్రతీదీ బయటకు వస్తుందని మానవుడు అనుభవం వలన తెలుసుకుంటాడు.''

ఇంకొక సందేశంలో మీరు ఏది నమ్ముతున్నారన్నది కాదు ముఖ్యం కానీ నిజంగా మీరేదయి యున్నారు అన్నది ప్రధానం అని చెప్పారు.

మధ్యాహ్నం 3-15 గంటలకు బాబా గదిలో అందరూ మరల సమావేశ మయారు. ఇండియాకు వెళ్ళడం గురించి యింకా చర్చ కొనసాగింది —

బాబా చెప్పారు — నా వలెనే మీలో చాలామంది డబ్బు లేకుండా ఉన్నారని నాకు తెలుసును. నేను యీ విశ్వానికి నాథుడనయినప్పటికి జేబులు ఎప్పుడూ చిల్లులు కలిగి ఉంటాయి. (అంటే ఖాళీగా ఉంటాయన్నమాట). ఇండియాకి వెళ్ళడానికీ మళ్ళీ అక్కడనుంచి రావడానికి అయే ఖర్చులుంటాయి కదా. మీలో కొందరు మీ రాకపోక ఖర్చులు పెట్టుకొని అక్కడ ఏర్పాట్లకయే ఖర్చులకు కొంతడబ్బు విరాళంగా యివ్వ గలిగే వారుంటారు. ఏమీ లేనివాడు ఒక్క డాలరు విరాళంగా యిస్తే బాగా ఉన్నవాడు పదిలక్షల డాలర్లు యిచ్చే దానితో సమానం. సమావేశంలో అమలుపరచడానికి నేను యింకా యితర పథకాలు వేస్తున్నాను. ఈ సమావేశానికి ఆధ్యాత్మిక విశిష్టత ఉన్నందున అది ప్రపంచాన్నంతనీ కదిలించి వేయవచ్చు. నేను ఏకాంతంలో

ఉంటాను. గనుక ఫిబ్రవరి 15 వ తేదీ లోగా ఎవరూ విరాళాలు పంపరాదన్న సంగతి మరచిపోకండి. ఫిబ్రవరి 15 వ తేదీ తరువాతనే మీరు పంపదలచుకున్నది ఆదీ పేరున పంపించండి. ఫిబ్రవరి 15 తరువాత మీరు పంపిన సొమ్ములు చాలినంతగా సమావేశపు ఖర్చులన్నీ పెట్టుకునేందుకు వీలుగా వస్తేనే నేను సమావేశం ఏర్పాటు చెయ్యమని ఆజ్ఞలు జారీ చేస్తాను. తగినంతగా విరాళాలు రాకపోతే ఆదీకి పంపించిన మొత్తాలు ఎవరు పంపినవి వారికి అతడు వాపసు చేస్తాడు. ఇండియాలో సొమ్ము యిచ్చేవారికి కూడా యిది వర్తిస్తుంది.

నేను సమావేశం పెట్టకపోవడం అంటూ ఉండదు. ఆ సమావేశంలో మీరంతా పాల్గొనాలని నేను కోరుతున్నాను. ఎందుచేతంటే దానికి గొప్ప ఆధ్యాత్మిక విశిష్టత ఉంటుంది. అందుచేత ఇండియాలో నా ప్రేమికులను, భక్తులను, కార్యకర్తలను, సాధువులను పిలవబోతున్నాను. వారికి సభలకి రావడానికి ఎక్కువ ఖర్చు కాదు. వారు ఉండడానికి వసతులు సులభంగానే ఏర్పాటు చేయవచ్చును. కానీ పాశ్చాత్యుల జీవన స్థితి యింకా ఉన్నతంగా ఉంటుంది గనుక, ఒక నెలరోజులు వారు ఉండడానికి ఏర్పాట్లు చేయడానికి చాలా ఖర్చు అవుతుంది. ఆహ్వానింపబడిన వారందరూ రావాలని నేను కోరుతున్నాను. ఇంక 700 సంవత్సరాలు వరకు యిలాంటి అవకాశం రాదు. ఆ సభలు అయిన తరువాత మళ్ళా నన్ను పాశ్చాత్య దేశాలలో మీరు చూస్తారని ఎవరూ గట్టిగా చెప్పలేరు.

ఎలిజబెత్ పాటర్సన్ మిర్టిల్ బీచ్ సెంటరు తరఫున కొంతడబ్బు యిస్తానన్నట్టు కనిపిస్తుంది. బాబా సమావేశాల కోసం డబ్బుకావాలన్నారు. కాని సెంటరుకి అది బాధా కరంగా ఉండకూడదు. బాబా శరీర త్యాగం చేసిన తరువాత ఆ సెంటరు ఒక యాత్రా స్థలంగా అయిపోతుంది. ఎందువల్లంటే బాబా అందులో తమ హృదయాన్నుంచారు. ఎలిజబెత్ యొక్క తీవ్రమయిన ప్రేమకు ఆమె అంకితమయినట్టి శ్రద్ధకి బాబాఆమెను ప్రశంసించారు. ఈ సెంటరు నిర్మాణము చేయడమే కాకుండా ఆమె ఆయనకు ఎంతో చేసింది. దానికంతా ఆయన యెడల ఆమె ప్రేమయే కారణం అని బాబా చెప్పారు.

బాబా— "సమావేశాల కోసం మీరు రావడానికి గాని అందుకు విరాళం యివ్వడానికి గాని మీరు ఒకరివద్ద అప్పుచేయవద్దు. మీ టిక్కెట్టు ఇన్‌స్టాల్‌మెంటు ప్లాన్‌లో కొనుక్కోవచ్చు. (టిక్కెట్టు సొమ్ము నెలకింత అని వంతులు వారీగా కట్టడం) మీరేదయినా డబ్బు పంపిస్తే దానితో యిలా వ్రాసి పంపించాలి.

"ఇది వేషరతుగా మెహెర్‌బాబాకి యిచ్చిన కానుక" అని: అలా వ్రాసిన సొమ్ము తిన్నగా ఆదీకి పంపించాలి. వారి వారి బృందనాయకుల ద్వారా ఆదీకి పంప వచ్చును." అని బాబా విశదీకరించారు.

2000 సంవత్సరాల పూర్వం నేను క్రీస్తుగా వున్నప్పుడు నేను చెప్పాను - "అన్నీ అమ్మివేసి నన్ను అనుసరించండి" అని. ఇప్పుడు యీ సమావేశానికి మిమ్మల్ని పిలిచి యిలా చెప్పదలిచాను.

"అంతా అమ్మేసి నాకివ్వండి అని. ఎందుచేతంటే నేను బీదవారందరికంటే బీదవాడిని." ఈ సమావేశంలో నేను కొంతవరకు నన్ను వ్యక్తపరచుకుందామను కుంటున్నాను. నా దివ్యత్వం యొక్క లేశ మాత్రపు ప్రదర్శన మీకు కలుగజేద్దామని ఉంది. మీరందరూ వస్తే నేను చాలా సంతోషిస్తాను.

ఈ చందాల కోసం మీరు అందరివద్దకు వెళ్ళి మీరు యివ్వండి - మీరు యివ్వండి అని అడగవద్దు. వీధులలో తిరిగి భిక్షమెత్తవద్దు. నన్ను ప్రేమించే వారినే అడగండి. ప్రేమతో యిచ్చేవారినే అడగండి. ఒకరు ఏమీ యివ్వలేకపోతే కొంచెం కూడా విచారించకండి. గణనకి వచ్చేది ప్రేమ. మీరు నన్ను ప్రేమిస్తూంటే మీరు నాకు కొంచెమే యిచ్చారు అనే మాటే ఉండదు. మీకు పిల్లలుంటే వారిని గురించి వారి రక్షణ, పోషణ కోసం యింటివద్ద ఏర్పాట్లు చేసి మరీ బయలుదేరండి. సమావేశాలకి పిల్లలను తీసుకురావద్దు. సమావేశాలు పూర్తిగా ఒక మాసం ఉంటాయి. నిండా నెలరోజులు ఉండగలిగేవారే రావాలి. 25 రోజులు మీతో నేను సహవాసం చేస్తూ ఆటలాడుతూ ఉండి 26 వ రోజున మీకు నా నిజరూపాన్ని లేశమాత్రం చూపిస్తాననుకోండి. ఆ కానుక యివ్వడం నేను వాయిదా ఎలా వేయగలను? అందు చేత మీరు పూర్తిగా నెలరోజులు ఉండేలా రావాలి. నేను ఆహ్వానించిన వారే రావాలి. వారి భోజనం ఖర్చులు వగైరా అక్కడ ఆతిథ్య సంఘం వారు పెట్టుకుంటారు.

తరువాత ఎవరు తప్పకుండా రావాలో వారి పేర్లన్నీ బాబా ఏకరువు పెట్టారు. రావాలి తప్పకుండా అని చెప్పేందుకు అరచేతిలో గుద్ది చెప్పారు. "ఎలిజబెత్ అసలు ప్రశ్నే లేదు. (అంటే ఎలాగా వస్తుందన్న మాట) మిసెస్ వైట్, ఆమె శరీరం వదలడానికి సిద్ధంగా ఉన్నాసరే. హారీ ఫ్లోర్ షీమ్ చచ్చిపోకుండా ఉంటే అతడు తప్పక రావాలి. ఫ్రాంక్ హెన్ డ్రిక్స్‌కి అది పెద్ద ప్రయత్నమే. డా॥ బెన్

హేమన్...." అని బాబా అనగానే బెన్ అన్నాడు. "నేను రాకపోతే అధికారికంగా ఉండదు." "ఈ గదిలో ఉన్నవారందరూ యిదివరకే ఆహ్వానింపబడ్డారు. వారికి యింకే ఆహ్వానము అందదు. ఏమిచేయాలో మాత్రం వ్రాసి పంపుతాము. ఇక్కడి బృందనాయకులు ఎవరెవరు వస్తారో ఆ ప్రేమికుల జాబితాలు తయారు చెయ్యాలి. వారంతా నా యెడల విధేయతకు షరతులు నా యెడల ప్రేమ వగైరా అన్నింటికి సంతకాలు చెయ్యాలి. రాగలిగిన వారే రావాలి. మీ అందరికీ అది ఒక పిక్‌నిక్ పార్టీలా ఉండదు. ఆ సమావేశం చాలా గొప్పదిగా ఉంటుంది."

బాబా యింకా అన్నారు—

"నేను ఇండియాకు వెళ్ళిన తరువాత అయిదు నెలలలో (నేడు 5-8-56 తారీకు) నాకు చాలా *బాధ కలుగుతుంది. ప్రపంచానికి కష్టమయిన పని కలుగుతుంది. అందుకే ఫిబ్రవరి 15 వ తేదీలోగా ఎవరూ సొమ్ము పంపకూడదు. అని చెప్పాను. ఫిబ్రవరి 15 లోగా ఏమి జరుగుతుందో ఎవరికీ తెలియదు."

సాయంత్రం 6-30 అయింది. అయిదుగురు ముఖ్యమయిన స్త్రీలు మాత్రం ఉన్నారు (ఎలిజబెత్, వగైరాలు). వారు మెహెరాకి మణికి వ్రాసిన ఉత్తరాలు బాబాకి చదివి వినిపిస్తున్నారు. బాబా అన్నారు— "నా కోసం ఆస్ట్రేలియాలో కార్యక్రమం ఏర్పాటయిందని వినగానే నేను అలిసిపోయినట్లు అనుకున్నాను. నాకు విశ్రాంతి లేదు. నాకు ఉన్న విశ్రాంతి నా ప్రేమికులు నా ప్రేమను తెలుసుకునేలా చేయడమే. నేను వెళ్ళిపోతున్నానని మీరు విచారించకూడదు. మళ్ళీ అందరం ఇండియాలో కలుసుకుంటాం కదా!

లిలిపుట్ థియేటరులో ఆ సాయంకాలం మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్ అనే నాటకం (తోలుబొమ్మలాట) ఏర్పాటయింది. ప్రపంచంలోని అతి చిన్న థియేటర్లలో ఒకటి లిలిపుట్ థియేటరు. అక్కడ బాబా ఎలిజబెత్ టోపి ధరించి చాలా తమాషా చేస్తున్నారు. లిలిపుట్ థియేటర్ పూర్తిగా బాబా ప్రేమికులతో నిండిపోయింది. బాబా వెనుకవైపున దూరంగా కూర్చున్నారు. ఒక చేతిలో బాబా క్రిసెంతమమ్ - (ఒక పెద్ద పసుపు పచ్చని పువ్వు) ఒకటి పట్టుకున్నారు. బాబా కుడి ప్రక్కను బి. బి. బి. కూర్చుంది. ఆమె పసుపురంగు శిరోజాలు మసక వెలుతురులో కాంతిగా

* (1956 సం॥ డిశెంబరు 2 వ తేదీన బాబా కొందరు మండలితో పూనానుంచి కారులో సతారా వెళ్తుండగా ఘోరమయిన ప్రమాదం జరిగింది.)

మెరుస్తున్నాయి. థియేటరులో దీపాలన్నీ తగ్గించారు. మెండెల్‌సాన్ సంగీతం వినిపిస్తోంది. 20 నిమిషాలు కూర్చొని బాబా వెళ్ళిపోయారు ఎవరినీ ఆయనతో కూడా లేచి రావద్దన్నారు గనుక మిగతావారంతా ఆఖరివరకు కూర్చున్నారు. బాటమ్ అనే అతడు మాత్రం అందరికీ వినిపించేలా గుఱ్ఱుపెడుతున్నాడు.

## సోమవారం ఆగస్టు 6 వ తేదీ :—

శాన్‌ఫ్రాన్‌సిస్కోలో ప్రాతః సమయంలో చాలా చలిగా ఉంటున్నా అందరూ పెందలకడనే లేచిపోయారు. ప్రేమికులు బాబా ఉన్న అంతస్తుకి పై అంతస్తులో బసచేసారు. బాబా ఉన్న గది యెదుట వసారా (బాల్కనీ) లో పూలకుండీలు పెట్టారు. పుష్పాల సుగంధం పై అంతస్తులో బాల్కనీలలో నుంచి చూసే ప్రేమికులు కూడా ఆస్వాదించడానికి వ్యాపిస్తోంది. ప్రేమికులు ఆశించినవిధంగానే ప్రాతఃకాల ఆలింగనం బాబా అందరికీ యిచ్చారు.

అల్పాహారాలు అయిన తరువాత బాబా గదిలో విశ్వ ఆధ్యాత్మిక సంఘంవారు సమావేశమయినారు. తరువాత ప్రేమికులందరిని బాబా గదిలోకి పిలిచారు. వారు గదిలో ప్రవేశించే సరికి బాబా ఎంతో గంభీరంగా ఉన్నారు. ఆయన నేత్రాలు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. ఎరచ్ బాబా చూపిన సంజ్ఞలు మాటలలో చెప్పడానికి ప్రక్కన నిలబడియున్నాడు.

బాబా - "గతరాత్రి ఒక్క నిమిషం కూడా నేను విశ్రాంతి తీసుకోలేదు. నేను పనిచేస్తూ గడిపాను. ఇది ఆఖరురోజు గనుక మీ బృదంతో వీలయినంత ఎక్కువ సేపు వుందామని నా తలంపు. అందరం కలిసి ఎక్కడికయినా కార్లలో వెళ్దాము. రేపు మళ్ళీ నేను వెళ్ళిపోతున్నాను.

"ఆర్థిక విషయాల గురించి ఏవో మాటలు వచ్చాయి. నేను స్పష్టంగా చెప్తాను. ఆతిథ్య సంఘం చిన్నవ్యవహారం. దీనికే యిలా కలవర పడితే ఇండియాలో రాబోయే పెద్దవ్యవహారం (సమావేశాలు) ఎలా చూస్తారు?

"నేను మీస్థాయికి దిగివచ్చినపుడు, నాతో ఏర్పడిన సన్నిహితత్వము, చనువు వల్లను మీరు నాదైవత్వాన్ని పూర్తిగా మరిచిపోతారు. ప్రతీ చిన్న విషయమూ (చెప్ప కుండానే) నాకు తెలుసన్నమాట మీరు మరిచిపోతారు. మీ అందరితోను నేను కూర్చు న్నపుడు, మీ ఆరోగ్యం గురించి నేను అడిగి తెలుసుకుంటున్నపుడు, మీరు ప్రతీచిన్న

సంగతి నాకు చెప్పాలనే ప్రయత్నంలో, ప్రతీ చిన్న విషయం నాకు తెలుసుననీ మీరు మరిచిపోతారు.

"నేను మీ పిల్లల గురించి ఆందోళన పడకండి అని చెప్తాననుకోండి. నామాట మీరు భగవంతుని మాటగా తీసుకోవాలి, నేను భగవంతుణ్ణి గనుక. భగవంతుని మాట అంటే అర్థం ఏమిటి? భగవంతుడు అంతరినీ తెలిసిఉండాలి. ఆయన అన్నీ చేయాలి. అందుకని ఆయన 'మీపిల్లల గురించి ఆందోళన పడకండి' అంటే మీరు వారి గురించి వ్యాకుల పడవలసిన పని లేదన్నమాట. నేను తాళం చెవి త్రిప్పినట్లయితే రేపు భూకంపం వచ్చినట్లయితే, అయిదు నిమిషాలలో మీరందరూ అదృశ్యులై పోతారు. అప్పుడు మీపిల్లల గురించి మీకుటుంబాల గురించి ఆందోళనలు ఏమవుతాయి? అందుకని నామాట ప్రకారం చేయండి – "నేను ఏమి చెప్పినాసరే - అంతే కావలసింది."

బాబా మేరియాన్ వద్దనుంచి ఆర్థిక స్థితి గతుల గురించి వివరణ అడిగారు. తరువాత సినిమా తీసే కెమేరా గురించి ఒక పోట్లాట సర్దేసారు బాబా. దానికి సంబంధించిన యిరుపక్షాలవారిని రప్పించి మాట్లాడారు. ఒకమారు బాబా అన్నారు – "నా యిష్టం వచ్చినట్లు ఎవరూ చేయటంలేదు. సరే మీయిష్టప్రకారమే కానీయండి."

మిగిలినవారందరూ మాట్లాడకుండా కూర్చున్నారు. బాబా చెప్పారు : "బాబా నిర్ణయించిన దానితో మీరు మీహృదయాలు నిర్మలంగా ఉంచుకోండి. అపార్థాలు చేసుకోకూడదు. నేను క్రీస్తును గనుక నేను క్రీస్తునని మీకు ప్రేమ, నమ్మకం ఉంటే, మీరు నాకు విధేయులుగా ఉండాలి; నన్ను మీరు ప్రేమించాలి. నాకు విధేయాలుగా ఉండడానికి మీరు సిద్ధంగా లేకపోతే, మీయిష్టప్రకారమే మీరు చేయదలచుకుంటే, అప్పుడు మీరు నన్ను వదిలెయ్యాలి. మీరు నన్ను ప్రేమిస్తే నన్ను అంటిపెట్టుకొని ఉండాలి. ఈ ఉదయం మండలివారికి, వారు ఉదయం ఆడంబరంగా అల్పాహారం తీసుకున్నందుకు, ఒక అరగంట ఉపన్యాసం యిచ్చాను.

ఎరచ్ తన స్వంత మాటలతో చెప్పాడు— (ఇవి బాబా చెప్పిన మాటలుకాదు) "మేము మా టీ గాని కాఫీ గాని ఉదయమే పుచ్చుకోవాలి. మధ్యాహ్నం భోజనం చేయాలి. ఈఉదయం కాఫీ టీలు అయిన తరువాత మళ్ళీ ఏదో తినాలని తెప్పించాము."

బాబా ;—నేను వారితో చెప్పాను – "మీరు సహాయపడాలంటే మీరు యీవిధంగా చందాలతో పోగుచేసినడబ్బు ఉపయోగించరాదు." అని. మండలి నాకుసన్నిహితులు. నేను క్రీస్తునని వారికి తెలుసును. వారు ఆహారం కావాలని తెప్పించియుండకూడదు. ప్రపంచంలో అనేకమంది మానవులు రోజుకి ఒక్కపూటే కడుపునిండా తింటున్నారు.

ఇండియాలో చాలా మందికి అది కూడా లేదు. ....మీరు నన్ను అంటిపెట్టుకొని ఉండాలంటే మీకు పరిశుద్ధమయిన హృదయం ఉండాలి. ఒక్కొక్కప్పుడు విశ్వాసం కలిగి ఉండి ఒక్కొక్కప్పుడు సందేహాలు పెట్టుకుంటే లాభంలేదు. అలాంటప్పుడు నన్ను వదిలి వెయ్యడమే ఉత్తమం. అప్పుడు ప్రపంచలో మీయిష్టం వచ్చినట్లు జీవించవచ్చు; స్వేచ్ఛగా ఉండవచ్చు. మీరు నన్ను ప్రేమించాలనుకుంటే మీరు మిలోనే గందరగోళం పడకూడదు. మీరంతా నన్ను ప్రేమిస్తున్నారు. మీరు ఒండొరులను ప్రేమించడంద్వారా నన్ను ఉత్తమంగా ప్రేమించగలరు. ఒకరి వెనుక ఒకరు ఏదయినా చెప్పదలుచుకుంటే నా ప్రేమను గురించి యింక మీరు ప్రపంచానికేం చెబుతారు? మీరు నన్ను ప్రేమించాలని నేను కోరుకున్నట్లు నన్ను మీరంతా ప్రేమించలేకపోతే నాగురించి ప్రపంచానికి ఏమీ చెప్పకపోవడం మంచిది.

కపటాన్ని అంతమొందించెదను గాక; మీ హృదయాలలో నుంచి కపటం పూర్తిగా తుడిచి పెట్టెదరు గాక; అప్పుడు చూడాలని ఉంది నాకు. మీరందరూ ఒకే హృదయం కలిగి ఉండాలి, నిర్మలమైన హృదయం ....మనం ఒకే కుటుంబం.

ఈ ఉదయాన్నే నేను ఆహారం చూడగానే ప్రారంభమయింది. తరువాత ప్రతి వారూ ఖర్చులు గురించి చెబుదామనుకున్నారు. మీమనసులలో ఉన్నదంతా అది ప్రతి బింబించింది. నా ప్రేమికులను నేను రేపు వదిలి వెళ్తున్నాను గనుక మీరందరూ హృదయాలు తేటపరుచుకోమన్నాను. అందుచేత అపార్థాలు లేకుండా ఉంటాయి. మీరు ఎప్పుడు ఆర్థిక వ్యవహారాలు చేపట్టినా పూర్తియయిన, శుభ్రమయిన, నిక్కచ్చి అయిన లెక్క యివ్వడానికి జాగ్రత్తపడాలి. మీరు తీసుకున్నది ఖర్చుపెట్టినది మిగిలినది జాగ్రత్తగా లెక్కలు వ్రాసి యివ్వాలి. పరిశుద్ధమయిన హృదయాలతో పక్షపాతం, దురభిమానం లేకుండా మీరంతా సామరస్యంతో పనిచేయాలి. మిమ్మల నందరను వదిలి నేను రేపు వెళ్ళిపోతున్నాను. ఈరోజే ఆఖరి రోజు. ఇప్పుడు మనం ఒక ఒప్పు కోలు చేద్దాము. ఎవరు పశ్చాత్తాప ప్రార్థన చెప్పగలరు ; నకలు ఉందా ?'' అని బాబా ప్రశ్నించారు. ఆ ప్రార్థన ఎవరికీ కంఠతా రాదు. ఎవలో ఒక నకలు తీసుకు వద్దామని కార్యస్థానానికి పరుగెత్తారు. మిగిలిన వారంతా అతడు వచ్చేవరకూ వేచియున్నారు. పుస్తకంతో అతడు తిరిగి వచ్చిన తరువాత, ప్రార్థన చదివాక బాబా చెప్పారు—

''మన అభిప్రాయ భేదాలకు దురవగాహనకు అనవసరంగా యింకొకరి మనసు కష్టపెట్టినందుకు మన తప్పులకు భగవంతుని క్షమార్పణ వేడుకొందాం. బాబా కి ఉన్న

అనంతమయిన ఓర్పులో నూటికి ఒకసారి అయినా మీకందరకు భగవంతుడిచ్చుగాక! మనం భగవంతుని క్షమించమని కోరుకుందాం. ఇప్పుడు ఒకరి తరువాత ఒకరు వచ్చి నన్ను కౌగిలించుకోండి.''

నెమ్మదిగా అందరూ వరుసలో వచ్చి బాబాను ఆలింగనం చేసుకున్నారు. బాబా అప్పుడు లేచి బల్లప్రక్కన నిలబడ్డారు. ఈ సున్నితమయిన ఆలింగనం తెలిసిన పాపాలని తెలియని వాటిని, ఒప్పుకున్నవాటిని, ఒప్పుకోని వాటిని క్షాళితం చేస్తుంది. ఇది ఆఖరి కౌగిలింత. రేపటి రోజున ఆలింగనం చేసుకోవడం యింక ఉండదు. ఇప్పుడు తుఫాను వెలిసింది. గనుక బాబా చాలా ఆనందంగా ఉన్నారు. ఆయన కంటిలో మెరుపు కనిపిస్తోంది.

కిట్టీదేవీ బాబా భోజనం తయారు చెయ్యడానికి ఆమె చల్లగా ఎలా జారుకుందో చెప్పింది. ఆమె ప్రార్థనకు రాలేదు. బాబా ఆలింగనానికి రాలేదు. బాబా తరువాత యిలా అన్నారు కిట్టీతో – నీవు ఎప్పుడూ వంటపనితో కూర్చొని దానితోనే సమయం అంతా వెళ్ళబుచ్చుకోకూడదు. నాతో సాధ్యమయినంత ఎక్కువసేపు ఉండాలి. ఆయన అప్పుడు ఆమెను క్షమించారు. ఆమె పోగొట్టుకున్న ఆలింగనాన్ని ఆమెకు బాబా యిచ్చారు.

బాబా హార్ప్ దంపతుల యింటికి వెళ్ళారు. బాబా వారి యింటిలో అన్ని గదులలోకి వెళ్ళారు. అక్కడ ఉన్న వారికి పళ్ళు ప్రసాదంగా బాబా పంచిపెట్టారు. జోసెఫ్ హార్ప్‌యొక్క యిష్టమయిన కుర్చీలో బాబా కొంతసేపు కూర్చున్నారు.

మ్యూయిర్ వుడ్స్‌కి వెళ్దామనుకున్న సమయానికి ప్రేమికులతో సమావేశం మూలాన, బాబా బయలుదేరలేకపోయారు. ప్రేమికులను ముందు బస్సులో వెళ్ళమన్నారు. డార్విన్‌షా చెప్పిన ప్రకారం బాబా అందుకు ఒప్పుకున్నారు. వాళ్ళు ముందు బయలుదేరి గోల్డెన్‌గేట్ బ్రిడ్జి దాటి తమలపాయి పర్వతాల మీద రోడ్డు మీద అనేకమయిన U (హేర్ పిన్) వంపులు తిరిగి వెళ్తున్నారు.

బాబా (రెడ్ వుడ్ ఫారెస్ట్) ఎఱ్ఱచెట్ల అడివిలోకి వెళ్ళారు. అక్కడ ముందుగా చేరుకున్న ప్రేమికులు ఆయన వచ్చారని సంతోషించారు. పిల్లలందరు ఆయనను చుట్టుముట్టారు. ఆయన చేతులు పట్టుకొని ప్రేళ్ళాడుతున్నారు. ఒక బ్రహ్మాండమయిన ఎఱ్ఱ చెట్టువద్ద బాబా ఆగారు. ఆ చెట్టు 1800 సంవత్సరాల నుంచి ఉందిట. దాని మాను క్రింద ఒక గుహలా ఉంటే బాబా అందులో కూర్చున్నారు. పవిత్రమయిన

బోధివృక్షం క్రింద కూర్చున్న బుద్ధ భగవానుని వలె బాబా ఉన్నారు. ఆ వృక్షమును చూడమని బాబా మండలికి చెప్పారు.

భోజనం ఎన్నిగంటలకని కిట్టీని అడిగి ఆ సమయానికి బాబా పరివారంతో తిరిగి వెళ్ళారు. బాబా గదిలో అందరూ సమావేశమైనారు. వారితో అప్పటినుంచి యింక ఆలింగనాలుండవని చెప్పారు. గుడ్ బై చెప్పడం కూడా లేదన్నారు. ఇక్కడ హాజరు కానివారిని బాబా రమ్మని కబురు పంపారు.

మధ్యాహ్నమంతా ప్రేమికులు బాబా గది బయట బాల్కనీలో తచ్చాడుతూ ఉన్నారు. కిటికీ గాజుతలుపులలోనుంచి వీలయినప్పుడల్లా బాబాను వారు తొంగి చూస్తున్నారు. బాబా కావాలన్నవన్నీ యిచ్చారు. 4 గంటలకు బాబా గది బయటకు వచ్చారు. ఆయన చేతిలో పంచదారతో చేసిన మిఠాయిలున్న డబ్బా ఉంది. అవి నక్షత్రాల ఆకారంలో తయారు చేసారు. డబ్బాతెరిచి చెరొకటి బాబా పంచిపెట్టారు. తెల్లని ఆయన చేతితో బెరిల్ ముఖంమీద మీసాలవలె పౌడరు అంటుకుని ఉంటే అది బాబా చేత్తో తుడిచారు; ఆ చేతితోనే ఎనిడ్ మార్గరెట్ల బుగ్గలమీద స్పృశించారు. లడ్ డింపిల్ చెల్లెలును మాత్రం కౌగిలించుకున్నారు. ప్రియతమునికి ఆమె హృదయాంతరంలో ఉన్నది బాగా తెలుసును. ఆమె ఆనందానికి అంతులేదు. ఆమెకు ఆనంద భాష్పాలు కూడా వచ్చాయి. అందరూ 5-30 గంటలకల్లా వెళ్ళిపోవాలని చెప్పారు. ఇదివరకు ప్రకటించినట్లు 6 గంటలు కాదు. టైము ఎంతయిందని బాబా అడుగుతూనే ఉన్నారు ఎడమచేయి మణికట్టు దగ్గర పట్టుకుని. టెక్స్ హైటవర్ ఒక మంచి నీలిరంగు ఊలు కోటు తీసికొని వచ్చి బాబాకి యిచ్చాడు. అది అతడు 3 1/2 రోజులలో స్వంతంగా తయారు చేసాడు. రాత్రిళ్ళు చాలా సేపటివరకు నిద్రపోకుండా ప్రియతముని కోసం ఆ కోటు కుడుతున్నాడు. ప్రియతముడు అది తొడిగి చూసి జేబులు లేవన్న సంగతి తెలిపారు. టెక్స్‌హైటవర్ అన్నాడు – 'గుడ్డ చాలలేదు' – బిలీ బాబా వైపు చూసి "బాబా! అది మీరు తొడుక్కుంటే చాలా బాగా ఉన్నారు" అంది. బాబా చిరునవ్వు నవ్వారు. టెక్స్ సెలవు తీసికొని వెళ్ళాడు.

## మంగళవారం, ఆగస్టు 7 వ తేదీ :–

తెల్లవారగానే అందరూ తయారయారు. బాబా వచ్చిన ప్రేమికులను వారి గదిలోనికి పిలిచారు. ఎవరూ కౌగిలించుకోవద్దు. పూలదండలు వేయవద్దు అని బాబా చెప్పారు. ఫిల్లిస్ ఫ్రెడెరిక్ ఒక దండ పట్టుకొని వచ్చింది. బాబా వద్దన్నారని అది బల్ల మీద పెట్టి వెళ్ళిపోయింది. తరువాత బాబా ఏంచేస్తారో అని కిటికీ గాజు

తలుపులో నుంచి చూస్తోంది. బాబా అది ఒక మారు మెడలో వేసుకొని ప్రక్కన కూర్చున్న బి. బి. బి. కి యిచ్చేసాడు.

బాబా బయలుదేరే ముందు యీ ఆఖరి నిమిషాలలో కూడా ఎవరో క్రొత్తవారు వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. ప్రేమికులకు తెలిసిన ఒకామె న్యూయార్క్ నుంచి వచ్చి బాబా దర్శనం చేసుకొంది. బాబా న్యూయార్క్‌కి వెళ్ళినప్పుడు ఆమెకు ఆయనను చూడడానికి వీలులేక పోయింది. ఒక స్త్రీ ఒక సమావేశానికి రాలేకపోయి నందున విచారిస్తోంది. ఆమెకు బాబా అనునయ వాక్యాలతో ఉపశమనం కలిగించారు. ఆమెను ఏదయినా ఒక బృందానికి చెందవలసిందని కొందరు సలహా యిచ్చారు. అప్పుడు బాబా ఏ బృందానికీ చెందని ప్రేమికులెందరో అసలు బాబా యొక్క బృందానికి చెంది ఉన్నారని చెప్పారు. అందులో ఆయన ప్రేమికులందరు అన్ని బృందాలు చేరి ఉన్నాయన్నారు. ఆయన నిజమయిన కేంద్రం ఆయనను ప్రేమించిన ప్రతివాని యొక్క హృదయం అని బాబా చెప్పారు.

బాబా సామాను కారులో పెట్టడానికి క్రిందకి తీసుకువెళ్తున్నారు. ఇంక ఆయిన వెళ్ళిపోతారని ప్రేమికులు బెంగ పెట్టుకున్నారు. బాబా బయలుదేరి క్రిందికి వెళ్తూంటే అందరూ ఆయన వెనకాలే నడుస్తున్నారు. బాబా లడ్ యొక్క కారులో ఎక్కి కూర్చున్నారు.

కారులో మండలివారు కూడా ఉన్నారు. వారు గుజరాతీలో మాట్లాడు కుంటున్నారు. ఫిల్లిస్ అందులోనే కూర్చుంది. ఆమె ప్రక్కన కిటికీ తెరిచి ఉంటే చలిగాలి వేస్తోందని ఆమెని బాబా కిటికీ ఎత్తెయ్యమన్నారు. కొంతసేపు ఉన్న తరువాత ఆమె మరిచిపోయి క్రిందికి దింపింది. బాబా అది చూసి మళ్ళీ కిటికీపైకి ఎత్తించారు. రోడ్డు మీద కారులో ఆమె ఎప్పుడు ప్రయాణం చేస్తున్నా బాబా యొక్క యీ దయగలిగిన చర్య ఆమెకు జ్ఞాపకం వస్తూంటుంది.

శాన్‌ఫ్రాన్‌సిస్కో విమానాశ్రయం అమెరికాలో అందమయిన విమానాశ్ర యాలలో ఒకటి. అందులో బాబా వద్ద ప్రేమికు లందరు నిలబడ్డారు. బాబా పిల్లలను చేరదీసి వారితో ఆడుతున్నారు. ఆలింగనాలు లేవని కొందరికి ఆశాభంగంగానే ఉంది. ఒకామె కౌగిలించుకోమని గట్టిగా ఏడ్చింది. ఆమె వైపు బాబా కోపంగా చూసారు. అయినా ఆమె వీపు మీద తట్టి బాబా ఆమె ఏడ్పును మాన్పించారు. ఒక క్రొత్తవాడు బాబాను చూసి ఆకర్షితుడై ఆయన వద్ద ఆగాడు. ప్రేమికులందరు ఆయనకు చూపిస్తున్న గౌరవాన్ని చూసి అతడు "ఆయన ఎవరు చెప్మా? అన్నాడు

వాళ్ళతో. ఆ ప్రశ్నకి బాబా సన్నిహిత ప్రేమికులు ఎవరికి వారే ఆయన క్రీస్తు అని తమ హృదయాలలో జవాబు చెప్పుకున్నారు.

ఇంతలో విమానం ఎక్కే సమయం అయింది. ప్రేమికులు వరుసగా నిలబడ్డారు. అందరూ బాబా ఆఖరి స్పర్శ కోసం చేతులు చాచారు. కొందరి చేతులు బాబా బిగువుగా పట్టుకున్నారు. ఒక అమ్మాయి ఆయనకంటె ముందు పరుగెత్తి ఆయన ముందుకు సాగేసరికి సాహసించి ఆయన మెడలో పుష్పమాల వేసింది. బాబా ఆమెను కౌగిలించుకున్నారు. ఆ దండ మళ్ళీ మెడలోంచి తీసి ఆమెకు యిచ్చారు బాబా. పెద్ద విమానంలోకి బాబా మెట్లు ఎక్కి వెళ్తున్నారు. లోపలికి వెళ్ళాక మూడవ కిటికీలో నుంచి ఆయన దివ్యహస్తం ఊపుతూ అందరికీ వీడ్కోలు చెప్తున్నట్లు క్రింద ఉన్న వారందరికీ కనిపించింది ఇప్పుడు బాబాను వదలినందుకు కొందరు స్త్రీలు ఏడ్చేసారు. మళ్ళీ వియోగం ప్రారంభం అయింది ప్రియతముని కోసం ప్రేమిక హృదయాలు ఆరాటపడుతున్నాయి. ఎవరి హృదయంలో ఏమి ఉందో ప్రియతమునికి బాగా తెలుసును. ఎలాగో ధైర్యంతో మనసులు కుదుటబెట్టుకుని కళ్ళు తుడుచుకుని, గుటకలు మ్రింగి, హృదయం నిబ్బరం చేసుకుని బాబాని పునర్దర్శనం చేసుకోవడానికి ఎదురు చూస్తున్నారు. బాబా విమానం ఆకాశంలో అదృశ్యం అయేవరకు ప్రేమికులంతా చూసి తమతమ యిళ్ళకు వెళ్ళారు

1956 వ సం॥ ఆగస్టు 9 వ తేదీన మొట్టమొదటి సారిగా ఆ సనాతన పురుషుడు, భగవదవతారుడు అయిన మెహెర్ బాబా ఆస్ట్రేలియాలో అడుగు పెట్టారు ఆ ఖండంలోని నదీనదాలు, పర్వతాలు, సమప్రదేశాలు సశ్యశ్యామలము లయిన క్షేత్రాలు, అరణ్యాలు అందలి జంతు సముదాయాలు అన్నీ కూడా వాటికి తెలియ కుండానే బాబా యొక్క పవిత్ర సామీప్యాన్ని అనుభవించాయి. బాబా నలుగురు శిష్యులతో బయలుదేరిన విమానము నిర్మలమయిన ఆకాశమునందు ఎగిరి వచ్చి సిడ్నీలోని మాస్కట్ విమానాశ్రయంలో ఆగస్టు 9 వ తేదీ మధ్యాహ్నం దిగింది.

బాబా భక్తులు కొందరు విమానాశ్రయం వద్ద బాబాకి స్వాగతం యిచ్చారు. బాబాను నగర ఉత్తర భాగంలోని బీకన్ హిల్ అనే చోటికి 12 మైళ్ళ దూరం లోని స్థలానికి తీసికొని వెళ్ళారు. సిడ్నీలోని యితర బాబా ప్రేమికులు, 600 మైళ్ళ దక్షిణంగా ఉన్న మెల్బోర్న్ నగరం నుంచి వచ్చిన బృందము, యింకా కాన్ బెర్రా (దక్షిణాన 100 మైళ్ళ దూరంలో ఉంది) న్యూకాసిల్ (ఉత్తరంగా 100 మైళ్ళ దూరంలో ఉంది) ఆర్మిడేల్ (ఉత్తరంగా 400 మైళ్ళ దూరాన ఉన్న పట్నం) నుంచి

వచ్చిన వారు వీరందరు బీకన్ హిల్‌లో బాబా సెంటరులో ఉండి బాబా వచ్చేసరికి వారికి స్వాగతం చెప్పారు. బాబా వారందరిని ఒకరి తరువాత ఒకరిని కౌగిలించు కున్నారు. బాబాకు ఏర్పరచిన వసతి అక్కడి ప్రేమికులందరు కలిసి కట్టించిన సెంటరు. బాబా దిగిన గది 30 అడుగుల పొడవు 20 అడుగుల వెడల్పు కలిగి ఉంది. దానికి రాతి గోడలు ఉన్నాయి. నేల కర్రతో చేసారు. కప్పు కూడా కర్ర తోనే వేసారు. దానికి పెద్ద కిటికీ ఉంది. అందులో నుంచి చూస్తే బయట ఉన్న భూమిలోని పొదలు అవీ కనిపిస్తాయి. పసిఫిక్ మహాసముద్రం కూడా కనిపిస్తుంది. ఆ గదిలో ఒక గోడమీద బాబా యీ విశ్వానికి సృష్టికర్తగా, ఆయనే జీవితానికి గమ్యమని తెలియజేసే చిత్రము లిఖించబడింది. ఈ చిత్రం అక్కడి బాబా ప్రేమికు లలో ఒకరిచేత వేయబడింది.

అక్కడి బాబా భక్తులందరు ఒక పెద్ద సావిడిలోను యింకా వారికోసం వేసిన మూడు గుడారాలలోను బసచేసారు. ఇంకా మిగిలిన వారు అరమైలు దూరంలో ఉన్న రెండు యిళ్ళలో దిగారు. అందరూ భోజనాలు చేసి, సాధ్యమయినంత ఎక్కువ సేపు ఆయన సహవాస భాగ్యం పొందడానికై బాబా వద్దకు వచ్చారు.

మరునాడు ఆగస్టు 10 వ తేదీనాడు ఉదయం బాబా ఫ్రాన్సిస్ బ్రాబజాన్‌ను పిలిచి తాము ఆస్ట్రేలియాకు వచ్చిన కారణం యీ విధంగా చెప్పారు.

(1) ఆయన యొక్క ప్రేమ బీజమును యీ దేశమునందు నాటుటకు;
(2) క్రొత్తగా బాబా కోసం కట్టిన యిల్లు చూసి అందులో ఉండడానికి;
(3) ఆయనను ప్రేమించిన వారిని ఆయన కోసం పనిచేసిన వారిని సమావేశ పరచడానికి.

తరువాత పిల్లలందరిని పిలిచి బాబా కొంత సేపు వారితో ఆడారు. ప్రేమికు లందరిని పిలిచి ఒక్కొక్కరిని పేరు పేరున బాబాతో పరిచయం చేయించుకున్నారు. అప్పుడు బాబా వారందరిని "నన్ను ప్రేమించడానికి ఎవరు యిష్టపడుతున్నారు" అని అడుగగా ఒకడు తప్ప, అందరూ చేతులు యెత్తారు. 'నీ వెందుకు చేయి ఎత్తలేదు' అని బాబా అతనిని అడుగగా, అతడు, "బాబా! మిమ్మల్ని ప్రేమించ డానికి నేను చాలుతానా? నేను తగుదునా, అని అనుమానిస్తున్నాను." అన్నాడు. అప్పుడు బాబా "నీవు నేను ఆజ్ఞాపిస్తే నీ పిల్లలనయినా సముద్రంలో పారవేయ గలిగినంతగా నన్ను ప్రేమిస్తున్నావా?" అని అడిగారు. అందుకు అతడు "ఆ పని నేను బాబా కోసం చేస్తాను" అన్నాడు.

అనంతరము బాబా ప్రేమను గురించి మాట్లాడారు. "ప్రేమ అంటే ప్రియతముని ఇచ్ఛప్రకారం ఏదైనా సరే చేయడం." ఇంకొకరితో బాబా "ప్రేమ ఉన్నచోట భయం ఉండగలదా ?" అని అడిగారు.

తరువాత బాబా తన ప్రేమికులతో ఉన్నందుకు వారు నిర్మించిన గృహమందున్నందుకు ఆనందం వ్యక్తపరిచారు. ఇద్దరు పిల్లలను దగ్గరకు చేరబిలిచి "ఎవరయినా చిన్నపిల్లవాడుగా నయినా అన్నాలి లేక ముసలివాడుగా నయినా ఉండాలి." అన్నారు బాబా. ఇంకా వారితో "వచ్చే సంవత్సరం ఇండియాలో ఒక పెద్ద సమావేశం ఏర్పాటు చేద్దామని అనుకుంటున్నాను. కొంతమందిని ఆస్ట్రేలియానుండి ఆహ్వానిస్తాను." అని చెప్పి అందరిని బయటకు పంపించి వేసారు. తరువాత బాబా వారిని ఒక్కొక్కరిని పిలిచి వారితో ఏకాంతముగా మాట్లాడారు. వారికి ఆయన ప్రేమను యిచ్చి ఒక్కొక్కరు ఆయనకు యివ్వగలిగిన వారి ప్రేమను స్వీకరించారు. ఒకామెకు ఆయన గుడ్డలు ఉతికి ఆరవేసే మహద్భాగ్యమును కలుగచేసారు. ఈమె ఆమె జీవితం అంతా యితరుల దుస్తులు శుభ్రం చేయడంతోనే గడిపింది. ఇప్పుడు, సాక్షాత్తు ఆమె ప్రియతముడయిన అవతార పురుషుని బట్టలు శుభ్రపరిచే అవకాశం ఆమెకు కలిగించి. ఆయనకు అన్నం వండి తయారుచేసిన వారికి ఆయన అందులో సగం వారికే తిరిగి తినమని యిచ్చేవారు. సాధారణంగా యిటువంటి సేవ కొంతమంది తాము స్వయంగా చేయడం యిష్టంలేక యింకొకరి నెత్తిమీద రుద్దుతారు. కానీ, ప్రభువు దృష్టిలో యిలాంటి సేవ సంతోషంగా అంగీకరించి చేసేవారికి ప్రభువు యొక్క ఆశీస్సులు లభ్యమవుతాయి. ఈ కారణం చేతనే బాబా యిటువంటి పనులు— ఇల్లు తుడవడం, బట్టలు ఉతకడం వంట చేయడం— ఆయన స్వయంగానే చేసుకునే వారు.

భోజనానంతరం ప్రేమికులు "అన్వేషణ" అనే నాటకం ఆడి బాబాను రంజింపజేసారు. బాబాను వెదకి కనుగొనడమే అందులోని సారాంశం. బాబా అందరి పాత్రధారులను మెచ్చుకున్నారు. ఆ నాటకం బాగుందని అది అచ్చువేయించి ప్రచురింపజేసి యితర దేశాలలో కూడా పంచి పెట్టవలెనని బాబా చెప్పారు.

తరువాత బాబా ఆ రాత్రికి విశ్రమించారు. ప్రేమికులు వారి బసలకు తిరిగి చేరుకున్నారు. రెండు గంటలయిన తరువాత యిద్దరు ముగ్గురిని బాబా పిలిచి డాబా మీద

చప్పుడవుతోంది దాని కారణమేమిటో చూసి రమ్మని పంపించారు. బయట గాలి ఎక్కువగా వీచుతోంది. బాబా మీదకు మెట్లులేక పోవుటచే రెండు నిచ్చెనలను తెచ్చి యిద్దరు దాదా పైకి ఎక్కారు. కిందకు దిగిన తరువాత పైన 'స్వాగతము' అని వ్రాసి యున్నది కదులుతుందేమో చూసి రమ్మని మరల డాబా మీదకు పంపిచారు. వారుదిగి వచ్చిన తరువాత "దీనివలన మీకు నన్ను తిరిగి చూసే అవకాశాలు మూడు మారులు కలిగాయి." అన్నారు బాబా చిరునవ్వుతో.

మరునాడు ఉదయం (11 వ తేదీ) 8 గంటలకు బాబా వద్దకు అందరూ సమావేశమయారు. వారి ఆరోగ్యాలు ఎలా ఉన్నాయో బాబా అడిగారు. వారితో అందరూ ఏవిధంగా నిద్ర పోయారో, పిల్లలతో ఎలా ఆడుకున్నారో అందరి ఆరోగ్యాలు ఎలా ఉన్నాయో బాబా విచారించారు. ఉదయం 9 గంటల నుంచి 11-30 గంటల వరకు ప్రజలతో మాట్లాడడానికి పిలిచారు. 150 మంది ప్రేమికులు అవతరించిన భగవంతుని సన్నిధిలో యీ విధంగా ఆయన సహవాసాన్ని అనుభవిస్తూ ఆయన ఆశీస్సులను ప్రేమను పొందారు.

భోజనానంతరం మరల బాబా వారి వద్దకు అందరినీ పిలిచి వారి వద్ద సెలవు తీసుకొని 20 మంది ప్రేమికులు తమతో రాగా తమ నలుగురు భారతీయ శిష్యులతో బయలుదేరి మెల్బోర్న్ నగరానికి వెళ్ళారు.

మెల్బోర్న్ (ఆస్ట్రేలియా) కు ఆగస్టు 11,1956 న వస్తారనగా అంతకుముందు చాలా మాసములనుండి అక్కడి బాబా ప్రేమికులు హడావిడి పడుతూ వారి రాకకుతగిన ప్రయత్నములు ఏర్పాట్లు చేసి ఆయత్తపడుతున్నారు. ఆ మహాశుభతరుణము కొరకు ప్రియతముని రాకకోసం ఉవ్విళ్ళూరుతూ కనిపెట్టుకొని యున్నారు.

బాబావారికి వారి మండలికి వసతికోసమని ఆరు యిళ్ళు ఏర్పాటు చేసారు. కాంబెర్ వెల్‌లో ఉండే డా॥ ఓబ్రయన్ దంపతుల యిల్లు అన్నిటికీ మధ్యగా ఉందని బాబాను అందులో దింపేటందుకు అది ఎన్నుకున్నారు. మెల్ బోర్న్‌లో ఆగస్టు నెలలో చాలా చలిగా ఉంటుంది. కాని బాబాకి, వారి మండలికి, ఆ యిళ్ళలో వెచ్చగా ఉండే ఏర్పాట్లు గావింపబడ్డాయి. బాబా ఆదేశానుసారంగా బాబా వారి రాకగురించి ఎవరికీ బహిరంగంగా తెలియపరచలేదు.

సిడ్నీ నుంచి వచ్చేవిమానం సాయంత్రకాలం 6-30 గంటలకు మెల్‌బోర్న్ ఎస్సెన్డన్ విమానాశ్రయంలో దిగవలసి ఉంది. ఎన్నాళ్ళనుంచో బాబాను చూడాలని ఆశ

పెట్టుకొని ఉన్నవాళ్ళకు కొద్దిసేపట్లో బాబా వస్తారు. వారికి స్వాగతం చెప్పాలని ఎంతో ఉత్సాహంగా ఉంది. ఇంతవరకు వారు బాబా చిత్రపటాలే చూసారు. బాబా వారి పుస్తకాలు వారి ప్రవచనాలు మాత్రమే చదివారు. ఇప్పుడు నిజంగా వారే ప్రత్యక్షంగా వస్తున్నారనేసరికి వారిలోని ఉత్సాహం మిన్ను ముట్టింది. ఫ్రాన్సిస్ బ్రాబజాన్ ఇండియా వచ్చి బాబాను స్వయంగా సందర్శించి వారితో సంభాషించి వారి సహవాస సౌఖ్యమనుభవించి బాబాయొక్క సంగతులు ఆస్ట్రేలియాలోని ఈ ప్రేమికులకు చెప్తున్నందువన వారికి తెలిసేది.

మెల్‌బోర్న్ విమానాశ్రయంలో బాబా విమానం సమయానికి దిగుతుందని తెలిసింది. మెల్‌బోర్న్ బృందం కుటుంబాల సహితంగా వచ్చి కలిసారు. ఈ మధ్యనే క్లారిస్ ఆడమ్స్, ఎనాలెమ్మన్ యిరువురూ మెల్‌బోర్న్ నుంచి కొద్దినెలల క్రిందట ఇండియా వచ్చి బాబాతో సంభాషణలు జరిపారు. వారు బాబాతోను మండలితోను కలిగిన ప్రేమ పూర్వకమయిన సాంగత్యమును గురించి యిక్కడి వారికి ప్రేమతో తెలియజెప్పారు. బాబా యొక్క బోధలు వారి జీవితంలో ఒక భాగంగా అయిపోయాయి. ఇలా బాబాను కలుసుకుని వచ్చి చెప్పిన తరువాత ఆ సందేశాలకు మరింత విలువ కలిగింది. బాబా, వారి శిష్యులు యింకా వారికి సన్నిహితులయారు. బాబా ప్రపంచ పర్యటన చేయనున్నారని విన్నప్పటి నుంచి బాబా ఇండియాకు తిరిగి వెళ్ళేటప్పుడు ప్రపంచపర్యటనలో ఆస్ట్రేలియా తప్పకుండా రావాలని విన్నవించుకున్నారు. మొదట సిడ్నీ వచ్చి తరువాత మెల్‌బోర్న్ రావలసిందని బాబాను కోరారు. వారి కోరిక బాబా అంగీకరించగానే వారి సంతోషానికి యింక మేరలేదు.

విమానం వస్తోందని కొద్ది క్షణాల్లో మెల్బోర్న్ విమానాశ్రయంలో దిగుతుందని మైక్‌లో ప్రకటనలు చేయబడినవి. విమానం దిగనే దిగింది. అందులోనుంచి ఒక్కొక్కరు దిగుతూంటే దూరాన్నుంచి యిక్కడి ప్రేమికులు ఆతురతతో చూస్తున్నారు. అది ఎ. ఎస్. ఎ. స్కైమాస్టర్ విమానం. హఠాత్తుగా వారి కళ్ళకు ప్రియతమ బాబా కనిపించారు. సందేహం లేదు ఆయనే ఎన్నాళ్ళనుంచో వారు చూడాలి చూడాలని ఉవ్విళ్ళూరుతున్న తమ ప్రియతమ బాబాయే ఆయన ముఖం ఎంత తేజోవంతంగా ఉంది! అబ్బ! ఆయన వదనం ఎంత ప్రేమపూరితంగా ఉంది. ఆయన ముందు ఫ్రాన్సిస్ నడిచివస్తున్నాడు. ఆయన వెనుక ఇండియా నుంచి బాబాతో వచ్చిన నలుగురు మండలి సభ్యులు ఉన్నారు. వారు ఎరచ్, ఆదీ, మెహెర్ జీ, నీలు, సిడ్నీ నుంచి అనేకమంది ప్రేమికులు బాబా బృందంతో మెల్‌బోర్న్ వచ్చారు. వారు కూడా బాబా వెనుక వస్తున్నారు. ఎనాలెమ్మన్ బాబాకు మెల్‌బోర్న్‌కి స్వాగతం చెప్పింది అక్కడి

బృందంలోని వారందరినీ బాబాకి పరిచయం చేసింది. బాబా యొక్క సన్నిధిలో ఆయన నుండి వచ్చిన ప్రేమ తరంగాల ప్రభావం ఆ తేజస్సు వర్ణించడానికి మాటలు చాలవు. మెల్‌బోర్న్ లోని భక్తులను బాబా ఆలింగనం చేసుకున్నాక, వచ్చిన వారు అందరితోను పరిచయం చేసుకున్న తరువాత బాబా వెంటనే కాంబెర్‌వెల్ గృహానికి వెళ్ళాలంటు న్నారని ఎరచ్ అందరితోను చెప్పాడు. సిడ్నీ నుంచి వచ్చిన విమానం నుంచి దిగిన బాబా ప్రేమికులు అందరిముఖాలలోను ఆనందం తాండవిస్తోంది. అనేక కార్లు సిద్ధంగా ఉన్నాయి బాబా వారి అనుచరులు ప్రేమికులు వాటిలో ఎక్కారు. ఓబ్రియన్ సతి, ఆమె చెల్లెలు, ఓకీఫ్‌సతి కాంబెర్‌వెల్ యింటి వద్దకు వచ్చి కారు ఆగగానే బాబా కి స్వాగతం యిచ్చారు.

మెల్‌బోర్న్‌లో సాయంకాలం సమావేశాలు లేవు. ఆదివారం ఉదయం సరిగ్గా 8 గంటలకు డా॥ ఓబ్రియన్ యింటివద్దకి అందరూ రావాలని అందరికీ చెప్పడం జరి గింది. చలి బాగా వేస్తోంది. ఎండ చాలా తక్కువగా ఉంది. ఎల్సీ ఎమ్. స్మార్ట్ అను నామె పదిమైళ్ళ కారులో వచ్చింది. ఆమె హృదయం ఆనందంతో గంతులు వేస్తోంది. ఆమె చుట్టూ ఉన్న ప్రపంచం అంతా గానం చేస్తోందా అన్నట్టుంది ఆమెకు. బాబా యిక్కడికి వచ్చారు. అద్భుతమయిన ఆయన సన్నిధిలోకి వెళ్ళాలని ఎవరికి వారే ఆదుర్దా పడుతున్నారు. నిజంగా యిటువంటి మహాపురుషుడు ప్రపంచంలో ఉన్నాడని ఆయన ప్రేమను వెదజల్లుతున్నాడని ఆయనప్రేమకి జాతి మత వర్ణ భేదాలు బొత్తిగా లేవని అందరికీ తెలుస్తే ఎంత బాగుండును! మన నిజమైన ఆత్మలను మేలు కొల్పు టకు ఆయనను అందరూ అనుసరించాలి.

ఓబ్రియన్ గృహానికి రావలిసిన వారంతా వచ్చిన తరువాత అందరినీ ఓబ్రియన్ దంపతులు యింట్లో ముందువున్న పెద్దగదిలోకి తీసుకువెళ్ళారు. అందరినీ బాబాకు పరిచయం చేసారు. బాబా ప్రేమతో చిరునవ్వు లొలికిస్తూ అందరిని కూర్చోమని సైగ చేసారు. బాబా వారికి దగ్గరగా సుఖాసీనులుకండని చెప్పారు. ఎరచ్, ఆయన సైగలు మాటలలో చెప్పడానికి బాబాకు దగ్గరగా నిలబడియున్నాడు. ఎరచ్ గొంతుక ధ్వని వినబడుతూంటే బాబా వారిని ముద్దుపెట్టుకుంటున్నట్లే వారు భావించారు. బాబా వైపే అందరూ రెప్పవాల్చకుండా చూస్తున్నారు. ఇంకొక వైపుకి వారి దృష్టి మరల్చ డానికి చూడతగినది అక్కడ యింకేముందిగనుక. సిడ్నీలో ప్రేమికులు వారి కొసగిన అఖండ స్వాగతాన్ని బాబా వర్ణించారు. ఇప్పుడు మెల్‌బోర్న్ వచ్చినందుకు బాబా వారి ఆనందాన్ని వ్యక్తపరిచారు. అసలు ముందు ఆస్ట్రేలియాకు వేసుకున్న ప్రయాణపు

భ్రష్టపరుద్దామనుకున్నారని అక్కడి యీ ప్రేమికులందరికీ ఎంతో ఆశాభంగం కలిగించడం యిష్టం లేక వచ్చానని బాబా అన్నారు. మరల ఆస్ట్రేలియా ఖండానికి రావడం పడదేమో అని అసలు యిక ముందు ఇంగ్లండు అమెరికాలకి కూడా వచ్చేవరకు అవకాశం ఉంటుందో ఉండదో అని అన్నారు. ఎందుచేతంటే బాబా శరీరం వదిలేసే సమయం ఎంతో దగ్గరలోనే ఉందన్నారు. సిడ్నీలో బాబా ఏమి చెప్పారో యిక్కడి ప్రేమికులకు కూడా అది వినే అవకాశం కలిగించాలని అదే యిక్కడ చెప్తాననీ బాబా అన్నారు. అప్పుడు బాబా, వారితో ఉన్న కొద్ది సమయాన్ని బాగా ఉపయోగించుకోమనీ, బాబాతో చనువుగా ఉండమనీ బాబా చెప్పారు. తరువాత బాబా 'అహం' గురించిన ప్రవచనం చేసారు.

బాబా 30 సంవత్సరాల నుంచి మౌనంగా ఉంటూ ఉన్నా ఆయన శక్తిపూరిత వాతావరణంలో ఆయన సన్నిధిలో ఉంటే ఆయన సంజ్ఞలద్వారా వ్యక్తపరుస్తున్న భావాలు ఎరచ్ భాషాకరణం చేస్తూ ఉంటే ఆయన మౌనం వహిస్తున్నారన్న కారణం వల్ల ఏ కొరతా ఉన్నట్లు ఎవరూ అనుకోకపోవడమే గాక బాబా మాట్లాడుతున్నట్లే వారందరూ భావించారు.

బాబా యొక్క ప్రేమకోసం వచ్చిన వారి కొరకు ఆయన వచ్చినట్లుగా బాబా చెప్పారు. అమెరికాలో అనేక మంది బాబాని చూడడానికి వచ్చారు ఇక్కడికి వచ్చిన తరువాత బాబాకి విశ్రాంతి తీసుకోవాలని ఉంది. బాబా వారి వద్ద ఉన్నప్పుడే బాబా ప్రేమను పొందడానికి ప్రయత్నించాలని బాబా చెప్పారు.

మెల్బోర్న్‌లోని ప్రేమికులకోసం వారు ఏదీ పోగొట్టుకోకుండా (మిస్ కాకుండా) ఉండాలని సిడ్నీలో చేసిన ప్రసంగాలను బాబా యిక్కడ కూడా చేసారు.

బాబా మెల్బోర్న్ ప్రేమికులను, తగిన ఆర్థిక సంపత్తి ఉన్నవారందరినీ 1957 అక్టోబరులో ఇండియాకు రమ్మని ఆహ్వానించారు. అప్పుడు ప్రపంచంలోని అందరి బాబా ప్రేమికుల మహా సమ్మేళనం జరుగుతుందని బాబా చెప్పారు. ఇంకా ఇండియాలో ఆ సమ్మేళనం ఎక్కడ జరిగేదీ స్థల నిర్ణయం చేయబడలేదు. సిడ్నీ నుంచి మెల్బోర్న్ నుండి ఇండియా రావడానికి యిష్టంగా ఉన్నవారి పేర్లన్నీ ఫ్రాన్సిస్ సహాయంతో ఆమె వ్రాసుకున్నాడు. సాధ్యమయినంత ఎక్కువమందిని దానికి హాజరవమని కోరారు. ఇలా రమ్మని చెప్తూ "నేను చెప్పినట్లు చేయడానికి సిద్ధంగా లేనివాళ్ళు వచ్చి ప్రయోజనం లేదు. అని హెచ్చరిక చేసి ఈ విధమయిన అవకాశం

మరల 700 సంవత్సరాలకి గానీ రాదు'' అని బాబా స్పష్టపరిచారు. పది గంటల సమావేశం ముగిసాక అందరూ బయటకు వెళ్ళారు.

తరువాత బాబా ఒక్కొక్కరినీ పిలిచి వారితో ఏకాంతంగా సంభాషణలు చేసారు. 11-30 గంటల వరకు యీ సంభాషణలు జరిగాయి మెల్‌బోర్న్ బృందము లోని అందరూ బాబాను ఆ విధంగా దర్శించడం జరిగింది. ఆరోజుకి యింక అందరినీ వారి యిళ్ళకు పంపించేసారు. ఒకీఫ్‌సతి యింట్లో ఆ సాయంకాలం సమావేశం ఉంటుందని అందులో ఫ్రాన్సిస్ బ్రాబజాన్ అంతవరకు ప్రచురించబడ నటువంటి బాబా సందేశాలను చదివి వినిపిస్తానని అందరితోను చెప్పాడు.

మరునాడు అనగా సోమవారం ఉదయం 8-30 గంటలకు బాబాను మరల దర్శించవచ్చునని అందరికి తెలియజేయబడింది. అప్పుడు అందరూ వారి వారి పిల్లల నందరినీ తీసుకురావాలని బాబా చెప్పారు.

ఆ ఆదివారం మధ్యాహ్నం (ఆగస్టు 10వ తేదీ) బాబా దిగిన ఓబ్రియన్ ల గృహం కాక వారితో వచ్చిన మండలికి ప్రేమికులకి బసకోసం ఏర్పాటు చేసిన మిగిలిన అయిదు యిళ్ళకి బాబా వెళ్ళి చూసారు. మరికొంతమంది కూడా కార్లలో బాబాతో వెళ్ళారు. దీని వలన మెల్‌బోర్న్ పొలిమేరలలోను తూర్పుభాగంలోను బాబా కారులో తిరిగినట్లయింది. ఆ విధంగా బాబా ఆ యా గృహాలకి వస్తారని అది వారికి ఎంతో గౌరవంగా ఎంచుకొని వాటిని సాధ్యమయినంత పరిశుభ్రంగా సుందరంగా ఉంచాలని అందుకు సంబంధించినవారు ప్రయత్నించారు.

ఈ సంగతి ముందుగానే తెలిసి ప్రేమికులు వారి యిండ్లకు పరుగెత్తి పుష్పాలను సర్దడానికి, వారి యింటిలో చలి ఎక్కువుగా బాధించకుండా చలిమంటలు వేసి యిల్లు వెచ్చదనం యివ్వడానికి బాబాకు స్వాగతం యివ్వడానికి ముందుగా ఏర్పాట్లు చేసుకున్నారు. బాబాను మంచి అందమయిన ప్రదేశాలున్న వీధులగుండా తీసికొని వెళ్ళారు. గ్రామీణ వాతావరణం సుందరంగా కన్నులకింపుగా ఉంది.

కారులో ఒక కొండరోడ్డుమీద వెళ్తూండగా కారు నడిపేవాడు బాబాను ఏదో ఆధ్యాత్మిక విషయం గురించి అడిగాడు. బాబా ఆ విషయం గురించి ఎంతో వివరంగా చక్కని సమాధానం యిస్తూ ఉండగా అతడు ఆ సమాధానం వింటూ తాను వెళ్ళవలసిన మార్గం మరిచిపోయి కారుని తప్పుదారిని పట్టించాడు. అందువలన రెండు మైళ్ళు చుట్టుతిరిగి వెళ్ళవలసి వచ్చింది.

"నన్ను కారులో తిప్పడానికి నీవెంత అదృష్టవంతుడవో నీకు తెలియదేమో." అన్నారు బాబా వారియింటికి వెళ్తూ తమ వద్దనున్న ప్రేమికులతో. ఒకరితో బాబా – "నన్ను యీ విధంగా కారులో తీసుకువెళ్ళడానికి సారధ్యం చేస్తున్నారంటే మీరు ఆధ్యాత్మిక భూమికలలో ప్రయాణం చేసేటప్పుడు ఎక్కడా మధ్యలో ఆగిపోకుండా త్వరగా ముందుకు సాగిపోవడానికి మీ మార్గం చాలా సుగమం అవుతుంది." అన్నారు.

ఒక యింటిలో పిల్లలతో బాబా గోళీకాయ లాడారు. ఆయన సంగీతం రికార్డులు వేస్తే విన్నారు కూడా. బాబా ఎల్‌సీస్మార్ట్ యింటికి వెళ్ళినపుడు బాబా ఆ కుటుంబంలో ఆబాలగోపాలమునూ ఆయనను కౌగిలించుకున్నారు. బాబా ఎల్‌సీ యింటిలో అన్ని గదులలోకి వెళ్ళి వారి పాదస్పర్శతో పావనం చేసారు. బాబా ఎల్‌సీ కుమార్తె అయిన జీన్ గదిలోకి వెళ్ళినపుడు యిది చాలా బాగుందని చేతి వ్రేళ్ళతో సంజ్ఞచేసి చెప్పారు. జీన్ రాయల్ మెల్‌బోర్న్ ఆసుపత్రిలో నర్సుగా పనిచేస్తోంది. ప్రతీ గదిలోను రెండు మూడు నిమిషాలు గడిపారు. అప్పుడు అవతారపురుషుడయిన బాబాను ఆ విధంగా తన యింటిలో కలిగి ఉండడానికి ఎల్సీ, ఆమె యింటిలోని జీన్ వగైరాలు ఎంత పుణ్యం చేసుకొనిపుట్టారో అన్నారు బాబా. ఆ నగరభాగంపేరు ఎల్‌థామ్. సాయంత్రం 5 గంటలకు ఓబ్రయన్‌ల యింటికి తిరిగి చేరుకోవాలి గనుక బాబా ఎక్కడా అల్పాహారాలు స్వీకరించలేదు. బాబా ఆ యింటివారిని విడిచి వెళ్ళేటప్పుడు పిల్లలందరను వీపుమీద తట్టి కారులో కూర్చుంటుంటే "ఆహా ! ప్రపంచ సార్వభౌముడే వచ్చి వెళ్తున్నాడ"ని అందరూ భావించారు. ఎక్కడా ఏవిధమయిన అట్టహాసము–బ్యాండు మేళాలు వగైరాలు—— ఉండరాదని బాబా వారికి ముందే చెప్పారు. బాబా యొక్క ఆగమనం వారిజీవితాలలో మరువలేరు ఆ మెల్‌బోర్న్ వాసులు. బాబా వస్తారని కొన్ని యిళ్ళల్లో కొన్ని గదులలో అలంకరించిన పుష్పాలు 3,4 వారాల వరకు వాడిపోకుండా అలాగే ఉన్నాయంటే బాబా వదిలిన గాలి ఆ వాతావరణం యొక్క ప్రభావమేమో అనిపిస్తుంది.

సోమవారం ఉదయం బాబా ఫ్రాన్సిస్ బ్రాబజాన్‌కి యీ క్రింది ఉపదేశం చేసారు.

(1) / "నీ అబద్ధపు అహాన్ని తిరస్కరించు; అప్పుడు నీ నిజమైన ఆత్మ నీకు భావనా వీధిలో ద్యోతకమవుతుంది."

(2) నీవు దేనినీ అడుగవద్దు.... అప్పుడు నీకు అన్నీ లభిస్తాయి.

(3) నీవు ఆఖరికి త్యాగాన్ని కూడా త్యాగం చేసే అంతగా సర్వమునూ త్యజించు.
(4) బాబాలో మరణించు. బాబా కోసం మరణించు. బాబాతో మరణించు. అప్పుడు నీవు బాబావలె జీవిస్తావు.
(5) నన్ను ప్రేమించడం అంటే నిన్ను నీవు పూర్తిగా మరిచిపోవడమన్నమాట.
(6) నేను నిజంగా ఎలా ఉన్నానో తెలుసుకోవాలంటే, నీ హృదయంలో ఒక చిన్నపిల్లవానిలాగ అయిపో; జ్ఞాని వలె తెలివిగా ఉండు.)

సోమవారం ఉదయం 8-30 గంటలకు కాంబెర్ వెల్ గృహానికి అందరూ పిల్లలతో కూడా వచ్చారు. బాబా అందరిని రాత్రి బాగా నిద్రపోయారా? అని కుశల ప్రశ్నలు వేసారు. బాబా మాత్రం విశ్వకార్యం ఎక్కువయినందు వలన రాత్రి అసలు తీరుబడి లేకపోయిందని అన్నారు. అందుచేతనే బాబా ఏకాంతంగా కనబడలేదు. 'ఆ పని ఏమిటో మీకు అర్థం కాదు' అన్నారు బాబా. అప్పటికి ఏర్పాటుచేయబడిన సాయంకాలం 7-15 గంటల విమానంలో బాబా సిడ్నీకి వెళ్ళవలసి ఉంది. కానీ యింకా తొందరగానే వెళ్ళాలనుకున్నారు బాబా.

బాబా తమ ప్రేమికులను "నేను అంతకంటెముందే బయలుదేరి వెళ్తే మీరు ఆశాభంగం చెందుతారా?" అని అడిగారు. వారికి బాబా ముందు వెళ్ళిపోవాలని లేదు. అయినా అయిష్టంగానే "మీ కోరిక ప్రకారమే కానీయండి బాబా!" అన్నారు. ఒంటి గంటకి ఒక విమానము, నాలుగు గంటల పదినిమిషాలకి ఒక విమానము బయలుదేరి వెళ్తాయన్నారు. నాలుగు గంటల పది నిమిషాలకు బయలుదేరే విమానంలో సిడ్నీ వెళ్తానన్నారు. ఆయన ప్రేమతో వారిని సమాధాన పరిచారు.

సిడ్నీలో ఉండే ఒక ప్రేమికుడు వెంటనే విమానాశ్రయానికి టికెట్లు మార్చుకు రావడానికి వెళ్ళాడు. మధ్యాహ్నం బాబాను 2 గంటల నుంచి 5 గంటల వరకు దర్శించాలనుకున్నవారంతా ఒంటిగంట నుంచి మూడు గంటల వరకు సమయం మార్చుకున్నారు. అందరూ బాబాతో ఒక నిమిషం మౌనంగా కూర్చున్న తరువాత పెద్దవారంతా బయటకు వెళ్ళి పిల్లలను లోనికి పంపించారు. పిల్లలందరూ బాబా ముందు తివాసీమీద కూర్చున్నారు. బాబా అందరితోను కలిసి మెలిసి తిరిగి వారిని కొందరిని తల నిమిరి, వీపు నిమిరి, కొంతసేపు వారితో గోళీకాయలాడి బంతులాటలాడి కొంత సమయం గడిపారు. బంతి చేత పుచ్చుకొని ఒక బాలుని వేపు చూస్తూ మరియొకని వైపుకి బంతిని విసిరేవారు. తరువాత పిల్లలంతా రింగు ఆట ఆడుతున్నట్లు కనిపించింది ఇంతకు ముందు ఒకడు బాబాతో గోళీకాయలాడమని

పందెం వేసాడు. బాబా ఆడుతున్నపుడు ఆయన కాయ తప్పకుండా గురిచేసి కొడుతూంటే తాను ఓడిపోక తప్పదని వెర్రిమొహం వేసాడు. తరువాత ఒక తీపి రొట్టెని తెప్పించి అది సన్నటిముక్కలుగా కొయ్యమని ఎరచ్‌కి యిచ్చారు. కోసిన తరువాత బాబా అందరికి తలొక ముక్క పంచిపెట్టి తినమన్నారు. అది వారి 'ప్రసాదం'గా గ్రహించి అందరూ తిన్నారు.

పిల్లలతో కొంత సమయం గడిపిన తరువాత మెల్‌బోర్న్ బృందంలోని ప్రతి యొక్కరిని రమ్మని వారితో వేరే వేరేగా బాబా సంభాషించారు.

తరువాత ప్రజలను చూడడం ఒంటిగంటకి ప్రారంభమయింది. ప్రజలు చాలా మంది వచ్చారు. చాలా మట్టుకు వారంతా ప్రేమికుల స్నేహితులు. వారిని వారు ఒక్కొక్కరినే తీసుకొని వెళ్ళి బాబాకు పరిచయం చేసారు. అడగాలనుకున్న వారిని ప్రశ్నలడగమన్నారు బాబా. అందులో తత్త్వశాస్త్రము చదువుకున్న ఒక మెడికల్ విద్యార్థి వచ్చినవారిలో ఉన్నాడు. ఇద్దరు మెల్‌బోర్న్ విశ్వకళాశాలలో చదువుతున్న విద్యార్థులు. జీవితం యొక్క ఉద్దేశ్య మేమిటో తెలుసుకోవాలని ఒకడనుకున్నాడు. ఇండియా రావాలనుందని ఒకడు అనగానే ఇండియాకు రమ్మని అతనిని బాబా ఆహ్వానించారు – బాబా వారిని 'భగవద్వచనము' అనే గ్రంథాన్ని చదవమని చెప్పారు. మెహెర్ బాబా "మేలుకొల్పువాని" గురించి ఆయన బోధనలు సందేశము గురించి తెలుసుకోవాలని కొందరు ఆతురత చూపారు. కొందరు బాబా అవతారుడయితే కావచ్చుననుకున్నారు. కొందరు అందులో సందేహం వెలిబుచ్చారు. అందరికీ బాబా వారి యొక్క ప్రేమను యిచ్చారు. ఈ కార్యక్రమం యావత్తు 2-30 గంటలకే సమాప్తి చేసారు.

సంభాషణలయిపోగానే బాబా మండలితో బయట ఉన్న కార్ల వద్దకు వచ్చారు. ఉన్న కార్లన్నీ బాబాను మండలిని మిగిలిన ప్రేమిక బృందాన్ని ఎక్కించుకుని విమానాశ్రయానికి బయలుదేరాయి. విమానాశ్రయం వద్ద పిల్లలను బాబా బుగ్గల మీద తలమీద నిమిరి తాను మెల్‌బోర్న్ వచ్చినందుకు చాలా సంతోషిస్తున్నామని బాబా అన్నారు. మెల్‌బోర్న్‌లోని ప్రేమికుల ప్రేమ వారిని బాగా ఆకర్షించిందన్నారు.

విమానం బయలుదేరే సమయం ఆసన్నమయింది. ఆదీ, ఎరచ్, మెహెర్ జీ, నీలు అక్కడికి వచ్చిన వారితో కరచాలనం చేసారు. బాబా చేయెత్తి వారందరి మీదకు చిరునవ్వుతో ప్రేమ ప్రసారం చేసారు. బాబా వారందరినీ ఆశీర్వదించారు. మెల్‌బోర్న్

ప్రేమికులు ఆనంద విషాదాలతో నిండి ఉన్నారు. సిడ్నీ నుంచి వచ్చినవారు, మండలి, బాబాతో విమానం ఎక్కారు. ఆఖరిసారిగా అందరూ బాబా సెలవు తీసుకున్నారు. కాని అది ఆఖరుసారి కాలేదు. బాబా విమానంలో కిటికీ దగ్గర కూర్చున్నారు – క్రిందఉన్న వారికి చేయి విసురుతున్నారు. విమానం ఆకాశంలోకి ఎగిరే ప్రయత్నంలో విమానాశ్రయానికి చివరికి వెళ్ళింది. తార్నాక్ చివరికి వెళ్ళి (విమానాశ్రయ భూమికి) మరల తిరిగి వస్తే యింకోమారు బాబా కనిపిస్తారేమో అని క్రింద నున్న మెల్‌బోర్న్ ప్రేమికులు చూస్తున్నారు. బయట చలి కరుస్తున్నా వారు లెక్కచేయకుండా నిలబడి చూస్తున్నారు. విమానం ఇంజిన్‌లో ఏదో చిక్కు వచ్చి బయలుదేరిన చోటుకి మళ్ళీవచ్చి ఆగింది. విమానం యిటు మళ్ళీరాగానే వీరివైపున్న కిటికీవద్దకు వచ్చి చేయి ఊపుతున్నారు బాబా. వారికి ప్రియతముని ఆఖరిసారిగా మరొకమారు చూసే అవకాశం కలిగింది. కొద్దిసేపట్లోనే ఇంజిన్ బాగుచేసాక మళ్ళీ బయలు దేరింది. బాబా చిరునవ్వుతో చేయి ఊపుతూ వీడ్కోలు యిచ్చారు. విమానం గాలిలోకి పైకి పైపైకి ఎగిరిపోతూ దూరాననుండి ఆకాశంలో ఒక చుక్కలా కనిపిస్తోంది. అవతారుడు అందులోనుండి సిడ్నీ వైపు వెళ్తున్నారు.

వారి ప్రేమబీజం వీరి హృదయాలలో నాటబడి ఉంది. బాబా పుస్తకాలకు వారి బోధనలకి వారి నూతన జీవితంలో ఒక నూతన అవగాహన ప్రేమికులందరికి కనిపించింది. ఈ మారు ఇండియాలో 1957 అక్టోబరు నవంబరులో బాబా దర్శనం పొంది తీరాలని నిశ్చయం చేసుకున్నారు.

13 వ తేదీ రాత్రి సకాలంలో విమానం సిడ్నీలో మాస్కట్ విమానాశ్రయం చేరుకుంది. బాబాతో కూడా ప్రయాణం చేసి వచ్చిన సిడ్నీనగర ప్రేమికులు బాబాకు కావలసిన సహాయం చేసి బయటకు తీసుకువెళ్ళి కార్లలో తిన్నగా బీకన్‌హాల్‌కి చేరుకున్నారు. ఆ రాత్రి యింకేమీ బాబా చేయలేదు. విశ్రాంతి తీసుకున్నారు.

14 వ తేదీ ఉదయం బాబా తమ ప్రేమికులతో బయలుదేరి నీలి పర్వతాలకు వెళ్ళి అక్కడ ఆరోజుంతా గడుపుదామనుకున్నారు గాని ఆ కార్యక్రమం మానివేసారు. దానికి బదులుగా కొంతసేపు విశ్రాంతి తీసుకొని ఆ ఉదయం సముద్రతీరానికి కారులో షికారుకి వెళ్ళారు. బయట నగరాలనుంచి వచ్చిన బాబా ప్రేమికులు దిగి వున్న రెండు యిళ్ళకు బాబా వెళ్ళి చూసారు.

టీ తీసుకున్న తరువాత బాబా అందరినీ పిలిచి కూర్చోమన్నారు. ఫ్రాన్సిస్ బ్రాబజాన్‌ని పిలిచి బాబా హాఫిజ్ మహాకవి గ్రంథాన్ని తీసుకురమ్మన్నారు. తెచ్చి

యివ్వగానే బాబా పుస్తకం అందుకుని తెరవగానే ఏదిపస్తే అది ఫ్రాన్సిస్‌ని చదవమన్నారు. ఆ పుటలో యీ క్రింది విషయం ఉంది.

"ఓ అజ్ఞానుడా ! జ్ఞానం సంపాదించడానికి ప్రయత్నించు. రోడ్డు మీద నీవు నడిచివెళ్ళే వరకు నీవు యితరులకు ఎలా మార్గదర్శకుడవవుతావు ?

ఓ కుమారుడా! దివ్య సత్యమును బోధించే పాఠాశాలలోని ప్రేమ పాఠమును జెర్పే ఉపాధ్యాయుని వద్దనుంచి నేర్చుకోడానికి ప్రయత్నిస్తే ఎప్పుడో ఒకరోజున నీవు తండ్రులలో ఒకడవవుతావు. కంచం, మంచం, (భోజనం చేయడం, నిద్రపోవడం) నిన్ను ప్రేమయొక్క ఉన్నత తరగతులలోకి వెళ్ళకుండా చేసాయి. నీవు ఆహారం నిద్ర మానివేస్తే నీ మిత్రుని చేరుతావు.

భగవంతుని ప్రేమ ప్రకాశం నీ హృదయంలో నీ ఆత్మలో ప్రసరిస్తే నీవు ఆకాశంలోని సూర్యుని కంటె సుందరంగా అవుతావని నేను గట్టిగా చెప్పగలను.

ఇంటిదారి పట్టిన వారివలె నీయొక్క ఉనికిని గురించిన రాగిని యిచ్చివెయ్యి. అలాచేస్తే ప్రేమ యొక్క పరశువేది స్పర్శ వలన నీవు బంగారంలా అయిపోతావు.

నీవు శిరస్సు పాదములు లేనివాడవయినపుడు వైభవోపేతమయిన ఆ మార్గము నందు ఆపాద మస్తక పర్యంతము భగవంతుని ప్రకాశము నీమీద ప్రసరించుగాక.

భగవంతుని సాగరములో క్షణమాత్రము మునిగి యుండుము; నీ శిరస్సు నందలి ఒక్క వెండ్రుకయినా సప్తసముద్రాలలోని నీటివలన తడుస్తుందని నీవు అనుకోకు.

నీ చూపు భగవంతుని ముఖము కోసం ప్రసరితమయితే యిప్పటినుంచి నీవు జ్ఞానమును పొందియుండుటకు సందేహము లేదు.

నీ ఉనికి యొక్క పునాదులు నాశనము చేయబడినపుడు, నీ హృదయ సదనము పడగొట్టబడుతుందని అనుకోకు.

ఓ హాఫీజ్! నీ మనసులో ప్రియతమునితో ఏకం కావాలనే కోరిక ఉంటే ఆధ్యాత్మిక విషయాల గురించి విచక్షణ చేసే వారి గుమ్మం దగ్గర ఉన్న ధూళివైపోవాలి నీవు."

బాబా శిష్యులు వారి సామానులు సర్దుకున్నారు. బాబా విమానంలో ఇండియాకి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నారు. ఆయన వెళ్ళేముందు ఒక సంకేతము చేయగానే

దాణాసంచా కాల్చబడింది. బయటకు వచ్చి చిన్నపిల్లవానివలె బాబా ఆశ్చర్యము ప్రకటిస్తూ ఆకాశము నందు ప్రేలెడివాటిని చూసారు "ఎందుకిలా చేస్తున్నారు. దానివలన ఏదయినా అంటుకోవచ్చు కూడాను" అని లోపలికి వెళ్ళారు.

రెండు నిమిషాల తరువాత ఆ చీకట్లోకి పురుషులందరు బకెట్లతో నీరు పట్టుకొని అక్కడ తుప్పలలో బయలుదేరిన మంటను ఆర్పడానికి వెళ్ళారు. రాత్రి 10-30 గంటలకు బాబా ఎక్కిన విమానం సింగపూర్ మీదుగా ఇండియాకి బయలుదేరి వెళ్ళింది.

సిడ్నీ (ఆస్ట్రేలియా) పత్రిక (ఆగస్టు, 1958) విలేఖరి ఒకడు బాబాతో సంభాషణకై వచ్చాడు. అప్పుడు బాబా సంజ్ఞలు చేయగా ఆదీ కె. ఇరానీ వ్యాఖ్యానించాడు–

"నేను ఒకే దేవుడు, ఒకే మానవాళి, ఒకే సౌభ్రాతృత్వ వర్గము అనే ఆదర్శానికి ప్రజలను మేల్కొల్పడానికి వచ్చాను. నేనేదీ క్రొత్త మతాన్ని స్థాపించడానికి గాని క్రొత్త బోధలు చేయడానికి గాని రాలేదు. ఉన్నదాన్ని పునరుజ్జీవింప జేస్తాను." అని బాబా చెప్పారు.

ఆస్ట్రేలియా పర్యటనలో సిడ్నీలోను మెల్‌బోర్న్ లోను బాబా యీ క్రింది ప్రసంగాలు చేసారు.

## ఆందోళన :–

బాబా చెప్పారు - "ఆందోళన పడకండి. ఈ ఆందోళన పేరుకొని బలపడుతుంది. దానికి కారణం పోయిన తరువాత కూడా ఆందోళన చెందడం అలవాటయి పోతుంది."

బాబా ఒకరిని నీవయసెంత? అని అడిగి తెలుసుకుని చెప్పారు – "నీవు యువకుడుగా ఉన్నప్పుడు ఏవో అనేకం జరిగి ఉంటాయి. నీవుఏడ్చావు, దుఃఖించావు, ఆందోళన చెందావు. 50 ఏళ్ళ తరువాత కూడా ఏలో ఆందోళన ప్రారంభం అయే సమయం వెళ్ళిపోయినా కూడా నీవు యింకా ఆందోళన పడతావు. ఇంకో 50 ఏళ్ళు జరిగిపోయినా కూడా యింకా ఏదో ఒక దాని గురించి ఆందోళన చెందుతూనే ఉంటావు. అదొక వెఱ్ఱి.

ఏదో ఒక స్థితిలో ఆందోళన చెందుతావు. అయినా నీవు అన్ని స్థితులు అనుభవించేసావు. నీవు గ్రుడ్డిగా ఉన్నావు. జబ్బుగా ఉన్నావు, బీదరికంలో ఉన్నావు. వృద్ధుడవుగా, యువకుడిగా, అందంగా, కురూపిగా యున్నావు. అనేక విధాలుగా ఉండి నీ పిల్లలగురించి నీవు ఆందోళన చెందుతావు. నీకు అసంఖ్యాకమయిన పిల్లలుండేవారు.

వారు అసంఖ్యాకమయిన జననీ జనకుల కలిగి యుండేవారు. నీవు నీ ఉద్యోగం గురించి ఆందోళన చెందుతావు. నీవు అన్నిరకాల వృత్తులు కలిగియుండేవాడవు. నీ భార్య గురించి ఆందోళన చెందుతావు నీకు అనేక జన్మలలో అనేక మంది భార్యలుండేవారు. నీవు అన్ని స్థితులలోను అన్ని అనుభవాలు పొందియున్నావు. అయినా నీకు జరిగిన ఏ చిన్నసంగతికయినా నీవు ఆందోళన చెందుతావు.

నా నుంచే ప్రతిదీ వస్తుంది కాని అది సత్యమయినది కాదు. నీవు కలగంటూ ఉంటే ఆ కలలో నేను కనబడి నీవు కలగంటున్నావు అది నిజంకాదు అని చెబితే నీవు అంటావు "బాబా! యిది నాకు సరదాగా ఉంది; ఇది నిజమయినదే; నాకు తెలుసును" అని. అది అర్థం చేసుకోవడం కష్టం. నీవు మెలకువగా ఉన్న కలలో ఏదీ నిజంకాదు. నేను చెప్తున్నాను కదా. నీవు ఏమీ ఆందోళన పడకు. ఎలా అవుతావు? నన్ను తలచుకో. నన్ను ప్రేమించు. క్రీస్తు తన దివ్యాధికారంతో చెప్పాడు— "నీ పాపాలు క్షమించబడ్డాయి" అని; నేను నా దివ్యాధికారంతో చెప్తున్నాను. "నన్ను ప్రేమించు, నీ ఆందోళనలు అన్నీ మాయమవుతాయి. వాస్తవం వర్ణించడానికి వీలులేదు. పది లక్షల మందిలో ఒక్కడు భగవత్ప్రేమికు డవుతాడు. పదిలక్షలమంది ప్రేమికులలో ఒక్కడికి దైవ సాక్షాత్కారం కలుగు తుంది. అది అసాధ్యం అవవచ్చు. "నీకు అవకాశం కలిగింది. ఎందుచేతంటే నేను మీతో యిక్కడే ఉన్నాను. నేను "నన్ను ప్రేమించు" అంటున్నాను.

## రెండు రకాల 'అహం'లు :—

బాబా చెప్పారు — " 'అహం' రెండు రకాలుగా ఉంది. ఒకటి అబద్ధపు అహం. దీనికి ఎన్నో కావాలనే కోరికలు ఉన్నాయి. అది అంటుంది — "నేను పురుషుణ్ణి. నాకు యిది కావాలి. నేను స్త్రీని. నాకు అది కావాలి; నేను జబ్బుగా ఉన్నాను; నాకు నొప్పిగా ఉంది! నేను సుఖంగా ఉండాలి; నాకు సుఖం లేకుండా పోయింది; నా భార్య నన్ను ప్రేమించడం లేదు; నేను చాలా భాగ్యవంతుణ్ణి; నేను చాలా బీదవాడిని; కానీ ఆ అహాన్ని రూపుమాపినపుడు ఒక మార్పు వచ్చేస్తుంది; అబద్ధపు అహం పోయి నిజమయిన 'నేను' వస్తుంది. తరువాత "నేను కోరికల నుంచి విముక్తి పొందాను." అనే అనుభవం కలుగుతుంది. "నేను అనంతుణ్ణి. భగవంతునితో నేను ఏకమయాను. నేను క్రీస్తుని" అనే అనుభవం నిజమయిన అహానికి కలుగుతుంది.

"ఎవరయినా బాగా చదివి భగవంతుడు తప్ప ఏదీ లేదని బుద్ధిచేత అర్థం చేసుకున్నప్పుడు "నేను భగవంతుణ్ణి" అని గట్టిగా చెప్పగలుగుతాడు. కాని 'నేను భగవంతుణ్ణి' అని యీ చెప్పడం నిలబడదు ఎందుచేతంటే అతడు అతని మనస్సు ఏకం కాలేదు. ఐక్యత లేదు. ఈ చెప్పడం కేవలం ఆలోచన వల్లనే జరుగుతోంది ఆలోచన ఉంటే ద్వైధీభావం ఉందన్నమాట. ఇక్కడ అపరోక్షానుభూతి లేదు. కానీ అతడు ఐక్య భావం భగవంతునితో ఐక్యతగురించిన అవగాహనద్వారా అనుభవిస్తాడు. అందుచేత యిది అసలయిన అనుభూతి కాదు. అది నిజమైన అహం కాదు. దీనికి రాజీ కుదరదు. ఇందులో సమాధానానికి తావులేదు. ఒక్కడే భగవంతుడున్నాడు. భగవంతునితో ఏకమయిపోవాలి. ప్రపంచ మానవుడుగా ఉంటూనే భగవదైక్యం పొందలేవు.

నీలోపల భగవదనుభూతి చెందితే— భగవంతుడు సర్వశక్తిమంతుడు అని మనకు తెలుసుకదా— నీవు కూడా సర్వశక్తిమంతుడుగా ఉండాలి. మరి నీవు నిస్సహాయుడుగా ఎందుకు భావించుకుంటావు ? ఈ నిస్సహాయతకు కారణమేమిటి ? నేను శాశ్వతుడనే— నేను అందరిలోను ఉన్నాను. అందుచేత మీరందరూ భగవంతుడే. అయినా మీరు నిస్సహాయులుగా భావిస్తారు. ఎందుచేత ? మీలో భగవంతుని కనిపించకుండా చేసే అడ్డుతెర ఉంది. నీకు నీవే ఆ తెరవు. అది తొలగించుటకు నీవల్లకాదు. నీ నేత్రాలు చిన్నవయినా బ్రహ్మాండమయిన ప్రకృతిని చూస్తున్నాయి. కాని వాటిని అవి (నేత్రాలను ఆ నేత్రాలు) చూడలేకున్నాయి. వాటిని నీవు చూడడానికి అద్దం కావాలి. నాఅనుగ్రహం అనే దర్పణం దొరికితే నీ స్వస్వరూపం ఆ క్షణంలో వ్యక్తమవుతుంది.

"అయితే నా అనుగ్రహాన్ని ఎలా పొందగలవు ? పదిలక్షలమందిలో ఏ ఒక్కడికో గాని అది లభ్యం కాదు. నా ప్రేమ మహాసాగరంలో నీవు మునిగిపోవాలి. అప్పుడు నా అనుగ్రహం నీవు కనుగొంటావు. నీవు ఆ విధంగా మునిగిపోలేకపోతే మరి యింక రాజీలేదు. నన్ను నీవు కావాలనుకుంటే యింకో మార్గం లేదు.

"ఈ ప్రేమ యేమిటి ? ప్రేమగురించి ఎన్నో గ్రంథాలున్నాయి. కాని అవి నీకు ప్రేమను యివ్వలేవు. ప్రేమ దానికోసం ఏదీ కోరదు. నీకు ఒక భార్య ఉన్నది. నీవు ఆమెను చాలా ఎక్కువగా ప్రేమిస్తున్నావు. ఆమెను నీ కోసమే వుండాలని నీకు ఉంటుంది. ఆమెకై నీవు ఉంచుకున్నది గొప్పప్రేమయే. ఆమె నుంచి ఒక్క క్షణమయినా విడిపడి ఉండడానికి నీవు యిష్టపడవు. ఆమె యింకొకరితో మాట్లాడినా కూడా నీకు కష్టంగా ఉంటుంది. ఆమె నీకు ఉండాలనుకోవడం నీ యొక్క

స్వార్థపరత్వమే. దానివలన అసూయ, భయము కలుగుతాయి. నీ భార్యయొక్క సుఖమును గూర్చి నీవు చూసుకోవు. కాని నీ స్వార్థాన్నే నీవు చూసుకుంటావు.

"మనం మాట్లాడే ఈ దివ్యప్రేమలో రెండు స్థితులున్నాయి. మొదటి స్థితిలో ప్రియతమునితో ఐక్యత పొందాలనే అభిలాష ఉంది. అదీ ఒక కాంక్షయే. "నేను భగవంతునితో ఐక్యం కావాలి" అని అనుకోవడము. రెండవ స్థితిలో ప్రేమికుడు ప్రియతముని గురించి ఏమీ కావాలని కోరడు. అన్ని పరిస్థితులలోను కూడా ప్రియతముని సంతోషపరచడం తోనే తృప్తిపడతాడు. అసలయిన ప్రేమంటే అదే. మామూలుగా ప్రేమ అనే దానిలో శాశ్వతమయిన సుఖం ఉండదు. అందులో సుఖము దుఃఖమూ కూడా ఉంటాయి" అని బాబా ప్రసంగించారు.

## ముగ్గురు అన్వేషకులు :—

బాబాను చూడడానికి వచ్చిన వారిలో మూడు రకాల వాళ్ళున్నారు. మొదటి వాడు — "బాబా ! నా కేమీ అక్కరలేదు. నాకు భగవంతుడే కావాలి" అంటాడు. దానితో బాబా చాలా సంతోషించారు. అతడు అన్నాడు కదా "నాకు వంట్లో బాగాలేదు. నాకు మంచి ఆరోగ్యమే ఉంటే నేను భగవంతుని తప్ప మరేదీ కోరను." అంటూ క్రమంగా అతడు తన సాధక బాధకాలన్నీ బాబాతో చెప్పుతున్నాడు. అతనికి ఒక పెద్ద కుటుంబం ఉందిట పోషించడానికి. చివరికి బాబా అతనితో "నీకు ఆరోగ్యం కావాలి. ఐశ్వర్యం కావాలి — నీకు నీ కుటుంబానికి, ఇవన్నీ కావాలి ఆఖరిని భగవంతుడూ కావాలి" అన్నారు.

రెండవ వాడు అన్నాడు—"బాబా ! మీతోనే నేనెప్పుడూ ఉండాలని ఉంది నాకు. మీసేవ చేసుకోవాలి నేను. నాకు యిప్పుడు ప్రపంచంతో పనిలేదు. నాకు ఏదీ కూడా అక్కరలేదు. నాకు తిండి గుడ్డ మీరు యిస్తే చాలు మిమ్మ సేవించుకుంటాను." సరే ఉండు అన్నారు బాబా. కొంతసేపయిన తరువాత అతడన్నాడు—"నాకు ఒక్కటే రాగం ఉంది. ఇది కూడా పోయాక మీ వద్దకు వచ్చి యీ శరీరం పడిపోయే వరకు ఉంటాను."

మూడవవాడు బాబా వద్దకు వచ్చి "నాకు భగవత్సాక్షాత్కారం కావాలి" అన్నాడు. బాబా అతనిని "నీకు అది కాక యింకేదయినా కూడా కావాలా ?" అని అడుగగా "నాకదే కావాలి.— ఇంకేదీ అక్కరలేదు" అన్నాడు. బాబా అతనిని "మూడు సంవత్సరాలపాటు నీవు ఒక గదిలో తాళం వేసుకొని పాలు మాత్రమే

తీసుకుంటూ కూర్చోవాలి. నీ వింకే ఆహారమూ తినకూడదు. ఏదీ చదవకూడదు. ఏదీ వ్రాయకూడదు.'' అని చెప్పగా అతడు బాబా చెప్పిన ప్రకారమే చేసాడు. ఒక రోజున అతని గదిలోకి ఒక త్రాచుపాము వచ్చినా అతడు గదివదిలి రాలేదు. తనకు పాలు తీసుకువచ్చినాతడు ఆ పామును జూచి దానిని చంపివేసాడు.'' అని బాబా చెప్పారు.

బాబా యింకా యిలా చెప్పారు— మీరందరూ ఒకటని తెలుసుకోవాలి. నాకొరకు మీకు ఉండే ప్రేమలో ఏవిధమయిన కోరికలు, అదికావాలి యిదికావాలి అని అడగడమూ పనికిరాదు. ఈ కావాలి అనేది మొట్టమొదట ''నేను ఎవరినో తెలుసుకోవాలి నన్ను నేను తెలుసుకోవాలి'' అని అనుకోవడంతో ప్రారంభం అయింది. ఈ మొదటి కోరిక అనేకమయిన మాయాన్వితమయిన కోరికలకు దారితీసింది. ''నాకు ఇది కావాలి. అది కావాలి – అని. దీనికి అంతు లేదు. అనేక జీవితాల పరిణామపరంపరలో కోరగా కోరగా ఆఖరికి విసుగెత్తి ''నాకు ఏమీ వద్దు'' అనే స్థితి కలిగినపుడు ఆ మొదటి కోరిక మొదటి ప్రశ్న— ''నేను ఎవరు?'' అనే దానికి సమాధానం ''నేను భగవంతుణ్ణి'' అని తెలుస్తుంది.

''మీరు మీ మామూలు జీవితం జీవిస్తూనే బాబానే ప్రేమించాలి. జీవితానికి మీరు సంగతి పొందకూడదు. అప్పుడు బాబా ప్రేమ అనే తెర యీ ప్రపంచం నుండి నిన్ను రక్షిస్తుంది.

''క్రీస్తు యొక్క గొప్పతనం అద్భుతాలు చేయడంలోను ఆయన శక్తిలోను లేదు— కానీ ఆయన గొప్పతనం ఆయన విషయంలోను ఆయన శిలువ వేయబడడం లోనే ఉంది. ఆయన అణకువే ఆయన నిజమైన గొప్పతనం.''

ఆఖరున బాబా ''మీ అసత్యపు అహమును తిరస్కరించండి. నిజమైన మీ ఆత్మయే పైకి వచ్చి తన ఉనికిని తెలుపనివ్వాలి. దేనినీ మీరు అడుగకుండా ఉంటే మీకు అన్నీ లభ్యం అవుతాయి మీరు త్యాగం చెయ్యాలి. చివరికి త్యాగాన్ని కూడా త్యాగం చెయ్యాలి.'' అన్నారు బాబా.

బాబా విమానం సింగపూర్ మీదుగా ఇండియా చేరింది. బాబా బొంబాయిలో ఒంటిగంటకి దిగి తిన్నగా ఆగస్టు 17 వ తేదీ సాయంకాలానికి సతారా చేరుకున్నారు. ఈ ప్రకారంగా 30 రోజుల్లో, ప్రపంచంలోని అనేక ఖండాలు తిరిగి వచ్చారు బాబా. ఆయా దేశాల్లో (యూరప్, ఇంగ్లండు, అమెరికా, ఆస్ట్రేలియా) బాబా ప్రేమికులు ఆయనకి ఎలాగయితే అన్ని విధాలా సుఖంగా సదుపాయంగా ఉంటుందో ఆ విధంగా

అన్నీ బాబాకి చేసిపెట్టారు. అన్ని దేశాలలోని ఆతిథ్య సంఘాలు బాబాకు ఎన్నో సహాయాలు వారి శాయశక్తులా పాటుపడి చేసిపెట్టి బాబా దీవనలకు పాత్రులయారు.

అనేక మారులు బాబా యిలా చెప్పారు—

"నన్ను ప్రేమించడానికి సాహసించిన వారు తీరం మీదే రక్షణ కోసం చూస్తూంటారు. నన్ను ప్రేమించండి. ఇంకా అధికంగా ప్రేమించండి. నాలో మీరు మునిగిపోయినా సముద్రంలో ప్రాణాలు పోగొట్టుకోండి. నాలో (సముద్రంలో) మీరు యింకా లోతుకు దిగి అట్టడుగున ఉన్న వెలలేని ముత్యాన్ని (అనంతమయిన ఏకత్వాన్ని) పొందండి. బాబాతో యీ పర్యటనలో కూడా వెళ్ళిన మండలి నా అసలు స్వరూపాన్ని ఒకించుక చూడగలిగారు. వారు ఎంతో అదృష్టవంతులు."

ఆతిథ్య సంఘ సభ్యులు బాబాకి ఎన్నో విధాల సుఖం కల్పించాలని వారితో ఉన్న మండలికి సహాయంగా ఉండాలని వారితో న్యూయార్క్ నుంచి శాన్‌ఫ్రాన్సిస్కోకి వెళ్ళిన అమెరికనులు 50 మందికి విమానాలలో చోటు కల్పించి వారికి కష్టం లేకుండా అన్ని విధాలా సుఖంగా ఉండాలని ఎంతో పాటుపడ్డారు. అంత నిస్వార్థంగా పనిచేసారు గనుకనే బాబా పర్యటన అంత జయప్రదంగా ముగిసింది—

1956 సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసాలలో బాబా మస్తుల సాంగత్యం కోసం అనేక గ్రామాలు తిరిగారు. ఆ విధంగా కారులో ఎంతో వేగంగా వెళ్తూండగా సెప్టెంబరు 10 వ తేదీ మధ్యాహ్నం – సోమవారం - 2-30 గంటలకు పెద్ద మోటారు ప్రమాదం తప్పింది.

అక్టోబరు 8 వ తేదీన ప్రత్యేకంగా బాక్సీ మస్తును (ఆలీషా) చూడడానికి బాబా మెహెరాబాదు వచ్చారు. తరువాత 23 వ తేదీన (1956, అక్టోబరు) అర్ధరాత్రి బాక్సీ మస్తు సాంగత్యం చేసారు బాబా. అప్పుడు మండలికి యీ మస్తు యీ సంవత్సరంలో మరణిస్తాడని బాబా చెప్పారు.

1957 వ సంవత్సరంలో బాబా తమ ప్రేమికులకు అయిదురోజులు సహవాస భాగ్యం కలుగజేస్తారని యిది వింటే వారందరు చాలా సంతోషిస్తారని బాబా అక్టోబరు 1 టవ తేదీన ఒక సర్క్యులర్ ద్వారా ప్రేమికులందరికి తెలియజేసారు.

జీవితంలో అపూర్వంగా కలిగే యీ మహాభాగ్యానికి నోచుకున్నవారు అందు కోసం యిప్పటినుంచి తగిన ఏర్పాట్లుచేసి సిద్ధం కావడానికి చాలాకాలం ముందుగానే ప్రేమికులకు తెలిపాడు.

ఈ సహవాస్‌కి తగినటువంటి సమయం 1957 నవంబరు 7 వ తేదీ నుంచి 1957 డిశెంబరు 7 వ తేదీ వరకు అని బాబా నిర్ణయించారు. ఇదే ప్రేమికులకి వీలుగా ఉంటుందన్నారు.

ఇదివరలో 1955 లో చేసినట్లుగానే యీ సహవాస్ కూడా నాలుగుబృందాలుగా విభజిస్తే ప్రేమికులకు ఇక్కడి మండలి లోని కార్యనిర్వాహకులకు అందరికీ వీలుగా ఉంటుందని కాని క్రిందటిమాటు వలెగాక బాబా వారి అనంతమయిన ప్రేమలో స్త్రీలకు కూడా సహవాసం కలుగజేస్తానని అంటున్నారు. అందువేత 1957 వ సంవత్సరంలోని సహవాస్‌కి రావాలని ఉండి రాగలిగిన స్త్రీ పురుషులందరికి, పెద్దవారికి మాత్రమే యీ సహవాస్ ఉంటుంది.

బాబా నిశ్చయించినట్లుగా దిగువ మెహెరాబాద్ స్థలాల్లో 1500 మంది పెద్దవారికి వసతి స్థలం ఏర్పాటు జరుగుతుంది. వీరందరు నాలుగు సమూహాలుగా ఒక్కొక్కదానిలో 375 మంది పెద్దవారుండేలా విభజింపబడతారు. 17 ఏళ్ళ లోపు పిల్లలను తీసుకురావద్దని బాబా తల్లితండ్రులను ఆజ్ఞాపిస్తున్నారు. నవంబరు 7 వ తేదీ లగాయతు డిశెంబరు 7 వ తేదీ వరకు ఒక్కొక్క వారంలో ఒక బృందం (375 మంది) తరువాత మరియొక బృందం ఆయిదేసి రోజులు బాబా సహవాసం అనుభవిస్తారు.

ఈ సహవాస్‌లో పాల్గొనేందుకు కొందరు పాశ్చాత్యులకు కూడా బాబా అనుమతి యిచ్చారు. వారిలో స్త్రీలు, పురుషులు కూడా ఉంటారు. అపూర్వమైన యీ సమ్మేళనంలో ఇండియాలోని కొందరు సాధువులు మస్తులు కూడా పాల్గొంటారు. మెహెరాబాద్ అనే పవిత్ర భూమి మీద ప్రపంచంలో అనేకమంది ప్రాచ్య పాశ్చాత్య దేశాలనుంచి బాబా ప్రేమికులు కలుసుకునే అవకాశం అందులోను ప్రియతమ బాబా సన్నిధానంలో ఉండే అవకాశం కలుగుతున్నందు వలన యిది అద్వితీయమయిన సమావేశంగా ఉంటుంది.

ఆ ప్రకారంగా అమెరికా నుంచి 150 మంది, ఆస్ట్రేలియా నుంచి 50 మంది, ఇంగ్లండు యూరప్ దేశాల నుంచి 25 మంది వస్తారని ఆశింపబడుతోంది. వీరంతా మెహెరాబాద్ కొండమీద యీ నెల రోజులు, 1957 నవంబరు 7 మొదలు డిశెంబరు 7 వరకు ఉంటారు.

దివ్యప్రియతముడయిన బాబా అనంత ప్రేమ అనే పెన్నిధిని కలిగి ఉన్నారు. దానితో ఉండడానికి ప్రాపంచికమైన ఐశ్వర్యానికి చోటు లేదు. ఆయన అందుకోసం శాశ్వతమయిన ఫకీరుగానే ఉంటున్నారు.

ఈ బ్రహ్మాండమయిన సహవాసానికి అయ్యే ఖర్చుల నిమిత్తం యీ విధంగా నిశ్చయింపబడింది – పాశ్చాత్యులు వారి రాకపోక ఖర్చులేకాక, ఇండియాలో వారి ఖర్చులు అంటే మెహెరాబాద్‌లో వసతికి భోజనాలకి ఖర్చులు మొదలయినవి, ప్రేమికులు యిచ్చే ప్రేమ కానుకల నుంచి, చేయబడతాయి

ఇండియాలో నుంచి తూర్పుదేశాల నుంచి వచ్చే ప్రేమికులు కూడా వారి రాకపోక ఖర్చులు భరించాలి. వారి వసతి భోజనాదులకు స్త్రీఅయినా పురుషుడయినా వారుండే సహవాస్ అయిదురోజులకు ఒక్కొక్కరు రు 30/– పంపిస్తూ వారికి అందే ఫారమ్ నింపి సంతకం చేసి పంపించాలి. ఇవి జూలై 1957 ఆఖరుకి అందేలా అందరూ పంపాలి. ఈ ఫారాలు, మనియార్డర్లు ఆదీ కె. ఇరానీ, కింగ్స్‌రోడ్, అహమద్ నగర్ అనే చిరునామాకు పంపాలి.

ఒకమారు పంపిన డబ్బు, పంపినవారు రాకపోయినా, ఏర్పాట్లన్నీ ముందుగానే చేయబడతాయి గనుక, మరల వాపసు యివ్వబడదు. ఏ పరిస్థితులలోను రు 30/-పంపకుండా ఎవరూ సహవాస్‌లో పాల్గొనుటకు వీలుండదు. 1500 మంది ప్రేమికుల వసతి కోసం రెండు పెద్దగుడారాలు, స్త్రీల కొకటి, పురుషుల కొకటి, నిర్మించబడతాయి. ఇంకా ఎన్నో పాత్ర సామానులు వగైరా అద్దెకు తీసుకునే ఏర్పాటు చేస్తారు. ఈ సహవాస్‌లో తప్పకుండా పాల్గొనాలనుకునే ప్రేమికులు కొందరు రు30/లు పంపలేని వారుంటే వారి మిత్రుల సహాయం తీసుకోవాలి గాని యీ సహవాస్‌కి డబ్బు యివ్వక్కర్లేకుండా రానిమ్మని కోరకూడదని బాబా దీనికి సంబంధించిన సర్క్యులర్‌లో స్పష్టం చేయించారు.

కొందరు బాబా భక్తులు వారి స్వంతానికి రు 30/– పెట్టుకోవటమే కాకుండా ఎవరికయినా అవసరం ఉన్నవారి కోసం సహాయపడగలిగిన వారుంటారు. బాబా సెంటర్లలోని నాయకులు అక్కడి ప్రేమికుల నడిగి ఆ విధంగా పెట్టుకో లేని వారికి అలాంటి వారి సహాయం పొందేలా ఏర్పాటు చేయాలి.

1957 వ సం॥ లో జరిగే యీ గొప్పసహవాస్‌కి రావడానికి మీరు కావలసిన ఏర్పాట్లు చేసుకోవడానికి సంవత్సరం ముందుగా మీకు తెలుపడమయింది.

ప్రేమికుల వద్దనుంచి మనియార్డరు ఫారాలు అందగానే మెహెరాబాద్‌లో ప్రవేశించడానికి కావలసిన టోకెన్‌లు పంపబడతాయి ఇంకా ఏదయినా కావలసివ

ఆదీ కె. ఇరానీకి వ్రాయవచ్చును. అని సర్క్యులర్ బాబా ప్రేమికుల కందరకు పంపబడింది.

1956 నవంబరు ఆఖరున బాబా తమకు అమెరికాలోను, ఇంగ్లండులోను, ఆస్ట్రేలియాలోను ఉన్న ప్రేమికులకు ఒక సందేశం పంపించారు. అదే సందేశాన్ని ఇండియా, పాకిస్తాన్, సిలోన్ దేశాలలో ఉన్న ప్రేమికులకు కూడా పంపించమని బాబా ఆదేశించగా ఆయన శిష్యుడు, కార్యదర్శి అయిన ఆదీ కె ఇరానీ డిశెంబరు 2 వ తేదీన అందరికీ సర్క్యులర్ ద్వారా పంపించాడు. ఆ సందేశం పాఠం యిలా ఉంది—

"ప్రతీ బాబా ప్రేమికుని వెంటనే బాబాకి ఒక చిన్న ఉత్తరం వ్రాయడానికి బాబా తమ ఏకాంతవాసం నుంచి అవకాశం యిస్తున్నారు. దీనికి జవాబు ఎవరూ ఆశించకూడదు. ఆ ఉత్తరంలో ఎవరూ వారి స్వంత వ్యవహారాలగురించి వ్రాయ కూడదు. బాబాని ఎవరూ ప్రశ్నలడుగకూడదు. అందులో ఏవిషయం మీదా బాబా సలహా కోరకూడదు."

ఈ లేఖ నవంబరు 29 న ఆదీకి పంపించి సర్క్యులర్ ఉత్తరం పంపించ మన్నారు. ఈ సర్క్యులర్ డిశెంబరు 2 వ తేదీన వెళ్ళింది.

బాబా సతారాలో గ్రాఫ్టన్ బంగళాలో ఉంటున్నారు. 1957 ఫిబ్రవరి 15 కి కొన్నివారాలు ముందుగా బాబాకు ఆయనకు సన్నిహితులయిన కొందరు శిష్యులకు మిక్కుటమయిన బాధ కలుగుతుందని బాబా గ్రాఫ్టన్‌లో మండలికి చెప్పారు. అప్పుడు ఆయన పాటిస్తున్న ఏకాంతవాసము ఫిబ్రవరి 15 వరకు సాగుతుంది

ఈ ఏకాంతవాసం రోజుల్లోనే ఎరచ్ నడుపుతుండగా వారి కారులోనే బాబా ఇండియాలో 10,000 మైళ్ళ ప్రయాణం చేసారు. ఇంత దూరం బాబాను తీసుకు వెళ్ళి ఎరచ్ చాలా జాగ్రత్తయిన సమర్థుడయిన డ్రైవర్ అని అనిపించుకున్నాడు. ఉత్తర హిందూస్తానంలో మస్తుల కార్యక్రమం కోసం ప్రయాణాలు చేసి సతారాకి నవంబరు 23 వ తేదీన తిరిగి వచ్చారు బాబా కొందరు మండలితో.

డిశెంబరు 2 తేదీ ఆదివారంనాడు బాబా, ఎరచ్, పెండు, విష్ణు, డా॥ నీలకంఠ్ (నీలు) వెంటరాగా సతారా నుంచి పూనా వెళ్ళారు. ఆ మధ్యాహ్నమే సతారాకు తిరిగి వెళ్దామని బయలుదేరారు. సతారాకు 14 మైళ్ళ దూరంలో ఉన్న ఉడతారా అనే గ్రామం సమీపానికి వచ్చారు. కారు మామూలు గానే వెళ్తోంది. ఎక్కువ వేగంగా

వెళ్ళడం లేదు. రోడ్డుమీద మనుష్యులెవరూ నడవటం లేదు. ఇతరములైన బళ్ళు అడ్డాలు కూడా ఏమీలేవు. ఏ కారణమూ లేకుండా కారు కంట్రోల్ తప్పి ఎదుట రోడ్డుప్రక్కన రాతితో కట్టిన వంతెనకు ఢీ కొట్టింది. అప్పుడు సమయం సరిగ్గా సాయంకాలం 5-15 గంటలయింది. వంతెనకు ఢీ కొని ప్రక్కనున్న గోతిలో కారు పడిపోయింది. మూడు నిమిషాల తరువాత ఎవరో ఒకడు కారులో ఆ దారిన పూనాకు వెళ్తున్నాడు. అందరిలోను విష్ణుకి తక్కువ దెబ్బలు తగిలాయి. అందుచేత వారంతా ఫలానా అని, సతారాకి వెళ్ళాలని అక్కడ గ్రాఫ్టన్‌లో బాబా ఉంటున్నారని, యీ విషయాలన్నీ అతడు చెప్పగలిగాడు. కారు వెనక్కి త్రిప్పి బాబాని విష్ణుని ఎక్కించుకుని అతడు కారు వెనక్కి త్రిప్పి, బయలుదేరి సతారాకి తీసుకొని వెళ్ళాడు. ఎంతో ఆలస్యం అవకుండానే ఒక లారీ ఆ దారిన వచ్చి మిగతా వారందరికి బాగా దెబ్బలు తగిలితే అందరినీ లేవదీసి అందులో ఎక్కించుకుని వెంటనే మండలి ఉంటున్న సతారా లోని రోజ్‌వుడ్ బంగళాకి తీసుకు వెళ్ళాడు. డా॥ నీలు మాత్రం స్పృహ రాకుండానే ప్రాణాలు వదిలేసాడు. మిగిలిన వారి స్థితి తీవ్రంగానే ఉంది. వారందరిని ఆస్పత్రిలో చేర్చారు. ఆరోజున అమావాస్య ఆదివారం. సూర్యగ్రహణం రోజు కూడాను.

1952 వ సంవత్సరంలో అమెరికాలో అయిన ప్రమాదంలో బాబాకి ఆయన ముఖానికి, చేతికి, కాలికి దెబ్బలు తగిలాయి. అవే కాకుండా యింకా చాలా దెబ్బలు తగిలాయి. ముఖానికి తగిలిన వాటిలో నుదుటికి, ముక్కుకి, దవడలకి తగిలాయి. నోటిలో నాలుక చీరుకుపోయింది. శస్త్రవైద్యులు ఆ చీలిక కొన్ని గంటల తరువాత కుట్టేసారు. గడ్డం క్రింద అలాగే చీరుకుపోతే అదికూడా కుట్టేసారు. బాబాకి తగిలిన దెబ్బలు ఆరోజుకారోజు తగ్గుతున్నాయి. ద్రవ పదార్థం త్రాగడానికి వీలు కలిగింది. కొద్దిరోజుల్లో వాపులు తగ్గిపోయాయి.

బాబాకు ముఖ్యంగా చట్టకి పెద్ద దెబ్బ తగిలింది. అక్కడ ఎముక విరిగింది. ఉండవలసినట్లుగా లేక ఎముకలు అటూ యిటూగా ఉన్నాయి. ఇది సామాన్య విషయం కాదు. శారీరక బాధ అమితంగా ఉంటుంది. బాబా గ్రాఫ్టన్ బంగళాలోనే ఉన్నారు. ఇద్దరు డాక్టర్లు చూస్తున్నారు. మెహెరా మొదలయిన స్త్రీ మండలి వారికి శుశ్రూష చేస్తున్నారు.

ఏకాంతము నందు బాబా యిచ్చిన సర్క్యులర్ లేఖలో యీ ప్రమాదాన్ని గురించి తెలియపరచగా ఒక ప్రేమికుడు, ఇలాంటి ప్రమాదాలు బాబా ఎందుకు తప్పించుకోరు ? అని అడుగగా బాబా యిలా జవాబు చెప్పారు.

"ఈశ్వరేచ్ఛ ప్రకారం జరిగి తీరుతుంది. నేను మీరు నమ్మిన భగవంతుని అవతారమే అయితే నేను అది తప్పించుదామని ఎంతమాత్రము చూడను."

బాబా ఎందు కింత బాధ స్వయంగా పడాలి ? అనే ప్రశ్నకి బాబా జవాబు— "మానవులు వారి కర్మ ప్రకారం ఎంత బాధ పడాలో అంతా పడతారు. కొంతమంది యితరుల కోసం బాధపడతారు. ప్రపంచం కోసం బాధపడతారు సద్గురువులు. ప్రమాదాలవల్ల బాధ పడినా ఏ కారణం వలన బాధపడినా అవతార పురుషుడయిన బాబా , శారీరకంగాను మానసికంగాను, ఆధ్యాత్మికంగాను కూడా ఎప్పుడు బాధపడినా మానవశ్రేయస్సు కోసమే అనేది స్పష్టం."

గత సంవత్సరం నవంబరులో బాబా పూనాలో ఉన్నప్పుడు నోజర్ అను యువకుడు విమాన ప్రమాదంలో చనిపోయినపుడు బాబా ఒక్కమాట అన్నారు. "ఒక సంవత్సరంలో నాకు ప్రియమైనవారు యింకా అయిదుగురు మరణిస్తారు." అని చెప్పారు. ఇప్పుడు బాబా "నీలు నా సన్నిధానంలో ప్రాణాలు విడిచినందుకు చాలా అదృష్టవంతుడు. అతడు కావాలనుకొన్నట్లే జరిగింది." అన్నారు. బాబా చెప్పిన ప్రకారం నీలు యొక్క శరీరం మెహెరాబాద్ తీసుకొని వెళ్ళి అక్కడ అంత్యక్రియలు జరిపారు. అది అతనికి అత్యంత ప్రియమైన స్థలం. అతడు తన ప్రియతమునితో అనేక సంవత్సరాలక్కడ గడిపాడు.

ప్రమాదం జరిగిన మరునాటి ఉదయం బాబాకు తగిలిన ఎన్నో దెబ్బలవల్ల అమితమైన బాధపడుతూ "హంగేరీ ప్రజలు యీ మధ్యను ఎంతో బాధపడ్డారు. చాలామంది గాయాలు తగిలి రోడ్డుమీద చూసే దిక్కులేకుండా పడిపోయి ఉన్నారు. వారి బాధ తగ్గించేవారు, మందులిచ్చేవారు, వారికోసం బాధపడేవారు, వారు ప్రేమించిన వారు, ఎవరూ వారి దగ్గరలేరు. నేను ఒక పరుపు మీదయినా పడుకున్నాను. నాకు సేవ చేయడానికి నా సన్నిహిత ప్రేమికులు అంతా ఉన్నారు. ఇక్కడ లేకపోయినా చాలా మంది నా మీద ప్రేమ వారి సానుభూతి కలిగి ఉన్నారు" అని బాబా తమ పరిస్థితి వారితో పోలిస్తే చాలానయం అంటూ చెప్పారు.

కొన్నిరోజుల క్రితం బాబా అన్నారు — "ఎవరూ కూడా వ్యర్థంగా బాధ పడరు. నిజమైన స్వేచ్ఛ ఆధ్యాత్మిక స్వేచ్ఛయే ఈ బాధ దానికి నిచ్చెన వంటిది. మానవులు తెలియకుండానే భగవంతుడు కోసం బాధపడతారు. భగవంతుడు తెలిసే

మానవులకోసంబాధపడతాడు. భగవంతుడు అసలు మానవ శరీరం లోకి దిగి అవతార మెత్తడమే ఒక బాధ ఆయనకి.

ఈ విధంగా ప్రమాదం జరిగిందని ఎవరికీ టెలిగ్రాం ల ద్వారాగానీ కేబిల్ ద్వారాగానీ ఎవరికీ తెలియపరచవద్దని బాబా చెప్పారు. అందుకనే డిశెంబరు 5 వ తేదీన సతారా నుంచి బాబా సోదరి మణిజా పాశ్చాత్య ప్రేమికులకి లేఖ మూలకంగా తెలియపేసింది. ప్రేమికులకు అందరికీ 6 వ తేదీన ఆదీ పంపించిన సర్క్యులర్ వల్ల తెలిసింది.

ఈ ప్రమాదం జరిగిన తరువాత బాబా తమప్రేమికులకు— "మీరు విచారించకండి; సుఖంగా ఉండండి; అంతా బాగాఉంటుంది. నేనుచెప్పినట్లు విశ్వాసంతో ఆచరించండి." అని ఒక సందేశం పంపించారు.

బాబా యింకొక విషయం అందరికీ ప్రత్యేకంగా యిలా వ్రాయించారు— "ఈ ప్రమాదం జరిగినందువలన వచ్చే సంవత్సరం నవంబరులో జరిగే సహవాస్‌లో ఏవిధమయిన మార్పు ఉండదు." ప్రేమికులు సహవాస్‌కి రావడానికి ఎక్కువ ప్రయత్నం చేయాలని, యీ ప్రమాదం సహవాస్‌కి సహాయకారిగా ఉంటుందని, సహవాస్ తప్పకుండా జరిగితీరుతుందని వ్రాయిస్తూ బాబా అందరికీ తమ ప్రేమను పంపించారు. మణి పాశ్చాత్యులకు డిశెంబరు 5 న వ్రాసిన లేఖలో యీ ప్రమాదం జరిగిన సంగతులన్నీ వ్రాస్తూ చివరన బాబా కి ఎవరూ తమ ఉత్తరాలలో యీ ప్రమాదం గురించి ఏమీ వ్రాయవద్దని పాశ్చాత్య ప్రేమికులను హెచ్చరించింది. తరువాత ఆ మరునాడు ఆదీ పంపించిన సర్క్యులర్ లేఖలో 2 వ తేదీన ప్రేమికులను బాబాకి ఉత్తరాలు వ్రాయమన్నారు కదా అని అందులో మాత్రం యీ ప్రమాదం గురించి వ్రాయకూడదని ప్రాచ్యప్రేమికులందరిని కోరడం జరిగింది.

## బాబాయొక్క ఆధ్యాత్మిక కార్యము – ఆయన శారీరక బాధ :—

అనేక మారులు బాబా ఏకాంతవాసాలు చేసారు. ఆ ఏకాంతవాసాలలో ఎవరికీ దర్శనం యివ్వలేదు. ప్రేమికులు ఎవరినీ బాబా అలాంటి సమయాలలో వారిని చూడ నివ్వరు. ఇప్పుడు ఫిబ్రవరి 15, 1956 నుంచి జరుగుతూ ఉన్న ఏకాంతవాసం అన్నిటి లాగ కాదు. దీనికి ఆధ్యాత్మికంగా చాలా ప్రాముఖ్యత ఉండడమే గాక, దీనికి ఎక్కువ విశిష్టత ఉంది. తీవ్రమయిన యీ ఏకాంతవాసంలో మధ్య మధ్య బాబా కఠినమయిన ఉపవాసాలు చేసారు; మస్తు ప్రయాణాలు చేసారు; యీ ఏకాంతవాసం భంగం

కలిగించుకుని అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా దేశాలకి (1956) జూలై మాసంలో వెళ్ళి వచ్చారు. (అప్పుడు రాబోయే యీ బాధనుగురించి బాబా సూచన చేసారు — ఆగస్టుమాసంలో) ఇండియాకి రాగానే వారి ఏకాంతవాసం మరల సాగిస్తున్నారు. ఈ ఏకాంతవాసం ఆఖరుభాగంలో ఆయన పనికి అవసరమని చెప్పి ఏకాంతం తీవ్రతరం చేస్తారు. తీవ్రతరం చేయడం అంటే అది ప్రేమికులెవరూ అనుకోని విధంగా జరిగింది. డిశెంబరు 2 వ తేదీన వారికి ఘోరమయిన మోటారు ప్రమాదం సంభవించడం తత్ఫలితంగా ఎవరూ ఆయనను చూడడానికి వీలులేకపోవడం అయింది. బాబా యిప్పుడు ఒకే స్థితిలో వెల్లకిలా పక్కమీద పరుండి ఉన్నారు. అటూ యిటూ తిరుగలేరు. ఇంతకంటె తీవ్రమయిన ఏకాంతం మనం ఊహించలేము. బాబా సతారాలో ఉండగా ప్రమాదం జరిగిన ఒక వారానికి వారి ఒడలంతా నొప్పులతో బాధ పడుతూంటే మండలి, డాక్టరు, బాబాని పూనా తీసుకొని వెళ్తామన్నారు. అక్కడ వైద్య సహాయం యింతకంటె బాగా ఉంటుందని చెప్పగా చెప్పగా ఎలాగయితేనేం బాబా దానికి అంగీకరించారు. పూనాలో వారి కుడికాలికి పూర్తిగాను వారి చట్టకు చుట్టూను వేసిన ప్లాస్టరు అంతా తీసేసారు. కాలు ట్రాక్షన్‌లో పెట్టారు విరిగిన ఎముకలు అతుక్కుంటున్నా వారి నొప్పులు అధికంగా ఉన్నాయి. కాస్త కదలితే విపరీతమయిన బాధ కలుగుతోంది. చట్టనొప్పి తగ్గితే వేరే యింకో నొప్పి బయలుదేరి బాధిస్తోంది. ఈ బాధ తీసివేయరానిది. ఇంకొకరు పంచుకోలేనిది. పూనాలో డా॥ భనోస్‌దే రోజుకి రెండు మారులు వచ్చి బాబాను చూస్తున్నాడు. డా॥ గోహర్, ఆదీకి మేనకోడలయిన డాక్టరు నర్గీస్ ఇరానీ ఎప్పుడూ బాబా వద్దనే ఉంటున్నారు.

ఎరచ్, పెండు యిద్దరు సతారా ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు.

ఎముక విరిగిన చోట వేలితో గుండ్రంగా చూపించి యిక్కడే మొత్తం విశ్వము యొక్క బాధ అంతా కేంద్రీకృతమయినదని బాబా చెప్పారు. అక్కడ ఉన్నదానినే యూనివర్సల్ జాయంట్ అంటారు. శారీరకంగా యింత బాధ పడుతున్నా బాబా "నేను సుఖంగా ఉన్నాను. ఎలా ఉండాలో అది అలాగే ఉంది." అని అనేవారు. ఇంకొకమారు బాబా అన్నారు—"విశ్వము యొక్క మానసిక వేదన అంతా నన్ను నలగగొట్టాలని చూస్తోంది. కానీ నేను అనుభవిస్తున్న అనంతమయిన ఆనందము అందరి యెడల నాకు ఉన్న ప్రేమ నన్ను నిలబెడుతున్నాయి. నా ప్రేమికుల యొక్క ప్రేమ నేను యీ భారము మోయడంలో నాకు ఊతగా ఉంది. రానున్న యీ వారంలో నా బాధ పరాకాష్ఠ నందుకుంటుంది. అది అవసరమే. అలాగే ఉండాలి. నన్ను ప్రేమించే అందరి ప్రేమతోను యీ క్లిష్టసమయం కూడా జరిగిపోతుంది."

ఆయనను ప్రేమించేవారందరి కోసం బాబా ఒక ప్రత్యేకమయిన సందేశం యిచ్చారు:—

"ఈ నిస్సహాయ స్థితిలో నేను అనగా భగవంతుడు తప్ప మిగిలిన దంతా మాయ. పరమాత్మతో ఏకమగుటకు మార్గము - ప్రేమ, త్యాగము, భగవంతుని ఇచ్ఛకు నిజాయితీగా లోబడి యుండడము. నేనే అందరిలోని ఆత్మను. నేనే అంతిమ గమ్యాన్ని: అందుచేత మీరు నిజాయితీతో నన్ను ప్రేమించండి. ఫిబ్రవరి 15 (1957) తో నా ఏకాంతవాసం అంతం అయిన తరువాత నేనే నిస్సహాయత నుండి విముక్తిని పొందుతాను. అందరకు నా సహవాసమును, దర్శనమును, ఆశీర్వాదమును యిస్తాను.

1957, ఫిబ్రవరి 15వ తేదీని నేను 24 గంటలసేపు నా ప్రేమికులందరి తోటి ఉపవాసం ఉంటాను. నాకు తగిలిన దెబ్బలవల్ల నాకు శారీరక నిర్బంధాలు ఉన్నా నేను 700 మంది పేదవారికి ఆ రోజున ప్రణామం చేస్తాను. వారికి సంతర్పణ చేస్తాను. అందరికీ నా ప్రేమ."

డిశెంబరు 16 వ తేదీ నుంచి బాబా చెప్పిన వారం ప్రారంభమయింది. బాధ అన్నివిధాలా ఎక్కువగాఉంది. ప్లాస్టర్ పట్టు వేసి తీసినందువల్ల అస్తవ్యస్తం పరుండి యున్నందున వీపు మీద పుండ్లు అయినవి. కదిలితే చాలు కాలు బ్రహ్మాండంగా నొప్పి పెడుతోంది. అప్పుడప్పుడు జ్వరం తగలడం శరీరం కొయ్యగా అయిపోవడం కూడా జరుగుతోంది. 15 వ తేదీ సాయంకాలం బాబా ఆ మండలికి యిలావివరించి చెప్పారు. "ప్రమాదం జరిగిన తేదీ లగాయితు (2-12-56) 75 రోజులు శారీరకమయిన బాధ అనుభవించాలి. అది ఒక కొండ మీదికి ప్రయాణంతో పోల్చవచ్చును. మొదటి 3 వారాలు ఎక్కడం. ఇప్పుడు యీ వారంలో కొండ శిఖరం చేరుకోవడము లాంటిది. తరువాత 3 వారాలు నెమ్మదిగా క్రమంగా దిగాలి. దాని తరువాత 44 రోజులు క్రమంగా నయంగా ఉంటుంది. మామూలుగా యిలాంటి దెబ్బలతో ఎలాంటి బాధ ఉంటుందో అది ఉంటుంది. ఇదంతా నా ఏకాంతవాసంతో సంబంధం కలిగి ఉంది. రాబోయే ఫిబ్రవరి 15 తో ఏకాంతవాసం అయిపోతుంది గనుక బాహ్యంగా పడే యీ నిస్సహాయత కూడా అంతమవుతుంది."

డిశెంబరు 15 వ తేదీన బాబాను ప్రేమించేవారందరికీ ప్రాచ్య పాశ్చాత్య ప్రేమికులకు ఒక సర్క్యులర్ లేఖ పంపించమని బాబా చెప్పారు. అది ఇండియా, పాకిస్తాన్, కాశ్మీరు, సిలోను, ఏడెన్, ఆఫ్రికా, ఇరాన్ దేశాలలో ఉన్న ప్రేమికులకు కూడా

బాబా పంపమన్నారు. అమెరికా, యూరప్, ఇంగ్లండు ఆస్ట్రేలియా దేశాలవారికి కూడా బాబా ఇచ్చ్ప్రకారం పంపించారు. ఇందులో బాబా శారీరక పరిస్థితి, బాబా ఏకాంతవాసం సంగతి అన్నీ వ్రాసారు.

డిశెంబరు 18 వ తేదీన సతారా నుంచి పూనాకు బాబాను అంబులెన్సు కారులో అక్కడి వైద్య చికిత్స బాగా ఉంటుందని తీసుకువెళ్ళారు. క్రిష్టమస్ పండుగముందు బాబాను క్రొత్త పడక మీదకు మార్చారు. ఇప్పుడు యిది మరికొంచెం సదుపాయంగా ఉంది. డా॥ డాన్కిన్ మిలటరీ ఆస్పత్రి నుంచి బాబాకి యిష్టమయిన ఒక మంచి డాక్టరుని (కర్నల్ చటర్జీ) తీసుకువచ్చాడు. అతడు బాబాకి దెబ్బలు తగిలిన చోట ఎక్స్‌రే ఫొటోగ్రాఫ్‌లు యింకా తీయించి చూసి కాలుబాగా కదపడానికి వీలుగా చేసాడు. బాధ చాలా వరకు తగ్గింది. ఇంకా అప్పుడప్పుడు జ్వరం కొద్దిగా వస్తోంది.

22 వ తేదీతో ఎక్కువ క్లిష్టమైన వారం ముగిసింది. దగ్గర ప్రేమికులందరు సంతోషించారు. 6-7 వారాలలో బాబా చంకలక్రింద కర్రలు పెట్టుకొని నడిచేలా చేస్తానని డాక్టరు చటర్జీ చెప్పాడు.

ఈ ప్రమాదం పూర్తిగా బాబా పనికోసం ఆయన అంతరంగ కార్యకోసం తెచ్చిపెట్టుకున్నదని స్పష్టంగా తెలుస్తోంది. ఎందువల్లనంటే – రోడ్డుచాలా బాగుంది. విశాలంగా ఉంది. రోడ్డుమీద బహుశాని ఆఖరికి ఒక కోడి పిల్లయినా లేదు. కారుమంచి స్థితిలో ఉంది. రోడ్డుమీద ఒక్క మనిషయినా లేడు. నడిపేవాడు ఎరచ్, ఎంతో సమర్థత గల అనుభవశాలి. కారు వేగం 40 మైళ్ళకి తక్కువగానే ఉంది. ప్రక్కనఉన్న రాతి వంతెన కట్టడం కూడా చాలా క్రిందుగా ఉంది. ప్రక్కనున్న గొయ్యి అయినా లోతయినది కాదు. బాబా చేసిన కార్యం కాకపోతే అది ప్రమాదం కావాలన్నా జరిగే పరిస్థితి కాదు. ఆయన ఇచ్ఛ ప్రకారం కారు కంట్రోల్ తప్పి ప్రక్కకి లాగేసి కారు కల్వర్టుకి – వంతెన గట్టుకి – గుద్దుకుంది. అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది.

కొంతకాలం క్రిందట బాబా మండలి క్రికెట్ ఆడిన స్థలానికి ఎదురుగానే యీ ప్రమాదం జరిగింది. ఆ దారిన బాబా వెళ్ళినప్పుడల్లా మండలితో యిక్కడ క్రికెట్ ఆడాము అని జ్ఞాపకం చేసేవారు. పూనానుంచి డిశెంబరు 2 వ తేదీన తిరిగి సతారా వెళ్ళేటప్పుడు యీ క్రికెట్ ఆట గురించి మాట్లాడుతూండగానే ప్రమాదం జరిగింది. ఆ ప్రమాదం జరిగిన తరువాత విష్ణు ఒక్కడే వెనుక వైపున ఉన్నాడు. అతనికి ఛాతీ లోపల ఒక ఎముక విరిగింది. ముఖం మీద దెబ్బలు తగిలాయి. మొత్తం మీద అందరి

కంటే తక్కువగా దెబ్బతిన్నది విష్ణు మాత్రమే. విష్ణు కారు దిగి ముందుసీటులో బాబా ఎలా ఉన్నారో చూద్దామని వెళ్ళాడు. బాబా సీటులో జార్లబడి ఉన్నారు. అప్పుడు ఆయన ముఖం ఎంతో ప్రకాశవంతంగా ఉందిట. పార్థునికి సారథ్యం చేస్తున్న శ్రీకృష్ణుడు యుద్ధభూమిలో యింత తేజోవంతంగా ప్రకాశించాడో లేదో గానీ బాబా వదనం మాత్రం తేజో విరాజమానంగా ఉంది. ప్రమాదం జరిగేముందు బాబా వెనుక ఉన్న నీలుని ముందుసీట్లో చూపోచ్చబెట్టుకున్నారు. లేకపోతే అతడు మృత్యువు వాత పడేవాడు కాదు. నీలు బాబా సమక్షంలో అతనికి బాధ లేకుండా మరణం రావాలని కోరుకున్నాడు. అలాగే జరిగింది. పెండు విపరీతంగా బాధపడుతున్నాడు. ఎరచ్‌కి దెబ్బలు తగిలినా ఎలాగో బాబా వద్దకి వెళ్ళి ఎలా ఉన్నారో కనుక్కోగలిగాడు. ఇంతలో ఎవరో కారులో వెళ్తూంటే బాబాని విష్ణుని ఎక్కించుకొని సతారాలో గ్రాఫ్టన్ చేరాడు.

కొద్దిరోజులకి ప్రమాదం జరుగుతుందనగా బాబా మండలితో "మనమందరము కొద్దిరోజులలో చనిపోవచ్చును." అని నీలువైపు తిరిగి "నీవేమీ దేనికోసమూ బెంగ పెట్టుకోకు. నన్ను ఎల్లప్పుడు స్మరిస్తూ ఉండు. ఉన్నవాడిని నేనొక్కడినే. అసలు పట్టించుకోవలసిన వాడను నేనే."

డిశెంబరు 21 వ తేదీన సాధు గాడ్గేమహరాజ్, ఆ నెలలోనే మస్తు ఆలీషా కూడా పరమపదం అలంకరించారు. ఆలీషా శరీరం మెహెరాబాద్‌లో ఖననం చేసారు. వీరి మరణాల గురించి బాబా ముందే చెప్పారు. కర్నల్ చటర్జీ అనే డాక్టరు బాబాను చూసి తన సలహాను, సహాయాన్ని యిస్తున్నాడు. ఈ డాక్టరు మూడు వారాలలో బాబా కర్రల సాయంతో నడుస్తారని చెప్పాడు. ఇలా చెప్పడం జనవరి (1957) మొదటి వారంలో జరిగింది. పూనా నుంచి ఫిబ్రవరి మొదటివారంలో బాబా పింపలగామ్‌కి వెళ్తారు. అంతకుముందు పైన చెప్పిన బీవిగారి కార్యక్రమం మెహెరాబాద్‌లో జరిగేలా ఏర్పాటు అయింది.

1952 వ సం॥లో అమెరికాలో మోటారు ప్రమాదం జరిగినప్పుడు బాబా ఉపయోగించిన చక్రాల కుర్చీ, కర్రలు, మెహెరాబాద్‌లో భద్రపరిచారు. ఇప్పుడు వాటిని పూనాకు తీసుకువచ్చారు. వారానికొకమారు ఎక్స్‌రే ఫొటోలు తీసి చూడగా బాగా కోలుకుంటున్నారని తెలుస్తోంది. విరిగిన ఎముకలు అతుక్కుంటున్నట్టు తెలుస్తోంది. బాబా కాలిమీద నడుముమీద మర్దనా చేయించుకుంటున్నారు. కండరాలకి ఎముకలకి తగిన పరిశ్రమ అభ్యాసం, వైద్యుని సలహా ప్రకారం బాబా చేస్తున్నారు. ఈ పనికోసం కొద్దిరోజుల క్రిందట వైద్యశాఖలో పని చేస్తున్న నాయక్ అనే ఒక

యువకుణ్ణి పెట్టుకున్నారు. ఈ పనికి సంబంధించి యింకా కొద్దిమంది బాబా వద్దకు వస్తూండేవారు. ఆ యువకుడు వాళ్ళు నిజంగా ఎంత అదృష్టవంతులో అనిపిస్తుంది, వాళ్ళకి ఆ సంగతి తెలియక పోయినా. ఈ మర్దనా, యీ పరిశ్రమ అభ్యాసాలు చేసేటప్పుడు బాబాకి వాటివల్ల ఎంతో బాధగా ఉండేది. ఏది ఎలా ఉన్నా వీటివల్లనో, దేనివలనో, బాబాకి రోజు రోజుకి గుణం కనిపిస్తూంది. ఆ యువకుడు మర్దనా చేయడం బాబాకి బాగా నచ్చింది. తన చేతులతో మృదువుగా ఉండవలసిన చోట మృదువుగాను, గట్టిగా చేయవలసిన చోట గట్టిగాను చేసేవాడు.

''ఒక రోజున మబ్బుగాను మరియొకరోజున ఎండగాను ఉన్నట్లే బాబాకి బాధ ఒకరోజున హెచ్చుగాను ఒక రోజున తక్కువగాను ఉంటోంది'' అన్నారు బాబా. బాబా విశ్రాంతి తీసుకునే చోటుకి సమీపంలో ఒక మహమ్మదీయ సాధువు సమాధి ఉంది. దాని దగ్గరకి అనేక మేకలు వచ్చి పచ్చికమేసి గంతులు వేస్తూండేవి. వాటిలో కొన్ని పిల్లలు బాబా ఉన్న యింటికి దగ్గరగా వచ్చినపుడు మండలి ఒకటి రెండు మేక పిల్లల్ని పట్టుకుని బాబా వద్దకు తీసుకువచ్చేవారు. ఎంతో దయతో వాటిని చేతితో నిమిరేవారు బాబా.

జనవరి 7 వ తేదీన బాబా—''నేను త్వరగా బాగు అయిపోవాలి. చేయవలసిన పని బోలెడంత ఉంది.'' అన్నారు.

బాబా మంచం ఎలా ఎత్తాలంటే అలా ఎత్తవచ్చు; దింపవచ్చును. బాబా పరుండే, నడుం నొప్పి లేకుండా జార్లబడి కూర్చున్నట్లు మంచం ఎత్తుకోవచ్చు; దానికి అలాంటి ఏర్పాట్లన్నీ ఉన్నాయి.

ప్రజలు ఎంతో మంది వచ్చి బాబాను దర్శనం చేసుకుంటామనేవారు. కానీచాలా మందిని వీలులేదని వెళ్ళమని మండలి చెప్పేవారు. ఆయింటి తోటమాలి ఒక ముసలి వాడు. అతడు మాత్రం ఎంత అదృష్టవంతుడో అతనికి బాబా దర్శనం ప్రతిరోజూ కాకపోయినా తరుచుగా దొరుకుతూ ఉండేది. అతడు మణిని అడిగి బాబా ఫొటో ఒకటి తనకి కావాలని అడిగి తీసుకున్నాడు. ఆ ఫొటో అతనికి యివ్వడానికి ఆమె తేగానే చెప్పులు వదిలేసి ఆ ఫొటో అందుకొని బాబా చిత్రానికి మ్రొక్కేడు. అది నొసటకి అద్దుకొని హృదయానికి హత్తుకున్నాడు. అప్పటినుంచి ఆ మాలి దివ్య పురుషుడయిన బాబాను ప్రతి ఉదయము కిటికీ బయటనుంచి అయినా దర్శించేవాడు.

బాబా ఉన్న యిల్లు బాబా చిన్నప్పుడు ఆడుకుంటూ ఉండిన ప్రాంతంలోనేఉంది. దానికి సిల్వర్ ఓక్స్ అనిపేరు. అక్కడి నుంచి దూరాన ఉన్న కొండ, ఆ ప్రక్కన

జొరాస్ట్రియనులు "మౌన గోపురం" కనిపిస్తూంటుంది. చిన్ననాటు బాబా అక్కడికి తరుచుగా వెళ్తూఉండేవారు.

పక్కమీద కొద్ది నిమిషాలసేపు బాబా లేచి కూర్చోగలిగేవారు. ఇప్పుడు కొంత ఘన పదార్థం తీసుకొని బాబా భుజిస్తున్నారు. ఇంతవరకు ద్రవాహారమే తీసుకుంటూండేవారు బాబా. అయినాగానీ మామూలుగా ఎవరయినా తినేదాంట్లో సగమయినా తినడం లేదు.

మిగిలినవారిలో పెండు యింకా సతారాలో ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నాడు. రోజురోజుకి అతనికి నయమవుతోంది, జనవరి 8 తేదీన ఎరచ్ ఆస్పత్రినుంచి యింటికి వచ్చేసాడు. అతడు మళ్ళీ ఎప్పటిలాగ బాబా వద్దకు వచ్చి పనిచేయడానికి యింకా కొంతకాలం పడుతుంది. విష్ణు శరీరానికి గాయాలు అంతగా తగులక పోయినా మానసికంగా గాభరా వల్ల కొంత దెబ్బతిన్నాడు.

1957, జనవరి 19 వ తేదీన బాబాకి ఎక్స్‌రే ఫొటో తీసి చూడగా నయంగా ఉందని తృప్తి కలిగింది. 20 వ తేదీ సాయంకాలం డా॥ చటర్జీ వచ్చి చూసి యింక బాబా లేచి చక్రాల కుర్చీ మీద కూర్చోవచ్చునని ఆయనను లేవదీసి ఆ కుర్చీమీద కూర్చోపెట్టాడు. ఈ కుర్చీ డా॥ డాన్‌కిన్ బాబాకి బహూకరించినది ఇంట్లో నాలుగు గదులలో కుర్చీ పోనిచ్చి చూసారు బాబా. ఆ విధంగా యిల్లంతా నాలుగు మూలలా కుర్చీలో తిరిగారు. అక్కడ వున్న శిష్యులందరికీ చాలా సంతోషం కలిగింది. మార్చి నెలాఖరు వరకు దెబ్బతగిలిన కాలు మీద బరువు మోపవద్దని డా॥ చటర్జీ చెప్పాడు. అందుచేత కాలుమీద ఆనుకొని కుర్చీలో యితరుల సహాయంతో బాబా కూర్చుంటున్నారు. ఇంకా కొంతకాలం వరకు ఊత కర్రలు కూడా ఉపయోగించడానికి వీలులేదు. కాలు నొప్పి పెట్టినంత వరకు కుర్చీలో కూర్చోవచ్చున్నాడు డాక్టరు. రోజు రోజూ క్రమంగా ఎక్కువసేపు బాబా కుర్చీలో కూర్చోగలుగుతున్నారు.

బాబాకి వ్రాసే ఉత్తరాలన్నీ మెహెర్ బాబా కేరాఫ్ ఆదీ కె ఇరానీ, కింగ్స్ రోడ్, అహమద్‌నగర్ అనియు, టెలిగ్రాంలు కేబిల్‌గ్రాంలు మెహెర్ బాబా, కింగ్స్‌రోడ్, అహమద్‌నగర్ అని వ్రాసి పంపాలని ప్రకటన చేయించారు బాబా. జనవరి 23, సాయంకాలం బాబా చక్రాల కుర్చీమీద కూర్చోగా మెహెరా బయట వరండాలోకి కుర్చీ త్రోసుకొని వచ్చింది. బాబా బయట ప్రకృతి దృశ్యాలు చూసి తమ సృష్టి వైచిత్ర్యాన్ని తిలకించి ఆనందిస్తున్నారు. అప్పుడు స్కూలుకువెళ్ళే ఆడపిల్లలు

గేటులోనుంచి బాబాను చూసి నమస్కారం చేయగా బాబా చిరునవ్వుతో స్వీకరించారు. వారిని చెయ్యెత్తి దీవించారు. ఎండ తగులకుండా బాబాకి గొడుగు పట్టారు స్త్రీ మండలి. ఆ క్రితం రోజు ప్రాతఃకాలాన బాబా అలా వసారాలో కూర్చుంటే కుర్చీలో పెద్ద గాలి వచ్చి కాగితాలన్నిటినీ ఎగుర గొట్టేసింది. గాలిదేవుడు వచ్చి బాబా పాదాలు తాకుదామని ఆదుర్దాపడ్డాడా, అన్నట్లు అవతారునికి జోహారు చేసాడు.

ఉదయాన్నే బాబా కాలుతోమడానికి నాయర్ వస్తూనే ఉన్నాడు. వాడి పని చేసుకొని వెళ్ళేటప్పుడు బాబాకి ప్రణామం చేస్తాడు. బాబా అతని వీపు మీద నెమ్మదిగా తట్టుతారు. ఒక్కొక్కరికి అవతారపురుషుని సేవ చేయడానికి వాని సుకృతాన్ని బట్టి బాబా అవకాశం యిస్తూంటారు.

ఇంక సతారా మళ్ళీ వెళ్ళడం పెట్టుకోలేదు గనుక 27వ తేదీన రానో, నజా అక్కడి సామాను సర్దుకొని తీసుకువద్దామని సతారా వెళ్ళారు. ఫిబ్రవరి 12వ తేదీన పూనానుంచి మెహెరాబాద్‌కి బాబాను తీసుకువెళ్ళారు. పూనాలో ఉన్నన్నాళ్ళు జస్సావాలా కుటుంబం వారు బాబాకు ఏమికావాలో అన్నీ జాగ్రత్తగా కనుక్కొని యిస్తూండేవారు. పెండు ఆరోగ్యం కొంచెం నయంగా ఉంది గనుక పూనా వస్తున్నాడు; వచ్చి సతారా వెళ్ళాడు అతనికి చికిత్స చేయడంలో సతారాలో డా॥ అబిడీ చాలా శ్రద్ధ తీసుకున్నాడు. ఆ డాక్టరుకి బాబా యెడల గౌరవం మెండు.

ఫిబ్రవరి 15వ తేదీన ప్రియతమ బాబా 700 మంది బీదవారికి పాదస్పర్శ చేసి ప్రసాదం పంచిపెడతారు. తరువాత గోదావరిమాయి ఆహ్వానాన్ని పురస్కరించుకొని బాబా సాకోరి వెళ్ళారు. తరువాత అనేకమంది వారి దర్శనం కోసం ఉవ్విళ్ళూరుతున్నారని పూనా వెళ్ళారు. పూనాలో సంత్ వాస్వానీ అనే సాధుపురుషుడు సెయింట్ మీరా విద్యానిలయమును స్థాపించి మత ఆధ్యాత్మిక విద్యారంగాలలో అఖండ సేవ చేస్తున్నాడు. బాబా తాము నడవగలిగిన వెంటనే పూనా వచ్చి అతనికి ఆలింగన భాగ్యమిస్తానని వాగ్దానం చేసి యుండుటచే ముఖ్యంగా బాబా పూనా వెళ్తున్నారు. బాబాకి మోటారు ప్రమాదంలో దెబ్బతగిలిందని వినగానే ఆయనకు త్వరగా ఆరోగ్యం కలిగేందుకు వాస్వాని తన శిష్యులందరిచేత అవిచ్ఛిన్న భగవన్నామ జపం చేయించాడు.

జనవరి 23 వ తేదీన బాబా ఆయన సోదరి మణి పాశ్చాత్యులకి వ్రాసిన లేఖ మూలంగా యీ క్రింది సందేశాన్ని పంపించారు.—

"బాబా కుటుంబంలోని ప్రియమైన ప్రతియొక్కరికి ఆయన ప్రేమ. మీరు విచారించకండి. నా ప్రేమలో సుఖంగా ఉండండి. నా ప్రేమను నిరంతరము మీతో ఉంచుకోండి. మీ ప్రేమ నన్ను సుఖపెడుతుంది. ఈ సంవత్సరం నవంబరులో ఇండియా రావడానికి ప్రయత్నించండి. బాబా"

ఆ సాయంకాలం బాబాకు కొంచెం బాధ ఎక్కువయింది. అప్పుడు ప్రియతముడు—"నాకు కలిగిన ప్రమాదము యీ విశ్వానికి ఒక ఆశీస్సు. అది బాబాకి ఒక శాపమయింది." మరునాడు ఉదయానికి బాధ అంతరించింది. అప్పుడు బాబా రెండు గంటలు పైగా చక్రాల కుర్చీలో కూర్చున్నారు.

ఫిబ్రవరి 9 వ తేదీన అమెరికా నుంచి నవంబరు సహవాస్‌కి వచ్చేవారి పేర్లు మేరియన్ వ్రాసి పంపిన ఉత్తరం బాబాకి అందింది.

ఈనెల 10 వ తేదీన గుజరాతీ పంచాంగం ప్రకారం బాబా పుట్టినరోజు అయింది. అయినా ఫిబ్రవరి 25 నాడే ఆయన జన్మదినోత్సవం జరపడానికి అనుమతి యిచ్చారు బాబా. అలాగే నిశ్చయం చేసారు. ఆ ప్రకారమే ఎక్కువ ఆడంబరం లేకుండా జరపాలన్నారు.

ఫిబ్రవరి 12 వ తేదీన మెహెరాజాద్ ప్రయాణం పెట్టుకున్నారు గనుక కారులో ఎక్కి అలా షికారు వెళ్ళి వస్తూండమని అది అలవాటు చేసుకోవాలని డాక్టర్లు చెప్పారు. ఆ ప్రకారం బాబా కారులో షికారు వెళ్ళి వస్తున్నారు. చక్రాల కుర్చీ కారు వరకు తీసుకువెళ్తే మంచి కాలు మీద ఆనుకొని కుర్చీలోకి మెల్లగా జారి కూర్చుంటారు. కాలు తోమే నాయర్ ఒక రోజున బాబాతో "బాబా! మీకు ఏ బాధ లేకుండా హాయిగా ఉండే రోజు కోసం నేను ఎదురుచూస్తున్నాను" అన్నాడు. అప్పుడు బాబా "ఆ రోజున నిన్ను నేను కౌగిలించుకుంటాను." అన్నారు. అందుకు నాయర్ — "అయితే ఆరోజు త్వరలోనే వస్తుందని ఆశిస్తాను" అన్నాడు.

ఈ వారంలో కర్నల్‌చటర్జీ రమ్మంటే అతని స్నేహితుడు రేడియాలజిస్టు అయిన "మేజర్" డాక్టరు (అంకుల్‌సౌరి) వచ్చి బాబాను చూసాడు. చూసి మార్చి మొదటివారంలో దెబ్బతగిలిన కాలు మీద ఆనుకోవచ్చునని చెప్పాడు. వీరంతా డా॥ డాన్ స్నేహితులే.

ఈ నెల 3వ తేదీన పెండూ పూనాలో మిలిటరీ హాస్పిటల్‌లో పరీక్ష చేయించుకోవడానికి అంబులెన్సు కారులో వచ్చాడు. ఆస్పత్రిలో పరీక్ష చేయించుకుని సిల్వర్

ఒక్సలో బాబాను మండలిని చూడడానికి వచ్చి అతని ప్రాణస్నేహితులను చూసేసరికి అతనికి దుఃఖం వచ్చేసింది. అతనిని చూసేందుకు బాబా చక్రాల కుర్చీమీద వసారాలోకి వచ్చారు. బాబా పెండుతో ఎంతో ప్రేమతో మాట్లాడారు; పరిహాసాలాడారు కూడా. ఈ విధంగా బాబా అనునయ వాక్యాలతో అతనికి ఎంతో బలాన్ని కలుగజేసారు. పెండు అహమద్‌నగర్ వెళ్ళాడు. అక్కడ బాబా ప్రేమికులయిన సత్తా కుటుంబంతో అతడు ఉంటాడు.

ఫిబ్రవరిలో ఒకనాటి ఉదయం బాబాకి స్కాట్‌లాండ్ నుంచి ఒక ప్రేమికుడు ఉత్తరం వ్రాసాడు. అందులో— "రాజాధిరాజా! తమ గౌరవ వైభవోన్నతులకు నా జోహారు" అని బాబాను సంబోధించి తన గౌరవాన్ని తెలుపుకున్నాడు. ఎరచ్ పూనాలో వాళ్ళయింట్లోనే ఉన్నాడు ప్రతిరోజూ బాబా వద్దకు వచ్చి కొన్ని గంటలు కూర్చుంటున్నాడు. మిగిలిన మండలి వారంతా సతారాలోనే ఉన్నారు. పింపలగామ్ వెళ్ళడానికి సామాను సర్దుకుంటూ ప్రయాణ సన్నాహం చేస్తున్నారు.

ఫిబ్రవరి 12 వ తేదీన దేరాడూన్ నుంచి ఆదీ కె. ఇరానీ (బాబా కార్యదర్శి)కి ఒక ఉత్తరం వచ్చింది. అందులో ఆ వ్రాసిన బాబా ప్రేమికుడు బాబా నామం ఉచ్చరిస్తూ తన మూడేళ్ళ కుమార్తె మిథిలేశ్ బాబాలో కలిసిపోయిందని ఆమె యెప్పుడూ బాబానే స్మరిస్తూ ఆయన్నే పూజిస్తూ ఉండేదని బాబాతో చెప్పి విలపించగా బాబా ఆ చనిపోయిన పిల్లను గురించి "మిథిలేశ్ అదృష్టవంతురాలు. నా పేరు ఉచ్చరిస్తూ మరణించిన వారంతా అటువంటి అదృష్టవంతులే." అన్నారు.

12 వ తేదీ ఉదయం ముందుగా ఏర్పాట్లు చేసుకున్న ప్రకారం బాబా మెహెర్‌జీ కారులో కూర్చుని పూనానుంచి మెహెరాబాద్ కి వెళ్ళారు. ఆ కారులో బాబాతో యింకా మెహెర్‌జీ, డా॥ డాన్కిన్ కూడా ఉన్నారు. స్త్రీ మండలి వారు ఆదీకారులో అనుసరించారు. కారు ప్రయాణంలో రోడ్డు బాగా లేకపోయినా బాబా తట్టుకోగలిగారు. ప్రయాణం మూడు గంటలు పట్టింది. ఆఖరికి మాత్రం బాబాకి కొంచెం అలసట కలిగింది. బాబా పూనాలో ఉన్నంతకాలము కాకా మెహెరాబాద్ తోట జాగ్రత్తగా చూసుకున్నాడు. అతనికి భూతి సాయం ఉంది. భూతిని బాబా హిమాలయాల నుంచి చిన్నపిల్లగా తీసుకువచ్చి పెంచారు. అదే యిప్పుడు మెహెరాబాద్‌కి కావలి. భూతి ఒక ఆడకుక్క.

ఫిబ్రవరి 14 వ తేదీ అర్ధరాత్రి మొదలు 15 వ తేదీ అర్ధరాత్రి వరకు బాబా ప్రేమికులందరినీ ఉపవాసం ఉండమన్నారు. ప్రతీ బాబా సెంటరులోను 15 వ తేదీ

బీదలకు అన్నదానం చేయాలని ఆదేశించారు. ఆనాటితో ముఖ్యమయిన వారి ఏకాంత వాసం ముగిసిందని యీ విధంగా చేయించారు బాబా. ఆ రోజున రెండు వేల రూపాయిలతో బీదవారికి బట్టలు, మిఠాయిలు, నగదు పంచిపెట్టారు.

15 తేదీ ఉదయం 800 మంది బీదవారికి బాబా వారి పాదాలకి నమస్కరించి ప్రసాదం యిచ్చారు.

1957 జనవరి 15 వ తేదీ నుంచి ఫిబ్రవరి 15 వ తేదీన జరిపించే బీదవారి కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేయమని బాబా పాద్రీకి, కాకాబారియాకి, ఛగన్ మాస్టరుకి, ఆదీ (సీ) కి మెహెరాజాద్‌కి బాబా కబురు చేసారు. దగ్గర గ్రామాలయిన పింపలగామ్, మాల్షి, వడగామ్, డోంగర్‌గామ్, మంజర్‌సుంభా, జేవూరు గ్రామాల నుంచి బీదవారిని రప్పించారు. షెండి, పుఖుర్ది గ్రామాల నుంచి కూడా వచ్చారు. ఆయా వూళ్ళ మునసబు కరణాలు కూడా కల్పించుకుని కార్యక్రమం చాలా క్రమశిక్షణతో జరిగేలా చూసారు. ఆ బీదవారికి ఒక్కొక్కరికి కుట్టించుకునేందుకు సరిపోయిన గుడ్డలు లడ్డు చుట్టి వారికి యిచ్చారు. ఈ కార్యక్రమానికి కాకా గది ఎన్నుకున్నారు బాబా. దానికి రెండు వైపుల ద్వారాలుండబట్టి వెనుక వైపునుంచి వచ్చి ఎదరివైపు ద్వారం నుంచి బాబా ప్రసాదం తీసుకొని బయటకు వెళ్ళేవారు.

మండలి యీ కార్యక్రమం చక్కగా ఏర్పాటు చేసారు. బాబా చక్రాల కుర్చీలో కాకా గదిలో కూర్చున్నారు. బీదవారు ఒక్కొక్కరుగా బాబా వద్దకు వచ్చి వారి ఆశీస్సులు పొందారు. ఇదివరకులాగ బాబా వారందరికి వంగి నమస్కారం చేయలేకపోయారు. వారి పాదాలు చేతితో స్పృశించి ఆ చేతిని వారి నుదుటికి తాకి యీ విధంగా వారికి ప్రణామం చేసారు. అనుకున్న 700 మంది కన్నా అనేక గ్రామాలనుంచి ఒక వందమంది ఎక్కువ వచ్చారు. అలా వచ్చినవారిలో 'బారాకోట్' అనే మస్తు కూడా ఉన్నాడు. అతడు వచ్చినందుకు బాబా చాలా సంతోషించారు. మగవారికంటె ఆడవారు ఎక్కువగా చంటిపిల్లల నెత్తుకుని వచ్చారు. అందరూ బాబా వద్ద ప్రసాదాలందుకున్నారు. ఈ కార్యక్రమం అంతా రెండుగంటలలో అయిపోయింది. ఫిబ్రవరి 20వ తేదీనాటికి బాబాకి ముఖం మీద తగిలిన దెబ్బలు పూర్తిగా నయిమయి వాటికి వేసిన పట్టీలు తీసారు. గడ్డం క్రింద పగిలిన మచ్చ మాత్రం మిగిలింది. ముఖం మీద మచ్చలు కూడా లేకుండా పోయాయి. కానీ కాలునొప్పి యింకా ఉంటూనే ఉంది.

బాబా ఏకాంతవాసం అంతమయిపోయిందని అనేకమంది ప్రాశ్చాత్య ప్రేమికులు బాబాకి శుభాకాంక్షలు పంపించారు. అందరికి జవాబుగా బాబా ప్రేమను పంపించారు. బాబాకి మరల ఎక్స్‌రే ఫొటోలు తీయించారు. అవిచూసి తృప్తి పొంది మార్చి 4 వ తేదీ ఉదయం డా॥ డాన్‌కిన్ పర్యవేక్షణ క్రింద బాబా కాలు క్రింద మోపి పసి పిల్లవాని వలె అడుగులు వేయుట ప్రారంభించారు. ఆ మర్నాడు మరి నాలుగు అడుగులు ఎక్కువ వేసారు. బాధపెడుతున్నప్పటికీ ఓర్చుకున్నారు. మూడు రోజులలో చాలా అభివృద్ధి కనబడింది. అయినప్పటికీ మార్చి నెలాఖరు వరకు కాలుమీద పూర్తిగా బరువు మోపరాదని డాక్టర్లు చెప్తూనే ఉన్నారు.

బాబా యీ విధంగా నిస్సహాయస్థితిలో ఉన్నప్పటకీ సాకోరీలో 18 వ తేదీన, పూనాలో 23వ తేదీన దర్శన కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నారు. ఒక రోజున బాబా —"నేను యీ రూపానికి పరిమితుడనై యుండలేదు. మీకు కనిపించడం కోసం ఒక చొక్కాలాగ యీ శరీరాన్ని ధరించి వచ్చాను. మీకు అర్థం అయే భాషలో నేను మాట్లాడుతున్నాను. (సైగల ద్వారా) నా చైతన్యపు భాషలో గనుక నేను చెప్తాంటే మీకు ఒక్క ముక్కయినా అర్థం కాదు. నన్ను అర్థం చేసుకోవాలని మీరు ప్రయత్నించకండి. నా లోతు అగాధమయినది. మీరు నన్ను ప్రేమించండి అంతే. నేను నిరంతరము క్రీస్తు చైతన్యస్థితిని అనుభవిస్తున్నాను. నేను నోరు విప్పి మాట్లాడినపుడు నానిజమైన ఆత్మను ప్రకటీకరణం చేస్తాను. మొత్తం ప్రపంచాన్ని ఆధ్యాత్మికంగా ముందుకు త్రోయడమే గాక నావద్దకు వచ్చిన వారికి వెలుగువైపుకి, సత్యము వైపుకి, తీసుకొని వెళ్తాను." అని చెప్పారు.

క్రిందటి నెలలో పూనాలో ఉన్నప్పుడు బాబా ఒక రోజున మెహెరాను మణిని పిలిచి హజ్రత్ బాబా జాన్ వేపచెట్టు క్రింద కూర్చుని యుండే చోట ఉన్న ఆమె సమాధిని దర్శించి దానిని పుష్పాలతోకప్పి రమ్మన్నారు. "అసమానమైనది నిరుపమానమైనది అయిన బాబా జాన్ నన్ను కలుసుకోవడం కోసం బెలూచిస్థాన్ నుంచి యింత దూరము వచ్చి పూనాలో స్థిరంగా ఉండిపోయింది" అని బాబా అన్నారు.

మెహెరా, మణి, హజ్రత్ బాబాజాన్ సమాధికి వెళ్ళి దానిని పుష్పాలతోకప్పి అక్కడ నుంచి ఎరచ్ యింటికి వెళ్ళి జెస్సావాలాలను చూసి మాట్లాడి వచ్చారు. ఎరచ్ మేనత్త కొన్ని సంవత్సరాల క్రిందట బాబాజాన్ వద్దకు వెళ్ళిన సంగతి వారితో చెప్పింది. అప్పుడు ఎక్కడినుంచి వచ్చావు? అని బాబాజాన్ ఆమెను అడిగింది. మెహెర్‌బాబా వద్దనుంచి అని జవాబు చెప్పగా "నా ప్రియతమ మెహెర్ వద్ద నుంచా ? నా బిడ్డను ఒకానొక రోజున సర్వప్రపంచము 'మెహెర్! మెహెర్! అనీ

ఎలుగెత్తి పిలుస్తుంది. వృక్షములన్నీ మెహెర్ ! అని అరుస్తాయి. పక్షులన్నీ 'మెహెర్ !' అని పాడతాయి,'' అని బాబాజాన్ చెప్పింది.

ఫిబ్రవరి 25 వ తేదీన ఇండియాలోను పాకిస్తాన్‌లోను బాబా జన్మదినోత్సవం విస్తృతంగా జరుపుకున్నారు. మామూలు కంటె యింకా నిరాడంబరంగా జరిపారు. ఆరోజున తెల్లవారుఝామున అయిదు గంటలకి సరిగా భగవంతునిపేరు ఏడుమారులు ఉచ్చరించమని మండలితో చెప్పారు. మండలివారు పెందలకడనే లేచి గదులన్నీ పుష్పతోరణాలతో అలంకరించారు. మెహెరాబాద్‌లో నేలమీద పంచరంగుల రంగ వల్లులు తీర్చి దిద్దారు.

ఆ సమయమున ప్రియతమ బాబా లేత నీలిరంగు చొక్కా తొడుగుకొని మంచంమీద కూర్చున్నారు. ఆయన మెడలో సుందరమయిన సుమాల మాల అలంక రించబడి ఉంది. ప్రపంచం నలుమూలల నుంచి బాబాకు అనేకమయిన ఉత్తరాలు టెలిగ్రాంలు శుభాకాంక్షలు తెలుపుతూ వచ్చాయి. అవన్నీ ఆయన ప్రక్కన ఒక బల్లమీద పుట్టినరోజు పండుగకు తయారుచేసిన రొట్టె, కొవ్వొత్తులతో బాటు ఉంచబడి ఉన్నాయి. సరిగ్గా అయిదు గంటలకు బాబా వద్దకు వచ్చి మండలి ఏడుమారులు భగవన్నామం ఉచ్చరించి జన్మదిన శుభాకాంక్షలు గానం చేసారు. బాబాకు ప్రాక్ ప్రతీచీవాసుల శుభాకాంక్షలను మెహెరా తెలియజేసింది.

బాబా యిప్పుడు చంక క్రింద పెట్టుకునే రెండు కర్రల (క్రచ్చెస్) సహాయంతో నడవగలుగుతున్నారు. రెండు అడుగులు వేసి ఒక మారు ఆగుతున్నారు, బాధ కలుగుతోంది గనుక. చక్రాల కుర్చీ ఎక్కువగా ఉపయోగించుట లేదు. ఈ కర్రలు డా॥ డాన్‌కిన్ 1952వ సంవత్సరంలో జెనేవా నుండి తెచ్చాడు. ఆ కర్రల సహాయంతో బాబా మెట్లు దిగడం ఎక్కడం కూడా చేస్తున్నారు. కర్కాల్ చటర్జీ చేత పరీక్ష చేయించుకోడానికి బాబా మండలితో పూనా యీ మార్చినెలలో వెళ్ళారు. బాబా నడక చూసి డా॥ డాన్‌కిన్ ఆశ్చర్యపోయాడు.

కోపెన్ హేగన్ నుంచి డిశెంబరు 1956 సం॥లో బాబా దర్శనార్థమై వస్తున్నా నని లెఫ్టినెంట్ కర్నల్ ఎఫ్. ఏ. గోడ్డెన్ (రిటైర్డు) అనే అతడు తెలియపర్చాడు. కానీ అనుకోకుండా ప్రయాణం వాయిదా వేయవలసి వచ్చింది, సూయజ్ కాలువ తగాదా అప్పుడు ముమ్మరంగా ఉండడం చేత. ఈ సంగతి బాబాకు వ్రాయగా 1957 మార్చి నెలలో రమ్మనమని అతడికి వ్రాసారు మార్చి 14 వ తేదీన

ఆ ప్రకారంగానే గోల్డ్‌నీ వచ్చి కరాచీ మీదుగా బొంబాయికి విమానంలో వచ్చాడు. అతని భార్య ఒల్లా బొంబాయి మెహెర్జీ కార్యాలయానికి కేబిల్ యిచ్చినందువలన మెహెర్జీ విమానాశ్రయంలో గోల్డ్‌నీ కి స్వాగతం యిచ్చి తీసికొని వచ్చి పూనాలో తన యింటిలో ఆతిథ్యమిచ్చి మరునాడు మధ్యాహ్నం 2-30 గంటలకు అతనిని మెహెరాబాద్‌కు తీసుకువెళ్ళాడు. ఆరోజున హోలీ పండుగ ఆ పండుగనాడే అంటే మార్చి 16 వ తేదీన బాబా గోల్డ్‌నీకు దర్శనం యిచ్చారు. గోల్డ్‌నీ మెహెరాబాద్‌లో బాబా మండలి జీవించే నిరాడంబర విధానం— రాతినేలమీద పడక, వరి అన్నం, పప్పు భోజనం వగైరా చూసి ఆశ్చర్యపోయాడు. అతనికి మాత్రం బాబా మంచి వసతి, భోజనం కల్పించారు.

18 వ తేదీన బాబా సాకోరీకి బయలుదేరారు. వారితో అనేకమంది మండలి వారు కూడా వెళ్ళారు. మొదటి కారులో డ్రైవరు ప్రక్కన బాబా కూర్చున్నారు. గుస్తాద్‌జీయును, కిషన్‌సింగ్, గోల్డ్‌నీ, కేశవనారాయణ నిగమ్ వెనుక కూర్చున్నారు. కిషన్‌సింగ్ ఆర్మీ ఎకౌంట్స్ డిపార్టుమెంటులో పనిచేసి ముందుగానే బాబా సేవకోసం పదవీ విరమణ చేసాడు. అతనికి కారు ఉంది. అందులో బాబాను కూర్చోపెట్టుకుని తీసుకు వెళ్ళాలని అతని ఆశ. కిషన్‌సింగ్ దేహ్రాడూన్‌లో ఉంటాడు. బాబా దేహ్రాడూన్ వెళ్ళినపుడు ఆయన వేరే కారులో వెళ్ళినా కిషన్‌సింగ్ ప్రార్థన కాదనలేక అతని కారులో ఎక్కారు. కిషన్‌సింగ్ కారు నడపడం చూసేవాళ్ళకి కూడా భయంగానే ఉంటుంది. అందుచేత ఎప్పుడు అవసరమయితే అప్పుడు నడపడానికి ఒక డ్రైవరు కారు ప్రక్కనే పరుగెత్తుతూ వెళ్ళాడు. అది చూసే వాళ్ళకి ఆశ్చర్యంగానే ఉంది. అలా ఉంటుంది కిషన్‌సింగ్ కారు నడపడం. గుస్తాద్‌జీ 30 ఏళ్ళనుంచి మౌనంగా ఉంటున్నాడు. అతడు శాంతంగాను, ఆనందంగాను ఉంటాడు. అతనికి పళ్ళు ఏవీ లేకపోయినా ముసలివాడుగా కనబడడు. ముఖం గుండ్రంగా ఉండి యువకుడిలాగే ఉంటాడు. అలాగే పళ్ళులేకుండానే ఏదయినా తినేయగలడు. అలా అలవాటు చేసుకున్నాడు. గోల్డ్‌నీ కారులో ఒకసారు గుస్తాద్‌జీ కూర్చున్నాడు. గోల్డ్‌నీకి దారి తెలియక గుస్తాద్‌జీని నాకు మార్గం చూపుతావా ? అని అడిగాడు. నేను భగవత్సాక్షాత్కారం పొందాక మార్గం చూపుతాను అన్నాడు.

సాకోరీకి రెండు గంటల ప్రయాణం. 8-30 గంటలకు ఆశ్రమానికి వచ్చారు. బాబా అక్కడికి చేరేసరికి బ్యాండుమేళం తెల్లటి గుర్రం బాబా గౌరవం కోసం అన్నీ తయారుగా ఉంచారు. 'అవతార్ మెహెర్ బాబా కి జై' అనే జయధ్వానాలు

చెలరేగాయి. బ్యాండు వాళ్ళు చాలా బాగా వాయించడం ప్రారంభించారు. అప్పటి కిప్పుడే కొన్ని వందలమంది బాబా కారువద్ద మూగారు. బాబా గారి కారు ఊరే గింపుతో ఆశ్రమంలో ప్రవేశించింది. స్వచ్ఛంద సేవకులు ఎకాపెకా వెండికర్రలతో బరాబరులు చేసి నడుస్తున్నారు. ఆశ్రమం లోపల పెద్ద మర్రిచెట్టు ఎదురుగా కనిపిస్తోంది. ఉపాసనీ మహరాజ్ దానిక్రింద కూర్చునే వాడు. దాని కెదురుగా వెదురు బొంగులతో ఒక పెద్ద పందిరి వేయబడి ఉంది. ఆశ్రమ పురోహితుడు ముందు బాబకు పూజ చేసాడు. ఆశ్రమ ప్రవేశ ద్వారం వద్ద గోదావరి మాయి ఆమె శిష్యు రాండ్రగు కన్యలు బాబాకి స్వాగతం చెప్తూ పాదపూజ చేసారు. బాబా దర్శనం చేసు కుని గోదావరి మాయి బాబాను పుష్పమాలతో అలంకరించింది. వేదిక మీద ఒక మెత్త ఉన్న కుర్చీలో బాబా కూర్చున్నారు. 'అవతార్ మెహెర్ బాబాకి జై' అని జయ ధ్వానాలు మిన్నుముట్టాయి. ప్రజలు ఎక్కువగా వచ్చి పందిట్లోనిండిపోయారు. బాబా ప్రసాదం పంచిపెట్టడం ప్రారంభించారు. సంగీతము కూడా మొదలయింది. వాయి ద్యాలు మ్రోగిస్తున్నారు. తరువాత గోస్తసే పందిట్లో క్రింద కూర్చోవడానికి కష్టపడు తున్న సంగతి బాబా గమనించి అతడికి ఒక కుర్చీ వేయించారు. దానిలో అతడు సుఖంగా కార్యక్రమం అయేవరకు కూర్చున్నాడు.

దర్శన కార్యక్రమాల్లో బాబా శిష్యులను ఆయన వేపే చూస్తూ ఉండవలసిందని బాబా ఆదేశిస్తారు. బాబాకి చాలా దూరంగా యిద్దరు ప్రేమికులు ఏదో మాట్లాడుతూ ''పోరా ! బాబా చాలా మూరంలో ఉన్నారులే. ఆయన దర్శనార్థులతో ఎంతో కోలాహ లంగా ఉన్నారు. మనని ఎక్కడ చూస్తారు'' అన్నాడు. ఆ ఉత్తర క్షణంలోనే బాబా వారి వైపు చూసి చూపుడు వేలుతో ''జాగ్రత్త !'' అన్నట్లు ''నాకు తెలియదనుకు న్నావా నీవేమంటున్నావో'' అన్నట్లుగా వారి వైపు చూసి వేలు ఆడించారు.

పరమేశ్వరీ దయాళ్ నిగమ్ (పుకార్) అనే బాబా శిష్యుడు యీ మధ్య బాబా అనుమతితో భారత దేశం అంతా తిరిగి అనేకమందిని బాబా ప్రేమికులుగా నొనర్చి వచ్చాడు. బాబా రెండుమార్లు ''నీ పర్యటనలో నీతోనే ఉన్నాను. నేను'' అని చెప్పారు. అతడు వచ్చాక నీ సంచార విశేషాలు చెప్పు పుకార్! అని అనగానే ఒకచోట తనకు ఒక హిందూ దేవాలయంలో అవమానం చేసి వెడలగొట్టారని చెప్పాడు. బాబా అంతా విన్నారు. విని పుకార్‌తో—

''ఆ సమయంలో సమీపంలో ఏవయినా క్రూర జంతువులున్నాయా? పెద్దపులి గాని పాముగాని?'' అని అడిగారు. పుకార్ వెంటనే జ్ఞాపకం చేసుకొని

"అవును బాబా! అదే సమయంలోనే ఒక పాము నా సమీపానికి వచ్చింది. చెప్పడం మరిచాను" అన్నాడు.

దర్శనార్థులు వరుసలో బాబా వద్దకు వస్తున్నారు. గత డిశెంబరు మోటారు ప్రమాదంలో కాలికి దెబ్బ తగిలినందున బాబాకి యింకా బాధగా ఉంది. కాలికి కట్టు ఉంది. బాబా భక్తులందరికి అంత బాధ భరిస్తూనే ప్రసాదం పంచి పెడుతున్నారు. కొందరు భక్తులు యీ ప్రసాదం కోసం (బాబా దర్శనం కోసం) 900 మైళ్ళ దూరంనుంచి కూడా వచ్చారు. బాబా సన్నిధిలో ఆయన నుంచి బయల్వెడలే ప్రేమ, ఆనందతరంగాల ప్రభావం వలన కొందరు ప్రేమికులు సిగ్గు వదిలి కళ్ళవెంబడి అశ్రువులు కారుస్తున్నారు. చూసే వారికి కూడా బాష్పధారలు కురుస్తున్నాయి. బాబా మండలిలోని వారు బాబా ముఖమున పట్టిన చెమటను మెత్తని బట్టతో తుడుస్తున్నారు నైపుణ్యంగా మరియొకడు ఆయనకు నొప్పి లేకుండా కాళ్ళు పడుతున్నాడు రెండు వైపులా సహాయం ఉంటే గాని బాబా లేచి నిలబడలేరు. బాబా యిట్లు చెప్పారు—

"సాకోరీకి రాగలిగినందుకు నేను సంతోషిస్తున్నాను. నా గురువు ఉపాసనీ మహరాజ్ సంపూర్ణత్వం మూర్తీభవించిన సద్గురువు. నా "తల్లి" తో (గోదావరి మాయి) నేను ఉన్నందువలన నేను మిక్కిలి ఆనందిస్తున్నాను. నేను కృష్ణుడనుగాన ఆమెను "యశోద" అని అంటాను. హృదయ పారిశుద్ధ్యంలో ఆమెకు ఎవరూ సాటి లేరు. ఆమెకు ఆశాభంగం కలుగకుండా ఉండడానికి యీ ప్రయాణం రద్దు చేసుకోకుండా వచ్చాను." ఆరతి యిచ్చిన తరువాత బాబా రెండు సందేశాలను యిచ్చారు—

(1) "మీరు చూసేదంతా వట్టి మాయే గానీ మరేమీ కాదు. ఇక్కడ బాబా కూర్చుండగా మీరు చూడడం మీకు దర్శనమిస్తూ ఉండడం – అంతా మాయే. అందులో యింక రాజీ లేదు. ఎవరయితే బాబా కోసం తన సర్వస్వాన్నీ పోగొట్టుకుంటాడో, అగాధమయిన సత్య సముద్రానికి లోతులను అతడు అందుకోగలుగుతాడు.

తరువాత బాబా రెండవ సందేశం యిలా యిచ్చారు.

(2) ఈ మధ్యన జరిగిన మోటారు ప్రమాదంలో నేను, నా ప్రియమయిన శిష్యులు కొందరు తీవ్రమయిన గాయాలకు గురి అయ్యాము. నా చట్టకి తగిలిన దెబ్బవలన నేను పడకమీద చాలా రోజులు పరుండి ఉండవలసి వచ్చింది. కానీ మీ అందరి ప్రేమవలన నాకు కలిగిన నెమ్మది ఆ కొద్ది కాలంలోను మామూలుగా పొంద

పీలులేనిది. ఇంక 15 రోజులలో నేను ఎవరి సహాయమూ లేకుండా బాగా నడవగలనని అనుకుంటున్నాను.''

ఈ రెండు సందేశాలకి శ్రీ టి. యస్. కుటుంబశాస్త్రి చక్కగా తెలుగులో తర్జుమా చేసి చెప్పాడు. బాబా వచ్చే ముందే ఆంధ్ర రాష్ట్రం నుంచి ఒక డాక్టరు (ధనపతిరావు) 72 మంది ప్రేమికులతో వచ్చి క్రొత్త వారిని పరిచయం చేసాడు. వారి ప్రేమ నిరంతరము బాబాకు ప్రవహిస్తూనే ఉంది.

బాబాకు అనేకమంది మిఠాయిలు, పళ్ళు కానుకలుగా యిచ్చారు. వెండి బంగారు జల్తారులతో పనితనము కలిగిన హారాలు బాబా మెడలో వేసారు. విశ్రాంతి సమయంలో హృదయాన్ని కదిలించే చక్కని పాటలు పాడారు. ఒక ప్రేమికుడు ఆంధ్ర దేశపు జానపద నృత్యం ప్రదర్శించాడు.

మధ్యాహ్నం భోజనానికి బాబాను గోదావరిమాయి ఆహ్వానించింది. కొందరు చాలా బాధపడిన వారికి సహాయం చేయడానికి మరి కొందరు స్వంత సమస్యలున్న వారికి సహాయం చేయడానికి ఆమె బాబాను ఆహ్వానించింది.

ఆశ్రమంలో ఒక పలక మీద, వచ్చిన సమయము వెళ్ళే సమయము వేయబడి యుండెను. వెళ్ళే సమయము 3 గంటలు అని వ్రాయబడెను. కొంచెంసేపు విశ్రాంతి తీసుకున్న తరువాత బాబా మరల పందిట్లోకి వెళ్ళి కూర్చున్నారు, మిగిలిన వారికి దర్శనం యివ్వడం కోసం. బాబా వారి శిష్యులను – క్రొత్తగా వచ్చినవారిని – ఆశ్రమం చూపించి తీసికొని రమ్మని అక్కడివారికి ఆనతిచ్చి వారితో పంపించారు. గోల్డ్‌నే వగైరాలు యీ అవకాశం తీసుకొని వెళ్ళి అన్నీ చూసి వచ్చారు. ఉపాసనీ మహరాజ్ దేహ త్యాగానంతరం అక్కడ భక్తులు నిర్మాణం చేసిన భవనాలు, మందిరాలు, అందలి అందమయిన శిల్పాలు అన్నీ చూసి వచ్చారు. ద్వారం వద్ద ఉన్న ఆంజనేయస్వామి ఆలయము కూడా చూసారు. అయిదుగురు సద్గురువులతోను మధ్యలో బాబా ఉన్న చిత్రం చాలా సుందరంగా ఉంది. తరువాత ముఖ్య మతాలన్నిటికి సాంకేతికములయిన, ఆలయము, మసీదు, జ్వాలతో ఉన్న కాగడా, శిలువ యివి కూడా చూసారు.

ఇంతసేపు బాబా దర్శనం జరుగుతూనే ఉంది. దయామయుడయిన ప్రభువు వారు బయలుదేరి వెళ్ళవలసిన సమయము యింకో గంట (3 గంటలనుంచి 4 గంటలకు) ఎక్కువచేసి మార్పించారు.

నాలుగు గంటలవుతూంటే బాబాను షెవర్‌లెట్ కారులోకి ఎక్కించారు. ఎదుట జాల్‌భాయి, అతని ప్రక్కన గోల్డ్‌నే అవసరంగా బొంబాయి వెళ్ళాలి గనుక అతడు బాబా కారులోనే కూర్చున్నాడు బాబా అందుకు దయతో అంగీకరించారు. నాలుగు కొడుతూంటే కారు బయలుదేరింది. అనేక వందలమంది జై జై అని అరిచారు. అంత శరీరబాధ పడుతూన్నా యిన్ని వందలమందికి దర్శనం యిచ్చి ఓర్పుతో ముఖంలో చిరునవ్వుకు అందరి యెడల ప్రసరిస్తున్న బాబా దేవుడేకాదు. ఇంకా ఎవరూ అర్థం చేసుకోలేని ఒక దివ్య రహస్యం.

కారులో వెళ్తూ కోపెన్‌హాగన్ నుంచి అనేకవేల మైళ్ళ ప్రయాణం చేసి వచ్చిన గోల్డ్‌నేతో అతడు యిదివరలో 1922 లో ఇండియాకు వచ్చిన సంగతి, క్రికెట్‌లో అతనికి బాబాకి, యిరువురకు ఉన్న అభిరుచి, ఈజిప్టులో టెన్నిస్ ఆడిన సంగతి, దక్షిణాఫ్రికాలో ప్రదర్శనపు పోటీ ఆటలు జరుగుతున్న సంగతి యిలా అనేక విషయాల గురించి బాబా మాట్లాడారు. జీసస్ "నేను నా తండ్రీ ఒకటే. నన్ను చూసేవాడు నన్ను పంపిన ఆయనను కూడా చూస్తాడు." అని చెప్పిన విషయం బాబా జ్ఞాపకం చేస్తూ "నేను ఆ పురాణ పురుషుడను" అని చెప్పారు. ఈ విధంగా మాట్లాడుతూ మెహెరాజాద్ చేరేసరికి సాయంత్రం 5-40 అయ్యింది. గోల్డ్‌నే బొంబాయి వెళ్ళడానికి బాబా అనుమతి యిచ్చారు. అతడు మెహెర్జీ సాయంతో అహమద్‌నగర్ వెళ్ళి పూనా వెళ్ళే బస్సులో ఒక్కరికే స్థలం ఉంటే అందులో ఎక్కి కూర్చున్నాడు. ఇంత శ్రమపడినా బాబా మెహెరాజాద్ వచ్చి కారు దిగేసరికి ముఖంలో తేజస్సు ఏమీ తరుగలేదు. కొద్దిరోజుల క్రితం బాబాకి బాధ చాలా ఎక్కువగా ఉంది. అయినా ప్రియమైన గోదావరి మాయికి ఆశాభంగం కలుగజేయడం యిష్టంలేక ఆమెయే బాబాని శ్రమ అయితే తరువాత రావచ్చులెండి అని చెప్పినా బాబా సాకోరీ వెళ్ళి వచ్చారు. గోల్డ్‌నే బొంబాయి వెళ్ళి వచ్చాడు. పూనాలో మార్చి 23 వ తేదీన దర్శన కార్యక్రమం ఏర్పాటయి ఉంది.

మార్చి 22 వ తేదీ సాయంకాలం రంజా మండలికీ, క్రొత్తగా వచ్చిన గోల్డ్‌నేకీ బాబా కథలు అనేకంగా చెప్పాడు. 23వ తేదీ ఉదయం బాబా ఆజ్ఞాపించినట్లు గోల్డ్‌నే యొక్క జెఫైర్ కారు 6 గంటలకే పూనాకు బయలుదేరవలసి ఉంది. ఆ ఉదయం తెల్లవారగానే డా॥ డాన్‌కిన్ కారు బయటకు తీసి అంతా శుభ్రపరిచాడు. వదులుగా ఉన్నవన్నీ బిగించాడు. దానికి కావలసిన 12 వోల్టుల బ్యాటరీ కూడా సంపాదించి బిగించాడు. మెహెర్‌జీ యొక్క డ్రైవరు కారు మిలమిల మెరిసేటట్లు

తోమేడు. ఇప్పుడు ఆ కారు బాబా యొక్క పెద్ద షెవర్లెట్ కారుతో ఉంచడానికి తగిన యోగ్యత కలిగి ఉంది. జెఫైర్ కారులో బాబా ఆదేశం ప్రకారం (1957) మార్చి 23 తేదీ ఉదయం 6 గంటలకు గోల్డ్‌నీ నడుపుతూ, అతని ప్రక్కన గుస్తాద్ జీ, వెనుక సీటులో కిషన్‌సింగ్, నిగమ్‌లు కూర్చోగా పూనాకు బయలుదేరింది. ఇంకా సూర్యోదయం కాకుండానే కారు సాగి వెళ్ళిపోయింది. గోల్డ్‌నీ విదేశాలలోని మంచి రోడ్లమీద కారు నడపడానికి అలవాటు పడ్డాడు. ఈ కారు డ్రైవింగ్ సీటు ఎడమ ప్రక్కన కూడా ఉంది. కొంతదూరం వెళ్ళాక రోడ్డుమీద వెళ్తున్న ఒక రెండెడ్ల బండిని తప్పించుదామని ప్రక్కనుంచి వెళ్తూంటే ఒక ఎద్దు వెనుక భాగం మడ్‌గార్డ్‌కి తగిలినందువలన ఆ మడ్‌గార్డు మీద రంగు గీచుకుపోయింది. వీరు పూనా చేరేసరికి పావుతక్కువ తొమ్మిది గంటలయింది. అప్పటికే చాలామంది బాబాప్రేమికులు స్టేషను బయట గుమిగూడి ఉన్నారు. అరగంట తరువాత బాబా షెవర్లెట్ కారు బయలుదేరింది. బాబాను ఊరేగించడానికి సన్నాహాలు పూర్తయాయి. ఊరేగింపు పావు తక్కువ పది గంటలకు బయల్వెడలవలసి ఉంది. పూనాలో అనేక వందల మంది బాబా భక్తులు చేరుకున్నారు.

అక్కడ సాఖరే మొదలయిన ప్రేమికులు క్రొత్తగా వచ్చిన గోల్డ్‌నీతో పరిచయం చేసుకున్నారు. బాబా పూనాకు రాగానే మండలిలోని ఒకని యింటికి వెళ్ళి వచ్చారు. ఆరోజున సాధు టి. ఎల్. వాస్వానీ స్థాపించిన సెయింట్ మీరా ఉన్నత విద్యాలయం సందర్శించి బాబా అక్కడ దర్శన కార్యక్రమం జరుపుతారు. ఆ రోజున ప్రత్యేకంగా అందుకే పూనా వచ్చారు. వాస్వానీ గొప్ప పండితుడు. ఇంగ్లీషులోను చరిత్రలోను ఆచార్యుడు. మానవసేవకోసం అన్నీ వదులుకున్న మహనీయుడు. జాతి మత కుల భేదాలు పాటించని ఒక విద్యాలయం స్థాపించాడు. బాలురకు, బాలికలకు కూడా అందులో విద్య గరపబడుతోంది. వారికి అన్ని మతాల సత్యాలు బోధింపబడు తున్నాయి. ఆయా మతాల పవిత్ర గ్రంథాలన్నీ పఠింపబడుతున్నాయి. దయ, సత్ప్రవర్తన, శీలం అందలి విద్యార్థులకు అలవడజేయబడుతున్నాయి. ఇవి ప్రాపంచిక మయిన కీర్తి, పేరు, ప్రతిష్ఠలకంటె ముఖ్యమని బోధిస్తారు. మీరా విద్యాలయం పేరుకోసం గాని, ఆర్థిక లాభం కోసంగాని నడుపబడటం లేదు. 'తూర్పు – పడమర' అనే మాసపత్రిక ఒకటి ఆంగ్లంలో ప్రచురింపబడుతూ నిర్వహింపబడుతోంది. వాస్వానీ యొక్క జీవకారుణ్యం పుష్పవృక్షం యొక్క సుగంధంలాగ అన్నివైపులకి వ్యాప్తి

చెందుతోంది. దయాస్వభావుడైన వాస్వానీకి 'సాధు' అనే బిరుదు ఎంతయినా తగి ఉంది. వాస్వానీని అందరూ 'దాదా' అని పిలుస్తారు. బాబా అతనిని "మై బిలవెడ్ చైల్డ్" (నా ప్రియతముడయిన బిడ్డ) అంటారు.

ఈ కార్యక్రమానికి ఇండియాలో అనేక నగరాల నుంచి ఎంతోమంది ప్రేమికులు అనేక వందల మైళ్ళు ప్రయాణం చేసి వచ్చారు. పూనా నుంచే అనేక వందలమంది బాబా దర్శనమవుతుందని వచ్చారు. బాబా కారు అనుకున్నప్రకారం 9-30 గంటలకు సరిగ్గా వచ్చింది. అక్కడ కూడియున్న జనసందోహాలు బాబా రాగానే "జై అవతార్ మెహెర్‌బాబా కి జై" అని జయధ్వానాలు చేసారు. ప్రజల్ని అదుపులో ఉంచడానికి మండలివారు పోలీసులులాగ తంటాలు పడుతున్నారు. బాబా కారు పుష్పమాలలతో అలంకరింపబడి అందంగా ఉంది. ముందు బ్యాండు మేళాలు వాయిద్యాలతో నడుస్తూండగా ఊరేగింపు ప్రారంభం అయింది.

బాబా కారు వెనుక యింకా కొన్ని కార్లు వెళ్తున్నాయి. వాటిల్లో గోల్డ్‌నీ యొక్క జెఫైర్ కూడా ఉంది. అనతిదూరంలోనే ఉన్న సెయింట్ మీరా హైస్కూలు చేరింది ఊరేగింపు మొదట వాస్వానీ బాబాకు స్వాగతం యిచ్చాడు తరువాత బాబాతో ఒక గదిలో వాస్వానీ కొంతసేపు మాట్లాడుతూ కూర్చున్నాడు వాస్వానీ బాబా వచ్చారని సంతోషం కొద్దీ ఉద్వేగంతో ఊగిపోయాడు. బాబా యొక్క ప్రేమామృత సేచనం అతనికి ఉపశమనం కలిగించింది. తరువాత బాబాను ఒక కుర్చీమీద కూర్చోబెట్టి మండలివారు ఆ కుర్చీ యెత్తుకొని పెద్దహాలులోనికి తీసుకువెళ్ళారు. బాబా వేదిక మీద ఒక మెత్తని కుర్చీమీద ఆసీనులయారు. బాబాకు కుడిప్రక్కన వాస్వానీ కూర్చున్నాడు. అనేకమంది బాలబాలికలు, మీరా విద్యాలయం లోని విద్యార్థులు విద్యార్థినులతో హాలంతా లోపల బయట ఉన్న స్థలమంతా కిటకిటలాడుతోంది. అనేక మంది స్థలం లేక నిలబడి యుండవలసి వచ్చింది. వేదికమీద బాబా గోల్డ్‌నీ ని కూర్చో పెట్టుకున్నారు. గోల్డ్‌నీ బాబా కుర్చీ ప్రక్కనే కూర్చున్నాడు. హాలులో బాబాకి యెదుట కుర్చీలో ఐరీన్‌కోనీబీర్ కూర్చుని ఉంది. ఈమె బాబాకు ప్రముఖమయిన ప్రేమికు రాలు. మీరా విద్యాలయ బాల బాలికలు అధ్యాపకులు బాబాను పూలమాలలతో ముంచెత్తి వేసారు. వేదికమీద అమర్చిన మైక్రోఫోన్ వద్దకు వెళ్ళి ఉద్వేగంతో నిండిన హృదయంతో వాస్వానీ బాబా సమక్షంలో యీ క్రింది విధంగా మాట్లాడాడు.–

"సోదరీ సోదరులారా ! ఏకైక దివ్యజనని యొక్క బిడ్డలారా ! ప్రపంచంలో వివిధ దేశాలలో ఉన్న శిష్యులు భక్తులు అనేకులు ఆ సనాతన పురుషుడని నమ్మి

గౌరవించే వారి దివ్య సన్నిధానంలో నిలబడి మాట్లాడుతున్నాను. మీలో ప్రతి యొక్కరు కూడా శాశ్వతుడయిన ఆ భగవంతుని యొక్క మూర్తులని పురాతనులని అనడంలో తప్పు ఉండదంటారా ? ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీ, ప్రతి బిడ్డ, ప్రతి పువ్వు, ప్రకాశించే ప్రతి నక్షత్రము, కూసే ప్రతి పక్షి, ప్రతి కెరటము, ప్రతి అణువు ఆ సనాతన పురుషుని రూపములే అని నేనంటే అది సత్యదూరం కాదు.

మన పాఠశాలలోను మన సోదర బృందాలలో ఒక సత్యమేమనగా ప్రతి ఉపాధ్యాయునికి, ప్రతి విద్యార్థికి, ప్రతి మానవునికీ, ప్రతి పక్షికి, ప్రతి మృగానికి, ప్రతి వస్తువుకి కూడా మనం గౌరవం చూపించాలని, మనలోని ఆ దివ్యత్వానికి గౌరవం చూపించాలని, మనం నేర్చుకుందాము.

ముప్పై యేళ్ళకంటె ఎక్కువ కాలముగా మన మధ్య ఉంటూ ఉన్నవారు మనకు, మాట్లాడుట కంటె యింకొకటి ఉత్తమమయినది ఉందని రుజువుచేసి యున్నారు. అదే మౌనము. నా మనసుకి అది సత్యముల యొక్క సత్యమని తోస్తోంది. ఆయన ప్రపంచానికి మౌనం ద్వారానే చెప్తున్నారు. మౌన సామ్రాజ్యానికి ఆయన సాక్షియని అనేక సంవత్సరాల క్రిందట నా హృదయంలోకి చొచ్చుకు పోయింది. శబ్దమయ మయిన యీ యుగములో ఆయన ఒక సత్యమును బోధించారు— మౌనముగా నుండుడు అని. ఈ సత్యము పూర్వము భారతదేశంలో ఋషులు బోధించారు. గ్రీస్ దేశపు ఋషి అయిన పైథాగిరస్ యీ సత్యమునే బోధించాడు. ఆయన ఒక సోదర బృందాన్ని నిర్మించి వారికి అతడు బోధన చేసిన మొదటి పాఠము ''మౌనముగానుండుడు'' అని. మౌనరాజ్యములో మనము మానవులందరి ఐక్యత, ప్రేమలో అందరి సోదరత్వము తెలుసుకుంటాము.

ప్రియతమ బాబా జీవితములో యింకొక సత్యమును తెలుసుకున్నాము— ఆయన సరళ (నిరాడంబర) జీవితమును ప్రేమించును. ఆయన సరళ స్వభావుడు. నిష్కపటి. అందుచేతనే అమాయకులగు చిన్న పిల్లల సహవాసంలో ఆయన ఆనందిస్తారు. ఇక్కడికి వచ్చి మీరా విద్యాలయం లోని యీ చిన్నపాపలని చూడగానే ఆయన హృదయం ఆనందంతో పొంగింది. పిల్ల 'ఆనందానికి' పెట్టినపేరు కదా- వచ్చిన తరువాత మనకిచ్చిన సందేశములో యీ పసివారి సాంగత్యము ఆయన హృదయానికి మంచి చేసిందని బాబా చెప్పారు.

మెహెర్‌బాబాలో నేను చూసిన మూడవ సంగతి కూడా ఉంది. ఆయన పెదవుల మీద నాట్యం చేసే మందహాసం. బహుశా ఆయన వలె ఎంతోమంది

బాధపడి ఉండరు! అయినా ఆయన ముఖం మీద ఆ అందమైన చిరునవ్వు ఎప్పుడూ చిందులాడుతుంది. ఆయన మౌనము, ఆయన నిష్కాపట్యము, ఆయన మందహాసము- ఇవి ఆయన మనకిచ్చిన కానుకలు. ఆయన యెడల నా హృదయంలోని గౌరవ ప్రేమలతోను, అణకువతోను, ఆయనకు నేను ప్రణమిల్లుతున్నాను! బాబాను ఒక సూఫీ ఉపాధ్యాయుడు ఒకసారి యిలా అడిగాడు "మీ పెదవుల మీద చిరునవ్వు చిందులాడుతూ ఉంటుంది. ఎందుచేత?" అని. అందులకు బాబా "అది నాతల్లి ఆశీర్వాదము" అన్నారు. ప్రియతమ బాబా యొక్క ఆధ్యాత్మిక జనని ఆయనను ఆశీర్వదించెను. ఆయన వదనమునందు చిరునవ్వు చిందించెను. ఆయన ఎందరి హృదయాలనో ఆశీర్వదించారు. మన సోదర సంఘమునందలి సోదరులను సోదరీ మణులను ఆశీర్వదించుటకు ఆయన వచ్చారు. మీరా విద్యాలయములందలి బాల బాలికలను ఆశీర్వదించుటకు ఆయన వచ్చారు.

పూజ్యులైన బాబా! అందరిని ఆ దివ్యజనని ఆశీర్వదించుగాక. నా ప్రియతమ దివ్యజనని యొక్క శుభాశీస్సులు మీ మీద, మీ మండలి మీద, మీ భక్తుల మీద యింకా, అధికముగాను అధికతరముగాను ఎల్లప్పుడు ప్రసరించి ప్రకాశించుగాక."

అని వాస్వాని ముగించిన తరువాత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు లేచి బాబాకు జోహార్లు అర్పించాడు. తరువాత బాబా వారు పిల్లలకిచ్చిన సందేశాన్ని చదివించారు. అమెరికాలో త్వరలో ప్రచురింకాబోయే బాబా సందేశాల సంపుటలో యిది కూడా చేరుస్తారు. ఈ సందర్భము నందు సాధు వాస్వానీ మెహెర్ బాబా వారిని పూజించి తన భక్తి పారవశ్యముతో యిట్లు సంస్తుతించెను.

"ఓ సుందర సనాతనా!

ప్రాక్పశ్చిమ దేశాల్లోని మందిరాలూ మసీదులూ గుహ్యా గోపురాలూ క్రైస్తవ దేవాలయాలూ నీ నిజరూపాన్ని మరుగు పరుస్తున్నాయి కదా!

ప్రేమ స్వరూపుడవు నీవు.
హృదయమే నీ నివాసస్థానము - నా హృదయంతో నిన్ను
ప్రార్థిస్తాను. నన్ను నీ దరి చేర్చుకొనుమా!
నీవే నా బుద్ధి: నా మనస్సు: నీవే నా హృదయము:

నా వెలుగు; నా ఆనందము; నా దివ్య లక్షణమూ; అన్నీ
నీవే; నీవే నా భక్తి; నీవే నా ఆత్మార్పణ శక్తి;
కార్య గర్వాన్ని త్యజించి నీ సేవలో కరిగిపోయే
వరం నాకు యివ్వవూ!
ఓ మౌన ముద్రాంకితా!
మౌన దీక్షితుడనై నీ విచ్చే కాన్కలందుకునే తీరు
నాకు నేర్పవూ!
మౌనంతో సాంధ్య తారను తిలకించునపుడు
మౌనంతో నిశాగర్భంలో సంచరించునప్పుడును,
మౌనంతో నీ చరణకమలాల చెంతజేరి పాడుకొనుట
నా హృదయానికి బోధించవూ!

అలా పాడుకుంటూ రాత్రంతా వెలిగి ప్రభాతసమయానికి ఆరిపోయే కొవ్వొత్తి వలె నన్ను మౌనముగా నీ పాదపద్మాల కడ వెలిగి కరిగి ఆరిపోయే వరం

నాకు ప్రసాదించవూ!'

తరువాత స్త్రీలందరూ బాబా దర్శనం చేసుకోవడం ప్రారంభించారు. కొంత సేపటికి వారిలో ఉత్సాహం వెల్లివిరిసింది. బాబా మీద పడిపోకుండా పుకార్ మొదలయిన బాబా శిష్యులు ఆ ప్రజల వెల్లువను ఆపాలని ప్రయత్నించారు. వారికి చెమటలు పట్టాయిగానీ వారు ముందుకు త్రోసుకు వచ్చి మండలి వారినే పడవేసేసారు.

తరువాత పరిస్థితి అదుపులోకి వచ్చాక స్త్రీలు దర్శనం చేసుకున్నాక బాబాను కుర్చీమీద బయటకు తీసుకు వెళ్ళారు. అక్కడ వేల సంఖ్యలో ఉన్న భక్తులు వారి వద్దనుంచి ప్రసాదం స్వీకరించడానికి ముందుకి వస్తుండగా మండలి వారిని ఆపడం పెద్దపని అయింది. వరుసలో వచ్చి బాబాను దర్శించి ప్రసాదం తీసుకొని వెళ్తున్నారు. ఒక ప్రక్కన హిందూ భజన కీర్తనలు పాడుతున్నారు. ఆ రోజున అనేక వేలమంది బాబా దర్శనం చేసుకున్నారు. వారందరికి బాబా ప్రసాదం పంచిపెట్టినందున ఆయనకి చేతులు నొప్పిపెట్టాయి.

ఆ సమయంలో పశ్చిమ జర్మనీదేశం నుంచి వచ్చిన ప్రొఫెసర్ ఎర్‌హార్డ్‌గిట్ట్ అనునతడు బాబాను గురించి తెలుసుకోవాలని కుతూహలపడుతూండగా గోర్డ్‌నీ అతనికి కావలసిన వివరాలన్నీ యిచ్చాడు. అతడు హిల్డర్‌షీమ్ అనే పట్టణ

వాస్తవ్యుడు. పశ్చిమ దేశాలలోని ప్రజల కంటె భారతీయులు ఎక్కువ ఆధ్యాత్మికత్వం కలవారని అతడు కళ్ళారా చూసిన దానిని బట్టి అభిప్రాయ పడుతున్నాడు. "పాశ్చాత్యులకి ఆదివారాలలో చర్చికి వెళ్ళడం మట్టుకే వారికి ఉన్న మతము" అంటాడతడు. భారతీయుల జీవిత విధానము వారి మత విషయకమయిన జీవితము మొదలయినవి ప్రత్యక్షముగా చూసిన యీ ప్రొఫెసర్ యింకొక అభిప్రాయమునకు ఎట్లు రాగలడు? ఇక్కడి విషయము లన్నియు గ్రహించి అతడు జర్మనీ వెళ్ళి అక్కడి విద్యార్థులకు ఉపాన్యాసాలిస్తానని అతడు చెప్తున్నాడు. చూసినంతవరకు భారతీయులు పాశ్చాత్యులకంటె ఆధ్యాత్మికంగా ఉన్నతి చెందారని అభిప్రాయ పడుతున్నాడు. ఇతనికి ఒక్క చెయ్యి మాత్రము ఉండెను. గోల్డ్‌నీ సాంగత్యములో బాబా గురించి ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు బాబా రచించిన పుస్తకాలు కొన్ని పంపించమని తన విరునామా యిచ్చి వెళ్ళాడు.

అప్పటికి మధ్యాహ్నం 3 గంటలయింది. ఇంక బాబా బయలుదేరవలసి ఉంది. అనేక వేల మంది జయధ్వానాలు చేస్తూండగా బాబా లేచి వెళ్ళారు. బాబా బయలుదేరే టప్పుడు వాస్వానీని కౌగిలించుకున్నారు. అది దేవతలు తిలకించవలసిన దివ్యకరుణాన్వితమయిన దృశ్యము. అక్కడికి వచ్చిన విద్యార్థుల విద్యార్థినుల ఉపాధ్యాయుల హృదయాలలో మధురమయిన ముద్రను స్థాపించిన బాబా ఆగమనము చిరస్మరణీయముగా ఉండిపోయినది. మరునాటి పత్రికలలో ఆరోజున పూనా నగరవాసులు పదివేల మంది బాబా దర్శనం చేసుకున్న సంగతి ప్రచురింపబడింది. చాలామంది బాబా ప్రేమికులు అనేకవందల మైళ్ళుకూడా ప్రయాణంచేసి వచ్చారు బాబా దర్శనార్థం. బాబా పరివారంతో ఏంపలగామ్ చేరుకునే సరికి సాయంకాలం 6-30 గంటలయింది. దారిలో రెండుచోట్ల అనేక మంది ప్రేమికుల కోసం బాబా ఆగవలసి వచ్చింది. బాబాకు శరీరంలో యింకా నొప్పి ఉన్నా శారీరకమయిన ప్రయాస ఎంత కలుగుతున్నా బాహ్యంగా మాత్రం అదేమీ కనపరచక ఎంతో తేజోవంతంగా ఆనందంగా ఉన్నట్లే తోచారు అందరికీ. శరీరంలోని కండరాల నొప్పుల వలన ఆ రాత్రి బాబాకి నిద్రపట్ట లేదు. అనేక వేలమందికి ప్రసాదం పంచియిచ్చినందున యీ నొప్పులు వచ్చాయి.

సాధువాస్వానీ తన ప్రార్థనలో సూచించిన మహదాశయం అతని 87 వ యేట 1966 జనవరి 16 వ తేదీన సిద్ధించింది. ఆనాడు, సహస్రాధిక మాసజీవి విజ్ఞాన సంపన్నుడు అయిన దాదా శాశ్వతంగా బాబాలో ఐక్యమయినాడు. బాబా మండలితో మెహెరాజాద్‌కి వచ్చిన మరునాడు ఆదివారం.

ఏప్రెల్ మొదటివారంలో బాబా మామూలు కర్రసాయంతో నడవగలిగారు. ఇప్పుడు ఆయన చక్రాల కుర్చీ ఎప్పుడోగాని ఉపయోగించడమే లేదు. బాబా కర్రలు పుచ్చుకొని నడుస్తూంటే మామూలుగా నడుస్తున్నట్లే ఉంది. కాని ఆయనకు శారీరకంగా చాలా శ్రమగా ఉంది నడవడం. మళ్ళీ ఎక్స్‌రే తీసి చూసేవరకు శ్రమపడవద్దని డాక్టర్లు బాబాతో చెప్పారు. అందుకోసం మళ్ళా పూనా వెళ్ళడం కోసం ఏప్రెల్ 18 వ తేదీన ఏర్పాటు చేసారు. అప్పుడు కర్నల్ చటర్జీ స్వయంగా ఉండి చూస్తాడు.

బాబాకి జరిగిన ప్రమాదం దృష్ట్యా సహవాస్ గురించి పునరాలోచన చేసారు. బాబా మండలివారికి కొంతరికి కూడా దెబ్బలు తగిలి చికిత్స పొందుతున్నారుకదా. రాబోయే సహవాస్‌లో వారే పని చేయవలసిన వారు కూడాను. ముఖ్యంగా బాబాకి అతి తీవ్రమయిన దెబ్బలు తగిలాయి. అందుచేత బాబా 1957 నవంబరులో జరుగవలసిన సహవాస్ 1958 జనవరి 26 నుంచి 1958 ఫిబ్రవరి 26 వరకు జరిపివెయ్యాలని నిశ్చయించారు. ఇదివరకే డబ్బు చెల్లించిన భక్తులు ఎవరయినా 1958 జనవరి 1 లో పెట్టే సహవాస్‌కి రాలేకపోతే అతడు తాను పంపించిన రు 30/- లు తిరిగి రాబట్టుకో వచ్చు. 31-7-57 తేదీ లోపుగా కావాలని వ్రాసిన వారికి ఈ రు 30/- లు తిరిగి పంపబడుతుంది. ఆ తేదీ తరువాత సొమ్ము ఎవరికీ వాపసు పంపబడదు— అని యీ విధంగా బాబా ఆదేశం ప్రకారం ప్రేమికులందరికి సర్క్యులర్ పంపించబడింది.

ఏప్రెల్, మే, జూన్, జూలై, ఆగస్టు, 1957 మాసాలలో ఎవరూ బాబాతో సంభాషించడానికి ప్రయత్నించకూడదు. ఎవరినయినా మెహెరాజాద్‌కి బాబా రమ్మని వ్రాయిస్తేనే అక్కడికి వెళ్ళాలి. ఈ 5 నెలలూ యితరులెవరూ అక్కడికి పోకూడదు.

మెహెరాజాద్‌లో ఏప్రెల్ రెండోవారానికే చాలా వేడిగా ఉంటోంది. ఈ సంవత్సరం ఏర్పాటు చేద్దామనుకున్న సహవాస్ వాయిదావేసి 1958 జనవరి 26 నుంచి ఫిబ్రవరి 26 వరకు సహవాస్ స్థిరపరచిన ఏర్పాటువల్ల ఫిబ్రవరి 25 వ తేదీ బాబా జన్మదినోత్సవం ప్రేమికులంతా కలిసి జరుపుకోడానికి వీలుగా ఉంది. ప్రేమికులందరికి బాబా ఆహ్వానాలు పంపారు— ఒక నెలరోజులు బాబా సన్నిధిని జరిగే సహవాస్‌కి. సహవాస్‌కి ఆహ్వానిస్తూ ప్రేమికులు వచ్చేటప్పుడు బాబాకు గాని వారి స్త్రీ మండలికి గాని పురుష మండలికిగాని కానుక లేవీ తీసుకురావలదని కోరుతూ ఉత్తరాలు వ్రాసారు. పోస్టుద్వారా యీ లోపున కూడా ఏమీ పంపవద్దని కోరారు.

ఈ సందర్భంలో బాబా తమ ప్రేమికులకు యీ క్రింది సందేశం పంపారు.

బాబా సందేశం—

"ఆందోళన చెందకండి. నన్ను అధికంగాను అధికతరంగాను ప్రేమించండి. మీకు ఎటువంటి పరీక్షలు కలిగినా ఎటువంటి కష్టపరిస్థితులు వచ్చినా నా కొంగును వీడక గట్టిగా పట్టుకోండి! మీరు నా విశ్వకార్యంలో పాల్గొంటున్నందుకు మీరు చాలా అదృష్టవంతులు. నేను ప్రకటితమయే కాలం ఎంతో దూరం లేదు. మీరు నా నిజ స్వరూపం చూడగలరు. మీకు ప్రతియొక్కరికి నా ప్రేమ."

8 వ భాగము సమాప్తము

(తరువాయి తొమ్మిదవ భాగములో)